# MADRAS GOVERNMENT ORIENTAL SERIES

Published under the authority
of the
Government of Madras

*General Editor*
T CHANDRASEKHARAN M A, L T,
Curator, Government Oriental Manuscripts Library
Madras.

**No. L. Vol. II.**

# శ్రీ రామాయణము

కట్టావరదరాజ కృతము.

(అరణ్య కిష్కింధా కాండములు)

TANJORE SARASWATI MAHAL SERIES No 62

# SRI RAMAYANAMU

BY

KATTA VARADARAJU,

(ARANYA AND KISHKINDHA KANDAS)

CRITICALLY EDITED WITH INTRODUCTION

BY

Sri N. VENKATA RAO, M A,
*Senior Lecturer and Head of the Telugu Department*
*Madras University, Madras*

---

*Published By*

Sri S GOPALAN, B A, B L,
*Hony Secretary, For the Administrative Committee*
*T M S S Mahal Library, Tanjore*

Price Rs 7-0-0

# PREFACE

This publication contains the "Aranya" and "Kishkindha" Kandas of Katta Varadaraju's Dwipada Ramayanamu They are issued in continuation of our prior publication of "Bala" "Ayodhaya" Kandas issued last year We hope this publication will receive the same appreciation from the public and the press as the prior one has had

The subsequent Kandas are being printed and will soon be issued

Our thanks are due to the Editor, Sri N Venkata Rao, Head of the of Department of Telugu, University of Madras for his valuable services in editing the work and to Sri A Mahadeva Sastri and Sri V Sundara Sarma, the Telugu Pandits of our library for carefully going through the original and preparing a correct copy for the edition

We are grateful to the Government of Madras for their timely grants that have enabled us to publish this and other valuable manuscripts of this Library We must thank also the Ratnam Press, Madras, for the neatness and despatch with which they have executed the printing of this publication

3-1-1952
T M S S M Library,
Tanjore

S GOPALAN,
*Honorary Secretary,*
*T M S S M Library Committee*



# పీఠిక.



మదరాసురాష్ట్రీయ ప్రభుత్వమువారి సమాదరణమునఁ బ్రథమమునఁ బ్రకటితమైన తెనుఁగు గ్రంథములలో వరదరాజ కృతియగు ద్విపద రామాయణమునందలి బాల, అయోధ్యా కాండములుగల ప్రథమసంపుట మాంధ్రమహాజనులనెల్ల నాకర్షించినది. ఈగ్రంథము తంజాపూరి శ్రీశరభోజి సరస్వతీమహాలు గ్రంథాలయమువారి పక్షమునఁ బ్రకటితమైనది. అపూర్వాంధ్ర గ్రంథములకు సన్నిధియగు నీతంజావూరిమహాలు గ్రంథాలయమువారి 'తొలికానుక''గా ప్రకటితమగు నీ రామాయణభాగమును ప్రశంసించిన పరిశోధకులును పండితులును, భాషావాఙ్మయ విశారదులగు ప్రశస్తవిద్వాంసులెల్ల గ్రంథప్రకటనముఁ గొనియాడిరి.

ముందు తెలిపినట్లుగా ప్రథమసంపుటము ప్రకటితమైన తోడనే ప్రభుత్వసహాయమున నీగ్రంథమున మిగిలిన కాండములను ముద్రించుటకుఁ బూనుకొని, తంజావూరి సరస్వతీమహాలు గ్రంథాలయమువారు, అరణ్య కిష్కింధాకాండములొక సంపుటముగను, సుందరకాండ మొక సంపుటముగను, యుద్ధకాండ మొక సంపుటముగను మొత్తముమీఁద నాలుగు సంపుటములుగా వెలువడఁజేయుటకు నిశ్చయించిరి. వానిలో అరణ్యకాండ, కిష్కింధాకాండములుగల ద్వితీయసంపుట మిది. సుందరకాండ, యుద్ధకాండ సంపుటములు వెనువెంటనే వెలువడఁగలవు.

ప్రథమసంపుటమున పీఠికలో కవివంశవృత్తాంతము తెలుపుటచే నిందులో విడిచిపెట్టబడినది. ఈ రెండుకాండములలోఁగల కవితాభాషా విశేషములను మాత్రమేచూపుటకు నీ పీఠిక యావశ్యకమైనది.

ఆ మొదటి పీఠికలో నాంధ్రవిశ్వవిద్యాలయమువారుప్రకటించిన రంగనాథ రామాయణములోని ప్రక్షిప్తభాగములకును, వరదరాజకృతిలోని భాగములకునుగల సంవాదములను చూపితిని (చూడుఁడు పుట 37) ఈభాగమునందలి సంవాదములనునిందు చూపుచున్నాఁడను

రంగనాథరామాయణము. (అనుబంధము 1 పుట 678)

"నాయింట దాఁజనము లైదువేలు
పాయకమణిమయాభరణముల్దాల్చి
యచ్చరలున్న వారలివె నీసేవ
కిచ్చెద నీమనసిమ్ము నాకిపుడు
విరిఁదోఁటలోఁ గల్పవృక్షంబులైదు
తరుణి! నీముడిపువ్వు దండలకిత్తు
అమరభూధర రోహణాచలమణులు
రమణి! నీకిత్తు నారతుల కేనిత్తు
ఆమీఁదకామధేన్వాది ధేనువుల
భామిని! నీయింట పాఁడి కేనిత్తు"

వరదరాజు రామాయణము (పుట 168.)

నాయింట దాసీజనము లైదువేలు
పాయక మణిమయాభరణముల్దాల్చి
యచ్చర సతులుగ నతివ నీసేవ
కిచ్చెద నీమనసిమ్ము నాకపుడు
విరిఁదోఁటలోఁ గల్పవృక్ష పంచకము
తరుణి! నీముడిపువ్వు దండలకిత్తు
అమరభూధర రోహణాచల మణులు
రమణి! నీకిత్తు నారతుల కేనిత్తు
ఆమీఁద కామధేన్వాది ధేనువులు
భామిని! నీయింటి పాడి కేనిత్తు ” (పంక్తి 3990-4000)

రంగనాథ రామాయణము పుట 204.

“ పదియవస్థలుదోఁచి భాసిల్లుపగిది
ఎదితలల్ మణిజూట పంక్తులనొప్ప
నాయవస్థలగోరుకులవి యిన్మడింపఁ
బాయని గతినొప్పు బాహులిర్వదియు
ఎరగదివ్యాంబరాధర శైకకాంత
లరుదార

వరదరాజు రామాయణము. పుట 176

“ పదియవస్థలుదోఁచు పగిది మస్తముల
పదియును మీఱంగఁబడి యవస్థలును



నినుమడించిన యట్టులిరువది చేతు
లనువుగా................
........................
దివ్యాభరణవస్త్ర దేదీప్యమాన (పంక్తి 4164–167 4175)

రంగనాథరామాయణము పుట 678

కొమ్మముప్పది రెండుకోట్ల చేరువలు
నెమ్మినం దొక్కొక్కనికి వేయివేయి
నానవబలపద్మమాత్రంబునాకు
దీనంబొ గెలిచితి దేవతాధిపుల
ఆబలంబెల్ల నీయడుగుల గొలిచి
యోబాల! నిటమీఁద నుప్పొంగనేర్తు!

వరదరాజు రామాయణము (పుట 201)

కొమ్మ! ముప్పదిరెండుకోట్ల చేరువలు
నెమ్మినందొక్కొక్కనికి వేయివేయి
దానవసైన్యమాత్ర బలంబునాకు
దీనిచే దేవతాధిపులగెల్చితిని
ఆబలంబెల్ల నీ యడుగులగొలిచి
యోబాల! యిటమీద నుప్పొంగనేర్తు!

(పంక్తి 4798–4800)

రంగనాథ రామాయణము. (పుట 215)

హరిరాజ! కానవేహరి రాజమధ్య!
కరిరాజ! కానవే కరిరాజ గమన!

హరిణంబ కానవే హరిణాయతాక్షి

..........................

తిలకంబ ! కానవే తిలకాంచితాస్య
అలినీల కానవే ! యలినీలకచను

వరదరాజు రామాయణము పుట. 217

తిలకంబ ! కానవే తిలకలలాట !
నళులార ! కానరే యలినీలకచను
హరిరాజ కానవే హరిరాజమధ్య
కరివరకానవే కరివరగమన !
హరిణంబ ! కానవే హరిణాయతాక్షి ! (పంక్తి 5168 - 5174)

రంగనాథ రామాయణము (పుట 216.)

" కాకుత్స్థ ! నీవతికారుణ్యమతివి
లోకైక రక్షణలోల చిత్తుఁడవు "

వరదరాజు రామాయణము (పుట 284)

కాకుత్స్థకులదీప ! క్రమమేననేయ
కారుణ్యమూర్తివి కల్యాణనిధివి "

పైన వివరించిన సంవాదములను పరీక్షించిన, రంగనాథ రామాయణము వ్రాఁతప్రతులన్నియుఁ బరిశీలించినగాని యా గ్రంథముయొక్క నిజస్వరూపము గుర్తించుటకు వీలుకలుగదు. దానిలో పాఠభేదములను సంస్కరించుటకు వరదరాజు రామాయణము తోడ్పడును. వరదరాజునకుముందుగల ద్విపద రామాయణములలో సుప్రసిద్ధ సంకీర్తనాచార్యులగు తాళ్లపాక అన్న

మయగారి ద్విపదరామాయణము గలదు. ఈ రామాయణమును పరిష్కరించునపుడును, పైనిచూపినరీతిగా, సంవాదములను పరిశీలించినపుడును, అన్నమయ్యగారి రామాయణకృతిని పూర్తిగ గుర్తించుటకు నవకాశము కలుగునను యభిప్రాయము ధృఢపడినది. పై రెండు సంవాదములలో లేనిభాగములన్నియు నన్నమయగారి కృతిలోనివేయని స్పష్టముగా నిరూపించుటకు తంజావూరి యందేకాక నామూలాగ్రముగా దేశమునం దుపలభ్యమగు రంగనాథరామాయణ ప్రతులన్నింటిని కూలంకషముగా పరిశీలింపవలసియున్నది. అట్లయిన రంగనాథరామాయణమును గూర్చిన సమస్యలుకూడ సుపరిష్కృతములగునని నాయాశయము

వరదరాజు రామాయణారణ్య కిష్కింధాకాండములను రంగనాథభాస్కర రామాయణములను సరిపోల్చిచూచిన వరదరాజెట్లు మూలముననుసరించి కథారచనముగావించెనో తెలియం గలదు.

ఆరణ్యకాండము.

| భాస్కర రామాయణము | రంగనాథ రామాయణము | వరదరాజ రామాయణము |
|---|---|---|
| 1. రాముఁడరణ్యమును ప్రవేశించుట కలదు | రామునియత్రిమహాముని యాశ్రమ ప్రవేశము (ఇది మూలమున అయోధ్యాకాండాంతముననున్నది.) | రాముఁడరణ్యమును ప్రవేశించుట. (మూలమున నిట్లే (యున్నది. |

| భాస్కర రామాయణము | రంగనాథ రామాయణము | వరదరాజ రామాయణము |
|---|---|---|
| 2. విరాధుని తలి దండ్రుల పేర్లు లేవు | జయుఁడు తండ్రి శత హ్రాద తల్లియనిగలదు | జయుఁడు తండ్రి-శత హ్రాద తల్లి (మూలమున నిట్లేయున్నది.) |
| 3. జంబుమాలివృత్తాంతము కలదు | కలదు | (ఇందును మూలమునను లేదు) |

## కిష్కింధాకాండము.

| | | |
|---|---|---|
| 1. వాలిభార్యయగు తార శ్రీరామచంద్రుని శపించినట్లు కలదు. | లేదు | లేదు (మూలములోను లేదు) |
| 2. సంపాతి తనకుమారుఁడగు సుపార్శ్వుని జూచి లంకకుఁబోయి సీతనుకనుగొనిరమ్మని పంపుట | లేదు | లేదు (మూలమునను లేదు) |
| 3. హనుమంతుని జన్మవృత్తాంతమునఁ గేసరి కథ గలదు. | లేదు | (మూలమునను లేదు) |
| 4. హనుమంతుఁడు తనజనన వృత్తాంతముఁ దానే చెప్పుకొనెను. | జాంబవంతుఁడు చెప్పినట్లు గలదు. | జాంబవంతుఁడు చెప్పినట్లుగలదు. (మూలమునను నిట్లేయున్నది) |

పై విభేదములను జూచిన రామాయణకథ యెట్టిమార్పులను బొందుచుండెడిదియో తెలియఁగలదు

వరదరాజుమూలము నెట్లనుసరించినదియు తెల్పుటకు నొక్కొక్క కాండనుండి యొక్కొక్క యుదాహరణము నిచ్చుచున్నాఁడను.

ఆరణ్యకాండ. సర్గ 1. శ్లోకములు 18-20

"ధర్మపాలో జనస్యాఽస్య శరణ్యం స్తం మహాయశాః
పూజనీయశ్చ మాన్యశ్చ రాజా దండధరో గురుః
ఇంద్రస్యైవ చతుర్భాగః ప్రజా రక్షతి రాఘవ
రాజా తస్మాద్వరాన్భోగా న్భుంక్తే లోకనమస్కృతః
తేలయలభవతారత్వ్యా భవద్విషయవాసినః
నగరస్థో వనస్థోవా త్వంనో రాజా జనేశ్వర"

"రఘుపుఁడు దొరదేవ మండలికెల్ల
రఘువంశజులకెల్ల రాజువునీవు
లోకులకెల్ల నేలుటకునై నీవు
లోకంబుకు నెల్లలోకేశుఁ డొకఁడు
చాలిన వారు దుర్జనుల నడంప
వాలాయమున మంచివారిఁ బోషింప
నీకెభారము మాటనిజము చెల్లింపఁ
జేకొని ధర్మమూర్జితము గావింప
న్యాయమార్గమ్మున నడవకయున్న
నాయవనీపతి నఘములుపొందు
నడచినఁగీర్తి యనంతపుణ్యంబు
కడపట స్వర్గలోక సుఖంబుఁజెందు

సత్యమార్గంబున జగతిఁ బాలించు
నత్యంత ధార్మికుండైన భూపతికి
నతఁడేలు సీమలో యతివరుల్ సేయు
నతిశయ జపతపో యాగాదికముల
ఫలములనాలవపాలు ప్రాపించు
నిలయేలుపుణ్యుల కెల్లకర్మములు
శరణుఁజొచ్చితిమి మీ చరణాబ్జములకు
నెఱిఁగిప్రోవుము మాకునెవ్వారుదిక్కు
రాక్షసబాధలు రాకుండమమ్ము
రక్షింపుకరుణాభిరామ ! శ్రీరామ !

అరణ్యకాండ (పుట 20–21)

కిష్కింధాకాండ వాలివధ ఘట్టము (సర్గ. 17 శ్లో 34–46)

'రాజహాబ్రహ్మహాగోఘ్నశ్చోరప్రాణి వధేరతః
నాస్తికఃపరివేత్తాచ సర్వేనిరయగామినః
అధార్యంచర్మమే సద్భిరోమాణ్యస్థి చ వర్జితమ్
అభక్ష్యాని చ మాంసానిత్వద్విధైర్ధర్మ చారిభిః
పంచ పంచనఖా భక్ష్యాబ్రహ్మక్షత్రేణ రాఘవ
శల్యకశ్శ్వావిధోగోధా శశఃకూర్మశ్చపంచమః
చర్మచాస్థిచమే రాజన్ నస్పృశంతి మనీషిణః
అభక్ష్యాని చ మాంసాని సోఽహంపంచనఖోహతః
త్వయానాథేన కాకుత్స్థ న సనాథావసుంధరా
ప్రమదాశీల సంపన్నా ధూర్తేన పతినాయథా
శఠోనైకృతికః క్షుద్రో మిథ్యాప్రశ్రిత మానసః
కథం దశరథే నత్వాం జాతః పాపోమహాత్మనా
ఛిన్నచారిత్ర్యకక్ష్యేణ సతాం ధర్మాతివర్తినా

ప్రసు ప్తపన్నగే నైవనరః పానవళగతిః"
"క్రూరాత్మకుఁడు నాస్తికుఁడు పతితుండు
చోరుఁడు శఠుఁడు నీచుఁడు మద్యపాయి
రమణుల నావుల రాజులద్విజుల
సమయించు వాఁడు పాషండవర్తనుఁడు
గురుతల్పగమనుండు కొండీఁడుద్రోహి
పరివేత్త యన్యాయపరుఁడు హింసకుఁడు
నిరయగాములు గాన నీకేఁటికయ్య
మీమాంస మీచర్మ మీదంతశల్య
రోమాదికంబుల రూపగుజంతు
రోయరెవ్వరు వానరులధార్మికుండ
వీయపకీర్తి నీవేల నొంది తివి
పంచనఖంబులఁ బరగినజంతు
సంచయంబులనైదు చనుఁగాని మీకుఁ
గడమ వాటిని తినంగాదేమిదలఁచి
పడవేసితివి నీకు భక్ష్యంబెయేను
అంటుదురే కేలనైన వానరుల
యొంటిమాంసంబు నిన్నొకనిఁ జూచితిమి
పాపివి యన్యాయపరుఁడవల్పుఁడవు
ద్రోహివి శఠుఁడవు దుర్బద్ధి వధమ
సాహసాత్ముఁడవు వంచకుఁడవజ్ఞుఁవు
అక్కట ! దశరథునంత రాజునకు
నొక్కటి సుతుఁడవై యీవుగల్గితివి"

(కిష్కింధాకాండ పుటలు 344-345)

పైవానినిబట్టి కొన్నిచోట్ల మూలములోని పదములనే యుపయోగించుచు, భావము నెంత విశదముగా వరదరాజు రచియించినదియు సువ్యక్తమగుచున్నది.

పూర్వకాండములందువలె నీరెండు కాండములను వరదరాజుకవితానైపుణ్యమును విశదీకరించుచున్నవి. వర్ణనలు చేయుపట్టుల సంస్కృత సమాసములతో ననుప్రాసములతో వరదరాజు రచించును. ఇదియే తక్కిన వానికంటె యీ గ్రంథమునకు విశిష్టత చేకూర్చునవి.

మచ్చునకు – ఋష్యమూక వర్ణనము – అరణ్యకాండము

అవలోక మాత్ర నిరస్తశోకంబు
దివిజ భూమీదరాంతి ప్రవేశంబు
అపహృతాధ్వన్య శ్రమాతిరేకంబు
తపనేందు గణమణి స్థగితరోకంబు
అమరాపగా కృతాత్మాభిషేకంబు
యమదూత గదితనమోనువాకంబు
సారసినీ చరచ్చక్ర వాకంబు
తీరవనీ సముత్తీర్ణ పైకంబు
కందరాంతర వికంకట వనోకంబు
సందీప్తశృంగాను షంగినాకంబు
వేలాచరిష్ణు గంధేభసాకంబు
తాలాది రసముత్కట వనీకంబు
ఋషికన్యకాకలావృత ప్రలాకంబు
విషయులో లాసరద్వివదభీకంబు
వాలిసంప్రాప్త భావవ్యలీకంబు

కాలాచరిత మౌనిగణవరాకంబు
ప్రతిపన్నయతి పుణ్యఫలవిపాకంబు
శ్రుత బుష్యనీకంబు బుష్యమూకంబు
(పుట 271 పంక్తులు 6460-6479)

అట్లే కాసారవర్ణనము చూడుఁడు (31 పుట 700-710 పంక్తులు)

వాలివర్ణనము :—కిష్కింధా కాండము

రావణగర్వ నిర్వాపణశాలి
భావజాహిత పాదపద్మమదాళి
ఖరకరాత్మజ దర్పగహనోగ్రకేళి
గిరిచరవీరాగ్ర కీర్తనశీలి
తారాహృదంబుజాతనవీన హేళి
చారువిభూషణ సౌవర్ణమాలి
యమితశౌర్యనిరస్త హర్యక్షకేళి
సముదగ్ర బలజిత సామజపాళి
కనక ఘంటాసముత్కార భీమవాలి
యనుదిన విదితదేవాళి యవ్వాలి
(పుట 316. 976-986 పంక్తులు)

రసభావవిన్యాసమునకు ద్విపద మిక్కిలియనుకూలమగుట చేత వరదరాజు కరుణరసము ను, చక్కగా నావిష్కరించినాఁడు, శ్రీరాముఁడు సీతనుగానక ముల్లోకమును భస్మముచేయుటకు విల్లంది యామెను తానువిడిచిపెట్టినరీతిగా వర్ణివాసి తెలుగ కుండ దెచ్చెదనని చెప్పిన ఘట్టము.

"పోయినఁద్రుంతునే భువనంబులెల్ల
నూరక తెచ్చిన నొప్పుకొనంగ

నేరుతునే ధరణీతనూభవను
ముడిచినపువ్వులు ముడిచిన మీర
తొడిగిన సొమ్ములు తొడిగిన కరణిఁ
గట్టినవస్త్రంబుఁ గట్టినయట్లు
పెట్టినతిలకంబు పెట్టినమాడ్కి
వేసినకీల్గంటు వేసినజాడ
చేసినవీడెంబు చేసినపోల్కి
నవ్వినసెమ్మోము నవ్వినరీతి
జవ్వని దెచ్చియుంచక మానిపుడు

(232 పుట. 5525 5536)

శ్రీరాముఁడు పర్ణశాలయందు సీతనుగానక విలపించు ఘట్టమంతయు (216-221పుటలు) కరుణారసప్లుతమై యలరారు చున్నది.

కిష్కింధాకాండమున శ్రీరాముని విరహవేదనయందు శృంగారకరుణ రసప్రాచుర్యము గన్పట్టుచున్నది.

కన్నులనెఱిగించు కలయింగితంబు
చిన్నినవ్వులఁదెల్పు చిత్తాభిమతము
సిబ్బితిచేఁజూపు శీలగౌరవము
గబ్బిచన్నల నెఱుఁగంగఁ జేయువలపు
యలిగినేరగయుండదవలి మోమిడదు
తలపఁదెవ్వరిని చింతకులోనుగాదు
ఏనుగాసిలియున్న యెఱిగిహితోక్తి
దానూరడించి సంతాపంబుఁదీర్చు

నడవి యయోధ్యగా నన్నింటిమాటు
పడఁతిదానయినిల్పి పరితుష్టుఁజేయు
తలంచినట్లమెలంగు తనమదిడాప
దలయికఁ జూపదేమునివ సైరించు
నగుమోముతోఁజేరి నాచెంతనిలిచి
తగినమాత్రంబె మెత్తనిమాటలాడు
నట్టిసీతకుఁ బాయునట్టినన్నీవు
చుట్టుకఁదిరిగియే సుఖముఁ గాంచెదవు"
(282-83 పుటలు 182-198 పంక్తులు.)

పైసందర్భములను రంగనాథ రామాయణమున నాయా స్థలములలో సరిచూచిన వరదరాజు ప్రత్యేకరచనాసామర్థ్యము విశదమగును.

వ్యాకరణ విశేషములు

1. చేయుదును అనుటకు "చేతు" అని ప్రయోగించుట.
2. సరస్సునకు సరంబని ప్రయుక్తము.
" మునియున్న యీసరంబునఁ బ్రవేశించి"
3. మణశబ్దము ఈకారాంతముగాఁ బ్రయోగము
నీటిలో నొక్కమణీమయంబైన
4. అందుక చుట్టుక – మొదలగు ప్రయోగములు
5. క్త్వార్థకసంధి – వడఁకటునిటు – వడఁకి అటునిటు
6. బొక్కసమిండ్లు – బొక్కసపుటిండ్లనుటకు – (పుట 151)
7. కర్మమునకు కర్మువు అను ప్రయోగము – (పుట 293)
పుట్టువును కాలమును కర్మువును

## — ఛందో విశేషములు :—

### యతులు

1. " నట్టడవినిఁ జిక్కినాఁడు నాచేత " ఇచ్చటహల్లునకు యతి శ్రీనాథుఁడు నైషధమునని ట్లే " నముచిదమనుండు పుత్తెంచినాడు" అనిప్రయోగించినాఁడు ఇట్లే 'నారచీరలు గట్టినారు " అని మఱియొకప్రయోగ మిందేకలదు.
2. " రామచంద్ర ! వివేకురాలుమాతార." (పుట 344) ఇచట హల్లునకు యతి. చిన్నయసూరి సూత్రము ననుసరించిన నచ్చునకేయతి.
3. " ఒక్కొకటనదులు నవోఢలోయనఁగ " నవోఢ శబ్దములో స్వరయతి. (పుట 396)
4. " ఉండకదిగువం గూర్చుండివివేక " దేశ్యధాతువుల ప్రత్యయములకు స్వరయతి వీనికి వ్యంజనయతి నిర్దిష్టము (పుట 421)
5. "క్రూరకర్ముఁడు కృతఘ్నుఁడసత్యపరుఁడు" (పుట 439) ఇచట క్రూ – ఘ్ను, అనునది విశేషయతి యని యప్పకవి. కాని యిట్టియతు లప్పకవికి ముందుగలవు.

అ. కర్మమధర్మ మజ్ఞానమాగడము, (పండితారాధ్యచరిత్ర)

ఆ. జ్ఞానికినుపదేశ విధిప్రకాశము సేయన్ (భారతముతిక్కన)

ఇ. జ్ఞానమునం గడవ మిగులఁ గల్మష మొందున్ (ప్రౌఢకవి మల్లన)

ఈ ఘ్యము . ... ..మిల భవదాజ్ఞాశక్తి (యథావాక్కుల యన్నమయ్య సర్వేశ్వరశతకము)

### శబ్దవిశేషములు

1. కమలాకరము – సముద్రము

" ఇక్కమలాకరంబెంత దాఁటుటకు "

2. కమలధి - సముద్రము (పుట 519)

" ఇక్కమలధి దాఁటనెవ్వఁడున్నాఁడు."

3. ఇనుఁడు - రాజు (పుట 523)

" ఏముకొల్చిన వారమినుఁడవు నీవు"

4 ఒడలురూపాంతరము ఒళ్లు. (పుట 146)

5. గరువించుట- గర్వించుటయొక్క రూపాంతరము(పుట 195)

6. కర్మచండాలుఁడు పుట్టుకచేగాక పనులచేతచండాలుండైన వాఁడు (పుట 206)

7. చాడె - జడలేకకొప్పు. (పుట 228) (చన్నులవ్రేగున చాడె వ్రేగునను) అష్టమహిషీ కల్యాణము.

8 వైడూర్యము-వైడూర్యముయొక్క రూపాంతరము(పుట276)

వైడూర్యము - చూడ - వ్రాస

9. కుపసము - కుప్పసము రూపాంతరము. (పుట 290)

10. విగ్రహించు - ఎదిరించు. (పుట 313) చూడుఁడు " శ్రీనాథుఁడు నైషధము." వేయికన్నులవానితో విగ్రహించి - వనిత ! యింకేమికానున్న వాఁడో మరుఁడు

11. దీవెన - దీవన రూపాంతరము (పుట 368)

" వీఁడె యంగదుఁడు దీవెనలిమ్ము"

12. విగణించు - పరిగణించు. ఉపసర్గవిశేషము. (పుట 378)

13. దిడ్డు - పల్లకీమీఁదపఱచెడు మెతుకగుడ్డలు. (పుట 386)

14. వరుషము - వర్షమునకు రూపాంతరము. (పుట 386)

ఆవరుషగుతు సమాగమంబునకు

15. ధనంజయుఁడు-అగ్ని- బూదినిండిన ధనంజయుఁడు(పుట390)

16 ఘర్మకరుఁడు - సూర్యుఁడు (పుట 391)

ఆఘర్మకరుఁడు దానాకాశమునంది

17. హల్లోహాలము. అల్లకల్లోలము. (పుట 316)
హల్లోహాలంబుగా నట్టహాసంబు
(ఈ శబ్దమునుగూర్చి నేనురచించిన భాషాపరిశోధన ప్రయోగవిశేషములు. అనుగ్రంథము చూడఁదగును)
18. అవివేకపడు - అజ్ఞానము కలిగి (పుట 321)
19. క్రమియించుట - గడచుట (పుట 471)
20. హనుమచ్ఛబ్దమునకు హనూమంతుఁడు అని భాషాంతరము
నుడివినయట్ల హనూమంతుచేత (పుట 478)

జాతీయములు

1. ఆహిరిఁబాడిన యనువుగా నేడ్చి. (పుట 358)
చూడుఁడు" రాజీవానన యేడ్చె ..కాంభోజి మేళవించి కా
రవ సుధాపూరంబు తోరంబుగాన్." వసు
2. చేతగాదనివాని చెవి మీలిపెట్ట ప్రోతు మీ. (పుట 523)
3. సామజోత్తియము దీర్చఁగనై నపనిక (పుట 524)
నోమలుపూని పొందునె కార్యసిద్ధి" చూడుఁడు. సామ
జము చెఱకు మీసిన నోమలుపదివేలుచేరి తోమంగలవా?
ఆడిదము సూరకవి చాటువు.
4. తద్దినములు పెట్టుట (పుట 87)
దైతేయులిద్దఱు తమపితరులకు తద్దినమ్ములు పెట్టుతలంపు
5 విడెములందుక రాక్షసులువెడలుట. వీరతాంబూలములు
పుచ్చుకొని యుద్ధమునకు వెడలుట. (పుట 72)
6 గడితానెము - తానెము సలాముచేయుట.
గుజ్జరి కేడెము మున్నగు విజయనగరరాజ్య పారిభాషిక
ములు.

అరణ్యకాండమున 6518 ద్విపదపంక్తులును, కిష్కింధా కాండమున 6248 మొత్తమువిూఁద 12766 పంక్తులీ రామాయణ భాగమునగలవు మొదటి రెండు కాండములందువలె నిందలి రచనయు సరళమై, హృద్యమై, సర్వజనసులభ గ్రాహ్యమైయున్నది. మొదటి సంపుటము వలెనే యీ సంపుటమును నాంధ్రమహాజను లాదరించి, రామాయణ పఠనమువలన కృతార్థతఁ జెందెదరు గావుత.

ఈ రసవంతమైన ద్విపద వాఙ్మయమును ఆంధ్రలోకమునకు సమర్పించు పట్ల సానుభూతి చూపిన మద్రాసు ప్రభుత్వమువారికి ఆంధ్రలోకము కృతజ్ఞతా బద్ధమగుటలో వెనుకంజ వేయదు.

ఈ మహాగ్రంథమంతటికి సంపాదకునిగా నన్ను నియమించిన మదరాసు రాష్ట్రీయప్రభుత్వము వారికి, దీనికనుమతినొసగిన మదరాసు విశ్వవిద్యాలయమువారికి నామనఃపూర్వక కృతజ్ఞతా వందనములు. తంజావూరి గ్రంథాలయ గౌరవకార్యదర్శులు శ్రీ యస్. గోపాలన్‌గారికి నిరంతరస్మరణీయ ప్రణామాంజలు. ఈ గ్రంథము నామూలాగ్రమున ముద్రణదోషములను సవరించి, నాకు చేదోడు వాదోడుగానుండిన, చిరంజీవి శివ సుందరేశ్వర రావునకు నాయాశీస్సులు.

ఇతి శివమ్

ఖర సంవత్సర
మహాసంక్రాంతి
14-1-52

నిడుదవోలు వేంకటరావు
విద్యారత్న, శాస్త్రోపాధ్యాయ
మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర
భాషాశాఖాధ్యక్షుఁడు.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 105 | గద | గదల |
| 10 | 220 | మెచ్చఁగ కడ | మెచ్చఁగఁగడ |
| 14 | 310 | కృతుల | కృతులు |
| ,, | 315 | యితడి | యితఁడి |
| 15 | 323 | తోఁడ | తోడ |
| ,, | 329 | రాముడా | రాముఁడా |
| ,, | 334 | నారత్త | నోరత్త |
| 17 | 378 | మీఱు - యిదియె | మీర - విదియె |
| 22 | 510 | కోసమ | బోసమ |
| 23 | 525 | మొలంగుడి | మొలంగుఁడి |
| 40 | 982 | చెచ్చవి | నెచ్చలి |
| 44 | 1024 | మక్షుతం | రక్షుతం |
| 46 | 1071 | మాతో | మాత్రో |
| 54 | 1262 | ఫుల్లా | ఘుల్లా |
| 55 | 1281 | జటాయూవు | జటాయువు |
| ,, | 1290 | దర్భ | దర్భల |
| 68 | 1486 | నంచ | చంచ |
| 66 | 1547 | దానిపై | దాసిపై |
| 77 | 1807 | బండ్లు | కండ్లు |
| 102 | 2398 | కింద్రుడి | కింద్రుఁడి |
| 105 | 2477 | దుఁదిగి | దుదిగి |
| 112 | 2624 | ఝుల్లవి | ఝుల్లని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 195 | సంఖ్య | 3650 | 4650 |
| 210 | 5005 | నుండయిప్పుడు | నుండనిప్పుడు |
| ,, | 5010 | అంకిలి | నంకిలి |
| 211 | 5020 | యీడేర్చు | నీడేర్చు |
| ,, | 5029 | యాప్రాణ | నాప్రాణ |
| ,, | 5030 | నాప్రాణ | యాప్రాణ |
| ,, | 5031 | నకుతోడునీడ | నకుఁ దోడునీడ |
| 212 | 5057 | యీమేని | నీమేని |
| ,, | 5058 | యేమేని | నేమేమి |
| ,, | 5063 | అక్కటా | నక్కటా |
| 213 | 5066 | యేమని | నేమని |
| ,, | 5068 | మీఁద కడు | మీఁదఁ గడు |
| ,, | 5085 | ఏమి | నేమి |
| 214 | 5101 | ఉన్న | నున్న |
| 222 | 5299 | యే తేపఁ | నే తేపఁ |
| ,, | 5300 | సిట్లాంటి | యిట్లాంటి |
| 223 | 5321 | గొబ్బున | గొబ్బున |
| 227 | 5422 | బోవపువ్వు | బోవఁ బువ్వు |
| 231 | 5515 | జేఁతు | జేతు |
| 240 | 5734 | టచ్చెరివు | ఉచ్చరువు |
| 243 | 5791 | రథము యిదె | రథము నిదె |
| ,, | 5792 | ములు | గములు |
| 244 | 5810 | రెండుయిల | రెండునిల |
| 245 | 5850 | హేతువుచెత | హేతువుచేత |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ,, | 5853 | స్నానంబు | స్నానంబు |
| 248 | 5928 | తెల్లిని | తెల్లని |
| 249 | 5953 | యాస | నాస |
| 250 | 5967 | వత్సలతను | వత్సలత |
| ,, | 5974 | గారణంబుగ | కారణంబుగ |
| 251 | 5086 | తరుగుచునుండ | తిరుగుచునుండ |
| ,, | 5998 | గుజగుజ లేల | గుజగుజలేల |
| ,, | 6003 | అన తెల్విఁ | అనఁ దెల్విఁ |
| 252 | 6028 | యజ్జనకుని | మజ్జనకుని |
| 253 | 6045 | మారిట్లు | మీరిట్లు |
| 255 | 6091 | యిక్కడ | నిక్కడ |
| 256 | 6114 | వారవ్వరు | వారెవ్వరు |
| 257 | 6141 | పేర్చియామూద | పెర్చియామీఁద |
| 259 | 6194 | ఋమతులెందరినైన | విమతులెందఱినైన |
| ,, | 6198 | యినసూనుఁడు | నినసూనుఁడు |
| | | నెఱుంగుయిల | నెఱుంగునిల |
| 261 | 6285 | వొక | ఒక |
| 263 | 6270 | బుప్పికా | బుప్పితా |
| 264 | 6297 | ంతకగాచల | మతంగాచల |
| ,, | 6315 | బడయుండ | బడియుండ |
| 267 | 6370 | రుంచెదము | నెంచెదము |
| 269 | 6408 | జేరుచున్నవ విని | జేరుచునున్నవ |
| | | యెంత | వనినెంత |
| 270 | 6429 | నొక్క | యొక్క |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 270 | 6434 | మహేంరుహావళుల | మహేంరుహావళులం |

కిష్కింధాకాండము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 284 | 214 | సాధింపగా | సాధింపఁగా |
| 285 | 250 | తనుగాచి | తనుఁగాచి |
| 288 | 322 | జూపట్టుయే | జూపట్టునే |
| 289 | 331 | పదములుకంద | పదములుగంద |
| ,, | 345 | లేటికి | లేఁటికి |
| 303 | 660 | నముల దొరగు | నములఁదొరగు |
| 306 | 752 | డీతండు | డీతండు. |
| 307 | 757 | దొరుక | ొరుగ |
| ,, | 780 | చుట్టు | మట్టు |
| 308 | 787 | గాపున | గావున |
| ,, | 793 | సతని | సతని |
| 312 | 876 | రముస | ఎమున |
| 326 | 1229 | చనినతల | చనినఁదల |
| ,, | 1231 | దలపుచు | దలఁపుచు |
| 328 | 1273 | ననుచుతల | ననుచుఁదల |
| ,, | ,, | పారి | పాఱి |
| ,, | 1275 | ముమ్మ్మాటు | ముమ్మాఱటు |
| 331 | 1359 | కర | శర |
| 332 | 1384 | సేదప్పు | సేఁదప్పు |
| 333 | 1400 | కొందంముతో | కొందలముతో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 336 | 1463 | సాదు | సాకు |
| 338 | 1524 | తలంచుసే | తలఁచునే |
| 340 | 1576 | పరవోర | పరివోర |
| 342 | 1618 | ఘపుని | ఘువుని |
| ,, | 1620 | టయు | టయుఁ |
| 348 | 1770 | మెఱుఁగగ | మెఱుఁగఁగ |
| 350 | 1814 | వనిమృగ | వనీమృగ |
| ,, | 1816 | ఒఱవ కరుణ | బఱవఁగ రుణ |
| 352 | 1863 | కులంగిడుసు | కలంగుదును |
| ,, | 1868 | సీకేలు | నీకేలు |
| 353 | 1881 | జాల | జాలఁ |
| 357 | 19[illegible]0 | ప్పైఁ మొదలి | పై మొదలి |
| 361 | 2092 | సచ్చుత్రుఁడ | సచ్చరిత్రుఁడ |
| 362 | 2095 | అల్లనవిచి | అల్లనవిచ్చి |
| ,, | 2112 | కన్నట్ట | గన్నట్టి |
| 363 | 2119 | దప్ప | దప్పక |
| 367 | 2231 | రెక్కల | ఱెక్కల |
| 369 | 2263 | సంగంబు | సగంబు |
| 371 | 2320 | చూత | భూతి |
| 378 | 2475 | బోఫ | బోధన |
| ,, | 2478 | కానాధీ | నానాధీ |
| 380 | 2535 | నన | దన |
| 381 | 2550 | యించున | యించు |
| 383 | 2595 | బిలా | నీబిలా |
| 388 | 2713 | ఇచ్చట | నిచ్చట |
| 393 | 2827 | సింధురరీతి | సింధురమురీతి |
| 401 | 3029 | దీర్పనీ | దీర్పని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ,, | 3041 | అతని | నతని |
| 408 | 3183 | రెక్కల | ఱెక్కల |
| 411 | 3258 | నట్లు | నట్టు |
| ,, | 3259 | అరఁగ | లారఁగ |
| 412 | 3287 | ఊరక | నూరక |
| 414 | 3374 | సున్న | నున్న |
| 432 | 3766 | టయు | టయుఁ |
| ,, | 3767 | కట్టెదుర | గట్టెదుర |
| 445 | 39[illegible]7 | వ్వారలు | వారలు |
| 446 | 4597 | ని తెలుఁగు | ని త్తెలుఁగు |
| 469 | 4651 | బంవుట | బంపుట |
| 470 | 4695 | యీముద్దు | నీముద్దు |
| 472 | 4723 | గాగ | గాఁగ |
| 474 | 4774 | దీఱనే | దీఱునే |
| 476 | 4823 | డెప్పుడు | ఎప్పుడు |
| ,, | 4824 | సబయ్యె | సంబయ్యె |
| 477 | 4849 | ఎచ్కటి | ఎక్కడి |
| 479 | 4900 | జినుల | జినులఁ |
| 480 | 4934 | వాటి | సాటి |
| 482 | 4973 | లరేణు | లవేణు |
| 496 | 5313 | నోడ | నోడఁ |
| ,, | 5319 | నాధిందు | సాధించు |
| 514 | 5760 | రాజ్యంటు | రాజ్యంబుఁ |
| 519 | 5862 | ధిశక్తి | ధీశక్తి |

---

# విషయానుక్రమణిక

## అరణ్యకాండము

| విషయములు | పుట |
|---|---|

విషయములు — పుట

విషయములు — పుట

శుభమస్తు.

కట్టా వరదరాజకృతమగు

# శ్రీ రామాయణము

(ద్విపద)



## ఆరణ్యకాండము

—: ఇష్టదేవతాస్తుతి :—

శ్రీరాజితశుభాంగ! - చిరగుణాసంగ!
హారికృపాపాంగ! - యలమేలుమంగ
భావుక! శతకోటి - భానుసంకాశ!
సేవకాత్మనివేశ! - శ్రీవేంకటేశ!
అవధారు! కుశలవు - లా రామచంద్రు
డవధరింపంగ రా - మాయణం బిట్లు
వినుపించు తత్కథా - వృత్తాంతమెల్ల
కనుపించు నవ్వాలి - కథ యెట్టులనిన;

—: శ్రీరాముఁడు మునుల యాశ్రమముఁ జూచుట :—

అపుడు రాముఁడు దండ - కారణ్య భూమి
విపుల తేజమునఁ బ్ర - వేశంబుఁ జేసి

యరుగుచో నభమును - నర్కమండలము
కరణి భూసురు లుండు - కందువఁ జేరి
వనమృగంబులకు ని - వాసమై సకల
మునివరాగమ నాద - ములఁ జెలంగుచును
గలిత నానావిహం - గమకలస్వనముఁ
గలిగి యాదిత్య రా - కాచంద్రముఖుల
నాటపాటలచేత - నమరు నికుంజ
వాటికలను స్రుక్స్రు - వమ్ములు దాల్చు
హోతలచేనొప్పు - హోమవేదికల
హేతులు వెలి విరి - యించు నగ్నులను
బలివిధానముల రం - భారసాలాది
ఫలమహీరుహములఁ - బద్మినీకుముద
జలజాకరముల భా - స్కరపావకులకుఁ
దులవచ్చు మౌనుల - తో విరాజిల్లు
నొక యాశ్రమముఁ జూచి - యుగ్రకార్ముకము
లోకరైన నెక్కిడ - నొల్లకఁ దమదు
భుజములఁ గీలించి - పోఫు రాఘవుల
నజినోత్తరీయులై - నట్టి సంయములు
వెఱఁగంది కరుణతో - వీక్షించి చేరి
భరతాగ్రజునిఁ జూచి - పలికిరిట్లనుచు.

—: మునులకు శ్రీరాముఁ డభయప్రదానముఁ గావించుట :—

" అతిథివై తివి యస్మ - దాశ్రమంబునకు
నతివతోవచ్చి నీ - కర్చ లిచ్చెదము
అమరావతీపురం - బమరేంద్రుఁ డేలు

క్రమమున నిలకెల్లఁ - గర్తవు నీవు
వసియింపు మిచట మీ - వారము మేము
వసుమతీ సురల దే - వతలను బ్రోవ
భారకుండవు దైత్య - బాధలు మమ్ము
నోరామ ! యెన్నని - యుగ్గడించెదము
నినుఁజూచి ప్రాణముల్ - నిల్చెను మాకు
మునులమాటను శమం - బుల నోర్వవలసె
మాకుఁగ్రోధంబులు - మత్సరంబులును
కాకుండ నటుగాన - కలుషించి మేము
చేతనై యుండియుఁ - జేసిన తపము
పాతకుల శపింప - బరిసిపోవుటను
దాలియుందుము కన్న - తల్లి బిడ్డలను
బాలించు గతి నీదు - పాలిటనుంచి
శరణాగతుల మమ్ము - సభయుల నీదు
మఱుఁగున నుంచి నే - మములు చెల్లించి
కావు మీవని ఫల - కందమూలములు
కావలసినవెల్లఁ - గానుకచేసి
యులరింప వారికి - నభయ మొసంగి
లలనాలలామతో - లక్ష్మణుతోడ
నాదినంబెల్ల న - య్యాశ్రమ సీమ
మోదంబుతో రఘు - ముఖ్యుఁడు నిలిచె.

—. రాముఁడు విరాధునిఁ జూచుట :—

అపరదినంబున - నమ్మహీభుజుఁడు
తపనసంకాశులౌ - తాపసోత్తముల

యనుమతిఁ జెంత మ - హారణ్య భూమి
యనుజన్మ సీతాస - హాయుఁడై చొచ్చి
పులులును గారెను - పోతులు బందు
లెలుఁగులు దోఁడేళ్ళు - నేదులు లేళ్లు
గాక ఘూకంబులు - కంకగృధ్రములు
నేకడ నెడ మూక - యుగ్రమై మెలఁగు
నవి చూచుచుం బోవ - నట్టహాసమున
నవనియు నింగియు - నదికట్టు వడఁగ
నతిభయంకరమైన - యంజనాచలముఁ
బ్రతివచ్చు మేను బా - భారంబు గాఁగ
తెఱచిన నోరుతో - దిగదిగ వెలుఁగు
మెఱుఁగు కోరలతోడ - మిణుగురుల్ రాల్చు
చూపులతో నుగ్ర - శూలంబుతోడ
జూపఱ బెదర వ - చ్చు సురాపరాధు
నా విరాధుని విల - యాంతక నిభుని
భావి రావణవైరి - భావించి చూడ,
శీఘ్రవేగమున పి - చ్చిలి నెత్తు రొలుక
వ్యాఘ్ర చర్మము మేన - వలెవాటు వైచి
నాలుగు సింహముల్ - నాలుగు పులులు
నాలుగుకొమ్ముల - నాగము స్తములు
పదికాఱుపోతు లి - ర్వది హరిణములు
పదియేను తోఁడేళ్లు - పందులేఁబదియు
శూలాగ్రమున గ్రేలఁ - జొరఁ బాఱి తనదు
మ్రోలఁగన్పట్టు రా - మునికడఁ ద్రోచి

జానకి కేల్వట్టి - చంకనువైచి
దానవుఁడవుడు రౌ - ద్రరసంబు మెఱయ
గడగడ వడఁకు రా - ఘవు దేవితోడఁ
గడకేఁగి నిల్చి బిం - కమున నిట్లనియె.
"ఎవ్వరురా! మీర - లిమ్మహాటవిని
గ్రొవ్వుతోఁ జక్కని - కోమలి తోడఁ
బోటు బంటులఁబోలి - భుజముల విండ్లు
హాటకపుంఖంబు - లైన బాణములు
కైదువులును బూని - గ్రాసమై నాకు
మీఁ దెఱుంగక వచ్చి - మీరు చిక్కితిరి
మాయావులై మీరు - మౌని వేషముల
నాయెదురను జడల్ - నారచీరలును
దాలిచి వచ్చినం - దప్పునే మౌని
జాలంబె కాదె భో - జనము నాకిపుడు
తలఁచ నీతలఁపు సుం - దరి తెకదేర
గలిగె నూరికె నాకుఁ - గామాతురునకు
దీని వివాహమై - తెరువాఁగి మిమ్ముఁ
బోనీకఁబట్టి యి - ప్పుడె మ్రింగువాఁడ
నేవిరాధుఁడ నాకు - నీ యరణ్యంబు
తావలంబ"ని పల్కు - దానవు మాట
విని దైన్యమున మోము - వెలవెలగాఁగ
దనపెదవుల నౌకిం - తయుఁ దడిలేక
జానకీవిభుఁడు ల - క్ష్మణు మోముఁజూచి
దీనుఁడై తనపెంపుఁ - దెలియక పల్కె.
"కంటివే లక్ష్మణ! - గాలిమైఁ గడల

నంటిరో యననొప్పు - నవనీతనూజ
చెలిఁబట్టువడి వెలి - చెనుఁ బ్రాణభీతి
నెఱుఁగక వచ్చితి - మిట్టి మార్గమున
మనము చూచుచునుండ - మనవెంటవచ్చు
వనిత నెత్తుకపోయి - వాఁడున్నవాఁడు
కైక తలంచు సం - కల్ప మంతయును
జేకూడెఁ గౌసల్య - సేయు పాపమున
ధరణియొక్కని కిచ్చి - తండ్రినింజంపి
తరుణినిం గోల్పోయిఁ - దన వివేకమున
నాచెట్టవట్టి మా - నముఁ దూలపోవ
నోచ సీజనకత - నూజ యేమందు!
ఏమిసేయుదు"? నన్న - నెంతయు నలిగి
రామునితో సుమి - త్రా సుతుండనియె.
" దేవ! యిట్లందు రే - దేవతావిభుని
లావునంగెల్చి ఖే - ల ప్రతాపుఁడవు
కావలెనన్న లో - క త్రితయంబు
నీ విశిఖాగ్నిచే - నీఱు సేయుదువు!
నేను నీ బంట నుం - డియు నింకలోన
దీనుని వలె నేల - ధృతి మాని పల్క?
వీఁడన నెంత! నా - వివిధాస్త్ర కోటి
వాఁడిమిచే భూమి - వ్రయ్యలుసేతు!
భరతుని మీఁది నా - పగయెల్ల నేఁడు
మరలించి యొకకోల - మర్దింతు వీని
పిడుగు గొట్టినయట్టి - పృథివీధరంబు
వడుపున నెమ్మేను - వ్రయ్యలుగాఁగ

నాచేతి యొకతూఁపు – నాటించి దనుజ
నీచునిం గూల్చెద – నిమిషమాత్రమున !
విపినమండలమెల్ల – వీనిర క్తమున
నిపుడ నదిశ్రేణి – నెనయంగఁ జేతు !
నంచిత పరమక – ల్యాణిని సీత
నుంచెదఁ దెచ్చి మీ – యొద్ద నీక్షణమె !
ననుఁ జూడుఁ"డని పల్క – నగుమోముతోడ
దనుజుఁడు భీతి యిం – తయు లేక పలికె.

—· విరాధరామ సంభాషణ :—

" ఎట్టివారలు మీర – లీవాశకముల
నట్టడవినిఁ జిక్కి – నారు నాచేత
మీరు వోయెదమన్న – మిన్నకపోవఁ
దీరునే విధి మిమ్ముఁ – దెచ్చెనా కడకు "
నను మాటలకు రాముఁ – డా నిశాచరుని
గనుఁగొని " ఏము భా – స్కర వంశజులము
దశరథరాజనం – దనులము , తండ్రి
యశమొంచి యతని స – త్యము నిల్పఁదలఁచి
వనులను జరియింప – వలసి యిచ్చోటి
మునికోటి ప్రార్థనం – బులఁ జరించెదము. "
అన్న మాటలకు వాఁ – డా రాజసుతుల
నెన్నక మదిగర్వ – మెచ్చ నిట్లనియె.
" రాజనందనులార ! – రాక్షస వంశ
రాజైన జయుని పు – త్రకుఁడను నేను
శతహ్రదయందురు – జనయిత్రి నాకు

నతిబలుండ విరాధుఁ - డందురు నన్ను
దేవతాఖచర దై - తేయ కింపురుష
లావణ్యవతుల నె - ల్లను విచారించి
తగినట్టి చక్కని - దాని నెచ్చోట
జగతిని వెదకి యీ - జలజలోచనను
నిచ్చోటఁజూచితి - నీయింతి మీరు
తెచ్చి కానుక చేసి - తిరిగాన మిమ్ముఁ
గాచితి నీయింతిఁ - గని నామనంబు
లోచనంబులును మే - లునకుఁబాల్పడియె!
కమలజుఁజేత సం - గరములో నౌరులు
తెమలింప రానట్టి - ధృతిఁ గన్నవాఁడ
నాయుధాహతులచే - హతిలేక యుండ
నా యజునివరంబు - లందిన వాఁడ!
జనుఁడు మీయిచ్చకు - సరిపోయినట్టి
యనువునఁబ్రతుకుల - యాస కల్గినను ,
ననుభవించెదరు కా - దనుచు నేమైన
నని యిట్టులట్లు మ - ల్లాడితిరేని
పొందన్న " నాగ్రహం - బున విరాధునకు
వెండియు నారఘు - వీరుఁ డిట్లనియె.

—. రాముఁడు విరాధునితో యుద్ధముచేయుట :—

" ఓరి! విరాధ! నా - యుగ్ర బాణముల
నీరీతి ననరాని - యీమాటలాడు
నిన్ను ఖండించెద - నేఁడు నీచేత
మున్నఁగాసిలియున్న - మునులఁ గాచెదను "

అని యేడు దూపుల - నద్రియుంబోలు
దనుజుని యురము ర - క్తంబులఁ దొఱుఁగ
వ్రేసిన నవి దూఱి - వీపునే వెడలి
భాసుర పావక - ప్రభలు గప్పుచును
పుడమి నాఁటిన మహీ - పుత్రినం దొక్క
యెడనుంచి తనశూల - మెత్తి యార్చుచును
వదనంబుఁ దెఱచి పై - వస్వాతుఁగరణిఁ
గదియ రాఁజూచి రా - ఘవులుఁగోపించి
యిరువురు నిఱుగడ - నిషుపరంపరలు
గురిసి దానవుమేన - గుదిగ్రుచ్చి నిలుప
నతఁడు మైజాడింప - నమ్ములన్నియును
క్షితిమీఁద రాలినఁ - జెదర కయ్యసుర
శూలంబుఁద్రిప్పి యా - ర్చుచు మీఁదవైవ
నాలంబులో నది - యాలంబు గాఁగ
రెండు దూపులచేత - శ్రీరామవిభుఁడు
ఖండింప పటువజ్ర - ఘాతనిర్భిన్న
సముదగ్ర కాంచనా - చలశిలాశకల
సమతఁజెందుచును ర - సా స్థలింబడినఁ
బోయిన శూలంబుఁ - బోవనిమ్మనుచు
నాయతాత్మీయ బా - హాయుగళమున
రామలక్ష్మణులఁ జే - రఁగనేఁగి పట్టి
యేమి దలంచెనో - యిరుభుజంబులకు
నెక్కించుకొని పోవ - నినకులోత్తములు
" దక్కనిత్రోవనే - చనుచున్న వాఁడు

మనమేఁగవలసిన - మాత్రంబెయేఁగి
తునుముద మట మీఁద - దోశ్శక్తి నితని
పోవనిమ్మని వాని - భుజముల మీఁదఁ
బోవువారలఁజూచి - భూపుత్రి వగచి,
" ఏలకో వీనిచే - నిమ్మహాశౌర్య
లాలంబులోఁజిక్కి - రసమర్థులగుచుఁ
గావలసిన వీని - ఖండింపలేరొ
లావున నింక నే - లాగు నా తెఱఁగు ! "
అని వెంటఁబోవుచు - నార్తి నొందుచును
వనమృగంబులకు భా - వమున భీతిలుచు,
" ఓరిదానవ ! మది - నోడక యేల
నీరాఘవులఁ బట్టి - యేఁగెద విట్లు ?
పోవచ్చునే నీవు - బోయిననేలఁ
బోవనిత్తురె పట్టి - పొలియింప కిపుడు
మనువంశ విభులను - మావారి డించి
చనుమన " విలపించు - జానకి మదికి
హితముగా ఖడ్గంబు - లిరువురుఁదిగిచి
దితిసుతు భుజములుఁ - దెగవ్రేయుటయును
వానిచేతుల వెంట - వసుమతి వ్రాలి
జానకిచూచి మె - చ్చఁగ కడ నిలువ
నావిరాధుండు మ - హా రావమొప్ప
లావెల్లఁ బొలసి యి - లాస్థలిఁ బడినఁ
గత్తుల నఱికియు - గాఁజాల కుట్ల
తిత్తిగాఁ బొడిచియుఁ - దీసియిట్టట్టు
వెలికిలఁ బొరలంగ - వ్రేసి మోకాళ్ళ

నలియంగఁ బొడిచి య - న్నయు దమ్ముఁడును
దలయుఁ గాళ్లునుఁ బట్టి - దానవు నెత్తి
యిలమీఁదఁ గొట్టియు - నెమ్ములన్నియును
బొడిపొడి సేసియుఁ - బొందుగఁ ద్రొక్కి
మెడ నులిమియు గ్రుద్దు - మిణకరింపంగఁ
బిడికిళ్ల గ్రుద్దియు - భీమరాక్షసుని
మడియింపనేరక - మల్లాడి యలసి,
" వింటివే లక్ష్మణ! - వీఁడిట్లు బడియు
నొంటనుఁ జావులే - కున్నాఁడు ధాత
వరముచే నటుగాన - వసుమతిఁ ద్రవ్వి
బొరియలో నీద్రోహిఁ - బూడ్చి చంపుదము
త్రవ్వుమిచ్చో" నను - దశరథసుతుని
యవ్వాక్యములకు వాఁ - డాపన్నుఁడగుచు
శరణాగతత్రాణ - సద్ధర్మపరుని
ధరణిజారమణు న - త్తఱిఁ జూచి పలికె.

## — విరాధుని శాపకథనము —

" స్వామి! నీచరణముల్ - శరణంబు నాకు
యీమానినియె సీత - యీవు రాముఁడవు
యితఁడు లక్ష్మణుఁ డని - యెఱిఁగితి నిపుడు
మతిమిమ్ముఁ గనలేక - మార్కొంటి నేను
బాధింపకుము దీన - బాంధవ! సకల
సాధు రక్షణ విచ - క్షణుఁడవు నీవు
వినుము నా తెఱఁగు నే - విబుధేంద్రు చెంతఁ
జనుమానమున నుండు - సంగీత నిధిని

తుంబురుం డనుచు నం - దురు పేరు, రాజ
సంబున గంధర్వ - జాతినుత్తముఁడఁ
గామాంధకారంబు - కన్నులఁదొట్టి
కామించి రంభతోఁ - గలసి క్రీడింపఁ
దనకొలువునకు ని - తఁడు వేళఁగాచి
కనుఁగల్గి యుండఁడు - గర్వించి యనుచు
దనుజుఁడవై నీవు - ధరణిపైఁబుట్టు
మనుచుఁ గుబేరుఁడ - త్యుగ్రహావృత్తి
శపియింప వెఱచి యం - జలిచేసి చాల
కృపణత్వమున నుండఁ - గృపయుంచి యతఁడు
మీరాకయును నాకు - మీతోడి రణము
కారణంబున ముక్తి - గలుగు చందంబు
వివరింపఁగిన్నర - విభుని శాపమున
నవనిపై నిట్టి ఘో - రాకృతిఁబుట్టి
సరిచూచితిని నాఁటి - శాపంబునకును
దరియౌట యభయప్ర - దానంబుఁజేసి
రక్షింపుఁడిక సంగ - రంబునం బడిన
రాక్షసులను మహీ - ద్రవ్వి పూడ్చుటయె
ధర్మంబుగా నటు - దలఁచిన యట్టి
కర్మంబు సేయుఁడేఁ - గనియెద ముక్తి.
దయఁజూడఁ డిచ్చోటు - దరలి యీప్రొద్దె
పయనమై దక్షిణ - భాగంబు నందుఁ
జను చోట నర్థయో - జనమాత్రనొక్క
ముని శరభంగ నా - మునిఁగాంచఁగలరు.
అందుచే శుభములు - నందుదు రేను

బొందుదు నిట్లూర్ధ్వ - పుణ్యలోకములు
పాలింపుఁడను"నుమాటఁ - బరమ కారుణ్య
శాలి యా జానకీ - జాని యాలించి
వెఱఁగును దాల్మి వి - వేకంబుఁ గరుణ
దొరయంగ సౌమిత్రి - తోడ నిట్లనియె.
"వింటివి లక్ష్మణ - వీని చందంబు
మంటిలోఁ బూడ్చక - మరణంబు లేదు
వీనికి నోదము - విధమునం బెద్ద
యేనుఁగ పొడవుతో - నిపుడొక్క గుంటఁ
ద్రవ్వు మీ"వని చెంతఁ - ద్రవ్వించి వాని
నవ్వేళఁ గుత్తుక - యంఘ్రిచేఁ ద్రొక్కి
యిరువురు పాఁతర - కీడ్చి పొర్లించి
శిరము క్రిందుగ రొద - సేయుచుఁ ద్రెళ్ల
బడఁ ద్రోచి దానవు - పై రాళ్లు గుండ్లుఁ
బడవైచి ప్రాకులా - పై నిండ వైచి
గడ్డలు దుమ్మును - గప్పి ధారుణికి
నొడ్డుగా పై దిన్నె - యునిచి యవ్వెనుక
జానకి నోదార్చి - శరచాప హస్తు
లై నిబిడంబైన - యడవిలోఁ జొచ్చి
నభమున సూర్యచం - ద్రములనుఁ బోలి
శుభమూర్తులై వచ్చు - చో రామ విభుఁడు

—: శ్రీరాముఁడు శరభంగ మౌని యాశ్రమమును జేరుట :—

సీత నప్పుడు తన - చెంతకుఁ దివిచి
ప్రీతితోఁ దమ్మునిఁ - జేర్కొని పలికె

"అతిఘోరమైన యీ - యడవి దాఁటితిమి
హితముగాఁగ విరాధుఁ - డెఱిఁగించి నట్టి
శరభంగమౌని యా - శ్రమముఁ జేరితిమి
పరికింపు మిచటి వి - ప్పల మహీరుహము
నారావి చెంతనా - నామరుల్ గొలువ
స్వారాజు వచ్చి యి - చ్చట నున్నవాఁడు
శింజాన కంకణ - శ్రేణి నచ్చరలు
వింజామరలు జెంత - వీచుచున్నారు
తెల్లని హయముల - తేరునఁగట్టి
యుల్లసిల్లుచునున్న - యొక సహస్రంబు
యిరువదే నేఁడుల - యెలజవ్వనంపు
దొరలు పసిండిక - త్తులుఁ బరిజించి
కుండల కోటీర - కోటితో దివ్య
మండనంబులు దాల్చి - మన్మథాకృతుల
జుట్టునుం గొలువ న - చ్చో నుర్వి మీఁద
మెట్టని పదముల - మిహిర తేజమున
నున్నవాఁడింద్రుఁ డ - యోధ్యలోఁదొల్లి
విన్నట్టి యందఱి - వేషముల్ చూచి
యితరులు సురలని - యితఁడింద్రుఁ డనియు
మతిఁదోఁచె శరభంగ - మౌని చెంగటికి
వచ్చియున్నాఁడు నే - వారి సేవించి
వచ్చెద నీపుణ్య - వనసమీపమున
జానకి చెంత ని - చ్చట నుండు మీవు
మానినివరేణ్యతో - మనమాట కాఁగ

యీచాయఁగాఁజూచి - యేమేమొ కొన్ని
చేచాఁచి యింద్రుండు - జెప్పెడి నిపుడు
వేగఁబోవలెనని - వినయంబు తోఁడ
సాగి మున్నగ రామ - చంద్రుంకు రాఁగ
గొబ్బున ననిపించు - కొని వాహనములఁ
దబ్బిబ్బుగా సుర - తతి యెక్కి కదలఁ
దాను రథంబెక్కి - ధరణీ ధరారి
యానిలింపులఁజూచి - యప్పు డిట్లనియె.
" అదె వచ్చె రఘురాము - డాయన చేతఁ
బ్రదుకులు మనకెల్లఁ - బదిలమై యుండు.
రావణాది నిశాచ - రశ్రేణి నెల్ల
యీవీరవరుఁడు జ - యించిన వెనకఁ
బొడగని మరికాని - పొసఁగ దేమియును
నుడివి యిట్లసిపల్కి - నోరెత్త రాదు
కనిపించు కొనువేళ - గాదు రండనుచు "
మనసులో మ్రొక్కి య - మ్మాతలి తేరు
నడపింప వినువీథి - నాకంబుఁజేర
గడియలో నరుగ రా - ఘవ శేఖరుండు
సీతయు సౌమిత్రి - చెంతల రాఁగ

—— రాముఁడు శరభంగుని దర్శించుట :——

జాతహర్షంబుతో - శరభంగుఁ జేరి
యతనికిఁ బ్రణమిల్లి - హస్తముల్ మొగిచి
హితమతి నిల్చిన - నీక్షించి మౌని
దీవించి యొక్క ప్ర - దేశంబుఁజూప

నావీరవరుఁడు సు - ఖాసీనుఁడగుచు
శరభంగ మౌనితో - శతమఖు రాక
మరలిపోయిన యాగ - మంబు వేఁడుటయు
నామహామహుఁడు ప్రి - యంబు రెట్టింప
రామునిఁజూచి స - ర్వము నిట్టులనియె.
"శ్రీరామ! యెవ్వారి - చేత సాధింపఁ
గారాని సత్యలో - కము నాతపమున
సాధించుటనుఁ జేసి - జలజసంభవుఁడు
బోధింప నింద్రుఁడి - ప్పుడు వచ్చి నన్నుఁ
బిలిచిన తోడనేఁ - బ్రియహితాలాప
ములువల్కి నినుఁజూచి - ముచ్చటదీఱి
మఱిపోవువాఁడనై - మదినీదు రాక
యరసి జంభారిఁ బో - మ్మని పనిచితిని
యిదినిమిత్తంబుగా - నింద్రుండు వచ్చె
నదినీకుఁ దెల్పితి - నవనిజారమణ!
నీకు హితంబెద్ది - నిర్జరరాజ
లోకమైనను సత్య - లోకంబెయైన
నితరలోకములైన - నే దపోమహిమ
జితము చేసినవాఁడఁ - జేకూర్తు నీకు
నడుగు" మీవన మునీం - ద్రాగ్రణిఁ జూచి
యడుగ నొల్లక రాఘ - వాగ్రణి వల్కెఁ
"అయ్య! మీకరుణచే - నన్నిలోకములు
నెయ్యెడవలసిన - నేనె సాధింతు
నవి నాకు నెంత మీ - యనుమతి చేత
నవనిపై నొక్క ర - మ్యప్రదేశమున

నుండఁగోరెద మాకు - నొకయెడ నాన
తిండు వసింప నెం - దే విచారించి"
యనిన రాముని@ జూచి - యామునిరాజు
మనసులో నలరి క్రొ - మ్మెర నిట్టులనియె.

—: శరభంగుఁ డగ్నిప్రవేశముఁ జేసి
బ్రహ్మలోకమున కరుగుట :—

" అనఘ రాఘవ ! ఇమ్మ - హాశ్రమంబునకు
ననతిదూరమున సుతీ - క్ష్ణాశ్రమం బొప్పు
నమ్ముని కడ కేఁగి - యతనితో మీర
లిమ్మన్న కడ కేఁగి - యిమ్ము మీ కిచ్చు
చని వేఁడుఁ డొకయింత - సంయురించి నన్నుఁ
గనుఁగొని తరవాతఁ - గదలుఁడు మీరు
యిదియె మందాకిని - యియ్యేటి తీరఁ
గదలి యమ్మునిఁగన్న - గాంతురు శుభము !
ఇప్పుడే చనియెద - నేనని యతఁడు
కుప్పసంబూడిన - కోదమ త్రాచనఁగ
కరలెడు హోమాగ్ని - కీలల మేను
దరికొల్పి యంగంబు - దహనునకిచ్చి
యతఁడిచ్చు నొక కొమ - రాకారమంది
జతఁగూడు పావక - జ్వాలలు వెడలి
యనఘు పుణ్యులు నాహి - తాగ్నులు దివ్య
మునులును దేవతా - ముఖ్యులు నుండు
లోకంబులెల్ల నా - లోకించి మించి
యాకడ బ్రహ్మలో - కావాప్తి నతఁడు

చతురాననునకు నం - జలిఁజేసి నిలిచి
యతఁడు సేమము వేడ - నరలేక పల్కి
యాలోకమున నిశ్చ - లానంద సౌఖ్య
లోలుఁడౌ మౌని నా - లోకించి మెచ్చి
యున్నచో నయ్యాశ్ర - మోపాంత వనుల

—: దండకారణ్యములోని మునులకు శ్రీరాముఁ
డభయదానమిచ్చుట :—

నున్నట్టి మౌనులు - యోగిపుంగవులు
పలుగురా ల్పొడిచేసి - భక్షించువారు
నిలివెఁడు నీటిలో - నెలకొనువారు
కొరుకుడు ధాన్యముల్ - గొనిమనువారు
కరువలీ తమమేఁత - గానున్నవారు
పుడమి మోవని దేహ - ములనుండు వారు
పడివట్టి పాటుగాఁ - బడియుండు వారు
యెత్తిన చేతుల - నేయుండు వారు
బిత్తరిం జలికోర్చి - పెనుపొందువారు
కలఁగక తలక్రిందు - గానుండు వారు
వెలుఁగు వహ్నులలోన - వెలుఁగొందువారు
పిడికెడు తిండిచేఁ - బేర్కొల వారు
పుడిసిటి మాత్ర మం - బులుగ్రోలు వారు
కందమూలముల నాఁ - కలి దీర్చువారు
నందితజీర్ణ ప - ర్ణము లాను వారు.
గరికెవ్రేళ్లు మెసంగి - క్రమియించు వారు
ఖరకర చిదిపిరాల్ - గ్రోలెడు వారు

నందఱు గుమిగూడి - యాశరభంగు
కందువఁ జేరి రా - ఘవుల దీవించి
యొక్కమాటగ వార - లొండొరు మీఱి
త్రొక్కులాడుచు రాము - తోడ నిట్లనిరి.
"మఘవుఁడు దొర దేవ - మండలికెల్ల
రఘువంశజుల కెల్ల - రాజవు నీవు
లోకుల నెల్ల నే - లుటకునై నీవు
లోకంబునకు నెల్ల - లోకేశుఁ డొకఁడు
చాలినవారు దు - ర్జనుల నడంప
వాలాయమున మంచి - వారిఁ బోషింప
నీకె భారము మాట - నిజము చెల్లింపఁ
జేకొని ధర్మమా - ర్జితముఁ గావింపఁ
బితృవాక్యమొనరింపఁ - బృథివిపైఁ గీర్తి
యతిశయింపఁ బ్రతాప - మభివృద్ధి సేయు
గుణములచే నెల్లఁ - గోటికి నెక్క
గణుతింప నీకెయే - కడఁ జెల్లుచుండుఁ
గావున మాకు నొ - క్క ప్రయోజనంబు
గావింప వలయు నో - గాములు మాని.
రాజులు పుడమి నా - ఱవయొక పాలు
భూజనమ్ముల చేతఁ - బుచ్చుక వారి
కన్నట్టి బిడ్డల - కైవడిఁ జాల
మన్నించి ప్రోవ ధ - ర్మంబటు గాన
న్యాయమార్గంబున - నడవక యున్న
నాయవనీపతి - నఘములు వొందు
నడచినఁ గీర్తి య - నంతపుణ్యంబు

కడపట స్వర్గలో - కసుఖంబు నొందు
సత్యమార్గంబున - జగతిఁ బాలించు
నత్యంత ధార్మికుం - డైన భూపతికి
నతఁడేలు సీమలో - యతివరుల్సేయు
నతిశయ జపతపో - యాగాదికముల
ఫలముల నాలవ - పాలుప్రాపించు
నిలయేలు పుణ్యుల - కెల్ల కర్మములు
రామ ! నీయంతటి - రాజు గల్గియును
సామాన్యులైన రా - క్షసులచే బాధ
నేమెల్లఁ బొరయంగ - నెంత లేదనుచు
నేమియు ననకుండ - నెట్లగు నీకు ?
ఈచిత్రకూట మ - హీధరప్రాంత
వాచంయములకు ని - ల్వఁగ యాములయ్యె.
మందాకినీతీర - మౌనిబృందంబు
డెందంబులకు నివ్వ - టిల్లె భయంబు
పంపాతరంగిణీ - ప్రాంతవాసులకు
మంపిల్లఁదొడఁగె న - మ్మదిలోన భీతి
యితరాశ్రమంబుల - యీ ఋషివరుల
వెతలెల్లఁ గతలుగా - వినిపింపవలయు
మముఁజూడు మిప్పుడు - మాశరీరముల
క్రమముఁ జూచినఁ దెల్పఁ - గాఁ బనిలేదు
మాయాపదలు మాన్చి - మహిసుతాప్రాణ
నాయక ! అభయుదా - నంబుఁ గావింపు !
శరణుఁజొచ్చితిమి మీ - చరణాబ్జములకు
నెఱిఁగి ప్రోవుము మాకు - నెవ్వారుదిక్కు

రాక్షసబాధలు - రాకుండ మమ్ము
రక్షింపు కరుణాబ్ధి - రామ ! శ్రీరామ ! ”
అనుచు దైన్యంబులోఁ - బ్రార్థింపుచున్న
వనవాసులకు రఘు - వర్యుఁడిట్లనియె.
చూచితి మిమ్ము మీ - చొప్పెల్ల వింటిఁ
గాచితి నవధులె - క్కడి వింక మీకు
పితృవాక్యమొనరించు - పేరిట మిమ్ముఁ
బ్రతినచే రక్షింపఁ - బనివూని నాఁడ
నెక్కడి వాపద - లింక మీఁద మీకు
నిక్కడ మిముఁగావ - నే వచ్చినాఁడ
మీరేమిచెప్పిన - మీరక చేసి
ఘోరరాక్షసులఁ బై - కొని త్రుంచువాఁడ
నావనవాసంబు - నకు ఫలంబైన
మీవాక్యములు జేసి - మేలందు వాఁడ
బట్టుగా మిమ్ముఁజే - పట్టిన వాఁడ
గట్టితి దనుజ శి - క్షా కంకణంబు !
నను వేఁడుకొనవేల - నానావిధాస్త్ర
ధనువులెన్నటికిఁక - దాఁచనివాఁడ
నిందఱి కభయమే - నిచ్చితి మీరు
మందిరంబులను నె - మ్మది నుండుఁడింక !
అప్రతిమంబైన - యస్మత్ప్రతాప
దీప్తానలంబు దై - తేయకాననము
దహియించు నప్పుడం - దఱుఁ జూచినన్ను
బహుమాన మొనరింపఁ - బ్రార్థించెదరు ”

—: సుతీక్ష్ణాశ్రమ ప్రవేశము :—

అని నమ్మికలొసంగ - నామునీశ్వరులు
తనవెంటరాఁగ సీ - తా సమేతముగ
ననుఁగు సోదరుఁగూడి - యపుడా సుతీక్ష్ణ
మునివరాశ్రమము రా - ముఁడు ప్రవేశించి
యచట జటావల్క - లాంబరధరుని
సుచరిత్రు నాసుతీ - క్ష్ణునిఁ జేరఁబోయి
యామునికెఱఁగి తా - నంజలిసేసి
"రాముఁడందురు నన్న - రణ్య భూములకు
వచ్చి మిమ్ములఁజూడ - వచ్చితి" మనిన
మెచ్చి యాముని రాజు - మిగుల దీవించి
చెంత నాసీనునిఁ - జేసి రామునకు
నెంతయుఁ గరుణతో - నిట్లని పల్కె.
"అన్న రాఘవ! మిమ్ము - నన్నదమ్ములనుఁ
గన్నుల వడిదీరఁ - గనుఁగొంటి నిపుడు
నేమమేకద? ఇంద్రు - చే వింటినిపుడు
భూమినంతయుఁగైక - పుత్రునకిచ్చి
చిత్రకూటనగంబు - చేరి యావెనుక
నత్రిని దర్శించి - యనసూయఁ గొలిచి
శరభంగమౌని యా - శ్రమము చేరుటలు
హరిహయుచేత నీ - యాగమనంబు
వినియున్నకతన నే - వేచి యొక్కడకుఁ
జనువాఁడనై నీదు - సందర్శనంబు
జేసి లోకాంతరా - శ్రితుఁడనై వెదుకఁ
కోపమకట్టి యి - ప్పుడు నిల్చినాఁడ

వింటిని మున్న మీ - వృత్తాంతమెల్ల
కంటిని మీశుభా - కారముల్ నేఁడు"
అని పల్కు రఘు వీరుఁ - డా తపోనిధినిఁ
గనుఁగొని సంతోష - కలితుఁడై పలికె.
"పావకనాత్మక ! నీ ప్ర - భావమంతయును
భావించి మును శర - భంగుఁడు దెల్ప
వీనుల విందుగా - వినియున్న వాఁడ
యేనెలవుల నుండు - యెఱిఁగింపు" మనిన
నాయనుగ్రహమున - నాతియు నీవు
నీయాశ్రమముల మీ - యిచ్ఛకు వచ్చు
క్రేవలనుండుఁడీ - కెలన నానామృ
గావళి యావలి - యధికమై యుండు
నంతమాత్రమె కాని - యన్యంబులైన
చింతలిచ్చట నున్నఁ - జేర వెవ్వరికి
నేమఱక మెలంగు - డిచ్చోట ననిన
నామహానిఁజూచి యి - ట్లనియె రాఘవుఁడు.
"ఎచ్చరికయ కాక - యేము కానలకు
వచ్చి యొంటిఁ జరించు - వారమే యెడల
జతనమ్ము మఱతుమే - సజ్య కోదండ
యుతులమై యస్త్రమ - యూఖముల్ వెలుఁగ
నుందుదు" మని పల్కు - చుండఁ గైసేసె
పుండరీకాప్తుండ - పుడు పశ్చిమాద్రి
సాయంతనములైన - సంధ్యాది విధులు
పాయక తీర్చి శు - భ ప్రదేశమున

నారేయి వసియించి - యమ్ముని యొసఁగు
చారు సపర్యల - సంతుష్టి నొందె

—: శ్రీరాముఁడు మునులయాశ్రమముం
జూడఁ బ్రయాణమగుట :—

ఉదయావసరమున - నుత్పల గంధ
సదమల శీతాంబు - సరమునఁ గ్రుంకి
నేమముల్దీరిచి - నెలఁతతోఁగూడి
ప్రేమసోదరునితో - శ్రీరామవిభుఁడు
మరల సుతీక్ష్ణాశ్ర - మముఁ బ్రవేశించి
హరిచింతన మొనర్చు - నయ్యోగిఁగాంచి
"ఓ మహాత్మక! సుఖ - మొంది యీరేయి
నీమహాశ్రమములో - నిదురపోయితిమి.
మావెంట వచ్చిన - మానివరేణ్యు
లావలఁ బోవుద - మనుచున్నవారు
పయనంబులో నెండఁ - బడకొక్కచోటు
రయమునఁ బోయి జే - రఁగఁదలంచెదము
అనుమతి యిండన్న" - నారాము మాట
మనసురంజిల విని - మౌని యిట్లనియె.
"రామ! యీదండకా - రణ్యంబులోన
భూమిజ నీడయుఁ - బోలివర్తింప
విహరింప నీవుఁ బ్ర - వేశించి యచటి
విహగస్వనంబుల - వీనులు చొక్క
సౌమ్యంబులగు మృగ - సంఘముల్ వెలుఁగు
రమ్యప్రదేశముల్ - కంటిలఁజేయు.

మీకు నింపొసఁగు భూ - మీరుహచ్ఛాయ
యా కెలంకులచంద - నానిలంబులను
నచటి తమ్మికొలంకు - లందు నెంతయును
రుచిపుట్టు నీరంబు - గ్రోల నింపెసఁగు
నావనగిరి కంద - రాంతరంబులను
దేవియుఁ దాము మో - దింతురుగాక !
చలువచప్పరముల - జాడ రసాల
విలసితచ్ఛాయల - వేడుక సేయు
నావనంబునెగాని - యన్యంబులైన
తావు మీరుండఁగ - దగదు పొండ "నిన
ఆమహానివరునకు - నంజలి జేసి
రామలక్ష్మణులు ధ - రాతనూజయును
వలగాఁగ వచ్చియా - వల సాగి తమ్ము
వలఁగొని మునులు న - ల్వంకల రాఁగ
నెక్కువెట్టిన విండ్లు - నిరువుర నడిమి
చక్కి జానకి నుంచి - చనుచున్న యపుడు
ఆరమణీమణి - యాత్మఁ జింతించి
శ్రీరామచంద్రు నీ - క్షించి యిట్లనియె.

— సీత రామునితో రాక్షసుల జంపమానుఁడని
మనవిఁ జేయుట .—

" అయ్య ! యిమ్మునినాథుఁ - డాడిన మాట
యియ్యెడ హితమని - యేఁగ నేమిటికి ?
వసుధఁ గాముకులగు - వారికి నిట్టి
వ్యసనముల్ తగుఁగాక - వలవదు మీకు ;

కామమోహితులకుఁ - గల్లలాడుటలు
నేమిహేతువు లేక - యీసులెంచుటలు
పరకామినులకుఁ బైఁ - బడి మెలంగుటలు
ధరణిపైఁ దగుఁగాక - ధర్మమార్గమున
నతిజితేంద్రియుండవై - యాడినమాట
ప్రతినతోఁ జెల్లించు - పరమకల్యాణ
శాంతమూర్తికి నీకుఁ - జనునయ్య ? వీరు
మంతనంబులు విని - మారాడలేక
మొగమాటచేత యీ - మునులకై లేని
పగ నంతరించుక - ప్రతినలు వలుక
చాలింపుడేఁటికి - శపథముల్ జగడ
మేలయ్య ? యీమహాను - లెటువోయి రేని
కయ్యముల్ వలవ ద - కారణద్వేష
మియ్యడవులలోన - నేఁటికి మనకు ?
పుడమి కొక్కరికిచ్చి - పొమ్మన్న నురకె
యడవుల బట్టి యి - ట్టనదలమగుచు
నుండువారము మన - మొక్కరి కొఱకు
దండకాటవిలోన - దైత్యుల తోడఁ
బోరాడ నేఁటికి ? భుజముల విండ్లు
మీఱ లెక్కిడఁ జూచి - మేనిలో నాకుఁ
బ్రాణముల్ నిలువకఁ - బల్లటిల్లెడును
ప్రాణనాయక ! డిందు - పడదు చిత్తంబు
దండకాటవి యేల - తగవేరిచోట
నుండినఁ దీరక - యున్నదే మనకు ?
నాకిది సరివోయి - నదిగాదు మదిని

మీకెట్లు దోఁచెనో - మీచిత్తమింక!
కాదని పోయినఁ - గలహముల్ పుట్టు
నాదండకాటవి - నసురులతోడ
రాజులకును ధను - ర్బాణముల్ కష్ట
రాజీవహ్నికి బల - ప్రదములౌఁగాన
మునులమై నచ్చిన - మూలలయందు
నునుప యీవిండ్లను - నుగ్రబాణములు
తెచ్చిన దోషమీ - తీరున హాని
వచ్చుటకును హేతు - వాదమైయుండె
మున్నొక్కముని తపం - బున నెంతవారి
నెన్నక లోకంబు - లెల్ల సాధింప
నది యింద్రుఁడెఱిఁగి చా - యలకత్తి నొకటి
బదను తూలికఁదెగి - పారంగఁదెచ్చి
నీవశంబున నిది - నిలుపుక యుండు
మీవ వచ్చువఱకు - నేమర వలదు"
అని చేతికిచ్చి తా - నమరావతికిని
జనునంత నమ్ముని - శాతకృపాణిఁ
జేతనుఁబట్టుక - చెంతల వనుల
నీతరి మెలఁగుచో - హేతి హేతువున
పోటు చింతలు గెల్చి - బుద్ధులు సాహ
సాటోపమును హింస - లాచరించుటయుఁ
జాలఁగఁగలిగి తా - సందియ జపము
వేళలు దప్పించి - వేలిమి మాని
తప ముజ్జగించి చిం - తకురిత్తబుద్ధి
విపరీతమై మాని - వృత్తిఁబోనాడి

నాసించి వేఁడిన - యర్థంబు పూని
చేయుటగాకవి - క్షేమంబు గలదె ?
వినఁగాకున్న నే - నాడినమాట
పూని నిర్వకరిత్త - పోఁడెందునైన
నటమీఁద ద్విజులతో - నాడిన మాట
యెట్లైనఁ జెల్లింప - కేల మానుదును!
తనయైన నీసుమి - త్రాపుత్రునైన
నినునైన వర్జింతు - నిలుపుదు మాట
మించి పల్కిన మాట - మేలాయె ననుచు
నెంచక నిటులాడ - నెట్లగు నీకు
నాకు మేలెంచి క - న్న తెఱంగు హితము
వాకొంటిగాన భా - వమునఁ దాలితిని
కాచితి నీతప్పు - కలవాణి తలఁచి
చూచిన నన్నని - చ్చో నిట్లు బలుక
కొఱఁతగాదిది నీదు - కులశీల ధర్మ
గరిమంబులకు నలం - కారంబుగాని!"

—: పంచాప్సరస సరోవర వృత్తాంతము :—

అని పల్కి చేవిల్లు - నమ్ములుఁదాల్చి
వెనుక సీతయు సీత - వెనుక లక్ష్మణుఁడు
కదిసిరా భీకర - గహన మార్గమున
నదులును గిరులును - నలినాకరములు
పొదలును గారెను - పోతులు పులులు
మదపుటేనుఁగులు జి - హ్మగములు గారు
చూచుచు గడచిరా - సూర్యబింబంబు
గోచరంబై క్రుంకి - కొండఁ జేరుటయు

నావేళ నొక యోజ - నాయతంబైన
వ్యావల్గ దండజ - వ్రాత తీరంబు
స్వాదు ప్రసన్నతా - స్వాద్యనీరంబు
రోదసివ్యాప్తమ - హల్కిశోరంబు
చారుమరాళికా - కతవిహారంబు
వారిజ మధు పూర్ణ - వారిపూరంబు
చారణయుత దివ్య - చంద్రాననప్ర
చారంబునైన కా - సారంబుఁజూచి,
ఆచాయనొక మ్రోఁత - యది యిట్టిదనుచు
గోచరింపక దిశల్ - ఘూర్ణిల్లి మొరయ.
నలుదిక్కులనుఁజూచి - నలినాప్తకులుఁడు
దెలియనేరక చెంతఁ - దిరుగుచు నున్న
ధర్మభృతుండను - తాపసనాథుఁ
బేర్మితోఁజేరంగఁ - బిలిచి యీరవము
యెక్కడజనియించె ? - యెవ్వరింగాన
మిక్కడ నన మౌని - యిట్లని పలికె.
"అనఘ ! యీకొలను పం - చాప్సరంబండ్రు
మును దీని నిర్మించె - ముని మాండకర్ణి
ఆ మాండకర్ణి యీ - యబ్జాకరమునఁ
దామరగుంపులోఁ - దపము సేయుచునుఁ.
బదివేలు దేవతా - బ్దములు వసింప
నదిచూచి బెగడి వా - తాహారుఁడగుచు
నీముని మదిలోన - నెవ్వరి మేలు
గామించి యో యిట్టి - గతి నుగ్రతపము
సేయుచున్నాఁడని - చిత్తంబులందు

నాయమర ప్రభు - లందఱు తలఁచి
యింద్రుని కెఱిఁగింప - నెంతయుభీతి
చంద్రాస్యలైన య - చ్చరల నేవురిని
దనకొల్వులో నున్న - తరుణులలోన
నెనలేని వారిఁగా - నేర్చి తాఁబిలిచి
"చూతము నేఁడు! మీ - సొలపులచేత
నాతని తపమెల్ల - నారడిఁబుచ్చి
రండని పనిచిన - రంభాదులెల్ల
నుండంగ తముఁబిల్చి - యుర్వీధరారి
పనిచినాఁడని వారు - పయనమై యపుడు
మునియున్న యాసరం - బునఁ బ్రవేశించి
తమ యాటపాటలఁ - దగువిలాసములఁ
దమి రేఁచి మునిని మో - దమునఁ ద్రోయుటయుఁ,
గాముని విరియంపఁ - గములకుఁ దగిలి
యామునిఁ గిలిగింత - లటు పుట్టఁజూచి
మరలి పోరాకుండ - మాయచే నీటి
తెరఁగట్టి యుంచి తా - తెఱవలఁ బిలిచి
లాలించి యనురూప - లావణ్య మహిమ
యాలంకరణముల - నందంబు పూని
నీటిలో నొక్క మ - ణీమయంబైన
హాటక దివ్య గే - హంబుఁగల్పించి
యైదుగురికి మేడ - లైదు నిర్మించి
యాడత్యకాంతల - నందుల నునిచి
వారికి వలసిన - వస్తువులెల్ల
స్వారాజ్యమున లేని - సకల భోగములు

గలిగించి వారలఁ - గలసి తపంబు
ఫలియించి యున్న యా - పములతో వెలఁగి
పంచసాయక బాణ - పంచకంబునకుఁ
బంచేంద్రియములు బా - ల్పఱచి యయ్యువతి
పంచకలీలా ప్ర - పంచ సర్వస్వ
వంచిత నియమాది - వర్తనుం డగుచు
నామాని యున్నవాఁ - డతని సన్నిధిని
రామల మణినూపు - ర ఝళం ఝళముల
నతఁడుఁ గన్గొనఁగ నా - ట్యము వినుపించు
నతివల గీత వా - ద్యముల రావంబు
లమ్మునిని నటనశా - లాభ్యంతరమున
ధిమ్మనునట్టి మ - ద్దెలల మ్రోఁతయును
కళఁగూడి శ్రవణముం - గళముఁగాఁగొలను
వెలపల మాకెల్ల - వినవచ్చె నిపుడు!"
అన విని కడు మెచ్చి - యాధర్మభృతుని
వనమున కేఁగి భూ - వర కుమారకులు
నతని చేతను బూజ - లంది యవ్వెనుక
నితరతపోనిధు - లెల్లనర్చింప
నట నిల్చి శరభంగుఁ - డాదియైనట్టి
జటిపురందరుల యా - శ్రమముల లోన
నెలయు రెన్నెల్లు మూ - న్నెల్లును నాల్గు
నెలలైదు నెల్లాఱు - నెలలును నేడు
నెల లెనిమిదినెలల్ - నెలలు తొమ్మిదియు
నెలలొక్క పదియుఁగా - నిలుచుచు వచ్చి;
ఎచ్చటెచ్చట నుండ - నెన్నాళ్లు ప్రీతి

నెచ్చునచ్చట నెల్ల - యిచ్చట నుండి
చరియింప విపిన వా - సమునాఁటి వఱకుఁ
బరికింప మితిలోనఁ - బదియేండ్లు గడచె.

—: శ్రీరాముఁడు మఱల సుతీక్ష్ణాశ్రమమునకు వచ్చుట :—

తరవాత సీతయుఁ - దమ్ముఁడు గొలువ
మరల సుతీక్ష్ణాశ్ర - మముఁ బ్రవేశించె
నచ్చోటిమునులెల్ల - ననురాగ మెచ్చ
వచ్చి పూజించి ర - వ్వనములోపలను
కొన్నాళ్ల వెనుక ర - ఘుప్రవీరుండు
మన్నవోలె సుతీక్ష్ణ - మునిఁజేర నేఁగి
ప్రణమిల్లె, మునిరాజ - పట్ట భద్రుండు
క్షణమాత్రము సమాధి - సంపన్నుఁ డగుచుఁ
గనువిచ్చి చూచుచోఁ - గదిసి రాఘవుఁడు
మునితోడఁ గేలుఁ ద - మ్ములు మోడ్చిపలికె
"అనఘ! యగస్త్య మ - హామౌని యిచటి
వనములలో నున్న - వాఁడని పలుక
వినియుందు మిది మహా - విపినంబుగానఁ
గనిపించఁ డీజన - కతనూజఁగూడి
కొలువ వేడుకయయ్యె - కుంభసంభవుని
నెలవానతిచ్చి మ - న్నింపుఁడు నన్ను"
అనిపల్క రఘుపతి - యాననాబ్జంబుఁ
గని సుతీక్ష్ణముని శి - ఖామణి పలికె
"జానకీరమణ! ప్ర - శ్నము చేసి నీవు
పూని యగస్త్యునిఁ - బొడగందు ననుచు

వడిగిరి నేనమ్మ - హా మానిచంద్రు
కడకేఁగు మని తెల్పఁ - గాఁబూని యుంటి
నిరువురి తలఁపులు - నేకమై యిపుడు
సరివచ్చె నామాన - సము ప్రీతి నొందె
చక్కఁగా నిచటి యా - శ్రమము దక్షిణపు
దిక్కున రెన్నాళ్ల - తెరువు పైనమునఁ
జనుచోట మీరగ - స్త్యభ్రాత యనెడి
మునివరు సేవించి - మువ్వురునచట
నతని యాశ్రమములో - నాప్రొద్దు నిలిచి
హితమతితో నమ్మ - నీశ్వరుండనుప
నావని చెంగట - నామటి మేరఁ
బోవుచో నుత్తుంగ - పూగపున్నాగ
నారంగజంబీర - నారికేళామ్ర
పారిజాతాశోక - పనస భూరుహాము
కైరవనీరజః - కల్హారచక్ర
సారస భాసుర - జలజ కరఁబు
వాజిపేయాదిస - వనకర్మ నిరత
యాజక స్వాహాస్వ - ధాభి రావంబు
జటివర కాషాయ - శాటికాకలిత
కుటశిఖాశాఖాగ్ర - కోటి భాసురము
నానాగమాభ్యాస - నక్షమాపార
మానికుమార ర - మ్య ప్రదేశంబు
నైనయగస్త్యశ్రీ - మా వాసమునకు
నానందమునఁబోయి - యమ్మునిఁజూచి
రందుపొంద" నవ్వుఁడు - రామలక్ష్మణులు

వెండియుఁ బ్రణమిల్లి - వీడుకోలంది
తనకు నమ్ముని - చెల్వు దారినే వచ్చి
యనుజునితో రాముఁ - డప్పుడిట్లనియె.

—: శ్రీరాముఁ డగస్త్యభ్రాత యాశ్రమమునకు వచ్చుట :—

"ఇదె యగస్త్యభ్రాత - యిరవుగాఁ బోయి
నదె పిప్పలాక్ష్మరు - హాచయంబు దోఁచె
శైత్య మాంద్యముల వా - సనలతోఁ గూడి
యత్యంత మృదు పవ - నాంకురం బెసఁగ
వినవచ్చుచున్నవి - వేద ఘోషములు
కనుపట్టె శుకశారి - కా విహంగములు
వలనొప్పె దర్భలు - వైడూర్యరుచులు
తొలకరించెను హోమ - ధూమముల్ చదల
స్నానముల్ దీర్చి పూ - జావిధానముల
మానులిచ్చు ప్రసూన - మాలికల్ బెరసె!
అందుచే నమ్మౌని - యాశ్రమంబగుట
సందియంబేల యి - చ్చటనున్న వాఁడు
మున్నగస్త్యుఁడు లోక - ముఁ, నెల్లఁ బ్రోవ
నెన్ని వాతాపి ని - య్యెడ వధియించి
దాన మృత్యువుఁ గెల్చి - తపసులఁ గాచెఁ
గాన నమ్మౌనీంద్రు - కథనమచ్చెరువు!

—: అగస్త్యముని వాతాపియిల్వలులను జంపినకథ :—

వాతాపియనఁగ ని - ల్వలుఁడన వెలయు
దైతేయ రిపువులు - తమపితసులకు

తద్దినమ్ములు వెట్టు - తలఁపుచే నిట్టి
బుద్ధినేర్చకత్రోవఁ - బోవుచున్నట్టి
తపసుల నియమించుఁ - దావిప్రుఁడగుచు
నపుడిల్వలుండు మ - హామునీశ్వరుల
జాలనర్చించి భో - జనమిడు వేళ
పోలుగ వాతాపి - పొట్టేటిఁజేసి
దాని వధించి త - త్పలలంబు వెట్టి
వానిఁ జేకొని "రమ్ము - వాతాపి" యనిన
భుజియించు విప్రుల - పొట్టలు జించి
నిజవర గర్వంబు - నివ్వటిల్లంగ
వెలువడి నిలుచుండి - విప్రులనెల్లఁ
దలవట్టి మ్రింగు వి - కాళ్ళతోఁగూర్చి
బలవంతుఁడై క్రొవ్వి - పలలభోజనుఁడు
కలశజుఁడాత్రోవఁ - గా నొక్కనాఁడు
సురలెల్ల నీరాక్ష - సులు పసివట్టు
ధరణీసురులు కోట్ల - తరములు గలరు !
అట్టి పాపాత్ముల - నడఁచి రమ్మనుచు
గట్టిగా తగుబందు - కట్టిన వచ్చి
గహనమార్గమున రాఁ - గని యిల్వలుండు
బహుమానమునఁ బిల్చి - బ్రాహ్మణార్థంబు
నేమించి యప్పటి - కప్పటివంట
లామతించిన యగ - స్త్యమునీశ్వరుండు
భుజియించి వార్చిన - ప్పుడు సహోదరుని
వృజినాత్ముఁడు పిల్వ - విని కలశజుఁడు

వాఁడు జీర్ణించి నై - వస్వతు పురికి
నేఁడేఁగె! వచ్చునే - నీవు పిల్చినను?
"ఓరి! జగద్ద్రోహి! - యోడక మునుల
నీరీతిఁ జంపితి - విన్నాళ్లు మీఁద!
అట్టి పాపములెల్ల - ననుభవింపంగఁ
గట్టడి చేసితిఁ - గడతేర్తు నిన్ను
ననవిని వాఁడాగ్ర - హంబుతోఁ గదియ
మునిశిఖామణి బొమల్ - ముడిగొనుచుండ
గోపించినఁ గుప్పఁ - గూరగాఁ బడియె
నాపాపమతి భస్మ - మై నిమేషమున
నామాడ్కి నిల్వలు - నడచిన యట్టి
యామహాత్ముని భ్రాత - యాశ్రమంబునకు
వచ్చితి" మనునంత - వనజబాంధవుఁడు
వచ్చెను బశ్చిమ - వనధి చెంగటికి
నావేళ వారగ - స్త్య భ్రాతఁ జేరి
సేవించి యమ్మౌని - చేఁ బూజలంది
యతని యాశ్రమమున - నారేయి యెల్ల
క్షితిసుతతో నిద్ర - చేసి వేకువను
నిత్యకృత్యంబు ల - న్నియుఁ దీర్చి పరమ
సత్యసంధుండు దా - శరథి యావేళ
నాయగస్త్య భ్రాత - యనుమతి నతఁడు
చేయి చూపినత్రోవ - సీత దోడ్కొనుచుఁ

—: అగస్త్యాశ్రమ వర్ణనము :—

జనిచని భల్లకా - సరటిభగవయ
వనచరశరకిరి - వ్యాఘ్రపంచాస్య

జంబుకహరిణ మా - ర్జాల గండకక
దంబభాసుర వనాం - తరములు గడచి
సుందరఁ జూతక్ర - ముకనారికేళ
చందనపనసర - సాల జంబీర
వాసంతి కాకుంద - వరఫలప్రసవ
వాసనావాసిత - వాతపోతముల
జాతివైరంబు లె - చ్చట లేని జంతు
జాతంబులను బర్ణ - శాలల మీఁద
నారవైచిన యట్టి - యరవిరి నార
చీరల హోమముల్ - సేయంగ నెగయు
పొగలను మౌనీంద్ర - పుత్రులు జదువు
నిగమంబులును స్వాదు - నీరంబు లొప్పు
కమలాకరంబులఁ - గల తపోవనముఁ
గమలాప్తకులుఁడు ముం - గలఁ జూచి పలికె.

—: అగస్త్య మహర్షి మహిమాభి వర్ణనము .—

" కనుఁగొను మెదుట ల - క్ష్మణ! చూడఁజూడఁ
గనుపండువయ్యె! జ - గద్ధితంబైన
తన చరిత్రమ్ముచేఁ - దనరు నగస్త్య
మునివరాశ్రమము సన్మ - ని సేవితంబు!
ఈ యగస్త్యుఁడె సుమీ - యెల్ల దానవుల
మాయించి సురలకు - మనికిఁ గల్పించె
నీతఁడె కాఁడె జ - యించి మృత్యువును
వాతాపి నడఁచి యి - ల్వలుఁ బొడిచేసె
నీమునిగద! భాసుఁ - డిట్టట్లు మెలఁగ

రామిగా వింధ్యప - ర్వతము మిన్నంద
మహిఁ గ్రుంగఁ ద్రొక్కి హి - మనగంబుఁ దాను
వహియించుకొని జనా - వళి నుద్ధరించె
నీశాంతమూర్తి యే - హిమవన్నగమున
కీశుఁడు పెండ్లికి - నేఁగిన యపుడు
సురలెల్ల నుత్తర - క్షోణికి నేఁగ
ధరణి మొగ్గతిలంగ - దక్షిణంబునకు
నందఱికిని దుల - యై తాను వచ్చి
పొందుపాటుగ నిల్పె - పుడమి యాఁతయును
నీపుణ్య నిధి వార్ధి - తెడునుఁబట్టి
యాపోశనంబుగా - నరచేత నుంచె!
నితఁడు లోపాముద్ర - యిల్లాలు గాఁగ
నతిశయ పరమక - ల్యాణంబు లందె!
నీ యాశ్రమంబులో - నింద్రాదిసురలు
సేయు పూజలొసంగు - చింతితార్థములు
నిమ్మౌని యనుమతి - నెట్టివారైన
తమ్ముఁ జెచ్చెలిమేని - ద్వారంబు దూఱి
లాలించు దేవతా - లలనలఁ గూడి
యే లోకమునకైన - నేఁగఁ జాలుదురు;
ఇచ్చోట నుండిన - నిఁక మన చెతలు
ముచ్చటల్ దీఱ యి - మ్మునిరాజుఁ గొలిచి
మన పట్టణమున నె - మ్మది నున్నయట్టి
జనకజకుఁ బ్రియంబు - నమకూర్పవచ్చు
ముందర నేఁగి యి - మ్మునితోడ మనల
చందంబు జానకి - సహితంబుగాఁగ

యేను వచ్చుటయు నీ - కెఱిఁగింపు" మనుచు
నానతి యొసఁగిన - నటుల లక్ష్మణుఁడు
నాకుంభజుని శిష్యు - నచ్చోటఁ జూచి
వాకొన్న సౌమిత్రి - వచనసంగతికి

—: శ్రీరామాగస్త్యుల సమావేశము :—

ఆచార్యసన్నిధి - కరిగి యో దేవ!
"రాచవారిద్దఱు - రమణి యొక్కతెయు
భానువంశజులఁట! - పరికింపఁదమకు
జానకీరామల - క్ష్మణులఁట! పేళ్లు
దశరథసుతులఁట! - తమతండ్రి పనుపఁ
గృశియించి వనులఁ జ - రింపుచు నిమ్ము
సేవింపఁదమకు న - చ్చిరఁట! లక్ష్మణుఁడు
తావచ్చినాఁడు నీ - తారఘువరులు
కడనున్నవారఁట! - క్రమ్మఱ యేమి
నుడువుదు? నానతిం - డు మహాత్మ!" యనినఁ
"గ్రక్కునం బిలువుమి - క్కడ నున్నవాఁడు?
నిక్కము నేరాము - నిం గనవేడి
యెదురులు చూచితి - మిన్నాళ్లు నట్టి
సదయావలోకుఁ గా - సల్యాకుమారు
దశరథతనయు నీ - రామనోహరుని
శశివదనుని రామ - చంద్రుఁ దో తెమ్ము
పొ"మ్మన్న శిష్యుఁడ - ప్పుడు వచ్చి కరత
లమ్ములు మొగిచి యా - లక్ష్మణుఁ జూచి;
"ఎక్కడనున్నాఁడొ - యిపుడు మీ యన్న

యక్కడికేఁగి మా - యాచార్యునాజ్ఞ
నోడితెత్తము రమ్ము - తోడనే రాముఁ
జూడవేడుక నగ - స్తుఁడు నన్నుఁ బనిచె"
అన లక్ష్మణుఁడు దాను - నాశ్రమద్వార
మున కప్పుడేఁగి రా - ముని కవ్విధంబు
వివరించి పిలిచిన - వెలఁదియుఁ దాను
రవివంశమణి తదా - శ్రమములోఁజొచ్చి
యమ్మేర తపసియి - ల్లాండ్ర కెంగేలుఁ
దమ్ములు బ్రాలేయ - తండుల చయము
గ్రసియించుటకు వేళ - గాంచియిట్టట్టు
వసియాడు పోషిత - హరిణడింభములుఁ
గనుఁగొనుచును జన - కతనూజతోడఁ
గనుసన్న సేయుచుఁ - గదియుదా నెదుర
హాటకగర్భుఁడౌ - నలబ్రహ్మయుండు
చోటును పావకు - చోటును శౌరి
చోటును శతముఖు - చోటును భాను
చోటును సోముని - చోటును శివుని
చోటును విప్రుల - చోటు కుబేరు
చోటును వాయువు - చోటుననంతు
చోటును గాయత్రి - చోటును యముని
చోటును వసువుల - చోటును వరుణు
చోటును స్కంధుని - చోటును ధర్ము
చోటునుఁగనుచు వ - చ్చి వనంతరమున
నెదురుగా శిష్యుల - సేవలు గొల్వ
నుదయార్కబింబస - ముజ్జ్వలుండగుచు

వచ్చు నగస్త్యుఁ డా - వనుఁ బుణ్యశీలు
వచ్చుట జూచి సీ - తాంగనా విభుఁడు
సాగిలి మ్రొక్కి యం - జలి చేసి భక్తి
యోగంబుచే నేమి - యునుఁబల్కలేక
యూరక నిలుచున్న - నుదితపోధనుఁడు
గారవంబొప్ప రా - ఘవులఁ దీవించి
యట నిల్వుమని తన - యావాసమునకు
జటులు వెంబడిరాఁగఁ - జని వీతిహోత్రు
నారాధనముఁ జేసి - యతిథికోటులను
బారుల మౌనుల - పంక్తు లమర్చి
యుండఱ వేర్వేర - నర్ఘ్యపాద్యములఁ
చందనాక్షతములఁ - జాల నర్చించి
భోజనాదులను తృ - ప్తులఁ జేసి మౌని
రాజు క్రమ్మఱ వచ్చి - రామునిఁ జూచి
తావంద నొక కుశా - స్తరణంబు నందు
నాదరంబున నుంచి - యప్పుడిట్లనియె.
"నరనాథతనయ! వా - నప్రస్థులైన
పరమయోగీంద్రులు - పావక క్రియలఁ
దీరిచి చేసిన - తైరవయులకును
నీరమన్నమునిచ్చి - నెగులు వారింపఁ
దలఁపని యధముండు - దబ్బరసాక్షి
పలికిన నీచుఁడు - పడు నారకముల
తాఁబడి తనమేను - తాన భక్షించి
లోఁబడి వాఁడధో - లోకమ్ము వొందు"
నని ధర్మశాస్త్రంబు - లందుఁ దెల్పుటను

నినుఁ బూజసేయుట - నీతంబు మాకు!
కందమూలఫలాది - కములు మాచేత
నంది తృప్తుఁడవుగ - మ్మ"ని యర్ఘలిచ్చి

—: అగస్త్యమహర్షి శ్రీరామునకు వైష్ణవ కోదండ తూణీరముల నిచ్చుట :—

"శ్రీరామ! తొల్లిరా - జీవలోచనుఁడు
భూరికాంచనమయం - బును సునాభంబు
నతివజ్రసారంబు - హరిదానవేంద్ర
శతమును దేవతా - సౌఖ్యకారణము 1020
ననితరసాధ్యంబు - నాహవవిజయ
జనకంబు భానుతే - జస్సమన్వితము
నక్షయదివ్యశ - రాస్త్ర తూణీర
మక్షతంబజహార - శ్లాఘనీయంబు
నగునట్టి వైష్ణవం - బైన కోదండ
మగివైరి వశముగా - నవుడుంచెఁ గాన
నతఁడవి తెచ్చి నా - యాశ్రమసీమ
జతనంబుగా నుంచి - చనియె గావునను
నేమది పూజించి - యెదురులు చూడ
రామ! వచ్చితివ కా - రణ బాంధవుఁడవు! 1030
హరినందకము నీకే - యసి జోడు కాదె!
హరిహయుం డుదయించె - నావింటితోడ
యీవిల్లు నీయమ్ము - లీనిషంగంబు
లీవాలు నిచ్చెద - నీవు గైకొనుము!"
అనిపైఁడి ఠీయురతోడి - యడిదంబు నంప

దానయుఁడు విల్లుఁదో - డ్తోడ నొసంగ
శ్రీరామ! యలసి వ - చ్చినవారు మీర
లారామశీత ర - మ్యప్రదేశముల
వసియింపుఁడీసీత - వసివాళ్లు వాడి
కనుగంది మునితో - గాసిల్లె మిగుల
సన్నుతనలమట - లెఱుఁగదీసాధ్వి
యిన్నిపాటుల కోర్చె - నేమనవచ్చు!
వనులకుఁ బతిద్రై దై - వంబుగా నెంచి
నినుఁగూడి వచ్చెనీ - నిత్యకల్యాణి!
మగని మేలునకోర్చి - మనసిచ్చి నడచు
మగువలెకాక భూ - మండలిరోయింతు
నిటువంటి సతిగల - దే! వధూమణులు
కుటిలమానసలు పే - ర్కొన నెల్లవారు!
చపలాలతలవంటి - చంచలత్వంబు
నెపుడు నమ్మలతోడ - నెనయు వాఁడియును
గరుడవాయువులకుఁ - గలుగు వేగంబు
తరుణులకెందుఁ జి త్తములందుఁ గలదు!
మాన్యయీసీత నీ - మానిని గాన
ధన్యవర్తన నరుం - ధతియునుఁ బోలి
యుత్తమగుణముల - యునికి పట్టైన
యుత్తలోదరిఁ గూడి - యుదట నీరాత్రి
నావనంబెల్ల ధ - న్యంబును లోక
పావనంబును గాఁగఁ - బవళింపుఁడనిన
నమ్మని యనుమతి - నచట మువ్వురును
నెమ్మితో శయనించి - నిమరించి లేచి

తెలవాఱఁ దగువిధుల్ - దీర్చి మువ్వురును
కలశ సంభవుని కెం - గటఁ జేరవచ్చి
కరములు మొగుడ రా - ఘవు మోముఁ జూచి
కరుణదైవార న - గస్త్యుఁడిట్లనియె.

—: అగస్త్యుఁడు గోదావరి తీరస్థపంచవటినిగుఱించి చెప్పుట :—

"శ్రీరామ! యీరేయి - సీతతో నిచటి
యారామమున నిద్ర - నంది సౌఖ్యమున
దినకృత్యములు దీర్చి - తే నీకు నేఁడు
పనియెద్ది? వివరించి - పలుకుమా" యనిన
"మునినాథ! యెచ్చోట - మువ్వుర మేము
వనవాస మీడేర్ప - వసియింప వలయు 1070
తగిన చోటిది యని - తలఁచి మాతోడ
విగణింపు" మనిని న - వ్విమల మానసుఁడు
నొకకొంత సేపు తా - నూరక తలఁచి
సకలజ్ఞుఁ డగు నగ - స్త్య మునీంద్రుఁడనియె
"జననాథ! రెండుయో - జనముల మేర
వనము చెల్వగు పంచ - వటియను పేర
నొక్కరమ్యస్థలం - బున్నది మీకు
నక్కడఁగలుగుని - ష్టార్థంబు లెల్ల
మేలెంచి దశరథు - మీఁది నెయ్యంబుఁ
బాలించి యచటికిఁ - బనిచెద మిమ్ము. 1080
మాయభీష్టము నీవు - మాయాశ్రమమున
జాయతో వసియింపఁ - జాల సమ్మతము;
అటులయ్యు మీహృద - యముల వర్తనము

నిటమీఁది కార్యంబు - నేయోగదృష్టి
భావించి చూచితిమి - పలికిన యట్లు
యావనంబునకుఁ బోం - దని పంపవలసె
పంచవటీవనీ - భాగంబు లమర
రించి యాగోదావ - రీ సమీపముల
వలయు వన్యములైన - వస్తువుల్గొనుచు
నలఁగుఁ డిచ్చటికి స - మీప మచ్చోటు
యేకాంతమది మీకు - ఋషులనందఱిని
చేకొని వారి ర - క్షింపుఁ డచ్చోట
గనుఁగొంటిరే మధూ - కవనంబు పొన్న
పొన నల్లనైనతోఁ - పు రఘుప్రవీర!
యా తోఁపునకు నుత్త - రాశగాఁ బోవఁ
బ్రీతిఁ బుట్టించు మ - ఱ్ఱియొకండు చెంత
నామఱ్ఱి పడమటి - యందనే యొక్క
భూమీధరంబు చూ - పుల విందుసేయుఁ
బడమర యచటికా - పావనాశ్రమము
పొడ గానవచ్చు గుం - పుగ నైదుచెట్లు"
అనిత్రోవ వివరించి - యవుడగస్త్యుండు
పనిచిన నమ్మౌని - పదముల వ్రాలి
యయ్యాశ్రమముఁగాచు - నజహారాదులకుఁ
జెయ్యెత్తి మ్రొక్కి ద - క్షిణముగా వెడలి
ధనువుఁ దూపులు నంది - తమ్ముఁడు సతియు
వెనుకరా నతిఘోర - విపిన మార్గమునఁ

—: జటాయు సందర్శనము :—

బంచవటికిఁ బోవు - పయనంబు నందు
వంచితశాఖా వృ - క్షాకాశ యగుచు

నూడలలో నొక్క - నొక పెనుమత్తి
జాడగా వచ్చి యా - కాయమువ్వారను
వసియింపుచో నొక్క - వలనైన కొమ్మ
నెనఁగుజటాయువు - నీక్షించి యలరి
"ఎవ్వఁడవీవు నీ - యిరవెద్ది? తండ్రి
యెవ్వఁడు నీకుఁ జే - రెయ్యది" యనిన
"నీతండ్రి చెలికాఁడ - నే జటాయువును
సీతతో నీవు వ - చ్చినఁ జూడగంటి
మనఁగంటి నేనన్న" - మాటకా రాముఁ
డనఘమానసుని జ - టాయువుఁ జూచి
యేరీతి మాతండ్రి - కీవు నెయ్యుఁడవు
మారాజునకు నీకు - మచ్చికయైన
కతమెట్టు" లనిపల్క - ఖగవతంసంబు
క్షితిసుతారమణు నీ - క్షించి యిట్లనియె.

— జటాయువు వంశాను కథనము: —

"సదయాత్మ! బ్రహ్మ వం - శజులము మేము
తుదిమొదల్ దెలియ నీ - తో వివరింతు
కృతముఁగర్దముఁడు వి - కృతుఁడు శేషుండు
నతని దాసిన సంశ్ర - యాఖ్యుండు వీర్య
వంతుండు బహుపుత్ర - వరుఁడు స్థాణుండు
నంత మరీచియు - నత్రియుఁ గ్రతువు
నావెనుకఁ బులస్త్యుఁ - డాంగిరసుండు
నావరసఁ బ్రచేత - సాఖ్య పులహులు

దొరసి దక్షువివస్వ – తు లరిష్టనేమి
బెరసిరి ధాతకు – బ్రియపుత్రులగుచు
నృపశేఖర ! యరిష్ట – నేమియుఁ వాఁడె
యపుడు కాశ్యప భూపుఁ – డనవన్నె కెక్కె
నజుని మానసపుత్రు – లగు వీరియందు
సుజనవందితుఁడు ద – క్షుఁడు తనూజలను
కోరి యఱువదిలెక్క – కనుగాంచె నట్టి
వారిలో నెనమండ్రు – వనితల నిచ్చె
ననఘు కాశ్యపునకు – నదితియు, దితియు,
దనువు, కాళికయునుఁ – దామ్రయుఁ, గ్రోధ
వశ, మను, వనలయుఁ – వారల నట్టి
శశిబింబముఖులఁ గా – శ్యపుఁడు వరించి
యారమణులఁ జూచి – యలివేణులార !
కూరిమి తనయులఁ – గోరుండు మీర
లిచ్చెదనని " పల్క – నింతులు గొంద
ఱిచ్ఛగించిరి కొంద – ఱేమియు ననక
నురకుండి రదితికి – నుదయించి రప్పు
డరయముప్పది మువ్వు – రాదిత్య వరులు
నెనమండ్రు వసువులు – నిసులు పన్నిద్ద
రును బదునొక్కండ్రు – రుద్రులశ్వులును
నిరువురుగా వార – లిద్ధతేజముల
ధరణిపై వెలసి, రా – తరవాత దితికి
నసురులు జన్మించి – రానిశాచరులు
వసుధఁ బాలించి త – వార్య శౌర్యమున
దనువను నతివ గం – ధర్వులం గనియెఁ

గనియెను గాళిక - కాలకానుజుని
నరకానుజునిఁ దామ్ర - నందనీమణులఁ
బొరసె పక్షులజాతి - పొదల నేవురను
నవిక్రౌంచి యన భాసి - యనశ్యేని యనఁగ
రవివంశ ! శుకిధృత - రాష్ట్రియు ననఁగ
నందులోఁ గూబల - నలక్రౌంచి కాంచె
నందను బాతుల - నాభాసిభామ
శ్యేనిగృధ్రములఁ గాం - చెను ధృతరాష్ట్రి
కానుపు హంస చ - క్రద్వయంబయ్యె
శుకిగాంచె నతను నా - సుందరివినత
నొకతెఁ గాంచెను మరి - యును గ్రోధవశకుఁ
గలిగిరి పదువురు - కన్యలు మృగియు
నల మృగమందయు - హరి భద్రమదయు
మాతంగి శార్దూలి - మరి కమ్రరోమ
శ్వేతయు సురసయు - క్షితి సురభియును
నను పదువురియందు - నల మృగజాతిఁ
గనియెను మృగి ఋక్ష - గణచమరముల
మృగమంద గనియె నె - మ్మని భద్రమంద
నెగడు నిరావతి - ని తనూజఁ గనియె
నాయిరావతి గాంచె - నైరావతంబు
నాయెడ హరిగాంచె - హరులు గోఁతులను ;
శార్దూలగవయాది - సంతతినెల్ల
శార్దూలి గనియెను - సామజంబులను
మాతంగి గనియెను - మరి శ్వేతగాంచె
ఖ్యాతిగా నష్టది - గ్గజ వరంబులను

సురభి రోహిణియును - సుదతి గంధర్వి
నిరుపమం గనియె రో - హిణికి నావులును
గంధర్వి యనునట్టి - కన్యకు సుతులు
గంధర్వులను వారు - గలిగిరి వరుస
సురసకు నాగరా - జులు సుతులైరి
గరిమతోఁ గద్రువు - గాంచెఁ బన్నగుల
మనువను భామ బ్ర - హ్మక్షత్రవైశ్య
జనశూద్రులను గాంచె - జాతులేర్పడఁగ
ననలకుఁ గలిగె మ - హా భూరుహములు
వినత యాశుకియును - వెలఁదికిఁ బాత్రి
సురసకుఁ గద్రువు - చూడంగ జెలియ
లరయఁ గద్రువుగాంచె - నలశేషు మొదట
నతఁడు సహస్ర ఫ - ణావళి చేత
క్షితిఁ దాల్చెఁ దాలిమి - చే నెల్లనాఁడు
వినతకనూరుండు - విహగవల్లభుఁడు
జనియించి రందుజ్యే - ష్ఠ కుమారుఁడైన
యట్టి యనూరిని - యందు సంపాతి
పుట్టె నాయనతోడఁ - బుట్టిన వాఁడ
నన్ను జటాయువ - నంగ వంశమున
నెన్నికఁ గనువాఁడ - నేనైననన్ను
నాసించి యడిగిన - యర్థంబుఁ దెచ్చి
యీ సమర్థుఁడ జుమ్మీ - నీకు నిచ్చుటకు
నడవిలో నాసహా - యత మీకు వలయు
నిడుమలపాలు గా - కేను తోడైన
నిచటి దైత్యులబాధ - నుంతని నీకు

వచియింతు! మీరొంటి - వచ్చిన వార
లదిగాక సీతాప - హారయుత మీకుఁ
దుదిలేని యనుదిన - దుఃఖకారణముఁ
గావున నీవు ల - క్ష్మణుఁడు వేఱొక్క
తావుల కేఁగిన - ధరణిజ నేను
కాచి యుండఁగశక్తిఁ - గలిగిన వాఁడ
నాచేతఁ దీఱు నెం - తటి కార్యమైన
వత్తునే!" యన రఘు - వరుఁ డట్టిమాట
చిత్తంబులోన మె - చ్చి ప్రసన్నుఁడగుచు
నాలింగనము జేసి - యర్చలొసంగి
చాలంగ మధురభా - షణములు వల్కి

## — జటాయువుతో సహా శ్రీరామ సీతాలక్ష్మణుల పంచవటీ ప్రవేశము :—

తరుణితోఁ దనవెంట - తమ్ముఁడు పక్షి
వరుఁడును రాఁ బంచ - వటి కేఁగు నపుడు
దానవశలభముల్ - తనదివ్య వైశి
ఖానల జ్వాలల - నణఁగుఁగాకనుచు
మదిఁ దలఁపుచుఁ బోవు - మార్గంబునందు
నది చూడుమని రాముఁ - డనుజుతోఁ బలికె
"సౌమిత్రి! తృణకాష్ఠ - జలసమృద్ధంబు
భూమికి నెల్ల వి - భూషణంబైన
యీ పంచవటిఁ జూడు - మిది యగస్త్యుండు
చూపి చెప్పినయట్టి - చోటు గావునను
నెందైన మనకొక - యిలుగట్టియుండ

నందుకుఁదగిన చో - టది విచారించి
రమ్మని" పల్కిన - రాముని మాట
సమ్మతంబగుట ల - క్ష్మణుఁ డిట్టులనియెఁ
"దేవ! మీచిత్తమే - తీరున నుండె
నావిధి మెలఁగ స - మర్థుండఁగాక
తనకేమి దెలియునీ - తఱిఁ బర్ణశాల
యొనరింపఁ దగునని - యూహించి పలుక
నేవేళ నయ్యెడ - నేమి కార్యంబు
కావలసినఁ బిల్చి - కట్టడచేసి
పనిఁగొనఁ దగుఁగాక - బంటనై యున్న
నను వేఁడనేల మీ - నగరి కార్యములు"
అనవిని "లక్ష్మణ! - హరిణాది వివిధ
వనజంతువులకు ని - వాసమిచ్చోటు
యిందుల సెలయేరు - లినుకదిన్నెలును
గందరంబులు సార - కాసారములును
కదలికా మాకంద - ఖర్జూరనింబ
బదరిరసాల రం - భా బిల్వపనస
కేతకీ కుందకం - కేళీలవంగ
జాతిలతా సమం - జస మంజరులును
నీడాకనంటుల - నెండిన పొరల
ఏడిరాసులుగాఁగ - విపిన మార్గములఁ
బలకలై తొరఁగిన - పచ్చకప్పురవు
తెలిదుమారము రేఁచు - తెమ్మెరల్ గనుము!
గుడిసెలగతి నొప్పు - గొజ్జంగ పొదల
వడియఁ బన్నీటి కా - ల్వల కెలంకులను

చలువలీనెడుఁజాలి - చలువల మృగము
దొలఁగి పోలేక ని - ద్దుర బోవువేళ
మడువు కట్టిన నాభి - మదర క్తధార
పుడిసిలించుక చెంచు - ప్రోయాండ్లు దెచ్చి
మునియాగ శాలల - ముంగిలులలికి
చనుట జూచితివె ల - క్ష్మణ! పంచవటిని
నల్ల గోదావరి - నళికదంబములు
పుల్లాంబుజములపై - పూఁదేనియలను
నసియాడి ఘుమ్మని - యంచల మొరయు
బిసములు మెసవక - బెదరు చూపులనుఁ
గలహంస చక్రవా - క ప్రముఖములు
మెలఁగక యున్నవి - మేలిమి తెరల
నీయేటి తేటనీ - రించుకఁ గ్రోలఁ
గాయంబు శ్రీమోని - కాయమై యుండు
జానకి యీనికుం - జముల వసించి
మాను నయోధ్యపై - మమత యుల్లమున
సవరపు మెకము లి - చ్చటి రేవులందు
నవతరించి జలంబు - లాని క్రమ్మరిన
వాలచామరములు - వాతూల వలన
లోలవల్లరుల న - ల్లుక ముళ్లు పడిన
తప్పించుకొన కేళ్లు - దాఁటి యట్టిట్టు
కుప్పించి యపుడురి - గోలలం బడిన
తిఱుప వదనముల్ - దెఱచి యొచ్చటికిఁ
బోరాక దిగులుచే - బోరలల్లాడ
కలఁగు చందము మాని - కన్నులు చూచి

కలనికిఁ జేరి వె - గ్గలనీక దువ్వి
యూడిక్కు లెడలింప - నవిదాఁటి మఱలి
చూచుచుఁ బారెదు - సొబగుఁ జూచితివె!
యీజటాయువుఁ గూడి - యిచ్చోటి మౌని
రాజులకెల్ల నా - రట జేసి యుందు

—: సౌమిత్రి పర్ణశాలను నిర్మించుట :—

వసియింత" మని పల్క - వడి నొక్కచోటి
కను వెల్లఁ బోఁ జెక్క - గాఁతముల్ త్రవ్వి
జమ్మిమ్రాకులను గుం - జలునిల్పి యిప్ప
కొమ్మల దూలముల్ - గొట్టి యమర్చి
ముదురులై చక్కనై - ములు జీరనట్టి
వెదురు బొంగులు దెచ్చి - వెసఁ గయిలెత్తి
నిడుపాటి వేప పెం - డెలుగట్ట మీఁద
పొడువాటి దర్భం - ప్పుడు వాస పోసి
మొగడల నాయుధం - బుల శాల హోమ
జగతియు నిర్మించి - చలువచప్పరము
విప్పుగా వైచియా - వెలిములుకంప
గొప్ప యేనుఁగ పొదు - గున పొంకపఱచి
గావలిగుడిసె రెం - డ్కటి తా వసింపఁ
త్రోవల మునిచి వా - కిటఁ దల్పులునిచి
సన్నజాజులును గొ - జ్జంగి తామరలు
పన్నీరు పువ్వులు - పాదిరి విరులు
కలువలు సంపెఁగల్ - ఘుమ్మను తావి
వలపు దండలు గట్టి - వడిఁ దీర్ఘమాడి

నారికేళపు టాకు - న నమర్చి దళ్లు
నేరాళముగ పువ్వు - టెత్తులు గట్టి
కురువేరు వటివేరుఁ - గూర్చిన జల్లు
లిరవుల వాసింప - నిండెల్ల విరుల
మేలు కట్టులు గట్టి - మేదినియూడ్చి
పాళెలు నరఁటి కం - బములు నమర్చి
చెఱకు కోలలు నాఁటి - సిరము కప్పురము
పఱచి ముగ్గులు దీర్చి - పడకింటిలోనఁ
బువ్వుఁ బానుపు చెంత - బుగబుగ తావి
నివ్వటిల్లఁగ ధూప - నికరంబమర్చి
వచ్చి యన్నకు మ్రొక్కి - వనజాక్ష ! రామ !
విచ్చేయుఁడింటికి - విడిది యేర్పడియె ”
నని తోడుకుని పోయి - యాపర్ణశాల
గనిపించు కమ్మని - కందమూలములు
పనసరసాలాది - ఫలములు కాన్క
యొనిచి చెంగట నిల్చి - యున్న సౌమిత్రిఁ
గనుఁగొని సంతోష - కలితుఁడై మెచ్చు
గనిపింప రఘుకులా - గ్రణి యిట్టులనియె.
“ అన్న ! లక్ష్మణ ! యోగ్య - హాంబు నిర్మింపఁ
గన్నట్టి మెచ్చు మ్రిం - గఁగరాదు నాకు !
డైన నేమిచ్చెద - నాలింగనంబె
కాని నీకని ” చేరి - కౌఁగిటం జేర్చి
యీచమత్కారమా - విన్నాళ్లు నెందు
డాఁచితి ? ధర్మజ్ఞుఁ - డవు కృతజ్ఞుఁడవు
భావజ్ఞుఁడవు ! తండ్రి - పరలోకమునకుఁ

కోపు విచారమి - ప్పుడు నీకె కాక
నినువంటి తమ్ముఁడుం - డినయట్టినాకుఁ
బనియేమి! తండ్రినా - పాలికున్నాఁడు!"
అనుచుఁ గ్రమ్మరఁ జేరి - యక్కునఁ జేర్చి
జనకజఁ గూడి యా - శాలాంతరమున
నింద్రభోగము మది - నెంచక రాము
చంద్రుఁడు గొన్నాళ్లు - సంప్రీతినుండె

—: హేమంత వర్ణనము :—

మఱియొక్కనాడు హే - మంతకాలమున
కుఱికుఱి సోనచి - న్కులు కురియంగ
సౌమిత్రిచేఁ గల - శముఁగొని రాఁగ
రాముఁడు జానకీ - రమణియుఁదాను
గోదావరినిఁ గ్రుంకఁ - గోరి ప్రాహ్ణమున
నీఁదుకు జడియక - యేఁగ వీక్షించి
సన్నపు మంచు పై - జడిగొన నేఁగు
నన్నతో లక్ష్మణుం - డప్పుడిట్లనియె
"అయ్య! యీ యడవినీ - హారంబు నించె
నెయ్యెడ పంటల - నెసఁగ ధరిత్రి
చలువలగ్గలమయ్యె - జలముల నెల్ల
వెలుఁగక పొగసూరె - వీతిహోత్రుండు
ఘనులైనవారలా - గ్రయణేష్టిచేసి
తనియించి పితృదేవ - తలఁ బుణ్యులైరి
పల్లెలన్నియుఁ బాఁడి - పంటలచేత
నుల్లసిల్లుచుఁ జాల - నుప్పొంగె నిపుడు

రాజుల దండయా - త్రల తరియయ్యె
రాజీవహితుఁడు పు - త్రకు దిక్కుఁజేర
దక్షిణాయనమైన - తరి నుత్తరాశ
వీక్షింపఁ దపనుండు - వెలిదైన కతనఁ
దిలకంబు లేనట్టి - తెలివయుం బోలి
విలసన శ్రీలచే - విలసిల్లదయ్యె
దూరమై దినమణి - దొలఁగి చరింప
బీరెండకాఁకలఁ - బెడఁబాయు కతన
మంచుగుబ్బలిని హి - మాని మించుటయు
నంచితంబయ్యె య - థార్థనామంబు
బడలికల్ దోఁచక - పగలయ్యె నెండ
యుడివోయి సంచార - సౌభాగ్యమై యలరె
నీటిలోపలియందు - నీడలయందు
పాటించి చేరఁ జొ - ప్పడ దెవ్వరికిని
నిలవరములు చేసె - నిశల వేల్పటను
తొలఁగె తారకములు - తుహినంబు నిండి
రాత్రియామములు దీ - ర్ఘంబులై మించె
చిత్రంబు చంద్రునీ - క్షింప నియ్యెడల
మనుజుల యూర్పుల - మాసి యద్దంబు
పోనఁగినగతి హిమం - బునఁ గెంపుఁదఱిగి
యెండకొట్టునఁ గందు - నీసీత మాడ్కి
నుండె చంద్రిక యిప్పు - డొరపెల్ల మాని
యలుగులు రా వారి - యనువునఁ జాల
వలిమీరి యుత్తర - వాయువుల్ విసరె
గోధూమసస్య సం - కులములై వనము

లాధూమములు గప్ప - నటులఁ గప్పట్టె
పసిఁడి నిగ్గులు దేఱ - పంటల నొఱఁగి
మొసఁగె రాజనపు చె - ల్వీసీత ముందు
సాంద్రతేజము లేక - సవితృ మండలము
చంద్రమండలముతో - సరివచ్చె నిపుడు
పచ్చిక గల్గిన - పట్టుల మంచు
తెచ్చె నీరెండల - నీ ప్రభాతమున
నీరాశ చేఁబోయి - నీరు తుండములఁ
బూరింప వివె గజం - బులు చలిచేత
పిఱికివా రని కేఁగ - భీతిలినట్లు
సరసులఁ జేరదీ - జలపక్షి కులము
పూయుతవనము లి - ప్పుడు నిద్రవోవు
చాయ నున్నదిగంటె - సవరణ లేక
హిమవారిఁ దోఁగిన - యినుక దిన్నెలును
దెమలక పాతె న - దీప్రవాహములు
నెండలఁ గ్రాఁగక - హిమవారి నెనసి
యుండుట జాలించి - యున్నవంబువులు
కొలఁకులఁ దామర - కులములఁ దూండ్లు
నిలువఁ బువ్వులమాట - నిర్నామమయ్యె
నీకాలమున నిన్ను - నెనసిన తపముఁ
గైకొని భరతుఁడే - గతి నున్నవాఁడొ!
మనరీతి భరతుండు - మౌనియై యెట్లు
చనువాఁడొ యావేళ - స్నానంబుసేయు!
గుణవంతుఁ డగుకైక - కొడుకు సమస్త
మణిభూషణంబులు - మాని యిప్పుడు

తలఁపుచుండుటఁ జేసి - తాను జయింపఁ
గలఁడు స్వర్గాదిలో - కంబులన్నియును
తల్లుల నడకలు - దలఁచి యూఱింతు
రెల్లరు నతఁడొక్కఁ - డే తండ్రిఁబోలె
నట్టి లోకోత్తరుం - డైనట్టి మగఁడు
నిట్టి సద్గుణముల - కిరవైన సుతుఁడు
కలిగియు నేలకో - కైక కడు నిట్లు
కులమెల్లఁ జెఱచు దు - ర్గుణము వాటిల్లె!”
అను మాట కడువేఁడి - యై చెవిసోఁక
విని సహింపక రఘు - వీరుండు వలికె
“నిందింతురే కైక - నీవు నాయెదుర
నందంబు కాదు గు - ణాఢ్యుఁడైనట్టి
భరతునినోపికం - బలుమాఱుఁ బొగడ
నరలేని భరతుని - యందు నామనము
కరఁగుచునున్నదే - కడఁ గలనైన
మఱవురా వాయన - మాటలిప్పుడును!
ఎన్నఁడొకో మన - మింకొక్క నాఁటి
కన్నదమ్ముల మొక్క - లై నలువురము
నొండొరులనుఁ జూచు - చుండు కోరికలు
పండిన భాగ్యసం - పదలు జేకూడు!”
అని పల్కుచును జన - కాత్మజ వెంటఁ
జనుదేర ముగ్గురుఁ - జనిరమ్యమైన
గోదావరీ నదీ - కూలంబుఁ జేరి
స్వాదు జలంబుల - స్నానంబుఁ జేసి
నిత్యకర్మంబు ల - న్నియుఁ దీర్చి పరమ

సత్యవ్రతాచార - సంపన్నుఁడైన
రాముఁడు నంది పా - ర్వతులతోఁ గూడ
నామేరు కోదండుఁ - డనఁ బెంపుఁగాంచి
మఱలి నిజాశ్రమ - మందిరంబునకుఁ
బరమసంయములు సం - భావింప వచ్చి
యచ్చోట సౌమిత్రి - యందు నెయ్యమున
ముచ్చట లాడుచు - ముదితాత్ముఁడైన
ధరణిజఁగూడి చి - త్రాసమేతముగ
హరిణాంకుఁ డున్నట్టి - యందంబు మీఱ
ననురాగరసలోలుఁ - డై తగినట్టి
యనువున వర్తించు - నాసమయమున

— శూర్పణఖ పంచవటికి వచ్చుట —

రావణు సోదరి - రాక్షసి దుర్గు
ణావృత లోకభ - యంకరాకార
పాపి శూర్పణఖ యా - పర్ణశాలా స
మీపమ్మునకు వచ్చి - మిహిరసంకాశు
నాజానుబాహుఁ జం - ద్రాననుఁ వికచ
రాజీవలోచను - రఘుకులోత్తముని
మత్తేభగమనుఁ గో - మల నీలవర్ణు
నుత్తమగుణుఁ గృత - యుగభాగధేయు
వరపుణ్యానిధి జటా - వల్కల కలితు
శరణాగతత్రాణు - జానకీ రమణు
రామచంద్రుని మహా - రాజలక్షణునిఁ
గామించి దుర్ముఖి - గదిసి యిట్లనియె,

—: కాముకురాలైన శూర్పణఖ శ్రీరామునితో మాట్లాడుట :—

" మానివేషంబున - మానినిఁగూడి
కానలలో నుండఁ - గారణం బేమి ?
యెవ్వారు మీరు పే - రెఱిఁగింపు " మనిన
నవ్వీరవరుఁడు ని - శాటినిఁ జూచి
కలయర్థమెల్ల ని - క్కమకాని బొంకు
పలుకఁడుగాన డా - పల సీత యునికి
యొందుపై మునివృత్తి - నలరుట నున్న
చందంబె కాఁగ డాఁ - చక యిట్టులనియె.
" భానువంశజుల మీ - బాల నారమణి
జానకి పేరు ల - క్ష్మణుఁడందు రితని
తమ్ముఁడితఁడు నేను - దశరథ సుతుఁడ
రమ్మనా పేరు శ్రీ - రామచంద్రుండు
దానవివలె నున్న - దాన వెవ్వతెవు ?
నీనెలవెయ్యది ? - నీకుఁ బేరేమి ? "
యనిన శూర్పణఖ మ - హారాజతనయుఁ
గనుఁగొని మదినిఁ గొం - కక యిట్టులనియె.
" నే దానవిని నాకు - నెలవీవనంబు
నాదు నామము శూర్ప - ణఖయందు రెందు
నాశ్రమస్వేచ్ఛావి - హారిణి నేను
వైశ్రవణుండు రా - వణుఁడు నాయన్న
లోకభీకరుఁడు త్రి - లోక సంహారి
యాకుంభకర్ణుఁడా - యన సోదరుండు

ఖరదూషణాది రా - క్షసులు నాదైత్య
వరునకుఁ దమ్ముల - వార్య విక్రములు
సైరోఁడు మా విభీ - షణుఁడందులోన
సాధువర్తనవాఁడు - సత్పురుషుండు
నిందఱి తోఁబుట్టి - యిచ్చకు వచ్చు
చందానఁగామ సం - చారిణి నగుచుఁ
జరియింతు నీసీత - చక్కదనంబు
సరిగాదు నీదివ్య - సౌందర్యమునకుఁ
గాంతలయందుఁ జ - క్కని దాననేను
కంతునిఁ జేటికి సిం - గాణికి లొంగి
నినుఁజూచి మదినిల్వ - నేరక వలచి
యనురాగ రసవార్ధి - యందుఁ దేలితిని!
కొఱమాలినట్టి యీ - కొంకిబికి సీత
బరిహరింపుము నాదు - పలుకియ్యకొనుము
నీచెలువును నీదు - నిండుజవ్వనముఁ
జూచు వారలుసీతఁ - జూచియేమందు
కాంచనరత్న సం - గతి నన్నువంటి
వంచలేక్షణ నీకు - జతఁగూడ వలదె!
వలసిన చోట కేఁగి - వలసిన రూప
ములనుందు నీమది - ముచ్చటఁదీర్త
నీ లక్ష్మణుని సీత - నిప్పుడే మ్రింగి
వేళంబెనీకు నే - వలఁదినయ్యెదను!
ఈవనంబులయందు - నీగిరులందు
నీవేడ్కఁ జెల్లింప - నేర్తు నిన్నటను

ననుమతి యిమ్మన్న" - యానిశాచరినిఁ
గని నవ్వి రఘుకులా - గ్రణి యిట్టులనియె

—: రామ శూర్పణఖల సంవాదము :—

"ఐనదైనను గాని - దైన నాకొక్క
మానినియున్నదీ - మాత్రంబె చాలు!
జడలు వల్కలములి - చ్చటఁదాల్చి యొంటి
నడవులలో మాని - నై యున్న నాకుఁ
బరిచర్య లొనరింప - బలుకుతోడునకుఁ
దరుణిమాత్రమెచాలు - తాజితేంద్రియుఁడ
నిచ్చోట సరిలేని - యింతివి గాన
నిచ్చోట సవతిపో - రేఁటికి నీకు?
ననుఁబాయనేరదీ - నాతి యీరమణిఁ
గనుఁబ్రామి యెడఁబాయఁ - గాజాల నేను
మనసొక్కకడనుండ - మఱివేఱె చక్కఁ
దనము లాసింప రెం - తటి మగవారు
మెలఁత! యింతేల నీ - మీఁదటి యాస
గలుగదు నాకుఁ బొం - కముగాదు నీకు
సౌందర్యశాలి వి - చ్చట నంటు లేదు
సుందరులను వేడ్కఁ - జూచి కామించు
కొమరుఁ బాయపువాఁడు - కోరిన నీకు
నమరు సౌమిత్రిపై - నాసించి చేర
మేరువుపై నంటు - మిహిరుని దీప్తి
తీరున నతనిఁ బొం - దినఁ దగు నీకు
నాలు లేని విచార - మతని చిత్తమునఁ

జాల నున్నది పొమ్ము - జాగేల! యిచట
నొంటిగా వచ్చోట - నున్నట్టి వాఁడు
కంటిబొట్టుగ నీదు - కండలి నుండు
సతిని యిల్లాలిపై - యక్కఱల్ దీరి
జతఁగూడి యుండుము - సమరాగములను
జనుమని" పలుక ల - క్ష్మణుఁ జేరఁబోయి
దనుజ కామాంధయై - తమకించి పలికె

—: శ్రీరామునిచేఁ దిరస్కృతయై శూర్పణఖ
సౌమిత్రిని సమీపించుట :—

"తగినట్టి దావనీ - తరివచ్చి యిట్టి
పొగరు జవ్వనము న - బ్బురపు చెల్వంబుఁ
గలిగి యొంటిగ నిట్లు - కానలోపలనుఁ
జెలువెల్ల నడవిఁగా - సిన జ్యోత్స్న కరణి
తెకతెరఁదోప చే - తికిఁ దొరకితివి!
సుకుమార మూర్తివి - చ్చోనొంటి గాఁగఁ
నారి లేకిట్లు స - న్యాసియుఁ బోలి
నారచీరలుగట్టి - నవయ నేమిటికి?
నను వరియించిన - నానాఁటి కీవుఁ
గననేర్తు వింద్రభో - గములిట్టి మేనఁ
గౌఁగిలి యాసించి - కదియఁ జేరంగ
లోఁగిన దను దయా - లోకమాలికలఁ
గను" మన్నవెగటు బిం - కంపు లేఁతనవ్వుఁ
గనుపింప నతఁడు ర - క్కసికి నిట్లనియె.
"పలికె లటులుండ - నెందు దాసులకుఁ

బోలునే యిటువంటి - భోగభాగ్యములు!
యేను రాముని బంట - నెఱుఁగక వచ్చి
మానిని! బేలవై - మందలించెదవు!
వారు చెప్పిన పనుల్ - వడి రేవగల్లు
నూరట లేక యే - నొదుగుచుఁ జేసి
యధమ జీవనుఁడనై - యరవిరి గుడిసె
నధిక భయంబుతో - నణఁగి యున్నట్టి
యేనెడ నీవెక్క - డంతకు నెంత!
మానినీమణి! నాకు - మగువ వైనపుడె
దానిపై సీత క్రిం - దట నూడిగములు
జేసుక యాయమ్మ - చెప్పిన యట్లు
నడవనేర్తువె నీవు! - నాకేమి పోదు!
పడఁతులతోడ సం - భాషింపరాదు
అకట! కురూపిణి - వైన యాసీత
నొకనాఁడు చేరఁగ - నొల్లఁడా ఘనుఁడు!
నినుఁజూచు కన్నుల - నెలఁతను వేఱె
కననేర్చునే యలం - కారనాయకుఁడు!
అతనికి నీవు చి - న్నారివై యున్న
నతిశయ సౌఖ్యంబు - లందఁజాలుదువు
తరవాత సీతఁ జెం - తకుఁ జేరనీక
పరిహరింతువు నిన్నుఁ - బాయలేఁడతఁడు
నాబుద్ధి విని రాము - నకు దేవివైన
నో బాల! రాముఁడ - యోధ్యకుఁజనిన
లేదు! అందఱికినే - లికసాని వగుచు
సీమకు లేనట్టి - సిరులఁ బొందెదవు!

పొమ్మ" న్న మఱలి యా - పొలదిండి ముద్దు
గుమ్మ యామాటని - ఱుక్కవముగా నెంచి
శూర్ణవైఖరి జగ - ద్రోహిణి యపుడె
పర్ణశాలను సీతఁ - బాయక యున్న
రాముని కడకు చే - రఁగనేఁగి మిగుల
గామిడితనముతో - గద్దించిపలికె
" ముసలిది చెలువంబు - మొదటనే లేదు
రసికురాలును గాదు - రామ! నీవేల?
యీసీతఁ జేపట్టి - యిటునటు నన్ను
గాసిఁబెట్టెద వెఱుం - గవు రసస్థితులు!
మంచితనంబుతో - మనసిచ్చి పలుక
కించవై నను నుడి - కించ నెంచితివి?
ఇది యేల! సవతిపో - రేఁటికి నాకు
మదిమది నుండినీ - మదిఁ గాననైతి
గ్రక్కున నీసీతఁ - గబళించి మ్రింగి
యొక్కతెనై యున్న - నొంటిగా నీవు
నిలుపోపలేక మ - న్నించి ప్రార్థించి
పిలిచిన రాక నే - బిగియుదుంగాన"!

—: లక్ష్మణుండు శూర్పణఖ ముక్కుచెవులు గోసిపంపుట :—

అని తేటి చూపుల - నట్టిట్టు బెదరి
కనుచున్న సీతఁ జెం - గటికి నా జంత
కొఱవలవంటి చూ - డ్కులను రోహిణికిఁ
గఱకఱ నెదుర ను - ల్కాయకో యనంగ
మృత్యువువలె నోరు - మిక్కిలి తెఱచి

యత్యుగ్రగతి వచ్చు - నాసురిఁ జూచి
భూమిజ వడఁక గొ - బ్బునఁజేర దిగిచి
రాముఁడు లక్ష్మణ! - రమ్మని పిలిచి
" మందెమేలమ్ములాడ - మన కేల ? దీని
చందంబుచాలదు - ర్జాతి యీనాతి
మంచిమాటలఁబోదు - మదిలోన దామ
సించక తగునాజ్ఞ - సేయుము దీని
మత్తురాలిది " యన్న - మాటలోఁ జేతి
క త్తి నెలమి దూరఁ - గ్రక్కునఁ దిగిచి
రక్కసింబట్టి యు - ర్వరఁబడ ద్రేసి
ముక్కునఁ జెవులును - మొదలంటఁ గోసి
పొమ్మని విడిచిన - ఘోరన రోద
నమ్మసేయుచునది - నాసిక లేక
కూయుచుఁ జేగురుఁ - గొండయో యనఁగ
హా ! యని పొడవుగా - హ స్తంబు లె త్తి
యేఁగుచో పండ్లు సి - రెండలుగాయ
సీఁగలు దొనదొన - నిందందుమూఁగ
నఱచి నిరోష్ఠ్యంబు - లైన మాటలను
మొఱయిడు నపశబ్ద - ములు నింగి ముట్ట
నెత్తురుల్ వర్షించు - నీరదంబనఁగ
న త్తరి నల్లని - యంగంబు నిండి
చిమ్మనఁగ్రోవుల - చిమ్మిన యట్లు
క్రమ్మిన ర క్తధా - రలు ప్రవహింపఁ
జలము మానక జన - స్థానమార్గమునఁ
దలయుఁ జీరయు వీడ - దానవుశాలు

— ఖరుని ముందఱ శూర్పణఖ తనభంగపాటును
చెప్పి రోదనముఁ జేయుట :—

అడవిత్రోవనె పోయి - యన్నయాఖరుని
యడుగులం బడుగుస - య్యానఁ బడినట్లు
వ్రాలి యాదండకా - వనములో జాన
కీ లక్ష్మణులఁగూడి - క్రీడింపుచున్న
రాముని తెఱఁగునే - రని పని చేసి
తాముక్కుఁ జెవులునుఁ - దఱిగించు కొనుట
దన యవమానమం - తయు నేర్పఱింప
విని యాఖరుఁడు క్రోధ - వివశుఁడై పలికె.
" ఏల ధరణింబడి - యేడ్చెద ? వింత
చాలును లేలెమ్ము - సైదోడు నీవు !
ఎవ్వఁడు నీకింత - యెగ్గు గావించె
నెవ్వఁడు నిదురించు - నెడ పాముఁ జెనకె
నెఱుఁగక యిటుచేసి - యెవ్వఁడా దండ
ధరపాశములు మెడఁ - దగిలించు కొనియె
నెవ్వఁడీ చిలివిషం - బిటుచేసి విషముఁ
గ్రొవ్వునఁ ద్రావి మ్ర - గ్గుచునున్నవాఁడు !
కామరూపంబులు - గలనిన్నుఁ జెనక
నామఘవుఁడు దక్క - నన్యులోపుదురె ?
వాని ప్రాణములు నా - వాఁడి బాణముల
చేనేఁడె హరియింతుఁ - జింత యేమిటికి ?
పాలునీరునుఁ గూర్ప - పాలుమాత్రంబె
గ్రోలుహంసయుఁ బోలి - కుంభినీ తలము
వానిపై నెత్తురుల్ - వరదలువాఱఁ

బాణంబుఁ జేసి తా - పము దీర్తుఁగాక !
వాని మేదోమాంస - వసలు భూతంబు
లానిక మెసవి గ - ర్జనఁ గ్రేఁవుఁగాక !
ఇలవాఁడు బడియుండ - నీడ్చిగోమాయు
కులము లంగకములఁ - గొనిపోవుఁగాక !
ఏను చంపెదనన్న - నెవ్వారలైన
వానిఁగావఁగనున్న - వారె లోకముల ?
నేనేడ దేరి వా - నినెఱుంగఁ బల్క-
నాసాహసముఁజూచి - నను మెచ్చు మవుడు"
అన విని ఖరునితో - నాచుప్పనాతి
మనుజాశనియుఁ గ్రోధ - మహిమ నిట్లనియె.
"అన్న ! యిప్పుడు దండ - కాటవిలోన
కన్నుల పండువై - కనుపట్టువారు
చిఱుతప్రాయపు వారు - చిత్తజునేలు
మురిపెంపు నెమ్మేని - మురువుల వారు
పెడఁద రొమ్ముల వారు - వెలిఁదామరలను
కడఁ ద్రోయు చక్కని - కన్నులవారు
నగుమొగంబులవారు - నలువునఁ బసిమి
నిగుడు నిర్భరమేని - నిగ్గులవారు
నెక్కడపో దార - లెత్తుక వచ్చి
జక్కవచంటి న - చ్చరవంటి దానిఁ
దాము తెచ్చినవారు - దశరథ సుతులు
రామ లక్ష్మణులను - రాజ నందనులు
నారచీరలు గట్టి - నారు కోదండ

ధారులై తలజటల్ - దాల్చినవారు
ధీరులు నిర్జితేం - ద్రియులైన వారు
శూరులు చూపరఁ - జొక్కించు వారు
నాకపర్ణశాలలో - నుండనేఁబోయి
వెకలినై మనుజులో - వేల్పులో యనుచుఁ
జేరఁగ నేనేఁగి - సీతయనంగ
వారి చెంగటనున్న - వనిత నిచ్చటికి
నెలయింప నొంటిగా - నేకాంతమాడు
పొలువు వారెఱిఁగి గొ - బ్బున నన్నుఁ బట్టి
యీవిరూపముఁ జేసి - యిపుడున్నవారు
నీవు వారలఁద్రుంప - నేవారి మేని
నెత్తురుల్ ద్రావక - నెంజిలి దీర
క్రొత్త మానిసిఁగాను - కోర్కె చెల్లింపు"

—ఖరుఁడు పదునల్వురు రాక్షసులను
శ్రీరామలక్ష్మణులపైఁ బంపుట :—

అని విని హుమ్మని - యాగ్రహం బొప్పఁ
దనచుట్టముల దండ - ధగులనుఁబోలు
రాక్షసేంద్రుల నతి - రథుల సంగ్రామ
దక్షుల సాహసో - ద్ధతుల రప్పించి
పదినల్వురను వేగ - పయనంబుఁ జేసి
"ఇది వేళవచ్చె మీ - రిద్దఱుఁగూడి
దండకాటవి కేఁగి - దశరథాత్మజులఁ
జెండాడి రంతు నా - చెలియలి చేత
విన్నాఁడ" నని వారి - వేషముల్ గుఱుతు
లన్నియు వివరించి - యనుచు నవ్వేళ

" మీరంగ వారలు - మిముఁజూచినపుడె
పారిపోవుదురు శూ - ర్పణఖ కోపంబు
తీరదు గావునఁ - దెలివలు గట్టి
వారిఁ బోనీయక - వసుధపైఁ గూల్చి
వారింటిలో నున్న - వనజాక్షిఁ బట్టి
యేరాక్షసుఁడు దెచ్చె - నేవాని మెచ్చి
యడిగిన నిత్తుఁ బొం" - డని పంప వారు
విడెములందుక తమ - వెంట శూర్పణఖ
మార్గంబు గనుపింప - మారుతాహతిన
నర్గళంబుగ వచ్చు - నభములనంగ
వడిమీర వచ్చిదా - వహుతాశనార్చు
లడవియేనుఁగలు డా - యఁగలేని యట్లు
శ్రీరాము తేజో వి - శేషంబు జూచి
యారాక్షసులు జేర - నసమర్థులగుచుఁ
ద్రొక్కుడు పడుచుండఁ - దోడనే చేరి
ముక్కిడి రక్కసి - మూఁకల నడువ
నదిచూచి రఘురాముఁ - డాసీత వినఁగ
మదిలెక్కఁగొనక ల - క్ష్మణుఁ జూచి పలికె
" వారెవచ్చిరి కంటి - వా! దైత్యవరులు
ధీరులై చుప్పనా - తికి వహించుకొని
యీ నిశాచరులనే - నిలఁగూల్చి వత్తు
జానకిఁగాచి యి - చ్చటనుండు మీవు
నీపర్ణశాలలో - నింత యేమఱక
కాపాడు" మనిన ల - క్ష్మణుఁడట్ల సేయు

—: రాముఁడు రాక్షసులను సంహారించుట :—

శరమేర్చి చేవిల్లు - జ్యావల్లిఁగూర్చి
సురవైరి వీరులఁ - జూచి యిట్లనియె
" మునులకై వడిఁగంద - మూలముల్ మెసవి
వనభూములను జటా - వల్కలశ్రేణిఁ
దాలిచి శాంతియు - దాంతియుఁబూని
మూలల నొదిఁగి యే - ము చరింపుచుండ
నేమి దలంచి మీ - రిద్దఱుఁగూడి
నామీఁద దండెత్తి - నారకారణము
వలదు పొండటుగాన - వాలాయముగను
కలనుపై వేడుకఁ - గలదేని మీకు
నాచేత విల్లును - న్నది మీరు వచ్చి
గోచరించితిరి మీ - కోరిన యట్లు
ననుభవించెదరన్న" - నసురులు రాముఁ
గనుఁగొని కడునొడుఁ - గఱచి యిట్లనిరి
" ఖరుఁడు మాదొర పంపఁ - గా వచ్చినార
మురుశక్తిచేత ని - న్నుక్కడంపంగ
నిండఱితోడ నీ - వెదిరించి పోర
నందుకు శక్తి లే - దని జేసితేని
నీవిల్లు ఖండించి - నీక్రొవ్వు మాన్చి
పోవుదుమిఁక దాఁచి - పోరాదు నీకు "
నని తమచేతి మ - హాశూలసమితి
దనుజులంకించి యం - దఱు మీఁదవైవ
నన్నిబాణంబుల - నన్నిశూలములు
మున్నాడి తునిమి రా - ముఁడు భీముఁడగుచుఁ

చక్కఁగా నీజన - స్థానంబు మీఁద
నెక్కడ వచ్చునో - యింక రాఘవుఁడు ?
ఈచోటు నీకొమ్మ - నిఁక వేఱెదిక్కు
చూచుకొమ్మది యేలఁ - జొరుము లంకకును
కాకున్న మననీఁడు - కాకుత్స్థకులుఁడు
నీకుఁదోఁచిన జాడ - నేఁడె వర్తిలుము
అన్నకన్న మహోగ్రుఁ - డైనట్టి వాఁడు
నన్ను నీరీతి మా - నముఁ గొన్నవాఁడు"
అని రొమ్ము గడుపునం - దంద కరంబు
లను మోఁదుకొనుచుఁ బ్ర - లాపింపఁజూచి

—: ఖరుని రణప్రస్థానము :—

తానాగ్రహంబుతో - దనుజులు వినఁగ
దానితో ఖరుఁడు ప్ర - తాపింప పలికె.
" నీ యవమతిచేత - నీరధివోలి
నా యాగ్రహము శూర్ప - ణఖ! మిన్ను ముట్టె
నెవ్వాఁడు నిన్నునేఁ - డిటు జేసె వానిఁ
గ్రొవ్వాఁడి తూపులఁ - గుంభినిఁ గూల్చి
యారక్తధారల - నాఁకలి డప్పి
తీరుతు నీకు నా - దిత్యులు బెదర"
అన విని మదినమ్మి - యది సమాళింపఁ
గనలుచు దూషణుఁ - గాంచి వాఁడనియె
" అనుకూలురై నాకు - నాప్తులై చేయిఁ
గనియున్న ఘోరరా - క్షసుల నేర్పఱచి
పదునాల్గువేలను - బలిసి నావెంటఁ
గదిసి కొల్వఁగఁ బిల్చి - కలనికిఁ బనుపు

తేరాయతముఁ జేసి - తెప్పింపు ఖడ్గ
నారాచశక్తికుం - తశరాసనములు
జోడింప నేమున్న - చూచెదరాము
తోడి సంగరమన్న" - దూషణుఁడపుడు
కదలివచ్చె నొకట - కాంచనాచలము
కదలునే యదియిది - కనకరథంబు
లనుచుఁ జూపఱు మెచ్చ - నపరంజి బండ్లు
నెనయు వైడూర్యంపు - టిరుసులు వజ్ర
మయమైన నొగయును - మణిగణప్రభల
దిగదిగమని నర - తిర్యగాదిత్య
పక్షి పన్నగలతా - ప్రసవభూమీజ
యక్షరాక్షసముఖా - నంతచిత్రములు
రణజయకారణ - రాహుధ్వజాగ్ర
రణదురుఘంటికా - రావంబు మొరయ
బహువిధసాధన - ప్రబలార్కదీప్తి
రహీ మాప శబల వ - ర్ణంబులై పొలుచు
హయములఁ బూన్చిన - యరదంబుఁ దెచ్చి
జయశాలియైన దూ - షణుఁడు నిబ్బటయు
నారథంబెక్కి తూ - ర్యంబులు మొరయ
సారథంబచరించి - జయభేరు లులియ
ముందర బహుసైన్య - ములు గొల్వ ననికి
స్యందనంబెక్కి దూ - షణుఁ డాప్తబలము
పజ్జలరా నేఁగఁ - బదునాల్గువేలు
రజ్జులాడుచుఁ బైఁడి - రథములవారు

పరశు పట్టిసకుంత - పాశకృపాణ
శరచాపతోమర - చయభిండివాల
ముసలచక్రగదాస్త్ర - ముద్గరప్రముఖ
లసమానసాధనో - ల్లాసులై కదల
ఖరుఁ డరదముఁదోలి - కాలాంతకార్క
వరతేజమునఁజేర - వానికి మునుపె
సమరభీషణుఁడు దూ - షణుఁడు సైన్యంబుఁ
దమకించి సెలవిచ్చి - దండకాటవికిఁ
జేరుచో దిక్కులు - చెవుడు పడంగ
ఘోరున రథచక్ర - ముల రవంబెసఁగ
నది గర్జితంబుగా - నభ్రమై యుంప
గుదులను బిడుగుల - గుఱియఁజేరుటయు

—: ఖరుఁడపశకునములు గాంచుట :—

నావేళ వానిపై - నశుభకారణము
గా వినువీధి ర - క్తంబులు గురిసె
రథవేగనిహతిఁదు - రంగంబు లలసి
పృథుగతి మ్రొగ్గి ధ - రిత్రిపైఁబడియె
గురువిభాదూరమై - కౌరవులతోడి
పరివేషమునఁదోఁచె - భానుమండలము
టెక్కెంబు మీఁద నుం - డెను బంతగ్రద్ద
వెక్కసంబుగఁ గూసె - విహగకులంబు
దిక్కులఁ జీకట్లు - తెరలుగా ముంచె
పక్కలు వాపోయె - నలుదెసలందు
చదల నెల్లెడఁ దోఁచె - సంజకెంజాయ

గదురు నెత్తురులు మృ - గశ్రేణి గ్రక్కె
కంకగృధ్రంబు లిం - గలముల నమిసె
యంకిలిఁ జేసె మ - హారోదనములు
చండాంశుకలన మ - స్తకములు లేని
మొండెంబు లాకసం - బునఁ గనుపట్టు
గ్రహణముల్ దోఁచెన - కాలంబులందు
మహినిండెను బ్రచండ - మారుతౌఘములు
జలజలంబగలు న - క్షత్రముల్ డుల్లె
కొలఁకుల జలము గ్ర - క్కున నింకిపోయె
గాలిలేకయు ధూళి - క్రందుగా నెగసె
రాలును బిడుగులు - రాల్చె మేఘములు
వడవడఁ గంపించె - వసుమతి యెల్ల
యెడమ మూపులు చలి - యించె దైత్యులకు
ఖరుని కుత్తుకఁబుట్టె - కాకుస్వరంబుఁ
బొరసె మహోత్పాత - ములు సేనలోన
నది చూచి సరకుసే - యక నవ్వి ఖరుఁడు
మదిఁగ్రొవ్వి తనయాప్త - మంత్రులకనియె

— ఖరాసురుని దంభోక్తులు —

"భావింపుఁడెన్నియు - త్పాతముల్ వుట్టె
నీవేళ కలనికే - నేఁగు నాయెదుర
నెటులైన రాము జ - యింపక మాన
నటమీఁద మృత్యువు - నైన జయింతు
చుక్కలు రాలింతు - సూర్యమండలము
వ్రక్కలింపుదు శర - వ్రాతంబుచేత

జానకీపతిఁ జంపి - సౌమిత్రిఁ ద్రుంచి
కాని నేఁడూరక - క్రమ్మరరాను
తోడఁ బుట్టినదాని - తుండుడుకార్చి
వేఁడుకఁ ద్రావింతు - విమతరక్తములు
నైరావతము మీఁది - యలవజ్రినైన
పోరిలోన జయించు - పూనికి నాది
యని నన్ను వీక్షింపుఁ" - డన మృత్యుపాశ
మునఁజిక్కి పొలదిండి - మూఁకతోఁగదల
నపుడు చారణసిద్ధ - యక్షగంధర్వ
తపనేందు ఋషిదేవ - తాసంఘమెల్ల
నవరత్నభాసమా - న విమానములను
దివినుండి రాఘవు - దీవించి పొగడె
నెందు గోబ్రాహ్మణ - హితముగా దైత్యు
లందఱు నని నశి - యింతురు గాక!
వీరల మర్దించి - విజయంబుఁగాంచి
యీరాముఁ డిలయెల్ల - నేలెడుగాక!"
అని పోకఁ జూచుచు - నాకాశమార్గ
మున దేవతావళి - మునగసలాడ
ననికి ఖరుండు రా - నలశ్యేనగామి
యను విహంగమదుర్జ - యులు మేఘమాలి
కరవీర నేత్రుఁడు - కాలకార్ముకుఁడు
పరుష మహామాలి - పలల భోజనులు
రుధిరాశనుఁడు సుపా - ర్శ్వుఁడు యజ్ఞశత్రు
పృథుకంధరులునను - పేళ్లచే వెలయు
ద్వాదశముఖ్య ప్ర - ధానులు చుట్టు

ద్వాదశాదిత్య ప్ర - తాపులై రాఁగ
దూషణు రథము చ - తుర్దిశలందు
భీషణాకారుల - భేద్య విక్రములు
స్థూలాక్షుఁడు ప్రమాథి - సారిది మహాక
పాలుఁడు త్రిశిరుఁడు - పాయక కొలువ
నలువురితోడ ముం - దరఁ జతురంగ
బలములఁ బురికొల్పి - పై వచ్చునపుడు,
ఖరుఁడు దూషణుఁడును - గ్రహమాలికాను
సరులైన చంద్రభా - స్కరులనుఁ బోలి
ధరగ్రక్కతిల్ల ను - ద్ధతిఁ దమ మీఁదఁ
బఱతెంచు రాక్షస - బలము నీక్షించి
చదలపై మహిదోఁచు - శకునంబు లరసి
మదిరాముఁ డలరి ల - క్ష్మణుఁజూచి పలికె.

— శ్రీరాముఁడు సీతను గాపాడు భారము
లక్ష్మణున కప్పగించి సన్నద్ధుఁడగుట. —

"ఖరుని మూఁకలువచ్చె - గహనమార్గమునఁ
బరికింపు మచట ను - త్పాతముల్ వొడమె
పొగలు గప్పెట్టె ని - ప్పుడు మదస్త్రముల
మొగిడి నూరకె నాయ - మోఘ కార్ముకము
నీచెంత వనపక్షు - లెలుఁగించు జాడఁ
జూచిన మనకు ని - చ్చోఁగయ్యమంది
బలవంతమై ప్రాణ - పర్యంతమునకుఁ
గలుగు సన్నలు దోఁచెఁ - గంటివే యిపుడు
నావలభుజము మి - న్నక యదరెడును
గావున మనకు ని - క్కము గెల్పు గలదు

కలనికి నేఁగుచోఁ - గడుమోమునందుఁ
గళగల్గియుండినఁ - గడవారి నోర్చు
మిగులఁ బ్రసన్నత - మించె నీ మోము
మగఁటిమిచే గెల్పు - మనకు సిద్ధించు
నదె వింటివే కాహా - కాదిరవములు
నదయదైతేయ వీ - రాట్టహాసములు
వినవచ్చుచున్నవి - వేళ నేమఱక
ధనువెక్కుఁబెట్టి య - స్త్రములేరుపఱచి
జానకిఁ దోడ్కొని - శైలకందరము
లోన వసింపు మీ - లువుఁగావు మిపుడు
తెగదన్న నాదుమీఁ - దటియాన నీకుఁ
బగవారి నణఁగించు - బహుళవిక్రమము
నీకుఁగల్గిన దైత్య - నికరంబు నెల్ల
మాకు వేడుకబుట్ట - మదమడంచుటకు
మాఱాడకు" మటన్న - మాటకు నతఁడు
శ్రీరాము నానతి - శిరమునఁ జేర్చి

— శ్రీరాముఁడు పరాక్రమముఁజూపుచు
ఖరునిసేనలతోఁ బోరుట. —

సీతఁ దోకొనిపోవఁ - జిత్తంబు వొదల
హేతులు వెదచల్లు - నేసుటమ్ములను
నారోపితమహాశ - రాసనం బంది
దారుణంబగు తను - త్రాణంబుఁదొడిగి
శింజినీక్వణనంబు - సేయుచు దనుజ
భంజనంబునకుఁ బా - ల్పడి నిలుచున్న

రామునిఁగని సుప – ర్వమునీంద్రులెల్ల
"నీ మహామహుఁ డొక్కఁ – డిందఱితోడ
జగడ మేక్రియఁ జేయఁ – జాలునో యితఁడె
పొగడొందుఁగాక! గె – ల్పునకుఁ బట్టగుచు
నాదివిష్ణువు దాన – వావళినెల్ల
మోదంబుతోఁ జక్ర – మున గెల్చినట్లు
లెటు వైరులనుఁ బొలి – యించునో! యితని
దిటముఁ జూతమటంచు – దృష్టింపుచుండ
ననికి సన్నద్ధుఁడౌ – నవనిజారమణుఁ
గని భూతకోటులు – గంపించి బెదుర
విలయావసర రుద్ర – వేషంబుతోడ
నలవోకగా రాక్ష – సాళిఁజూచుటయు
నప్పుడు సింహనా – దాభీలమగుచు
నుప్పొంగి దానవ – వ్యూహంబుఁ గెరలి
కార్ముకజ్యావల్లి – కార్ఝాంకృతములు
దుర్మధాంధత దిశా – స్తోమంబు నిండ
వచ్చుచో రఘుకుల – వరుఁడొక్క వాఁడి
చిచ్చుఱ నమ్మోర్చి – చేతఁగీలించి
కాలాగ్ని కల్పుఁడై – కన దక్షయాగ
శాలలో వెలుఁగు నీ – శ్వరుని చందమునఁ
జెనుపొందు ననుఁజూచి – భీతిచే నచటి
వనదేవతలు భూత – వర్గంబు వెఱచి
నలుదిక్కులనుఁ బోవ – నాళీకమిత్ర
కులమణి యున్నచోఁ – గోదండ బాణ
కేయూర కటక కిం – కిణికా కిరీట

సాయక కుండల - జాజ్వల్యమాన
వరవిభావటలంబు - వనజాప్త దీప్తి
కరణి పైఁబొదువు మే - ఘంబులో యనఁగ
నిండినసేనలో - నిలిచి ఖరుండు
చండాంశ తేజుఁడై - సారథి కనియెఁ
"గడపుము రథము రా - ఘవులపై నిపుడు
పడనైతి వారి నా - బాణచాతురిని
దానవావళికి సం - తసముఁ గల్పింతు
మానుల యడియాస - మానుతు నిపుడు
చేరఁబట్టుక వత్తు - సీత నీక్షణము
పరిహారింపుదును శూ - ర్పణఖ ఖేదములు"
ననపల్కి విని వాఁడు - నట్లసేయుటయుఁ
దన యిరుగడవీర - దానవశ్రేణి
నడచుచోఁ జుక్కల - నడుమఁ గన్పట్టు
కడునుగ్రుఁడైన యం - గారకు కరణిఁ
గనుపట్టుచుఁ బ్రచండ - కాండవర్గంబుఁ
గనుచెదరంగ రా - ఘవు మీఁదఁగురిసి
ఘర్జించుటయుఁ దక్క - గలయోధులెల్లఁ
దర్జించిశూలము - ద్గరకరవాల
కుంతతోమరగదాం - కుశభిండివాల
సంతతు లందంద - జడివట్టి ముంచి
యరదముల్వారపి వా - హముల పైఁదరఖి
కరుల ఢీకొలిపి భీ - కరులై చెలంగి
జగడింప వారేయు - శరపరంపరలు
నగముపైఁ గురియువా - నయుఁబోలి కప్పు

నాసాధనము లెల్ల - నాపగాశ్రేణి
యాసముద్రుని లోన - నణఁగిన యట్లు
పనిగొనలేవయ్యె - బాణపాతములఁ
దనమేన బహురక్త - ధారలు దొరఁగ
నతిశోణసాంధ్య రా - గారుణజలద
శతపరిచ్ఛన్న భా - స్కరుఁడకో యనఁగ
వెలుఁగొందు నారఘు - వీరునింజూచి
కలఁగుచు దివిజసం - ఘము వినువీథి
"అక్కట! యీ రాక్ష - సావళి మట్టె
నొక్క యీ శ్రీరాము - నుక్కడంచైదగు
ఇతఁడెట్లు వోరు వీ - రిందఱి తోడ
కృతపుణ్య! శ్రీరామ! - గెలుతువుగాక!"
అనుచుండఁ బరిమండ - లాయతోద్దండ
కనకకోదండ ని - ర్గత హేమపుంఖ
కాండప్రకాండ తీ - క్ష్ణకరకరాళ
చండప్రభానిర - స్త నిశాటసైన్య
నిబిడాంధకారుఁడై - నీడలు వడఁగ
ప్రబలదానవసేన - పడలు వడంగ
ననిసేయ, భగ్నంబు - లైన తేరులును
తునిసి మావంతుల - తో వ్రాలు గరులు
నడ్డంబు నిడువునై - హయములమీఁద
నొడ్డగిల్లిన ప్రోగు - నుగ్రసాదులును
ఖండిత కంకణాం - గదభుజాలతలు
నొండొంట ధరణిపై - నొరలు మస్తములు
డొల్లు కిరీటముల్ - దుల్లు దంతములుఁ

ద్రెళ్లుకాయమ్ములుఁ - దెగిన కంఠములు
జీరాడు కేశముల్ - చెదరు హారములుఁ
బాఱు నెత్తురునదుల్ - పడు కేతనములుఁ
బొడిమైన శరములుఁ - బొరలు గాల్బలము
మడియు సారథులు ద - మూరథా విండ్లుఁ
బగులు కేడెమ్ములు - బరియలై చినుఁగుఁ
బొగరు దైత్యులకడు - పులు వేగ మురియు
ముక్కులు విఱుఁగు నె - మ్ములుఁ జెక్కులైన
చెక్కులు నజ్జులౌ - చెవులు తుండించు
కాళ్లును నలియు న - క్కులునురుమైన
వ్రేళ్లును వ్రయ్యలౌ - వీపులుఁ గలిగి
శతసహస్రములైన - సంఖ్యల దైత్యు
లతిమాత్ర చిత్రరా - మాస్త్ర ఘాతములఁ
బడుగుఁ బేకయునుఁగాఁ - బడిన పెండియును
పుడమియల్లుఁడు వింటఁ - బూన్చి వికర్ణి
నాళీక నామబా - ణ ప్రయోగములఁ
జాల నెండిన వన - జాలంబు నేర్చు
దహనుని రీతి దై - త్యశ్రేణినెల్ల
దహియింప గరుడచ్ఛ - దసమీరణముల
నిలమీఁద వ్రాలు మ - హీరుహశ్రేణి
పొలుపున దనుజుల - ప్పుడు గూలుటయును
చెదరినల్గడ హత - శేష సైన్యంబు
మదమేది ఖరదైత్యు - మఱుఁగుఁ జొచ్చుటయు
మున్నాడి యాహవం - బున దూషణుండు
వెన్నాఁగి తనవారి - వెఱవకుండనుచు

శరమేర్చి శమనుండు - శంకరునెదురు
కరణిఁ గోపించి రా - ఘవు ధిక్కరించి
నిలిచినఁ బోవక - నిలిచిన సేన
బలదర్పమున వాని - బలమాత్మ నమ్మి
సింహనాదముతో - శిలలురువృక్ష
సంహతియును మహిఁ - జలియింపవైచి
యుగ్రశస్త్రములఁ బ్ర - యోగింప రాఘ
వాగ్రణి వారిపై - నాగ్రహంబునను

— శ్రీరాముఁడు గాంధర్వాస్త్రమున రాక్షసులఁదునుముట :—

గాంధర్వమగు తూపుఁ - గైకొని వింట
సంధించి వేసిన - జగమెల్ల బెగడఁ 2050
దనయందు దివ్యశ - స్త్రములు మిన్నెల్లఁ
జినుకుటింగలములుఁ - జిందసీనుచును
రాఁజుచు నమ్మహా - స్త్రము తమ మీఁద
రాఁజూచి సమరంబు - రాము శౌర్యంబు
శరముఁ బూనుటయు న - స్త్రము రాకఁజావు
నెఱుఁగక దిగులుచే - నిన్నియు మఱచి
రివ్వలు విఱిగి పా - ఱి తొలంగు బుద్ధి
నెవ్వరికిని లేక - యెట్లున్న వారు
నటులె యుండఁగ నేత - దస్త్రసంభూత
చటులాస్త్రములు ధరా - చక్రంబు వొదివి 2060
బలమెల్ల సమయింప - బలులైదువేల
బలము దూషణుఁడంపఁ - బటుపరాక్రములు
వారు రామునిపై న - వార్యరోషమున

ఘోరాస్త్రకోటులు - గోలగాఁగురియ
వారి యమ్ములు తన - వాలంపుగముల
వారించి జానకీ - వరుఁడు గోపించి

— దూషణవధ —

యాదూషణుని మీఁద - నతని సైన్యంబు
మీఁద నాదిత్యులు - మేలని పొగడ
దూషణుం డేసిన - తూపులు భీమ
రోషభీషణుఁ డౌచు - రూపఱ నేసి 2070
వాని సారథిఁ ద్రుంచి - వానియశ్వములఁ
జానేసి చేశరా - సనము ఖండించి
మూఁడు దూపుల నుర - మ్మున రక్తధార
లోడికల్ గట్టమ - హోద్ధతి నేన యు
విరథుఁడై యమ్ములు - విల్లును లేక
ధరణిపై నొకకొండఁ - దరలించినట్లు
నపరంజికట్లచే - నళనిసన్నిభముఁ
జపలాలతా ప్రకా - శము లైన శత్రు
జనపాల రక్తమాం - సములాని విజయ
జనకమై దివిజభీ - షణమయి పొల్చు 2080
నొక పరిఘముఁబట్టి - యురవడి రాఁగఁ
జకచకల్గల యర్ధ - చంద్రబాణములఁ
జేతులు రెంటినిఁ - జిదిమి వైచుటయు
భూతలం బద్రువ న - ప్పుడు దూషణుండు
కొమ్ములుఁ గొట్టిన - కుంభిని మీఁదఁ
గమ్మికపడిపోల్చు - గంధేభ మనఁగ

నారక్కసుఁడు వడ్డ - నఖిలభూతములు
శ్రీరామవిభుఁ బ్రశం - సించి రుల్లముల
నతని బాంధవులు మ - హాకపాలుండు
నతిశౌర్యధనుఁడు స్థూ - లాక్షుఁడన వాఁడు 2090
మత్తచిత్తుండు ప్ర - మాథియు ననఁగ
నత్తరి మువ్వురు - నసికుంత ముసల
సాధనమ్ములు వైవ - జానకీవిభుఁడు
సాధులౌ నతిథులం - జని కాంచినట్లు
లెదురేఁగి రండని - యేర్చిన యమ్ము
పదను జూడ మహాక - పాలుని శిరము
ఖండించి స్థూలాక్షు - కన్నులు రెండు
రెండు తూపులగ్రుచ్చి - త్రెళ్ళంగనేసి
మఱియొక్క కోల ప్ర - మాథిఁ గీటడఁచి
వెరఁజి తక్కిన యైదు - వేలరాక్షసులఁ 2100
బోనీక చంపున - ప్పుడు ఖరుం డలిగి

## — శ్రీరామబాణములకు ఖరుని పన్నిద్దరు మంత్రులు బలియగుట —

తాను పన్నిరువురఁ - దనమంత్రివరులఁ
బనిచిన వారలు - పన్నిరువురును
మొనసేయఁ జూచి రా - ముఁడు భీముఁడగుచుఁ
గాండమొక్కట శ్యేన - గామినిఁ ద్రుంచె
రెండు తూపులఁ బృథు - గ్రీవునిఁ దునిమెఁ
జంపె నొక్కటయజ్ఞ - శత్రువుంబట్టి
యంపెఁ గాలుని వీటి - కావిహంగముని

జతగూర్చి పనిచె దు - ర్జయు వానితోడ
నతని వెంబడిఁగూర్చి - యంపెను పరుష
వడిఁగరవీరాక్షు - వానితోఁ గూర్చి
కడతేర్చి తానంపెఁ - గాల కార్ముకుని
లీలగా మేఘ మా - లిని బలిపెట్టి
యాలంబులోన మ - హామాలిఁ గూల్చె
యనిపె సర్పాశ్యుని - యమ్ము సంధించి
యనలకల్పుని రుధి - రాశనుఁగూల్చె
సైన్య శేషమునెల్ల - సమయించు రాము
జన్యరంగమున రా - క్షసులెల్లఁ బడిన
నాదైత్య కేశంబు - లాహవ యాగ
వేదికి దర్భలై - విలసిల్లె నపుడు
రణయాగశాలకు - రాక్షసశస్త్ర
గణములన్నియు నుప - కరణంబులయ్యె
నగ్నులయ్యె మణీమ - యాభరణంబు
లగ్నిసమాన రా - మాస్త్రసంహతుల
జానకీపతి పాద - చారియై యొకఁడు
దానవవరచతు - ర్దశ సహస్రముల
నొకముహూర్తంబులో - నుక్కణఁగింప
నొక త్రిశిరుండు తా - నొద్దికయగుచు

## — త్రిశిరసంహారము —

ఖరునికి నూరట - గానిల్పి యుగ్ర
శరచాపహస్తుఁడై - శౌర్యదర్పములఁ

దనవెంటరాఁగ ర - థంబుపై వచ్చి
యనువున ఖరుఁడు దు - రాగ్రహుఁడగుచుఁ
దేరువో నిచ్చుచోఁ - ద్రిశిరుఁడా ఖరునిఁ
జేరి యడ్డము నిల్చి - " శ్రీరాము మీఁద
నేటికి జనియెద - వేగల్గి నన్నుఁ
జాటుగనే యిట్టి - సమరంబులకును
తేరిచూడుఁడు నన్ను - దేవరవారు
పోరాడ నీతఁడ - ప్పుడు పురందరుఁడె ?
మనుజుండు వీఁడెంత - మడియింతు నన్నుఁ
గనుము చంపుదుఁబట్టి - కాకుత్థ్సకులుని
నా యాయుధము తోడు - నాకితండెంత?
నీయాన ! వధియింతు - నేఁడె రాఘవుని
నతనిఁ జంపుటయొండె - నతనిచేఁ దనకు
మృతియొండె కాకేల - మిక్కిలిమాట
యేను జయించిన - నీజనస్థాన
మేనాఁడు నెమ్మది - నేలుము నీవు!
కాకయుండిన రమ్ము - కలని కవ్వనుక "
నని పచారించివాఁ - డరదంబుఁ దోలి
పెనుభేరి మొరయించు - పెక్కువ నార్చి
శిరములు మూఁడును - శిఖరముల్ మూఁడు
ధరణీధరంబుపైఁ - దనరిన యట్లు
గాత్రంబుపైఁ దోఁపఁ - గాండవర్షంబు
చిత్రంబుగా మొగుల్ - చినికిన యట్లుఁ
గురియుచో రాముఁడుం - గోపించి దివ్య
శరముల మేను జ - ర్ఝరితంబు సేయ

రాఘవత్రిశిరుల - రణకేళి యస్త్ర
లాఘవంబును సుర - శ్లాఘనీయముగ
హరియునుఁ గరియుఁ గ - య్యముసేయుసరణిఁ
బురణింప త్రిశిరుఁ డ - ప్పుడు కోపగించి
రాము నెన్నుదురు నా - రాచముల్ మూఁడ
చేమఱువక వ్రేయఁ - జిఱునవ్వు దొలఁక
నాకసంబున వేల్పు - లచ్చెరువంద
కాకుత్స్థకులుఁడు రా - క్షసుని కిట్లనియె.
"మేలుమేలు! నిశాట! - మిక్కిలి బంట
వాలంబు నీవుసే - యంగ నేర్పరివి
శరము లేసితివో? య - బ్జంబు లేసితివో?
మెఱుఁగరాదిట్లని - యించుకనైన
నాచేతిశరముల - నాఁటిన నెనుకఁ
జూచెదవది సరి - చూచుకొమ్మ"నుచు
నెన్నిలోకంబుల - కేఁగినఁద్రుంతు
నన్నట్లు పదునాలుఁ - గమ్ములు దొడిగి
యురము నొవ్వఁగ నేసి - యురువడినాల్గు
శరములచే రథా - శ్వంబులఁగూల్చి
సారథి నెనిమిది - సాయకమ్ములను
సూరాత్మజుని వీడు - చొరఁద్రోలి యొక్క
తూపున టెక్కెంబుఁ - దునియలుచేసి
కోపించి మఱియుఁ బె - క్కు శిలీముఖములఁ
దనువు నాటించి య - స్త్రంబులు మూఁటఁ
దునిమె శోణపుశిరో - ధులు మూఁడు వరుస
పులిఁజూచి వనమృగం - బులు వాఱినట్లు

కలఁగి రాఘవుఁజూచి - కలన రాక్షసులు

**—: ఖరాసురుఁడు రామునితో యుద్ధముచేయుట :—**

పరువెత్తి త్రిశిరుని - పాటు ఖేదమున
ఖరునితోఁ దెల్పినఁ - గడునల్గి యతఁడు
చంద్రుపై రాహువు - చనినట్లు రామ
చంద్రుపై నలిగి య - స్త్రమ్ములు గురిసె
తన తేరు చెంతకుఁ - దరమి యా నముచి
యనిమిషేంద్రునిఁ జేరు - నట్టిచందమునఁ
గదిసి పుంఖాను పుం - ఖములుగా దిశలు
చదలును దారుణా - స్త్రచయంబు గాఁగ
నురువణించిన రాముఁ - డుగ్రసాయకము 2190
లురుశక్తినైచి య - త్యుగ్రతేజమునఁ
దపనుని దీప్తియుం - తయుఁగాననీక
యపుడు నభంబెల్ల - నాక్రమించుటయు
నాళీకములఁ జిల్కు - నారాచములను
జాల దైత్యుఁడు రామ - చంద్రుని మేను
నంకుశాహతిఁ గరి - నలయించు రీతి
నంకిలి నొందింప - నపుడు వేలుపులు
గాలాంతకుఁడు వీఁడె - కాఁబోలు ననుచుఁ
జాల రామునిగెల్వ - సంశయింపంగఁ
బెక్కండ్రతోఁ బోరి - బెలుకురి యలసె 2200
చిక్కె రాఘవుఁడని - చింతించె ఖరుఁడు
సింగంబు మృగముఁ జా - చినరీతి రాచ
సింగంబు ఖరునిఁ జూ - చె తృణంబు గాఁగ !

శలభంబు వహ్నిచెం - చక డాసినట్లు
ములుచదానవుఁడు రా - ముని లెక్కఁగొనక
చలము మీఱఁగ నర్ధ - చంద్ర బాణమున
విలుఁదునియఁగ నేసి - వెసఁ బెనువాఁడి
మరియు నేడమ్ముల - మహిసుతా విభుని
యురమును కవచ మో - హో! యనఁ ద్రుంచి
వేయమ్ములను రెప్ప - ద్రేయక మునుపె
కాయమ్ము నిండారఁ - గాయముల్ చేసి
పూచిన మోదుగు - పోలుపునఁ గువల
మేచకాంగము రక్త - మిళితంబుగాఁగ
గెలిచితినని విశం - కితుఁడైన ఖరునిఁ
గలుషించి చూచి రా - ఘవ శేఖరుండుఁ

— రాముడు ఖరుని రథాది పరికరములఁ గూల్చుట —

దనకుఁదొల్లి యగస్త్య - తాపసుఁడొసఁగఁ
గను విష్ణుదేవలో - కంబైన ధనువు
చేనంది శితశర - శ్రేణిచేఁ గ్రుచ్చి
దానవు జర్ఝరి - తశరీరుఁ జేసి
యొక బాణమున వాని - యున్నత ధ్వజముఁ
జకచక ప్రభలీన - జగతిఁ ద్రెళ్ళించి
మించిన దనుజుఁడే - మియు నడ్డచేసి
యెంచక ములుకుల - నేనుఁగు మేను
నాఁటించుకై వడి - నాల్గు బాణముల
నాఁటించి నొప్పింప - నవరక్తధార

నెమ్మిన నిండఁబూ – నిన సప్తసాయ
కమ్ముల ఖరుని యం – గము నొవ్వనేసి
శిరముపై నొకతూపు – చేతుల రెండు
శరముల మూఁడర్ధ – చంద్రబాణముల
నురముపై నాఁటించి – యొక పదమూఁడు
దురుసుటమ్ములను ని – త్తురు చిందనేసి
కాఁడిమానొక విశి – ఖమున నాల్గింట
బోఁడిమి చెడహాయం – బులఁ దూపులాఱు
నిగుడించి సారథి – ని శరత్రయమున
నొగలును నిరుసు రెం – డు మహాస్త్రములను
ద్వాదశాస్త్రములచే – ధనువు మేనఁ ద్ర
యోదశాస్త్రము లేసి – యుబ్బడఁగింప
సారథి వోలిసి య – శ్వంబులు మడిసి
తేరు చెక్కలువోయి – దేహంబు వ్రస్సి
టెక్కెంబు విఱిగి ఖం – డితములై వింటి
చెక్కలు మహిఁగెడ – సినఁ దేరి చూచి
యిలకు లంఘించి యొం – డేమియు మదినిఁ
దలఁప కాయసగదా – దండంబుఁ దాల్చి
యెదురుగా నిల్చిన – ఋషులు దేవతలు
"నదిరయ్య! రాముబా – హా పరాక్రమము!"
అనివిమానములపై – నంజలి చేసి
కనుచుండ కోసల – కన్యకాసుతుఁడు
ఖరుని తెంపును భుజా – గర్వంబుఁ జలము
గరువంబుఁ దెలివియుఁ – గాంచి యిట్లనియె,

—: రాముఁడు ఖరునితో జతురోక్తులుగఁ
బరుషము లాడుట :—

" చతురంగ బలములు - సరస రా నీవు
ప్రతివాని నిలిచి నీ - పాపంబు చేత
నందఱు బొలిసిన - నటు నిటుఁజూడ
నెందు నెవ్వరు లేక - యేకాకి వగుచు
నిలిచితివింక నే - నెలవు జొచ్చెదవు
చలమేల! తొలఁగు మి - చ్చటికైనఁ బ్రతికి
క్రూరకర్మము సేయు - కుచ్చితుఁడెల్ల
వారలచే నప - వాదంబునొందు
జెడు నెంతవాఁడైనఁ - జెడక యుండుదురె!
కడు ద్రోహులైన రా - క్షస కులాధములు
నీచకర్మము సేయు - నెడవానిఁ బాముఁ
జూచినగతిఁ జంపఁ - జూతురందఱును
కామ లోభాదులఁ - గలుషముల్ సేయు
పామరు నట్టి పా - పంబులే చెఱచు
తెలియక వడగలు - దిని యందుచేత
నలికిరి పాములు - నశియించినట్లు
నిన్నాళ్లు నీవని - నెల్ల మౌనులను
వెన్నాడి చెఱచిన - వృజినంబు నీకు
ననుభవింపఁగ దరి - యయ్యె నందేమి
యొనఁగూడె లాభ మ - య్యోవారిఁ జెఱుప ?
నేరెండివోయిన - వృక్షంబు వడిన
మేర నీ మేను భూ - మిని వ్రాలఁగలదు
ఋతు ధర్మములనెల్ల - వృక్షముల్ ఫలము

లలితశయముగఁ గాంచు - నట్టి చందమునఁ
జేసిన కర్మరా - శికిఁ దగుఫలము
లాసన్న గతిఁబొందు - నవి కాలవశత
జనుల విషాన్నభో - జనమునుఁ బోలి
చెనఁటి కర్మము చంపు - శీఘ్రకాలమునఁ
బుడమికి నప్రియం - బులు చేసినట్టి
జడమతులనుఁ బట్టి - సంహరించుటకు
రాజునై యట్టి భా - రముఁబూని మాని
రాజఁబోషింప దీ - రక వచ్చినాడ?
కలితసౌవర్ణ పుం - ఖంబులైన వింట
వెలువడు నట్టి నా - విశిఖరాజములు
పుట్టలోఁ బాములు - వోయెడు రీతిఁ
.నెట్టుక నీమేన - నేఁడు దూరెడును
మున్ను నీచేఁదుది - ముట్టినవారు
చన్న త్రోవనె నీవు - చనుదువుగాక!
నీవె చంపిన మాని - నిచయంబు మింటి
త్రోవ విమాన పం - క్తుల నేఁగు వారు
పడుమంచు నరకకూ - పంబుల నీవు
పడఁజూచి యందఱు - పకపక నవ్వి
మూరు మోములు వెట్టి - మూలనిఁజూచు
మేరఁగేడింప ని - మ్మెయిఁ జేతుఁగాక!
తొలఁగ నీయక యొక్క - తూఁపుచే నీదు
తల తాఁటి పంటిచం - దంబున ధరణి
డొల్లక మునుపె తో - త్రోడఁ జేయుమ్ము
వెళ్లక మున్నుపె వే - వేగ నీచేత

నైన మాత్రము చూడు" - మనిన ఖలుండు
జానకీరమణు నెం - చక యిట్టులనియె

—: ఖరాసురుఁడు రామ పరుషోక్తులకుఁ
ప్రతివచనములు పలుకుట :—

"చిల్లరగాండ్లు వ - చ్చి దురంబులోనఁ
ద్రెళ్ళిరి నీచేతఁ - దేఁకువ మాలి!
యంతమాత్రనె బంట - వై ప్రల్లదంబు
లెంతయుఁబ్రోది నీ - వేల పల్కెదవు?
జగతి క్షత్రాచార - సంపన్నులగను
దగవాని తమ పోటుఁ - దమరె వాకొనఁగ
క్షత్రియాధములు లో - కమునందు తమరె
శత్రులనందఱి - జంపుదు మనుచుఁ
బరవకూఁతలు గూసి - పగవానిచేత
దురిములో మానంబుఁ - దూలపోవుదురు
యెవ్వాఁడు సంప్రాప్త - మృత్యుఁడౌ నతఁడు
ప్రొవ్వునఁ దన్ను న - ల్గురిలోనఁ బొగడి
హాతుఁడగుఁ బరచే - నగ్నివర్ణమున
క్షితి నెఱ్ఱనై యున్న - శిలకాల్పఁగలదె?
వడిగలతనము నీ - వంటి వానికినిఁ
బొడమునే? నిను నొక్క - పోటరి వనుచు
నెన్నువానికి భయం - బింతియే గాక
నిన్నుఁ బేర్కొనిన దా - నవుఁడేల వెఱచు?
నీవాడు మాటలె - నీదు లాఘవము

సేవగ నలుగురు - నెఱుఁగ బల్కితివి!
పర్వతంబునుఁబోలి - పటుగదాదండ
ధూర్వహాభుజుఁడనై - తోఁచి నీయెదురఁ
గదలక యముఁడున్న - గతి నిల్చునన్నుఁ
బదరి చూచియునిట్లు - భాషింపఁదగునె?
పలుమాటలేల నేల - బవరంబులోన
గెలిచి చంపుదు నిన్నుఁ - గేవలశక్తి
నినుఁడు గ్రుంకిన మన - యిర్వురి పోరు
కొనసాఁగి కనరాదు - గొబ్బున నిపుడె
జయమందు వాఁడ నీ - సమరంబులోన
భయమేది యణఁగిన - పదునాల్గువేలు
దానవులకు వారి - తరుణులు హితులు
దీనులై శోకింపఁ - దేఱ కన్నీరు
నినుఁజంపి యూరార్చి - నిలుపుదుఁజూడు"

—: ఖరుఁడు రామునిపై గదను ప్రయోగించుట :—

మని యుఱుముక వచ్చు - నశనియె పోలు
చేగదయెత్తి యా - ర్చి యణంగుమనుచు
వేగించె ద్రిప్పి బ - ల్విడిఁ బ్రయోగింప
నది వచ్చి వనభూరు - హశ్రేణి నెల్ల
నదమదంబుగఁ గొట్టి - చరముక పాఱి
పై రాఁగ నొకకొన్ని - బాణంబు లేసి
యారాముఁ డదిపొడి - యైపోవఁజేయ
మంత్రౌషధముల సా - మర్థ్యంబుచేత

సంత్రాసమతి వ్యాళి - సమసిన యట్లు
గద వడిపోవనా - గద యనిదైత్యుఁ
డెద వడఁకటునిటు - నీక్షింపఁజూచి
చిఱునవ్వు మొగముఁగై - సేయఁజేచాఁచి
ఖరునితో వీరశే - ఖరుఁ డిట్టులనియె
"ఇదిగదా! యాస్తి నీ - కిప్పుడు నిట్టి
గదపోయె, శక్తియె - క్కడిది పోరాడ!
ఈపాటివాడ వి - క్లేల గర్వోక్తు
లీపౌరుషపుమాట - లిపుడు వల్కితివి
చచ్చిన వారల - సతుల కన్నీరుఁ
దెచ్చిన మాన్పఁగఁ - దీరునే నీకు!
కల్లలాడుదురె? రా - క్షసులెందునైన
చెల్లరే! కులమెల్లఁ - జెఱచితి నీవు!
నీచుఁడవైతివి - నీదు ప్రాణములు
నాచేతి శరములుం - డఁగనీయ విపుడు!
అమృతంబు గరుఁడఁడు - హరియించినట్టి
క్రమమునఁ బోనీక - కైకొనుఁగాక!
నీతల ఖండింప - నిగుడురక్తమున
భూతకోటులనుఁ దృ - ప్తులఁ జేయు వాఁడ!
చక్కని జవరాలి - సందిటిలోన
జొక్కి రతిశ్రమ - సుఖపరవశత
నిదురించుగతి నస్త్ర - నిహతిచేఁబెద్ద
నిదురఁగైకొన ధాత్రి - నినుఁద్రెళ్లనేతు!
ఆమీఁద నీయాత్ర - మా వాసులకును
క్షేమంబు లొసఁగి మా - సీమఁజేరుదును

ఏను జనస్థాన - మింకఁ బాడుచేసి
మానుల కిచ్చిన - మాట నిల్పుదును
దనుజకామినుల రో - దనములు వినుచుఁ
గనుగన్న గతిఁ బారఁ - గాఁ దఱుముదును
నీకులకాంతలు - నీమీఁద వ్రాలి
శోకింపుచుండ నేఁ - జూచుచుండుదును!
క్రొవ్వి బ్రాహ్మణకంట - కుఁడవైన నీకు
నెవ్వరు వెఱతురో - యిన్నాళ్లు నిచట
నట్టివారల యజ - నాది కర్మములు
నెట్టుక నీడేర్ప - నిన్ను వధింతు!
పోయెదవన నెందు - పోనిత్తు? నెటకుఁ
బోయెద" వని పల్క - బొమముడితోడఁ
గిటకిట యన పండ్లు - గీఁటుచు నలిగి
కటములు మిగుల ను - త్కటముగా నదుగఁ
బొడవైన యొక మహా - భూజంబు వెఱికి
యడుగుల ధారణి - యల్లాడ నడఁచి
"చావుపొమ్మని" వైవ - జానకీరమణుఁ

—— రాముడు ఖరునిఁ జంపుట :——

డావంతయుఁ దలంక - కానుగంబులనుఁ
బొడిపొడిచేసి యా - భూమీరుహంబు
నడుమనే తునిమి క - న్గవ జేగురింప
వేయు తూపుల దైత్య - వీరుని యురము
గాయముల్ సేయ ర - క్తంబులు దొరగ
సెలయేరులనుఁ బోల్చు - జేగురు కొండ

యలవున గదురు కం - ఖమరులం దరుమ
నెదురుగా రాఁగపై - నెగయు దుర్గంధ
మెద నేవగించి మ - హీసుతా విభుఁడు
వెనువెనుకకుఁబోయి - వీతిహోత్రునకు
నెసవచ్చు తనకింద్రు - డిచ్చినయట్టి
బ్రహ్మాండవిభవుప్ర - భావమౌ నొక య
జిహ్మాగంబున రొమ్ము - చినుఁగ వ్రేయుటయు
హరునిచేఁగూలిన - యముని చందమున
హరిహయు ఘోరవ - జ్రాహతిఁబడిన
బలవృత్ర నముచుల - పగిది నద్దనుజుఁ
డిల మీఁద వ్రాలిన - యెడ బ్రహ్మర్షులు

—: దేవతలు శ్రీరాముని గీర్తించి
పుష్పవృష్టి గురియించుట .—

రాజర్షి వరులను - రణభూమి జాన
కీ జానిఁ గనుఁగొని - కీర్తనల్ చేసి
శ్రీరామ! వీఁడు చే - సిన యుపద్రవము
లోరువలేక యిం - ద్రోపేతముగను
నేమెల్ల శరభంగు - నింటికి వచ్చి
యీమాట లాడుచో - నింతియు నీవుఁ
దమ్ముఁడు డాఁజూచి - తఱిగాదటంచు
నమ్మౌనియును మేము - నాలోచనములు
జేసి యింద్రునితోడ - శీఘ్రవేగమునఁ
బాసిపోయితిమి పు - ష్పకముల మీఁద
మునులెల్ల నిది కార్య - ముగ నెలయించి

నిను దెచ్చి రిచటికే - న్నియుపాయముల
మాయాపదలు దీరె - మానుల కెల్ల
నీ యాశ్రమములందు - నిడుమలు మాని
నీదండకాటవి - నెల్ల మానులును
వేదోక్తకర్మముల్ - వెలయఁ జేయుదురు"
అనునంత జడివట్టె - నరుల వాన ,
తనియించెఁ జెవులుగం - ధర్వగానములు ,
తులకించె దివిజదుం - దుభినాదంబు ,
విలసిల్లె నచ్చర - విరిఁబోండ్ల యాట ,
మలసెఁ జందనశైల - మారుతాంకురము
పొలిచెను విల్లెత్తు - పొడవుచే ధరణి ;
అపుడు వేల్పులు రాము - నాశీర్వదించి
కపటదైత్యులు మూఁడు - గడియలలోన
నీరాముచే గ్రుగ్గి - రెల్లరు ! నాది
నారాయణుఁడయి మా - నవమూర్తిఁ దాల్చి
యితఁడయ్యెఁగాఁబోలు - నిఁక మంటి మనుచుఁ
గ్రతుభుజులెల్ల స్వ - ర్గమునకుఁబోవు
నావేళ లక్ష్మణు - డనలగహ్వరముఁ
దావెలువడి మహీ - తనయఁదోకొనుచు
నారాహవాసులై - నట్టిసంయములు
జేరి వెంబడి రాఁగ - శ్రీరాముఁజూచి
సౌమిత్రి సంతోష - సహితుఁడై పొగడ
భూమీసురస్తుతుల్ - పుడమిపై నిండ ,
" మునులనుఁ జేపట్టి - మొనలకు నడచి
దనుజులఁ దునిమియెం - తటిధన్యుఁడయ్యె !

కనుచాటు లేక సౌ - ఖ్యంబుతో నెపుడు
మనుఁగాక నాస్వామి - మహి నెల్లనాఁడు!"
అనుచు సిబ్బితితోడఁ - బ్రాణేశువదన
వనజంబుఁజూచి భా - వము పల్లవింపఁ
జేరి కౌఁగిటఁజేర్చి - శ్రీరాము మరియుఁ
దేరి కన్గొనుచు నెం - తే మదిమెచ్చి
యతిమానుషంబైన - యాత్మేశు శౌర్య
మతిశయంబని మెచ్చి - యడుగుల వ్రాలి
లేచి క్రమ్మరఁగ నా - లింగనసౌఖ్య
వీచులఁ దేలి య - వేల ప్రమోద
వారాశి నోలాడు - వసుమతీతనయఁ
జేరనక్కునఁ జేర్చి - శ్రీరామవిభుఁడు
మానులఁ బనిచి ల - క్ష్మణుఁడును దాను
నానందరసమగ్నుఁ - డై యున్నయంత

— అకంపనుఁడు రావణుని సముఖమందు
శ్రీరామ పరాక్రమము నుగ్గడించుట —

అప్పు డకంపనుఁ - డనెడి రాక్షసుఁడు
"చుప్పనాతిని ముక్కు - సోణాలఁ దాఁకఁ
జెక్కి దానికి వహిం - చికొని పోరాడు
రక్కసులను ద్రుంచి - రాక్షసప్రభుల
ఖరదూషణాదుల - ఖండించి నపుడె
సురవైరులకుఁ దల - చూపరాదిచట
నీజనస్థానమిం - కెవ్వ రేలుదురు!
రాజనెవ్వనిఁగాఁగ - రావణాసురుఁడు

నియమించునోపోయి - నేఁదెల్పుకున్న
పయికార్యమతనికే - ర్పడియుండ" దనుచు
లంకకు వీతక - లంకకు వాఁడుఁ
గొంకుచు దశకంఠు - కొలువున కేఁగి
"దనుజేంద్ర! మనజన - స్థానంబు లోని
దనుజులందఱు రణ - స్థలములోఁ బడినఁ
దప్పించుకొని నీప - దమ్ములఁ జూడ
నిప్పుడొంటిగ డాఁగి - యేను వచ్చితిని
చిత్తంబులో వల - సినయట్లు జూడుఁ
డిత్తరి" యనుమాట - యెప్పుడు వినియె
నప్పుడే కోపించి - యాపంక్తిముఖుఁడు
రెప్పవేయక వాని - దృష్టించి పలికె
"చాలించురోరి! పి - శాచప్రచార!
యేలదబ్బరలాడ - నిట్లు నాయెదుర?
పట్టుచుఁ బట్టుక - పాడయ్యె నంటి
వెట్టుజనస్థాన - మిందఱు వినఁగ?
అదియేల నిట్లయ్యె? - నసురలనెల్ల
వెదకి చంపిన యట్టి - వీరుఁడెవ్వాఁడు?
వానికెవ్వఁడు దిక్కు? - వాఁడు ప్రాణముల
తోనెట్టులుండు నిం - దుఁదిగిన యపుడె?
బ్రదుకనొల్లక యింత - పనిసేయువాని
బ్రదికింపనేర్తురే - బ్రహ్మాదిసురలు!
నాకప్రియముఁ జేసి - నలినాక్షుఁడైన
నాకేశుఁడైనఁబి - నాకి తానైన
ధనదుఁడైనను యము - ధర్మరాజైన

మననెట్లు నేర్చు నే - మరుమొగంబిడినఁ
గాలునికిని నేను - గాలుండ! కీలిఁ
గీలికి! మృత్యువుఁ - గెడపమృత్యువను!
తనప్రతాపంబుచేఁ - దరణిఁబావకులఁ
బొనిగింతు! వాయువుఁ - బోలి క్రమ్మరుదు!
నిజమాడు మేఁటికి - నీమది భీతి?
రుజచేతఁగల్లలా - రోపించి పలుక!"
అన నకంపనుఁడు ద - శాననుఁజూచి
వినయపూర్వకముగా - వినునుంచుఁబలికె.
"దశరథసుతుఁడు ప్ర - తాపభాస్కరుఁడు
శశిబింబవదనుఁడా - జానుబాహుండు
జితవైరివీరుండు - సింహాసంహననుఁ
డతిలోకుఁడఖిల క - ల్యాణశీలుండు
రాముఁడు దండకా - రణ్యంబులోన
నేమిటికో వచ్చి - యెందరింజంపి
యచలుఁడై యున్నవాఁ - డతనితో నెదుర
నచలధన్వియునోపఁ - డని తోఁచె నాకు!"
అని పల్కునంత గా - లాహియుఁబోలి
కినిసి రోజుచు "నుడి - కించెదనన్ను!
రాముఁడెవ్వఁడు? వాఁడు - రణమెట్లుచేసె?
రాముని వెంబడి - రారుగా నేఁడు
నాయింద్రముఖ్యనా - నామరశ్రేణి
యీ యర్థమంతయు - నెఱిఁగింపు మనిన
ముమ్మాఱుగా దశ - ముఖుఁడేఱిచూచి

క్రమ్మరఁజేరి య - కంపనుఁడనియె.
"విలువిద్యయందుఁ బ్ర - వీణుఁడు రాముఁ
డలఘుసాహసుఁడింద్రు - నంతటి వాఁడు
కారుణ్యశరధి య - కల్మషాత్మకుఁడు
సారసాక్షుఁడు సర్వ - సముఁడు ప్రాజ్ఞుండు
నతని తమ్ముఁడు నస - మాధిక శౌర్యుఁ
డతని లక్ష్మణుఁడని - యందురు పేరు.
అన్నతో సరియైన - యతిబలశాలి
యన్నిట మేటి దే - వావళికన్న
ననిలునితోఁగూడు - నగ్ని చందమునఁ
దన సహోదరుని ప్ర - తాపంబు చేత
రాముఁడున్నట్టి గ - ర్వముఁజూచి యింక
నేమిటి పౌరుషం - బెట్టి వారలకు ?
అతఁడు జనస్థాన - మారడిఁబుచ్చె
నతనిచే హతులైరి - యఖిల దానవులు
రామునికిని సంగ - రంబునఁదోడు
హేమపుంఖశరంబు - లింతియే కాని
కడమవారలఁజూచి - కానమవ్వేఁట
వెడలు తూపులు వహో - విషభుజంగములు
నెందెందు చూచిన - నెల్లరాక్షసుల
ముందఱ దోఁచురా - ముఁడు సమరమున
నింతటివానిచే - నీజనస్థాన
మంతయుఁ బాడయ్యె - నసురులు వడిరి."
అనిన రావణుఁడు దు - రాగ్రహంబొదవ

నని కేఁగి శ్రీరాము - నవనిఁగూల్చెదను
నిపుడెపోయెద నన్న - యెడ నకంపనుఁడు
కుపితాత్ము దశకంఠుఁ - గూర్చి యిట్లనియె.

— అకంపనుఁడు రావణునితో రాముని గెల్చు నుపాయము సీతనపహరించుటయే యని చెప్పుట —

"రాముని బలపరా - క్రమశక్తు లింత
సామాన్యమే! నీవు - శపథముల్ వలుక
శరములచే నదీ - సలిలప్రవాహ
ములనైన నొకతృణం - బుననిల్పగలఁడు!
అవని నక్షత్రగ్ర - హావళినైన
దివియైనఁగినిసి భే - దించు నమ్ములను!
పాతాళమునఁ గ్రుంగి - పడిపోవునట్టి
భూతలంబైన ని - ల్పును కరాగ్రమున!
జలములు లేకుండ - జలధులింకించు
జలముల నించుని - ర్జలవారినిధుల
నిల మిన్ను గావించు - నిల సేయు మిన్ను
నెల నినునిగఁ జేయు - నెల సేయు నినుని
పగలు రేలును రేలుఁ - బగలును జేయు
జగతిపై నతనికి - సాధ్యముల్ గలవె?
తలఁచిన విశ్వమెం - తయు వినిర్మించి
మలఁగించు విశ్వంబు - మాట మాత్రమున
నరికట్టు వాయువు - నల్లాడకుండ
గురిపెట్టు జమునిము - క్కున మషీ రేఖ!
ఇటువంటి రఘువీరు - నెదుర నీవొంటి

నెటుల పోయెదవంటి - నెఱుఁగ లేకుంటి!
సాటియే శ్రీరామ - చంద్రుతో నీవు
మాటలేఁటికి హస్తి - మశకాంతరంబు!
పోయితివే మోస - పోదువు ఖరుఁడు
వోయినట్లనె కాని - పోయి రారాదు!
పోరాదు నీకునేఁ - బోరానివాఁడె?
తీరని పనిగాన - తెలుఁపగా వలసె.
పాపకర్ములకు సు - పర్వలోకంబు
ప్రాపింపనటుల యా - భానువంశజునిఁ
జెనకిన వారికిఁ - జేకూడనేర
వనుపమ జయకీర్తు - లాపదల్ గాక
యాదండకావని - యందు కుండలిత
కోదండపాణి ర - ఘుశ్రేష్ఠుఁజూచి
యెదురింప నీవేల - యీజగత్రయముఁ
బొదివిన నొకతుణం - బున నీరు సేయ
నతని గెల్వఁగ నుపా - యము వేఱె కలదు
క్షితితనూజాత యా - సీత రామునకు
దేవేరి వెనువెంటఁ - దెచ్చుకొన్నాఁడు
దేవగంధర్వాది - తేయకామినుల
సరిలేరు జానకి - సౌందర్యమునకు
నరభామినులఁ దగు - నా సాటిసేయ
మదుని సమ్మోహన - మంత్రాధిదైవ
మరవిందభవుసృష్టి - నంటని ప్రతిమ!
లోచనానందక - ల్లోలవారాశి
యాచంద్రముఖి చెల్వ - మలవియే పొగడ

జానకీదేవి వం - చన మీఁదఁ బట్టి
తేనోపుదేని యం - తియె చాలు నీకు !
నాయింతి వేత్తైన - యపుడె రాఘవుఁడు
బాయ నేరక మేనఁ - బ్రాణముల్ విడుచు
నాకిది సరిపోయి - న తెఱంగు మీఁద
నీకు నే క్రియ దోఁచె - నేఁడట్లు చేసి
పగఁదీర్పు" మన విని - పంక్తి కంధరుఁడు
"తగు నీదు బంధుహి - తంబిది నాకు
నటుల సేయుద"మని - యంగీకరించె
నటునటు నాదినం - బంతయుఁదీర్చి

— శ్రీరామునిపైఁబగ దీర్చుకొనుటకై రావణుని
దండకారణ్య ప్రస్థానము.—

వేగినంత పటాణి - వేసడంబులను
వాగెలు గుదియించి - వలుదపగ్గముల
నొఁగల బిగించి ప - న్నుక నూతుఁడెదుర
గగవయానరథంబుఁ - గ్రక్కునఁ దేర
నా తేరిపై నెక్కి - యరుగ నారథము
శీతాంశుఁడంబుజ - శ్రేణిఁగన్పట్టు
తీరున వినువీధిఁ - దిగదిగ వెలుఁగ
మారీచదైత్యాశ్ర - మముఁ బ్రవేశించి
యతనిచేతను బూ - జలంది వాఁడిచ్చు
నతిశయభక్ష్యభో - జ్యాదులఁ దనిసి
వానితో నొకఘడ - వసియించి కొన్ని

లేని నెయ్యములుగ - ల్పించి భాషించి
యున్నాఁడ రావణు - నుల్లంబులోన
నున్నకీ లెఱుఁగక - యొంటిగా నితఁడు
తనయింటి కేపనిఁ - దలఁచియో వచ్చె
నని యెంచి మారీచుఁ - డతనికిట్లనియె.
"యేమిగార్యముగ నా - యింటికివచ్చి
తీమీర ననుచరు - లెవ్వారులేక ?
ఏమి సేయుదు నీకు - నేమి కావలయు
నేమి తలంచితి - వెఱిఁగింపు మనిన"
మారీచుకూరిమి - మాటల కలరి
యారావణుఁడు విన - యమున నిట్లనియె.
"ధరణీసురలకహి - తంబులు గోరు
ఖరదూషణాది రా - క్షసవీరవరులఁ
దడవుగా మనజన - స్థానంబు నందు
గడితాణాముగ నుండఁ - గట్టడ జేసి
యున్నది యెఱుఁగుదు - వో లేదొ ? యిట్టు
లున్నచో నిన్ననే - నొకవార్త వింటి
రామచంద్రుఁడు దశ - రథపుత్త్రుఁడొక్క
కామినితో దండ - కావని జేరి
కదనంబులోపల - ఖరదూషణాది
మదమత్తదనుజకు - మారవర్గమును
నారాచములఁగూల్చి - నాఁడందుకతన
నారాఘవుని దేవి - నపహరించెదను
అందుకు నీసహా - యము మదిఁగోరి
నందునవచ్చితి" - నని యప్డు పలికె

నప్పుడెగుండె ఝ - ల్లని తెల్విఁదప్పి
దప్పితో నాలుకల్ - దడిలేక భ్రమసి
పెదవులుఁ దడవుచు - భీతిచేఁజాల
నెదవడి మారీచుఁ - డిట్లని పలికె

—: మారీచుని హితోక్తులు :—

"సీతను దెమ్మని - చెప్పిన పరమ
పాతకుఁడెవ్వఁడా - పాలసబుద్ధి
వినియేల చెడనీకు? - వేగంబె వానిఁ
గినిసి దండించినఁ - గీడొంద వీవు!
అవని యరాక్షసం - బై పోవనిన్ను
నవివేకిగాఁ దన - యాత్మలోనెంచి
యెవ్వఁడింతకుఁదెగి - యెను? వానిఁదెల్పు
మివ్వేళఁ దగునాజ్ఞ - నేన సేసెదను!
పాముకోఱలఁ గేలఁ - బట్టుమన్నట్లు
పామరుఁడెవ్వఁడీ - పనికి నిన్ననిచె?
మిగులవేడుక కొమ్మ - మీఁదఁ గేలునిచి
తగ నిద్రవోవు నీ - తలఁగాలఁ దన్ని
యెవ్వఁడుబోధించె? - నెవ్వఁడు నీదు
క్రొవ్వాఱ మృత్యువు - కోఱలఁ ద్రోసె!
నాభిజాత్యంబను - నట్టి తుండంబు
నాభీలవిక్రమం - బనునట్టి మదము
గంధసింధురము నొ - క్కఁడు జేరి దుర్మ
దాంధుఁడై చెడిపోవు - నాతఁడున్నాఁడె!
ధానవమృగములఁ - దరమి వధింప

దానఁ బొల్పడి శస్త్ర - తతి గోళ్లుగాఁగఁ
గోటలస్త్రములుగా - గురుశౌర్యదేహ
సారంబుతో నొప్పు - జానకీరమణ
పురుషసింహము నిద్ర - వోవఁగ నెవ్వఁ
డురక మేల్కొలిపి మృ - త్యువుచేతఁ జిక్కు
విల్లను మకరంబు - విశిఖంబులను క
రళ్లను శౌర్యదు - ర్వారపంకంబు
వలనొప్పు సమరప్ర - వాహవేగంబు
నలరు రాముని పేరి - హ్రదములోఁ జొచ్చి
సుడిఁజిక్కి యెవ్వఁడు - సుడివడఁజూచు
నడలని కాలపా - శములకుఁ జిక్కు ?
కావున నీబుద్ధి - కాదయ్య నీకు '
రావణ ! కులమెల్ల - రక్షింపు మీవు
ఎందఱు లేరు నీ - కింతులు ! వారి
యందాల రమియింపు - మరుగుము మఱలి
రాముని దేవి ధ - రాపుత్రి మనుజ
భామిని నీకేల - పతితోడఁగూడి
దండకావనుల ఖే - దంబులు దీరి
యుండగానిమ్ము మీ - యూరికిఁబొమ్ము
నామాట విను" మన్న - నమ్మికచుట్ట
మీమేరఁ బలుకుటల్ - హితమని యెంచి
యప్పుడే మఱలి మ - హారథంబెక్కి
యప్పురంబునఁ దాల్మి - యుల్లంబుఁ బేర్చి
తనదు లంకారాజ - ధానికిఁజేరి
దనుజులు భజియింపఁ - దానున్న యంత

—: రావణుని యెదుట శూర్పణఖ ప్రలాపించుట :—

అపుడు శూర్పణఖ మ - హారోదనంబు
విపుల చలింపఁ గా - వింపుచు వచ్చి
దనుజుల నెల్ల నిం - తటి వేగిరమున
దునుమునే ! యమునిసై - దోడైనవాఁడు
రాముఁడీతని పరా - క్రమము దానవుల
దోమలఁబొగవోలి - త్రుంగించె నిపుడు
నిది తమయున్నతో - నెఱిఁగింతు ననుచు
నదివచ్చి లంక భ - యంకరవికృత
రూపిణియై చొచ్చి - రుచిరసింహాస
నోపరి దేవేంద్రుఁ - డున్న చందమున
భానుమండల విభా - భాసురదివ్య
నానామణి విభూష - ణములు రాణింప
ననుపమబలులు ప్ర - హస్తాదులైన
యెనమండ్రు మంత్రులు - హితవృత్తిఁగొలువ
దిగదిగ వెలుఁగుచు - దీప్తార్చు లడరఁ
బొగలేని వహ్నిపెం - పుననున్నవాని
పాకారి ముఖ్యది - క్పతు లాహవమున
డాకొని తేరిచూ - డఁగరాని వాని
శతకోటి తవభుజ - స్థలముపై నాఁటు
కతకునఁ జీరయా - గాయంబు వాని
తనమేన నైరావ - తము కుమ్ముకత్తి
పెనుగంటు పైసరుల్ - పెనఁగొన్న వాని
పదితల లిరువది - బాహువుల్ దిశలు
పదియునుఁ గబళింపఁ - బనిగొన్న వాని

వెలుపైన యురముపై - వేల్పుమిటారు
లలఁదిన కుంకుమ - యసలొప్పు వాని
లలితమహారాజ - లక్ష్మణచిహ్న
ముల నొప్పు నవయువం - బుల మీఱు వాని
బారుదీరిన యట్టి - భానుబింబముల
తీరెచ్చు కోటిర - దీప్తుల వాని
గురుతరవైడూర్య - కుండలప్రభల
మెఱుఁగుఁ జెక్కులు జాజు - మెఱయించు వాని
నంజనాచల నిభం - బైన గాత్రమున
సంజకెంజాయ వ - స్త్రముఁదాల్చు వాని
కలనిలో విష్ణుచ - క్ర ప్రహారముల
గళములయందు రే - కలు మించు వాని
కులశైలపంక్తి ను - గ్గుగఁజేయ సప్త
జలరాసులు గలంపఁ - జాలిన వాని
తనపేరు విన్నట్లం - దారకశ్రేణి
మునముల మనునాగ - మూన్చిన వాని
పడిగలవాని యే - వలన ధర్మములఁ
జెడజూచువాని నూ - ర్జితశక్తి వాని
సమరగంధర్వ వి - ద్యాధరయక్ష
రమణులఁ దెచ్చి కా - రల నుంచు వాని
పరకామినుల మీఁది - బాళిచే నొక్క
తరినైనఁదనివి నొం - దకయుండు వాని
జపము లధ్యయనముల్ - సవనముల్ ఘోర
తపములుఁ జేయుచిం - తమెలంగు వాని
భోగవతీనామ - పురికేఁగి భయద

నాగలోకముల ను - న్న ఫణీంద్రవరుల
వాసుకితక్షక - వ్యాళులఁ గెలిచి
యీసున దక్షకు - నిల్లాలి దెచ్చి
డక్కఁగొనంగి వా - టకశాలలోనఁ
జొక్కుటాటలు నేర్పి - చూచినవాని
కైలాసమున కేఁగి - కలనఁ గుబేరుఁ
దోలి పుష్పకము నె - త్తుకవచ్చువాని
పృథుశక్తిఁ దరువులు - పెకలించి చైత్ర
రథము నందనముఁ జూ - ఱలు వుచ్చువాని
తరణిచంద్రగ్రహ - తారకావళులఁ
గలములఁబట్టి న - ల్గడ వ్రేయు వాని
పదివేలవర్షముల్ - బ్రహ్మనుఁగూర్చి
మది సదరక శిరో - మాలికల్ దునిమి
హుతవహులో వ్రేల్చి - యూర్జితస్థితులు
నతిశయ వరములు - నందినవాని
మనుజులు దక్క నే - మగవారిచేతఁ
దనకు నాశము లేని - తపమూనువాని
బ్రహ్మవిద్యానిధిఁ - బరమసాహసుని
బ్రహ్మణ హింసలఁ - బాల్పడు వాని
క్రూరుని కఠిను మూ - ర్ఖుని దురాచారు
ధీరుఁ గృతఘ్ను నా - స్తికు మదోన్మత్తు
దయలేనివానిఁ గ్రో - ధమునుఁ గామంబు
సయిదోళ్లుగా ధాత్రి - జల్లించువాని
దిగధీశులనుఁ జెక్కి - తీర్చిన చరణ
యుగళమంజీరంబు - లొప్పెడువాని

బృందారకేంద్రు నూ - రించు నమూల్య
చందనవస్త్ర భూ - షల మించువాని
చంద్రప్రభాచాక - చక్యంబు దొలఁకు
చంద్రహాసము కేల - సవరించువాని
లోకభీకరునిఁ ద్రి - లోకకంటకుని
బ్రాకటజయశీలుఁ - బౌలస్త్యు నుగ్ర
భావను మయసుతా - ప్రాణవల్లభుని
రావణు లోకవి - ద్రావణుఁ జూచి
సిగ్గెఱుంగక ముక్కు - చెవులునుఁ బోయి
బొగ్గువంటి శరీర - మున, బీటలెత్తి
తులకించి రొంపిని - త్తురు గొలుచేతఁ
గొలువువారెల్ల ము - క్కులు మూసికొనఁగ
గద్దరియై మంత్రి - గణములోఁ బెద్ద
గద్దియ నున్న రా - క్షసరాజుఁ బలికె

-. శూర్పణఖ రావణుని నీతి రాహిత్యము నధిక్షేపించుట :—

“ అసురనాథ ! భో - గాసక్తిచేత
నాసన్నమృత్యుభ - యంబుఁ గల్గియును
మత్తుండవై మేను - మఱచి యేమియును
జిత్తగింపక యుపే - క్షించి యున్నావు !
గ్రామ్యంబులైన భో - గంబులఁ దవిలి
సామ్యవర్తనల మిం - చకయుండెనేని
యతని నెల్లరు స్మశా - నాగ్నియె పోలె
హితుఁడని యెంచక - యెడసి పోవుదురు
తగునట్టి కార్యంబుఁ - దగినట్టి వేళ

తగఁదీర్పఁడేని యా - ధరణిపాలకుఁడు
గార్యహాని యొకఁడె - కాక తానందు
నార్యులు నిందింప - నల్పుఁడై సమయు
తానస్వతంత్రుఁడై - ధరయేలునట్టి
వాని రాజనుచు న - వ్వరుఁ జేరఁబోక
గజములు బంకసం - కరపల్వలమును
త్యజియించుగతి పాయుఁ - దలఁతురుల్లముల!
తనప్రభుత్వమునకుఁ - దాఁగర్తగాని
మనుజనాథుఁడు వార్థి - మధ్యంబునందుఁ
బడియున్న శైలంబు - పగిది రూపేరు
పడక మెల్లనె పద - భ్రష్టుఁడైపోవు!
దేవతలెల్ల " నెం - తే యల్పుఁడయ్యె "
రావణుఁడన నెట్లు - రాజ్యమేలెదవు?
బుద్ధిలేదేని ప్ర - భుత్వంబును నీకు
సిద్ధింపనేర్చునే - శిథిలమౌ కాక?
భండారమును మంత్రి - బలము చారులును
మండలాధీశ్వరు - మనసు వెంబడిని
నడవకుండిన వారి - నరపతిత్వంబు
లడవిగాసిన వెన్న - లై పొల్లుపోవు!
దూరపు కార్యముల్ - తోఁచుట నృపులు
చారులచే దీర్ఘ - చక్షువులైరి!
అట్టియోజనలేని - యధముఁడు ధరణి
యెట్లు బోషించు? వాఁ - డేమిటిరాజు!
నీకిట్టి ధరణీశ - నీతిమార్గంబు
లేకున్నకతనఁ గ - ల్గెను వంశహాని

నీజనస్థానంబు - నీదు సోదరులు
రాజమాత్రునిచేత - రణభూమిలోన
పాడరి హతులైన - పట్టునఁదేరి
చూడకయది చెవిఁ - జొనుపకయున్న
దిక్కు లేదనుచు దైె - తేయుల నొకరిఁ
జిక్కకుండఁగ సుర - శ్రేణి దండించు
దశరథసుతుఁచే - దండకావనము
కుశలంబు నొంది నీ - క్షోణికి నెల్ల
పోనివచ్చిన కార్య - మది నీకుఁదెల్పు
మానిసి కరవుగా - మహిఁనేలినావు!
అదిగాక యిట్టి కా - ర్యము నీవు వినియు
నెదవడి నీచేత - నేమియుఁగాక
యున్నావొ! నాకేమి - యును మదిఁదోఁచి
యున్నకార్యంబుగా - దొక మాట వినుము
చెడుబుద్ధివాని కొం - చెపుటీవివాని
జడుని లోభిని దుర్వ్య - సనుని శఠుని
రాజని మెంచరు - ప్రజలు దుర్నీతి
రాజమాత్రులు ప్రజా - రంజన పరులె!
గణుతింపఁ బ్రజపట్టు - గలుగని రాజు
తృణమాత్రుఁడతనిచే - తికి నెట్టి పనులు
చేకూడనేర్చునే! - చిల్లపెంచులను
పాకంబు చెసి యెండఁ - బారుకాష్ఠములు
గరికిపోచలు వాయు - గతి మహీరజము
పరిజనంబులను చే - పట్టని దొరయు
నొక్కచందము కాన - నొక కార్యమునకు

నెక్కడ గురిసేసి - యెంచ రెవ్వరును
ముడిచిన పువ్వులు - మునుముట్టఁగట్టి
విడిచిన మైలయు - విడిచిన యట్లు
మొదట సమర్థుఁడై - మున్నట్టి పెంపు
వదలిన రాజునె - వ్వరు వగలుదురు
ధర్మశీలుండు కృ - తజ్ఞుండు వైరి
మర్మభేదనుఁడు క్ష - మాసత్త్వధనుఁడు
నగునట్టి రాజు సే - యకయుండి సేయు
తగవుగా సకలయ - త్నములు జేకూడు
యోగనిద్రారతి - నుండు నీశ్వరుఁడు
జాగరూకతఁ బ్రపం - చముఁ బ్రోచినట్టు
లీగుణంబులు గల్గు - నృపుఁడు పూజ్యుండు
వేగులచే నెల్ల - వృత్తాంతములునుఁ
దెలియక మందబు - ద్ధిని ధాత్రియేలఁ
దలఁచిన నీకు ప్ర - తాప మెక్కడిది"!
అని శూర్పణఖపల్క - నామాటలెల్ల
విని రావణుఁడు చాల - విన్ననైయుండి
వంచిన తలలెత్తి - వదరెడుదాని
కించు వాక్యములాల - కించి యిట్లనియె.
"రాముఁడెవ్వఁడు? ఘోర - రణమెట్లు చేసె?
నేమిటికై వచ్చె - నీయడవులకు?
నేరీతిఁ గెలిచె? నె - య్యేవి సాధనలు?
వేరువేరుగ నాకు - వినిపింపు" మనిన
దానవి పంక్తికం - ధరుఁజూచి యెల్ల
దానవుల్ వినుచుండ - తానిట్టులనియె.

—: శూర్పణఖ శ్రీరామాదుల సౌందర్య పరాక్రమములను వర్ణించి, సీతనపహరించి పగసాధింప బుద్ధి చెప్పుట .—

ఆజాను దీర్ఘబా - హాయుగళుండు
రాజీవనేత్రుఁడు - రవికులోత్తముఁడు
నారచీరలుగట్టి - నాఁడు చెల్వమున
మారునితో మారు - మసలెడు నాఁడు
దశరథరాజనం - దనుఁడు రాఘవుఁడు
శశివదనుండు రా - క్షసుల మర్దింప
బంగరు కట్లచే - బలునారి మెఱయు
సింగాణి విల్లు ప - సిండి పుంఖముల
మీఱు లకోరీల - మిఱిమిట్లు గొనఁగఁ
క్రూరసర్పంబుల - కొమరగ్గలింపఁ
గరముచాచుట నిషం - గంబుఁ దూపులునుఁ
దొరగించుటయు వింటఁ - దొడుగుట పగర
గుఱిసేసి వ్రేయుటఁ - గోరి వీక్షింప
నెఱుఁగఁగ రాకయ - నేక బాణములు
యిలయు నింగియు నిండి - యింద్రుండు గురియు
శిలలు సస్యంబులఁ - జెఱిచిన యట్లు
దనుజుల నొక ముహూ - ర్తంబులోఁ దునిమి
మనజనస్థానంబు - మహిఁబాడుచేసె !
జానకీపతి పాద - చారియై తిగ్మ
భానుని కైవడి - పదునాల్గు వేల
దనుజ వీరులనుఁ జే - తడి యాఱకుండ
దునిమి ఖరాదియో - ధుల సంహరించి
చెక్కు చెమర్పక - చింతిల్లుచున్న

సక్కఁడి మానుల - కభయంబు లిచ్చి
యూఁటదానిని దీని - హతము సేయంగ
నేఁటికి వలదని - యిటుసిగ్గు చెఱిచి
విడిచి పొమ్మన్న నీ - వేదిక్కు గాన
వెడలి వచ్చితిసురల్ - వీక్షించి నగఁగ !
అన్నిగుణంబుల - నాతన తమ్ముఁ
డన్నకు సరివచ్చు నట్టి - యుత్తముఁడు
తమ్ముఁడు చెలికాఁడు - దాసుఁడు హితుఁడు
నమ్మిన వాఁడాయె - నయొ రాఘవునకు
ననుకూల శీలయా - నాయన భార్య
తనరు సీతయనంగ - దరలాక్షి యొకతె !
చక్కని నెమ్మోము - జాబిల్లి రేక
నొక్కులు దిద్దునె - న్నుదురును మేల్మి
బంగరు నిగ్గులు - పచరించు మేను
సింగపునడుము రా - జీవపత్రముల
నిరసించు కన్నులు - నెఱివంక బొమలు
గరువంపు నవ్వు ను - త్కటకటీరంబు
జక్కవగుబ్బలు - సంపంగి చెక్కు
ముక్కును వలమురి - మురువైన గళము
తుమ్మెదకురులు చే - తుల సోయగంబు
కెమ్మోవి చెలువందు - కిసల హస్తములు
కెందమ్మి యడుగులు - గిలగిల మొరయు
నందెలు మణికంక - ణాంగదంబులును
జెలునొప్ప నాసాధ్వి - శ్రీమహాలక్ష్మి

పొలుపున గిరిరాజ - పుత్రివై ఖరిని
వనదేవత యనంగ - వారిజాసనుని
వనితకై వడి జగ - ద్వర్ణిత యగుచు
నెక్కడి సురకాంత - లేడయప్సరస
లెక్కడి యహికన్య - లెందుకువారు!
వారిసౌందర్యము - వ్వనజాక్షి కాలి
గోరునకైనం ద - క్కువ నిక్కువంబు!
తగు నీకు సీత సీ - తకు నీవు దగుదు
వగణిత భోగభా - గ్యాకారములను!
అటువంటి సతి యింద్రు - నంతటి వాని
కెటువలె దొరకు! న - య్యుగురాకుఁ బోఁడి
నరుని వెంబడిగహ - నంబుల వెంటఁ
దిరుగునే! యనితోడి - తెచ్చినే నీకుఁ
గానుకఁ జేసి నే - గలిగిన ఫలము
నీ నెమ్మదికి నింపు - నెలకొల్ప వలయు
నని మెంచి పర్ణశా - లాంతరంబునను
జనకజతోడఁ బ్ర - సంగంబు జేసి
యేకాంతమున నీయ - హీనశౌర్యంబు
నీకల్మియును వితీ - ర్ణియుఁ జెలువంబు
మరులు పుట్టఁగఁ బల్కి - మదినీయ కొలిపి
తరుణినే దెచ్చు మం - త్రము భిన్నమైన
నారామసోదరుఁ - డరికట్టి నన్ను
పారిపోఁగనీక - బ్రతిమాలుచుండఁ
జెవులును ముక్కుఁగో - సెను! నీసిమిత్త
మవమానములకెల్ల - నాలయంబైతి!

సీతను నీవు చూ - చిన వలరాజు
హేతికి లోనుగా - కెట్లు దాళుదువు!
ఆమానవతి మీఁది - యాస గల్గినను
తామసంబేల నీ - తనిఁగుడికాలు
ముందుగానడపుము - మూఁకలఁగూర్చి!
సందడి సేయకు - సన్నకుసన్న
మాయావివై పోయి - మఱలినగాని
నీయత్నమంతయు - నిష్ఫలంబగును!
నీ వొక్కఁడే యేల - నినువంటివారు
వేవేలు గూడిన - విల్లందెనేని
రాముని ఘోరనా - రాచదావాగ్ని
చేమాడి పోకేమి - సేయంగ వచ్చు!
నిదుర వేళలనైన - నీవు శ్రీరాము
నెమరక మాయచే - నెలయించియైన
నొంటరిఁగానున్న - యుర్వీజఁబట్టి
యింటికిఁ దెచ్చుకొ - మ్మిది బుద్ధినీకు
నీదుశక్తి యెఱింగి - నేఁడేఁగి రాము
పైదలిఁ గొనివచ్చి - భార్య సంపదల
నాకొమ్ము నీకు ని - ల్లాలుగా సుఖము
జేకొమ్ము! నీకుఁదోఁ - చినయట్లు పొమ్ము"

—: రావణుని రెండవమాఱు దండకావన ప్రస్థానము :—

అనవిని రావణుఁ - డౌఁగాక యనుచుఁ
జనియెదనని యాన - శాలకు నరిగి
యేకతంబున నమ్యు - లెఱుఁగక యుండ

రాఁగొట్టి తగినసా - రథిఁ జేరఁ బిలిచి
రథమిచ్చుటకిఁ గోని - రమ్మన వాఁడు
పృథువేగ మొప్ప ని - ల్పినఁ దేటి చూచి
కామగంబును మణి - గణవిభాదివ్య
ధామంబు దనుజవ - క్త్ర ఖరాన్వితంబు
నగు తేరిపై నెక్కి - యర్ధరాత్రమున
గగనమార్గంబునఁ - గదలి శీఘ్రమున
ధవళాతపత్రంబు - దశశిరోభాగ
రవిభాసమాన వ - జ్రకిరీటములును
నెఱితావిదిశల నిం - డిన పారిజాత
సరములఁ బొలుచు వి - శాల వక్షంబుఁ
జళచళ ల్వెదచల్లు - చలువదువ్వలువ
నకళంకరుచి చంద్ర - హాసంబు మెఱయ
మెఱుపులు గల నీల - మేఘంబు పోలి
ధరణికి డిగ్గి యా - దశకంధరుండు
నెడనెడనున్న మ - హీధరావళియు
నుడివోని ఫలముల - నొప్పు వృక్షములఁ
జలువనీటి నెసంగు - జలజాకరముల
నలరెడు మౌనుల - యాగవేదికల
నారికేళరసాల - నారంగవకుళ
భూరుహానీరంధ్ర - పుణ్యాశ్రమములుఁ
బన్నగగంధర్వ - పక్షికింపురుష
కిన్నరమిథున సం - కీర్ణకుంజములు
వాలఖిల్య మరీచ - వైఖానసౌఘ
లాలితపర్ణశా - లా ప్రదేశములు

వీణాది సంగీత - విద్యలచేఁ బ్ర
వీణలౌనచ్చర - వెలఁదుల గుంపు
చలువముత్యపు సరుల్ - చందనప్రసవ
ములు దాల్చు దేవతా - ముగ్ధాజనములుఁ
గలహంస బకచక్ర - కారండవాది
జలపక్షికల కలాం - చత్తటాకములు
విచ్చలవిడిఁ జెంత - విహరింప నిలకుఁ
వచ్చిన దేవతా - వర విమానములు
తీరంబులకుఁ దెచ్చి - తెరలు వైచుటయు
నారజల్లిన యట్ల - నలరు ముత్తెములుఁ
గరడులచే లవం - గములు తెప్పలుగఁ
దరిఁజేర వెరఁజు వ - ర్తకుల మొత్తంబు
మోసులైన ప్రవాళ - మూలకందములు
రాసులై దేరుటీ - రలతాగృహములు
మిఱియపుఁ బొదరిండ్ల - మీఁద ఘుమ్మనుచుఁ
దిరుగుచు నసియాడు - తేఁటి దాఁటులును
వెండి బంగారముల్ - వెలలేని మణులు
నిండిన గనులనే - న్నిక కెక్కుచరులు
తళుకుగాఁ బెరుగు చిం - దంపు తిప్పలును
గరిమముల్ మించిన - కరపట్నములును
గజవీరభట తురం - గమ రథంబులును
విదయకరణములై - వెలయు కోటలును
చల్లనై మెల్లనై - చాలనెత్తావు
లెల్లడ వెలివిరి - యించు గాడ్పులును
గలిగిన జలధి చెం - గటి విభవములు

కలయఁ జూచుచుఁ దశ - కంధరుం డరిగి
కట్టెదురను దొల్లి - గజకచ్ఛపములఁ
బట్టుక కొనివచ్చి - పక్షిపుంగవుఁడు
కొమ్మపై వ్రాలు వేఁ - గున నది విఱుగ
నమ్మహా శాఖఁ బా - యక వాలఖిల్య
మునులుండ నెఱిఁగి తా - ముక్కునఁ గఱచి
కొని హిమాచలముపైఁ - గొమ్మఁ దానునిచి
యందుండు మౌనుల - నవ్వాలి కనిచి
యందుపై గజకచ్ఛ - పాహారి యగుచు
దాన సత్త్వము హెచ్చి - తల్లి ఖేదంబు
మానుపఁ దలఁచి య - మరపురిఁ కేఁగి
సురరాజ గుప్తమౌ - సుధ గొనివచ్చె
గరుడి నిందుకుఁ దాళి - గగనంబు మోచి
శతయోజ నాయత - శాఖల చేత
నతిశయించి తపోధ - నాదరమైన
ధర్మమూలము సుభ - ద్రంబను మఱ్ఱి
దుర్మదాంధుఁడు ప్రోవు - త్రోవలోఁ జూచె.

## — రావణుఁడు మారీచుని సంధించుట —

ఆచెట్టు గడచి వాఁ - డవ్వలఁ జనుచుఁ
జూచె మారీచర - క్షోవరాశ్రమము
నందు జటావల్క - లాదులతోడ
నిందుశేఖరు మది - నెపుడు భావించి
యొప్పు మారీచుఁడా - నొయ్యన జేరి

యప్పుడు రావణుఁ - డానిశాచరుఁడు
దనకిచ్చు పూజలఁ - దనిసి యున్నంత
గనుఁగొని వాఁడు రా - క్షసరాజుఁ బలికె.
"ఇప్పుడే వచ్చితి - విటమున్న పోతి
విప్పుడు మరలిరా - నేఁటికి నీకు?
మీకందఱికి సుఖ - మేకద? యేమి
వాకొన వచ్చి రా - వణ! చేరినావు?
మదిఁగలఁగెడు నాకు - మాటక తెలుపు
మిది" యన్న విని దాన - వేశ్వరుఁ డనియె.

—· రావణుఁడు సీతాపహరణమున మారీచుని సహాయముఁ గోరుట —

"ఓయి! మారీచ! నీ - వొకఁడ వేకాక
యేయెడ వెదకిన - నేఁ బ్రాపుఁగాన!
ఖరదూషణాది రా - క్షసుల నందఱను
నరుఁ డొక్కఁ డెదురుగా - నక సంహరించె
జడియక మన జన - స్థానంబు చెఱిచి
'కడులావుతో దండ - కావనంబునను
బదునాల్గువేలైన - పలల భోజనులఁ
జదిమి వైచితిని - మీచింతలుదీర"
ననుచు బీరములాడి - యుందలిమునులు
తనుమెచ్చ తమ్ముఁడు - దాను నున్నాఁడు
అందుపైఁ దనకది - యాలని యొక్క
సుందరిఁ దెచ్చియుం - చుక యున్నవాఁడు
రాముఁడు మిగుల దు - ర్జనుఁడు మూర్ఖుండు

సోమరి యింద్రియ - సుఖపరవశుఁడు
కరినుఁడు క్రూరసం - కల్పుఁడు లోభి
శఠుఁ డధర్మపరుండ - సత్యవాదుండు
ముక్కరుఁ డధముఁడు - మూఢుఁడజ్ఞాని
నిష్కారణంబుగ - నేఁడు శూర్పణఖ
చేరిన ముక్కును - జెవులునుఁగోసి
యారయ మనకెల్ల - నపకీర్తిఁ జేసె
నందుకు బదులుగా - నతని యిల్లాలి
నందఱు మెచ్చఁగ - నపహరించినను
మనమైలవాసి న - మ్మది నుండవచ్చు
దనుజుల కెల్లనుఁ - దలయెత్తఁ గలుగు!
నాయన్న దమ్ములు - నన్నుగా నీవు
హాయత గల్గిన - యట్లైన నాకు
నెదురింప నేర్తురే - యింద్రాదులైన
యదిగాక నీవు మా - యాబలంబునను
జతురుండ వగుట నా - సాహచర్యంబు
మతి నెంచి వచ్చితి - మనవిఁ జేపట్టి
కనక మృగంబవై - కలధౌతరేఖ
లను మీరి రత్నవా - లంబుఁద్రిప్పుచును
సీతముందఱ నటిం - చినఁజూచి మెచ్చి
యాతన్వి పట్టితె - మ్మని వేఁడనేని
రామసౌమిత్రులా - రామనుఁగాన
నేమది వచ్చిన - నెలయింపు మీవు!
రాహుగ్రహంబు చం - ద్ర ప్రభఁబట్టు
సూహాచే నాసీత - నొడిచెద నేను!

ఇటులఁ జేసితి మని - యింతిని బాసి
దిటదప్పి రాముఁడా - ర్తిని మృతినొందు।
సులభమార్గం బిది - చూచితి రాము
గెలుచు నుపాయమే - క్రియ మఱిలేదు
రమ్మని ప్రార్థింప - రావణు మాట
రిమ్మవట్టింప మా - రీచుఁ డిట్లనియె

—: మారీచుం డీయకార్య కరణమునుండి
రావణుని మఱల్పఁ బ్రయత్నించుట :—

జగతిపై దొరలకి - చ్చకము గావలసి
మొగమోడి ప్రియవాక్య - ములు వల్కువారు
గలిగి యుందురు గాని - కడతేర్చు హితము
దలఁచి యెప్పటికి హి - తంబైన మాట
నుడువు వారలు లేరు - నూటవేయింట
నుడివిన వినువారు - ను ధరిత్రి లేరు.
ఇంద్రుని గుణముల - నెచ్చిన రాము
చంద్రుని భుజశక్తి - శౌర్యదర్పములు
వేగుల వారిచే - వినిన రోషమున
వేగనీయుని యావి - వేకంబుఁ గప్పె
నెఱుఁగక యున్నాఁడ - వింతకోపించి
శరము రాముఁడు వింట - సంధించె నేని
చాటి చెప్పెదను రా - క్షసులను నట్టి
మాటయే లేకుండ - మహిఁ జుల్కఁ జేయు!
సీతనిమిత్తమై - చెడఁగోరితేని

సీతోడ నాతోడ - నే చల్లఁగాను
శ్రీరాము కోపాగ్ని - చే విశ్వమెల్ల
నీరయి లంకతో - నెఱవేఱుఁగాని!
రావణ! నినువంటి - రాజును గొల్చి
చావనేమిటికి రా - క్షసు లకారణము!
నినువంటి కాముకు - నికి రాజ్యమేల?
తనవారి నావారి - తనమెంచనేర
నైనట్టి పని యయ్యె - నాస లీడేరి
హానిఁజెందిన మంచి -దని యెంచెదేని
చెడిపోవుటయుకాని - సీత పేరైనఁ
దడవిన యపుడనీ - తలలుర్విఁగూలు
రామదూషణము లూ - రక నీవు చేసి
కామహాత్ముని నల్గి - రైన నాడుదురె!
కైకకు లొంగిన - కన్నట్టి తండ్రిఁ
జేకొని నిజమరిఁ - జేయంగఁ దలఁచి
వనులకు వచ్చిన - వాఁడట్టి పరమ
మునివేషధారి రా - ముని మీఁదలేని
గుణములారోపించి - కొన్ని దోషములు
గణుతించి పలికెదా - కాకుత్స్థకులుని
రాముఁడు పరమధ - ర్మస్వరూపకుఁడు
రాముఁడు సత్యప - రాక్రమశాలి
యాయన దండను - న్నట్టి జానకిని
నీయట్టివాఁడుఁ దే - నేర్చునే బ్రదికి
మనయిరువురికిని - మంచికార్యంబు
మనసున దలఁచి యీ - మాటలాడితివి!

భానుఁడుండఁగఁ బట్టి - ప్రభఁ దివియంగఁ
బూనుదురే! ఇట్టి - బుద్ధులు గలవె?
బాణాసనాదుల - పారకాష్ఠములు
బాణముల్ జ్వాలికా - పటలంబుగాఁగ
రణమను నీరసా - రణ్యంబులోనఁ
దృణముగా వీరదై - తేయసైన్యంబు
నేర్చు రాఘవవహ్ని - యేగతిఁ జేసి
యోర్చెదు మిడుతపై - నురికిన యట్లు?
చాపపాశము పూని - శత్రులందునుపఁ
గోపించి యముఁడు మా - ర్కొని వచ్చినట్లు
వచ్చు రామునిఁ జేర - వశమె యొక్కనికి!
పిచ్చుక యెట్లు గు - ప్పించు వారిధిని?
యతని కోదండ స - హాయంబు గలుగు
క్షితి తనూజాతఁ దె - చ్చెదనందురయ్య?
సింహావక్షుని దయా - సింధునిఁ బురుష
సింహుని శ్రీరాముఁ - జేరి యా సీత
ప్రళయానలశిఖా ప్ర - భావంబుచేత
వెలుఁగొందఁ గీవెట్లు - వీక్షింపఁ గలవు?
అకట! ఇట్టి వృథా ప్ర - యత్నమేమిటికి?
సుకరంబు గాదు నీ - చూచిన చూపు
రామునిఁ గనిపిన - రాలేవు మఱలి!
భూమి యేలుక సుఖం - బున నుండుమీవు
మన విభీషణునితో - మంత్రులతోడ
మనసులోఁ గల - యట్టి మర్మమేర్పరపి
యతనికి మనకు బ - లాబలంబులను

స్థితులును గుణదోష - చింతలు నరసి
వారలు చెప్పిన - వైఖరి నడవు
మారాముఁ జెనకి ద్రో - హము సేయనేల ?
హిత మహితంబు న - వెంచక జనక
సుతఁదెత్తునని చెడఁ - జూచెదవేల ?
నీవు గల్గినవట్టి - నెలఁతలు నీకు
వేవేలు గలరేల - విడువు మీతలఁపు

— పూర్వము శ్రీరామునిచేఁ దనకుఁగల్గిన భంగపాటును మారీచుఁడు రావణునకుఁ జెప్పుట :—

ఇదిపరమార్థంబు - హితము నామాట
మదిఁజేర్చి లంకకు - మఱలి పొమ్మీవు.
దనుజేంద్ర! తొల్లిభూ - ధరము చందమునఁ
దనువెత్తి యయుతవే - దండ సత్త్వమునఁ
గుండల మాణిక్య - కోటీరదివ్య
మండనంబులుఁ దాల్చి - మదగర్వరేఖ
దండకాటవి కేఁగి - తాపసోత్తముల
కండలుదిని దావుఁ - గడుఁగ్రొవ్వు దొట్టి
యున్నచో గౌశికుఁ - డొదిగి నావలన
జన్నంబుఁ దాఁజేయ - శక్తుఁడు గాక
నాదశరథుఁ జేరి - యవనీశ! పలల
ఖాదులు నాదు యా - గము సాగనీరు.
అందుకు మీరాము - నంపుము దనుజు
లెందరు వచ్చిన - నితఁడు దండించు
ననవిని గాధేయు - నాదశరథుఁడు

గనుఁగొని "తగునె రా - క్షసులతోఁ బోరఁ
బదియునాలేండ్ల యీ - బాలకునంప
నది యేటిమాట! య - స్త్రాభ్యాసశక్తి
చాలదు వీనికే - సైన్యంబుఁగూడి
తోలుదు దానవా - దుల సంగరమునఁ
జలమేల" యనిన వి - శ్వామిత్ర మౌని
యలుక తోడుత నమ్మ - హారాజుఁజూచి
"మారీచుఁ జంపనో - మనువంశ తిలక!
శ్రీరామునకె కాక - శివునకుఁ దరమె?
ఎవ్వనిచేఁ దీర - దితనిచే వాని
క్రొవ్వడగింతు నీ - కుఁదరంబు గాదు
బలవంతుఁడవు శౌర్య - పరుఁడవు కయ్య
ములను రాక్షసబలం - బులు ద్రుంచినావు.
అందులో నొకఁడుగా - డలతాటకేయుఁ
డందుపై రావణు - ననుచరుఁ డతఁడు
అతులతేజస్వి నీ - యాత్మజుఁ డొకఁడె
యతనికి మృత్యువా - యనవచ్చె నేని
నాజన్న మీడేరు - నను నమ్మి వెంట
నోజనవర! పంపు - ముఱక రాఘవుని."
అనితోడి తెచ్చితా - యజ్ఞంబుసేయ
ధనువంది రాముఁడ - త్తరిఁ గాచియుండ
నితనిసత్తువ నమ్మి - యిచ్చిరి మునులు
హుతవహునందు నా - జ్యోపహారంబు
లాపొగలేఁ జూచి - యాఁపఁ గారాని
కోపంబుతోఁ గాశి - కుఁడు మొఱవెట్ట

బాలుఁడీతండని - పదరి యయ్యాగి
శాలలో రక్తమాం - సరబులు గురియఁ
జంపనొల్లక యొక్క - శరముచేఁదన్ను
గొంపోయి జలధిలోఁ - గూలంగవైచె!
తలక్రిందుగాఁ బడి - తామూర్ఛవోయి
విలవిల దన్నుక - వెసఁ గన్నుఁదెఱచి;
శరమిట్లు నూఱుయో - జనములు దెచ్చి
శరనిధిలోవైచి - చంపకపోయె!
అదియారా! రామాజ్ఞ - యారా! రామాస్త్ర
మిదియారా! తనపుణ్య - మింతియేచాలు
నవిలంకఁ జేరితి - నట్టి శ్రీరాముఁ
గినిసి మేల్మఱచి యేఁ - గీడు సేయుదనె!
కాదనియేమైనఁ - గనిపించుకొనిన
లేదు ప్రాణంబు దా - ల్చిపురంబుఁజేర!
సుకసుఖంబుననుండి - చూపోపలేక
యకట! యీకీడు సే - యఁదలంచి నపుడె
లంకయుఁ జెడు దైత్యు - లకు హానివచ్చు
శంక యేమిటికి ని - జంబె పల్కితిని!
పామున్నమడుగులోఁ - బక్షీంద్రుచేత
నామీన సంఘంబు - హాతి వొందినట్లు
రామాపకారంబు - రావణ! నీవు
కామించిచేసి రా - క్షసులఁ జంపెదవు
నీవు చూచుచునుండ - నీవారలెల్ల
రావణ సంగ్రామ - రంగంబులోనఁ
బడిపోవ శేషించు - పాటుఁబోతులను

వెడమతినై చూచి - విలపింపఁ గలవు.
ఆలంకలోని గే - హములు బాణాగ్ని
కీలల భస్మమై - కెడయఁ జూచెదవు
రావణ! యన్యదా - రపరిగ్రహంబు
నూవె పాపముల కె - చ్చైనాలయంబు
నీ కులసతులతో - నిత్యసౌఖ్యములు
జేకొని రమియింపు - సీత యేమిటికి?
సతులప్రాణములు రా - జ్యము గోరితేని
మతిఁ దలంపకుము రా - మద్రోహ మీవు
కాదని సీతపై - గమనంబు నీకు
ప్రాదుర్భవంబైనఁ - బడుదుము దుఃఖముల.
వినుమింక నొకటి యా - విలుకాండ్ర మేటి
వనవాస మీడేర్ప - వచ్చిన వెనుక
దానవుల్ వెంటని - ద్దఱు తోడుగాఁగ
యేను వాసును వింత - మృగరూపములను
మెఱుఁగుఁ గోఱలు గబ్బు - మేనులు మెఱయఁ
జరియింపుచును మహా - శ్రమములఁ జెఱచి
మునులను జంపి య - మ్మునులుచిక్క మెసవి
వనములు నుగ్గాడి - వచ్చితొల్లింటి
తపసగవారి మీఁ - దట నున్న కతన
జనకజరాముల - మ్మ్రాణులపైఁ గదియ
నారాఘవుండు మూఁ - డమ్ముల నొక్క
పారిగాఁ దొడఁగి మా - పరువులు జూచి
పడవేయఁ బూనినఁ - బాఱిపోవుటకుఁ
బడుపాట నాకుఁ దె - ల్పఁగరాదు నీకు!

మన్ను రామునిసత్త్వ - మును బాణశక్తిఁ
గన్నట్టివాఁడనై - గ్రక్కునఁ దొలఁగి
వచ్చి రోషమున స - ర్వంబును రోసి
యిచ్చోట సన్న్యాస - మేనుగైకొంటి
నందుచే నీక దక్కె - బ్రాణంబు లనుచుఁ
దుందుడుకారి యిం - దువసించినాఁడ
కడమ యిర్వురును రా - ఘవుని బాణములఁ
గడతేరి యమపురిఁ - గాఁ పున్నవారు!
ఏచట్టు చూచిన - నిరువురు వయసు
రాచబిడ్డలు నొక్క - రమణియుఁ గూడి
ముని వేషములను నా - ముందఱ నిల్చి
ధనువులతోడ న - స్త్రములు సంధించి
యంతకునట్లు పా - యక యున్నవారు
చెంతకు నీవు వ - చ్చినవేళనుండి
మున్ను నేఁగాన రా - ముని విశ్వరూప
మెన్నండు నీరాక - నిపుడుగన్పట్టె
రామమయంబై ధ - రాచక్ర మెల్ల
నామదిఁదోఁచె ని - న్నటి కలలోన
వెఱచి నేఁబాఱ నా - వెంట రాఘవుఁడు
తరుముకరాఁ గాంచి - తల్లడించెదను
అదినిమిత్తముగ ని - ట్లాడితి వీవు
బ్రదుకనిత్తువె యెంత - ప్రాలుమాలినను!
నాకు రకారాది - నామముల్ భీతిఁ
జేకూర్చె రా ముని - చేఁ జిక్కినట్ల
రమ్మనకుము నన్ను - రథము పై నెక్క

పొమ్మనకుమీ రత్న - పు మృగంబవగుచుఁ
బిఁఖువుమంచనకుము - విను రావణాఖ్యఁ
బిలిచినఁ బలుకక - ప్రేమ దశాస్య
నామధేయముఁ బూని - నాచెంత మెలఁగు
మేమఱియును రాము - నికఁ దలంపకుము!
నేవెఱచిన యంత - నీవును వెఱతు
వావల వెఱతురిం - ద్రాదిదేవతలు
బలినముచులనైన - బాణజాలములఁ
బొలియించువారలి - ప్పుడు మాఱుకొనిన!
ననుఁబ్రోచి నీదు మా - నంబుఁ బ్రాణంబు
మనికియు వేఁడిన - మాను మీమాట
రొకరినిఁ జెఱచుట - యుత్తమపురుషు
లకు నెల్ల లోకంబు - లకు హానిగాన
హితముఁ దెల్పెదఁ దగ - వెంచి యీమాట
మఱియించి యిఁకనైన - మాను మీచలము
బ్రదికియుండినఁ జాలు - పదివేలు వచ్చె
నిదిమాకు నేలనీ - వెటువోటివేమి?
నీవెంట రానొల్ల - నినుఁ జేరనొల్ల
నీవాఁడగా నిది - నేనెంచి కాదె
సన్యాసినైతి మ - చ్చరమేల నాకు
నన్యాయపరుని వా - క్యము లేలవిందు
నాచుప్పనాతికై - యఖిలదానవులుఁ
జూచు నంతటిలోనఁ - జూర్ణమై పడిరి!
అదివచ్చి బోధింప - నని కేఁగి ఖరుఁడు
నెదవ్రయ్యు బ్రాలెమ - హీస్థలియందు

నీవు నాముక్కుఁడి - నిర్భాగ్యురాలి
చేవలందవిలి యీ - చేటు కోర్చితివి
వలసిన వినుమట్లు - వల దేని ఖరుఁడు
పొలిసినగతి నీవుఁ - బొలియుదు వచట"

—: రావణుఁడు మారీచుని హితోక్తులకుఁ బెడచెవిఁబెట్టి సీతాపహరణములో సహాయముచేయనిచో వానికి తనచేఁ జావు సిద్ధమని చెప్పుట :—

అనియిట్లు మారీచుఁ - డాడిన మాట
తనకు రోగికినౌష - ధంబునుఁ బోలి
పథ్యంబుగాఁ గణిం - పక వాని బుద్ధి
మిథ్యగానెంచి న - మ్మిక లేక పలికె
"చవుటి నేలలయందుఁ - జల్లిన బీజ
నివహంబుకైవడి - నీమాటలెల్లఁ
బనిఁ గొననేరవి - ప్పటికి నాయెడల
నని యేలరాములో - ననిపల్కనేల?
తలిదండ్రులకుఁ గాక - తన సీమ విడిచి
కలిగిన బంధువ - ర్గము పొత్తువాసి
తప్పుకయొక యాడ - దాని మాటలకు
నిప్పుడీ యడవుల - నిడుమల కోర్చి
పాపిష్ఠయై చెడి చెట్లఁ - బట్టినవాని
ప్రాపున మన్నట్టి - పరదేసి పడుచుఁ
బట్టిన యంత నా - కుద వచ్చె నేని
యిట్టి పాటి విభుత్వ - మేఁటికిఁ దనకు!
లేక యేమాన భా - త్రీతనూజాత

నీకార్యమింద్రున - కేని గాదనఁగ
వచ్చునే? నీతియు - వ్వారు తెల్పువార
లచ్చోట లేరని - యడుగ వచ్చితిన?
మేలైనఁ గీడైన - మేలు నీవట్టి
యాలోచనలు మాను - మాత్మలో నేను
సీతను దెచ్చుట - సిద్ధంబు తనదు
నీతి పరస్త్రీల - నెమకి పట్టుటలు
రాజు వేఁడిన మంత్రి - రాచకార్యములు
తేజంబు విభునకుఁ - దేవేఁడినైన
నుపచారములు పల్కి - యొదుఁగుచుఁ దగిన
యపుడు మెల్లని మాట - లాడినట్లాడి
మఱి యొక్కతఱి తన - మతముగా విభుని
మఱలించుకొని తన - మాటఁ జెల్లించి
నడచినఁ దగుఁగాక - యప్రయాసంబు
తడవక హృదయమిం - తయుఁ గానలేక
వెగటుగాఁ బల్కిన - వినినఁ బూజార్హుఁ
డగు రాజు సైరించు - నా వెఱ్ఱివాఁడ!
అనలుని వేఁడిమి - యమరేంద్రు శౌర్య
మునుఁ జంద్రుని ప్రసాద - మును బాశపాణి
దండశక్తియు భాను - తనయుని సమత
నిండార విభునికి - న్ని గుణంబులునికి
రాజులు మహినెల్ల - రకుఁ బూజ్యులగుట
రాజింపనేరకి - ట్లాంటి నీకడకు
వచ్చినవాని దు - ర్వచనముల్వలుక

వచ్చునే యెఱుఁగని - వాని చందమున ?
నినుఁ గార్యమడిగితి - నీచేతనైన
పని నీవొనర్పుము - పసిఁడి మెకంబు
మేనత్తి సీతాస - మీపవనంబు
లోనఁ గ్రుమ్మరిన నా - లోకించి సీత
పట్టి తెమ్మని రాముఁ - బనిచిన నతఁడు
పట్టఁ జేరినఁ దగు - ల్పడక కేడించి
దూరంబుగాఁ బోయి - తోడ రాఘవుని
శారీర మున్నట్లు - జానకి వినఁగ
"హాసీత హాలక్ష్మ - ణా" యనిపలుక
నాసద్దువిని రాము - సరయు మీవనుచుఁ
బనుపు లక్ష్మణుఁ బిల్చి - పనిచిన నతఁడుఁ
జను నొంటిగాఁ బర్ణ - శాలలోనున్న
సీతనప్పుడు జేరి - చెఱవట్టి మఱల
నేతెంతు శచిఁదెచ్చు - నింద్రునిరీతి
నీకార్య మీడేర్ప - నెల్లరాజ్యమున
నీకు సగంబిచ్చి - నే మెచ్చియుందు
కదలు మిప్పుడె దండ - కావనంబునకు
నిదె రథంబెక్కి యే - నేతెంతు వెనుక
జగడంబులకుఁ బోక - జానకి నురక
తగిలించుకొని కృతా - ర్థతనుండువాఁడ
నిటుసేయవేని యే - నిప్పుడ నిన్ను
నటునిటుఁ బోనీక - యసిఁ ద్రెవ్వనేతు !
పలిన దారతోడ - నెదురాడు వాఁడు
ఖలుఁడొండనేర్చునే - మేదిని యందు ?

మృగమవై యిపుడ పో - మ్మాపు వోయినను
బగఱచేఁ జావును - బ్రదుకు సందియము
వోవలేననివ ని - ప్పుడెనాదు చేతఁ
జావు సిద్ధము నీకు - సరిపోయినట్లు
నను" మన్న రాజ నే - నను నహామికను
దను వీఁడు కాదన్న - దండింతుననియె
నిందుకు బెదరుదు నే - యని తలఁచి
క్రిందు మీఁదరసి మా - రీచుఁడిట్లనియె

— రావణుని మూర్ఖతకుఁ జింతించి మారీచుఁడు మఱల హితోపదేశము చేయుట —

" రావణ ! పుత్రమి - త్రకళత్ర సహిత
మీ వేళ నినుఁ ద్రుంప - నిచ్చలోఁ దలఁచి
యెవ్వఁడు బోధించె - నీబుద్ధి నీకు ?
నెవ్వఁడు పాపాత్ముఁ - డిట్ల నీమేలు
చూపోపఁ జాలక - చొరరాని చోటు
లీపగిదినిఁ ద్రోవ - నిచ్చకంబాడె ?
నీకు మృత్యువును స - న్నిహితంబు చేసి
యీకీడు దలఁచువాఁ - డెవ్వఁడున్నాఁడు ?
నిను మించిన బలుండు - నీబలం బడఁప
మనసున నెంచి యీ - మరులుపుట్టించె !
మర్యాద మీఱుచో - మంత్రులు తగిన
కార్యమాలోచించి - కన్నయర్థంబు
నిలువనాడక యున్న - నిగ్రహింపంగ
ఫలయుఁగావున నట్టి - వైపు చింతింపు !

రాజైనయతఁడె మ - ర్యాదఁ దప్పినను
భూజను లెట్లు కా - పురము సేయుదురు?
దోరమంచివాఁడైనఁ - దోఁచినమాట
వెలివక మంత్రులు - విన్నవింపుదురు.
అతిశయింపఁగ నీతి - యవనిఁ బాలించి
నతని వే సుమ్ము ధ - ర్మార్థకామములు
నీతిలేదేని వా - నికి నేమిలేదు
హేతువౌ నతఁడుర్వి - నెల్లఁ జెఱుప
రాజమూలంబు ధ - ర్మముగాన మంత్రు
లేజాడఁ బతియందు - హితులు గావలయు
క్రూరుఁడై తాఁబ్రతి - కూలుఁడై నీతి
దూరుఁడౌ నతని కెం - దును మేలురాదు
ఒరకంబులను రథం - బుర్విఁ బైఁగదలు
తిరిఁ జూచి చక్కని - దారిగా గడపు
సారథిగతి మంత్రి - సన్మార్గమునకు
భూరమణుల చిత్త - ములఁ ద్రిప్పుకున్న
నిరువురకును హాని - యేకాన నీకుఁ
బరమధర్మంబు నా - పలుకు సేయుటలు
కానివాఁడొక్కఁడొ - క్క ప్రయోజనంబుఁ
దాను సేయ ననేక - ధార్మికావళికి
నవరోధములు పుట్ట - నధిపతి నేర
మవనీ జనులకెల్ల - నాపదల్ సేయు!
నక్క వాకిలి గాచి - నమ్మృగంబులేమి
యక్కరల్ దీరి సౌ - ఖ్యము లందఁగలవు?
తెలియక యటుల యిం - ద్రియ పరుఁడైన

యిలఁబతిచేఁ సౌఖ్య - మెవ్వ రొందుదురు ?
కాకతాళన్యాయ - గతి ఘోరమైన
నీకీడుతలఁపు వా - నికి మూలమయ్యె !
పోయినయపుడె చం - పును మృగరూప
మాయావిఁ దన్ను రా - మశిలీముఖంబు
తనుమాత్రమునకు నీ - తాకాంతుఁ జేరఁ
జని చూచినంతలోఁ - జావు సిద్ధంబు
సీతను నీవుదె - చ్చితి వేని వెనుక
నీతోడ లంకతో - నిమిషమాత్రమున
దానవులెల్ల హ - తంబు గాఁగలరు
మాను మీతగని కా - మము దానవేంద్ర !
హితము నాపలుకని - యెంచవు దైవ
గతిచేత నవసాన - కాలంబుచేరె
అట్టివానికి నేల - యాప్తుని మాట
పట్టియుండును ? చల - పట్టుటేకాక
నీవు చంపెదనన్న - నీచేత నేల
చావఁగావలయు ? న - చ్చట నెయ్యాఁగాక !
నీచేతి చావుచే - నిరయంబు రాముఁ
జూచి వచ్చినమోక్ష - సుఖమును గలుగుఁ
యమగదా దండమై - యకట ! యీబుద్ధి
సమకూరె నీకు నా - సలు దీఱెనాకు
పోదము రమ్ము గొ - బ్బున మున్నుగాఁగ
నే దండకాటవి - నేఁడె చేరెదను
మించనాడితి నీకు - మేలవుఁగాక
యుంచితివే నను" - నంచు బల్కుటయుఁ

—: రావణునితోఁ గూడిపోయి మారీచుఁడు
మాయామృగ మగుట :—

గాఁగిలించుక దశ - కంధరుం డలరి
యాఁగాక యని వాని - కప్పు డిట్లనియె.
" పరమాప్తుఁడవు శౌర్య - పరుఁడవు దైత్య
వరులెందఱైన నా - వారు గల్గియును
నింతవాఁడని నిన్ను - నెంచి యిట్లొంటి
నింతదూరము వచ్చి - యేవేఁడుకొంటి
నెవ్వఁడవో నైతి - వింతపర్యంత
మివ్వేళ నిన్ను నీ - వెఱిఁగి పల్కితివి
రత్నమయంబు నా - రథమెక్కి కదలి
యత్నంబు గనుము మా - యామృగాకృతిని."
అని రథారూఢుఁడై - యతఁడును దానుఁ
జని చని కొన్ని దే - శంబులు గడఁచి
దండకావనము చెం - తకు నేఁగి యచట
నుండి కాంచనరథం - బొయ్యన డిగ్గి
తాను మారీచు హ - స్తముఁ గేలఁ గూర్చి
వానితోఁ బ్రణయ పూ - ర్వకముగాఁ బలికె
" ఆపొన్న పెనుమఱ్ఱి - యండనే యున్న
యీపొన్న గుంపుల - కీవలిచాయ
నరఁటితోఁటకుఁ దూర్పు - నందు రాఘవుఁడు
చరియించునది పర్ణ - శాల వీక్షింప
సీత యిచ్చోట వ - సించు నిందులకు
నీతలంచిన యట్ల - నీవేఁగు " మనిన

—: మారీచుఁడు బంగారులేడి రూపము ధరించుట :—

మారీచుఁ డపుడాత్మ - మాయాప్రపంచ
మారావణుఁడు మెచ్చి - యవునని పొగడ
మరకతమణిభాస - మాన శృంగములు
నరుణోత్పలచ్ఛాయ - లమరు మొగంబు
నీలనీలప్రభా - న్విత కర్ణములును
జాలఁ గాంచనరుచుల్ - చల్లుకంధరయు
నింద్రనీలపుముక్కు - హీరమశాళ
చంద్రసన్నిభమైన - శాతోదరంబు
గొప్ప వైడూర్యముల్ - గూర్చినయట్ల
యిప్పపూవులచాయ - నెసఁగువాలంబు
గోమేధికంబులు - గొరిజలు వెండి
కామలవలె సోయ - గములైన కాళ్లు
ముత్తెపుఁబొడలు కెం - పుల మూపురంబు
లత్తుకచ్ఛాయఁ జె - లంగు కందంబు
కురువింద నయనముల్ - క్రొవ్వాఁడి చూపు
లరుదు మీఱఁగ మృగం - బై పొడసూపి
చెట్టులకెగఁబ్రాకి - చివురులు మెసవి
గుట్టలు చంగు చం - గునఁ జౌకళించి
సీతముందఱ వ్రాలి - చిత్రమృగంబు
ధాత వ్రాసిన వ్రాఁత - తను నెచ్చరింపఁ
బోవుఁ గ్రమ్మరఁ జూచుఁ - బోవక మఱలు
తావులాస్వాదించు - దాఁటు నట్టిట్టు
మెల్లనే నడచు భూ - మిని బొడల్ వెట్టు
నొల్లు జాడించు మే - నూరక విఱుచు

సెలవులఁబచ్చిక - క్షితిమీఁద రాల్పుఁ
దెలియక తనసీడ - దృష్టించి బెగడు
మృగముల వెన్నాడు - మింటికి నెగయు
జగతిపైఁ బవళించు - జవమునఁ బఱచు
వెనుకొని మృగిఁజేరి - వెనుకఁ జక్కట్లు
తన మోము చాచి యెం - తయు మూరుకొనుచు
దివిఁ జూచు చూచి నల్ - దిక్కులుఁ జూచుఁ
గవియుఁ నుంకించు నే - కడ కాలుఁద్రవ్వ
మొకముపైఁ బాలిచే - మేవు వర్జించి
రొంక వింతరవముతో - నుఱకవాచఱచు
మారీచుఁ డీరీతి - మాయలుఁ జేసి
యారామమున నిట్టు - నట్టు మెలంగ !
పువ్వులుఁగోయుచు - భూమితనూజ
దవ్వుల వనదేవ - తయుఁబోలి మెలఁగఁ
గనిపించుకొనిన నా - కపటమృగంబుఁ
గనుఁగొని యాశ్చర్య - కలితయైయుండ
నవు డింద్రధనువు చా - యను మేను మెఱయ
విపులపై నూరక - వేడంబు వెట్టి
కొఱవిఁ ద్రిప్పిన మాడ్కి - గుజరాతికెంపు
మెఱుఁగులు నమ్మేన - మిన్నులఁ బొదువ
మఱియుఁ జెంతకు వచ్చి - మాటకు నేఁగి
వెఱచినగతిఁ బారి - వెఱవకఁ జేరి
మెలఁగుచో జానకి - మృగశాబకంబు
చెలువంబుఁ జూచిమె - చ్చి ముదంబు వొదల
రామాశిరోమణి - రామలక్ష్మణులఁ

బ్రేమఁ గొబ్బునఁ జేరఁ - బిలిచిన వారు
వచ్చి యామృగముచె - ల్వమునుఁ జేష్టలునుఁ
బచ్చని మెఱుఁగునుఁ - బరికించి చూచి
కన్నుల విందుగాఁ - గని మెచ్చునట్టి
యన్నతోఁ సౌమిత్రి - యపుడిట్టులనియె.

—: బంగారు లేడి మారీచుని మాయ యని
శ్రీరామునితో లక్ష్మణుఁడు చెప్పుట :—

"మృగము కాదదియు మా - రీచునిమాయ
యగునని దోఁచె నా - యంతరంగమున
వేటలాడుచు వచ్చి - వీఁడాచరించు
బూటకంబులఁ జిక్కి - పొలిసినయట్టి
రాజులు గడు నపా - రము వీని జాడ
లీజటివరులెల్ల - నెన్నికొనంగ
వినియుందు నిటువంటి - వింతమృగంబుఁ
గనినట్టివార - లెక్కడనైనఁ గలరె?
ఇది వాని మాయయా - నేల సందేహ
మది యేల మనకు రం - డని" పల్కుటయును
విని యెఱుంగక విధి - విహితమౌ బుద్ధి
తనుఁజెడ రేప సీ - తాకాంత పలికె.

—: బంగారు లేడిని పట్టి తెమ్మని సీత శ్రీరాముని వేఁడుట .—

"స్వామి! రాఘవ! యిట్టి - చక్కని మృగము
సీమలన్నియునుఁ జూ - చితి మెందు లేదు!
ఇది మనోహరరేఖ - నింపు పుట్టించె

పదికిఁ బట్టుకరమ్ము - మనవిఁ జేకొమ్ము
పట్టణంబెడవాయు - పదియుమూఁడేండ్ల
కిట్టి వేడుక నాకు - నీక్షింపఁగలిగె!
సతతంబు మన పర్ణ - శాల ముంగిళ్ల
నితర వన్యమృగాళి - నెల్లఁ జూచితిని.
ఏనాఁడుఁ జూడలే - దిది నవరత్న
నానావిభాసము - న్నతమై చెలంగె
తనురూపలక్ష్మిచే - తనుజూడఁ జూడఁ
గనుపండువయ్యె నీ - కాంచనమృగము
వింటిరే! చెవులకు - విందులై నులుల
నంటిన దీనిసో - యగమైన పలుకు!
కడమ రెండొక్కటిఁ - గ్రమియించి యుచటఁ
దడయక మనమయో - ధ్యాపురిఁ జేరి
పడకయింటికి నెల - పలి చప్పరమున
సడలని యుపరంజి - సరిపెణల్గట్టి
పెంచఁగోరెదను చం - పిన గాదు దీని
వంచించి పట్టి తే - వలయునుమీరు.
అచటి యత్తలు భర - తాదులుఁ జూచి
యచలితానందంబు - ననుభవించెదరు.
దీనిప్రాణములతోఁ - దెచ్చు మార్గంబుఁ
గానకుండిన చంపి - కవచంబుఁ దిగిచి
యాయజినంబుపై - నాసీనుఁ జేసి
నాయభీష్టంబులె - న్నటికిఁ జెల్లింప
నీరీతిఁ బతులతో - నింతులు వలుక
శూరగాఢైనవీ - మృగముపై మిగుల

నాసక్తి గలిగియు - న్నది" యని చలముఁ
జేసి పొమ్మని పల్క - సీతపైఁ గరుణఁ
దనకును వేడుక - దానిపైఁ గలిగి
యునికిచే శ్రీరాముఁ - డొకమాట వలికె.
"లక్ష్మణ! చూచితే - లలితవిలాస
లక్ష్ములచేతఁ దొ - లఁగ కీమృగము
నందన వనములో - నను చైత్రరథము
నందులో నట్టి సా - రంగంబు లేదు
కనకరోమంబులు - గల యీమృగంబుఁ
గను మావలించినఁ - గనుపట్టు నాల్క
సురుచిరరత్నరిం - ఛోళి చేఁబొలిచె
మెఱుపు మేఘములోన - మెఱసిన యట్ల
నిగనిగ మనునింద్ర - నీలంపు బరణి
మొగముగాఁదగఁగ సొం - పు వహించె మృగము
కమనీయ శంఖము - క్తానిభం బగుచు
రమణీయమగు నుద - రంబు దీనికినిఁ
జెలువొప్పఁ బట్టితె - చ్చెదు గాకయన్న
విలుకాండ్రు రాజులు - వేఁటమార్గముల
వెలువడి మనసుల - వేడుకల్ దీర
పొలనుగావలసి చం - పుదురు జంతువులఁ
గాంచన రత్నాది - కంబులు సంత
రించుటకై ఖని - శ్రేణిఁ ద్రవ్వుదురు.
అందుచే బొక్కస - మధికమై వృద్ధిఁ
బొందునానాఁట నె - ప్పుడు నినలేదె!
తనమది శుక్రుండు - దలఁచిన యంత

ధనము బొక్కసమిండ్ల - దఱుఁగక యుండు
కైవడి నొక్కచోఁ - గలదు లేదనెడు
యావిచారము మాని - యత్నంబు సేయ
నది సఫలం బగు - నని యర్థశాస్త్ర
విదులైన యట్టి కో - విదులు వల్కుదురు.
ఈ మనోహరమైన - మృగమునుజూచి
భూమి నెవ్వరికైనఁ - బొడమదె యాశ!
ఈచర్మమున వసి - యింప నీసీత
యాచించెఁ జూచిన - యప్పటినుండి
కాదనకుము తెత్తుఁ - గదలి మృగంబుఁ
గాదిది ప్రియ కీయం - గాదు ప్రవేణి
యనుమృగోత్తమముగా - దానికి ననుఁగఁ
దనరునట్టిదిగాదు - తలఁప నీమృగము
నవి దీనితో సాటి - యనరాదు నేఁడు
దివినుండి చంద్రుని - దేహంబు విడిచి
వచ్చెనో! రాక్షస - వరులు మాయావు
లిచ్చోటి కిరీతి - నేతెంచినారో!
అటులైనఁ జెయ్యిగా - యక తిత్తియొలిచి
యిటుఁదెచ్చి జనకజ - కిత్తు నీక్షణము
మారీచుఁ డంటివి - మాయావి రాచ
వారల మును వీఁడు - వధియించినాఁడు
కావున వీని వే - గమె యాజ్ఞ చేసి
నేవత్తు నిచ్చోట - నీవుండు మిపుడు
వాతాపి ఋషులకు - వంటయై వారి
నేతరి తాఁ బొలి - యించి మించుటయుఁ

దాను జాలుగ నళ్వ - తరియను దాని
దానిగర్భంబు వి - దారించినట్లు
మును హింసనొనరింప - మొనసి యగస్త్య
మునివాని దన తేజ - మునఁ జంపినట్లు
వనము లీఁ జెనఁటిని - మారీచు నీచుఁ
దునుముదు సీతనా - తో నేమి వల్క
నట్టి గార్యము సేయు - నదియ నాపూన్కి
పట్టి తెత్తును దీనిఁ - బడ నేసి యైన
దీని చర్మము గొని - తెత్తు నేమఱక
జానకిఁ గావుమి - చ్చట మన కెపుడు
నతఁడును నీవుఁ బ్ర - యత్నంబుచేత
క్షితిసుతఁ గాచిర - క్షింపుఁ డేమఱక"

— శ్రీరాముఁడు బంగారులేడిని పట్టుటకు బయలుదేరి దానింజంపుట —

అనుచుఁ గట్టడిచేసి - యారఘువీరుఁ
డనుపమ ఖడ్గబా - ణాసనాస్త్రములు
కైకొని కదలినఁ - గని యామృగంబు
పోక దవ్వుగఁ జెంతఁ - బొడచూపి కడసి
యేమఱి నటులుండె - హెచ్చులులేక
తామాయమై పోయి - తగులక యనుచు
తిరిగి రాఁజూడ నం - తికమునఁ జెట్టు
మఱుగుఁ జేసుక నిల్చి - మరియుఁ జేరుటయు
నల్లంతు వడదాటి - యావల పోక
మళ్ళిపోవఁగనీక - మరులు పుట్టించి
యమ్మృగ మందింతునో - యని యెంచు రాము

నెమ్మది యెఱిఁగిఁక - నీకాననముల
నెక్కడికో పోయి - యీమాటలోనఁ
గ్రక్కునఁ జెంగటఁ - గనుపించి దాఁటి
చేతి కందినక్రియ - జిక్కఁ బోమ్మనఁగ
యేతరిఁ గనరాక - యెలయింపఁ జూచి
యిది దానవులమాయ - యేతప్పదనుచు
మదినెంచి ప్రకుపిత - మానసుండగుచు
దీనిఁజంపుదునని - తెలివితోఁ ద్రోవఁ
బూని చేచాఁచి యం - బుజమిత్ర కిరణ
సన్నిభంబగు నొక్క - శరమేర్చి తివిచి
కన్నుఁదామరల చెం - గావి గీల్కొనఁగఁ
దిన్నగా వింట సం - ధించి వేయుటయు
మిన్నంది బ్రహ్మని - ర్మితమైన శరము
మాయామృగంబైన - మారీచహృదయ
మాయెడ రెండు వ్ర - య్యలుగాఁగ విరియఁ
బిడుగుకైవడి నాఁటి - భేదింప వాఁడు
పొడవుగా నొకతాటి - పొడవునకెగసి
కూయుచు నిలఁబడి - ఘోరరూపమున
మాయామృగాకృతి - మాని రావణుఁడు
తనకుఁ జెప్పినమాట - తలఁచి రాఘవుని
యనుపమస్వరముతో - నన్నిశాచరుఁడు
“ హాసీత ! హాలక్ష్మ - ణా ”! యని యవని
నాసురాకృతిఁ బడి - ప్రాణముల్ విడువ
మణిభూషణములు హే - మకిరీటవరము

మిణుఁగురుల్ రాల్చును – నీలిశాత్వలును
మెఱుఁగుఁ గోఱలుఁగల్గి – మేదినిమీఁద
హరిహయుచేతి వ – జ్రాయుధాహతినిఁ
బడిన కొండయుఁ బోలి – పడియున్నవాని
జడుని మారీచరా – క్షసుఁ దేరి చూచి
సౌమిత్రి మున్న యె – చ్చరికగాఁ దెలుపు
నామాట నిజమని – యాత్మలోఁ దలఁచి
" హాసీత ! హాలక్ష్మ – ణా ! యనురవము
చేసి కూలెను వీఁడు – సీత యామాట
విని యేమియయ్యెనో – విన్న సౌమిత్రి
తనమది నేమని – తలఁచునో యకట !"
అని యెంచి మదిలో భ – యమ్ము దుఃఖమునుఁ
బెనఁగొనఁ జానకీ – ప్రియుఁడాకమృగము
చంపి తదీయ మాం – సంబరఁటాకు
చించి లోఁ బొటిలంబు – చేసికైకొనుచుఁ
దమ యాశ్రమము త్రోవఁ – దడయక వచ్చు
సమయంబునందు న – చ్చట మహీతనయ
విననైన తనప్రాణ – విభుపోయి నెలుఁగు
చెనఁటిదానవునిచేఁ – జెవిసోఁకుటయును
విని గుండెలవియ న – వ్వాలఁది సౌమిత్రిఁ
గనుఁగొని మైవడఁ – కఁగ నిట్టులనియె

— ఆర్తనాదము విన్నసీత లక్ష్మణుని శ్రీరాముని సహాయమునకై వెళ్లుమని చెప్పుట —

" సౌమిత్రి ! యిప్పుడు స్వ – స్థానముల్ దప్పి

నామేనిలోనఁ బ్రా - ణములు చలింపఁ
దనపతి యార్తనా - దము వినవచ్చె
నినువంటి తమ్ముఁడుం - డియు నిట్టులయ్యె
నీవేళ మాయన్న - నీవురక్షింపు
మావల నొకదైత్య - హార్యక్షమునకుఁ
జిక్కెను వృషభమై - శ్రీరామచంద్రుఁ
డొక్కఁడు కానలో - నురక పొమ్మంటి
శరణుఁ బొందిన యన్న - చాలఁ జేపట్టి
కరుణతో రక్షింపు - కదలి పొమ్మిపుడు"
ననుచు నాపన్నయై - యడలంగ వినియు
విననట్టియున్న భా - వించి లక్ష్మణునిఁ
గనుఁగొని సహియింపఁ - గా లేక జనక
తనయ నిష్ఠురభంగిఁ - దానిట్టులనియె
"ఇట్టిచో లక్ష్మణ! - యీవు బోనవుడె
గట్టిగా హితుఁడవు - గావు శత్రుఁడవు!
ననువేఁడి నాప్రాణ - నాథుని చావు
మనసులోఁ గోరి యీ - మాడ్కి నున్నావు!
రాముని మేలుఁ గో - రకయున్న నిన్ను
నేమి వల్కఁగ నేర్తు - నెటువలె నోర్తు?
నినువంటి వానికి - నేఁడిట్టిబుద్ధి
చనదు పొమ్మనిన ల - క్ష్మణుఁ డిట్టులనియె.
"ఓయమ్మ! యిటులాడ - నుచితమే నీకు?
మాయన్న నవిలోన - మార్కొని నిల్వ
యక్షరాక్షసదాన - వామరవరులు
లక్షించి యతని యా - లముఁ జూడఁగలరె!

నరమృగపశుపక్షి - నాగవల్లభులు
దురములో రాముని - దుర్కొనఁగలరె ?
నన్ను నిష్ఠల మా - నము తూలిపోవ
మన్ననఁ దప్పి యీ - మాటలాడెదవు ?
వలదమ్మ ! నీ ప్రాణ - వల్లభుతోడ
గలనిలో నెదురింపఁ - గా నెవ్వఁడోపు
నీవెన్ని పలికిన - నిను నొంటిడించి
పోవరాదేను ద - ప్పుదునె రామాజ్ఞ !
మూఁడు లోకములు రా - ముని మీఁదఁ దమకుఁ
దోడుగా శతమఖా - దులఁ గూడివచ్చి
విల్లందియున్న నీ - విభుని కట్టెదురఁ
ద్రుళ్లడంగక సమ - ర్థులె యెదురింప ?
మానుమీచింత యీ - మారీచు నెలుఁగు
గాని రాఘవుమాట - గాదేను వింటి
మారీచుఁ జంపి నీ - మగఁడదే వచ్చు
నారాతునుండు మా - యాబలాన్వితుఁడు
రాముని శరముచే - వ్రయ్యలై పడుచు
నీమాట దానాడె - నిది నిక్కవంబు
నీకుఁ గావలియుండ - నియమించి నన్ను
నీకడనుంచి తా - నేఁగె రాఘవుఁడు
నట్టిచో నిను డించి - యన్నసన్నిధికి
నెట్టుపోవుదు నేల - నెఱుఁగ కాడెదవు ?
ఖరుని గీటడఁచి రా - తుసుల మర్దించి
శరవహ్నిచే జన - స్థానంబుఁ గాల్చి
వీరుఁడై యున్న యా - విభునిపై దనుజ

లీరసంబునఁ గల - హింపఁ గోరుదురు!
అసురలతోఁ బగ - యయ్యెను మనకు!
కనుఁగందకున్న రా - ఘవునిపై వలిగి
దనుజులు నానావి - ధముల వంచనలు
కనుపించుకొని సేయఁ - గాఁ దలంపుదురు
వారిమాయలు రఘు - వర్యుని యెదురఁ
దీరునే నీవు చిం - తిలనేఁటికమ్మ?
ఉరకుండుమన" నాగ్ర - హోపేత యగుచు
నాతియు నాసీత ల - క్ష్మణుఁ జూచి పలికె

—. సీతాదేవి లక్ష్మణునితోఁ బరుషోక్తులాడుట .—

"కులపాంసనుండవు - క్రూరచిత్తుఁడవు
కలుషమానసుఁడవు - కామాంధమతివి
రామునికిని హాని - రాఁబ్రమోదించు
తామసాత్ముఁడ వీవు - దాయాది వగుటఁ
దరిచూచుకొని కీడుఁ - దలఁచిన నిన్ను
బరమపాతకుని నా - పతి నమ్మి వచ్చె!
మొదటనే యీవనం - బుల కేమురాఁగ
మదినేమి దలఁచి వెం - బడివచ్చినావొ?
కాక యేమని బందు - కట్టెనో భరతుఁ
డాకైక యేఁటికి - నంపెనో నిన్ను!
తమ్ముని భరతుని - దండనే యునిచి
నమ్మించి నాపెండ్లి - నాఁటనుండియును
నిందుకే కాచినా - వేమొ? రాఘవుని
సుందరి నొకఁడు నే - ర్చునె తేరిచూడ!

అకట ! రామద్రోహి - వగుదు గాకేమి !
నికట శాత్రవుఁడవై - నిలుతుగాకేమి !
క్షుల్లకంబులు సేయఁ - జూతుఁ గాకేమి !
యుల్లంబులో విషం - బుంతుగాకేమి !
ఇందీవరశ్యాము - నినవంశతిలకు
మందరాచలధైర్యు - మన్మథాకారుఁ
గమలపత్రాక్షు రా - కాచంద్రవదను
శమదమ సంపన్ను - సత్యసంకల్పు
శ్రీరామ విభునిఁ బా - సిన నిమిషంబు
నేరుతునే మేన - నిలుపఁ బ్రాణములు
నన్యులాసించిన - యందాక ధరణి
కన్యయుఁ బ్రతుకునే - కనలేవుగాక !
తృణమైన నీఁక నోర్వఁ - జాల నీయెదురఁ
దృణముగా రాఘవుఁ - డెచ్చోటనున్న
నతనికిఁ బ్రీతిగా - నర్పింతుఁ బ్రాణ
మతిమానుషంబైన - యాత్మశీలంబు
చూచి నీతలఁపు మం - చునుఁ బోలి విరిసి
నీచులు చనుగతి - నీ వెసంగుదువు" !
అని పరుషోక్తులి - ట్లాడినఁ జెవుల
విని కటకటఁబడి - వేదనంబొంది
యంజ నుండఁగ రోసి - యట్టట్టు వోయి
యంజలిచేసి రా - మానుజుండనియె.

—సీతయొక్క దూషణవాక్యములను వినలేక లక్ష్మణుఁడామెనువిడిచి బయలుదేరుట :—

"నీవు నాపాలిట - నిలిచిన యిష్ట

దైవంబు నామీఁద - తల్లివినాకు
నేఁటువంటివాఁడనే - నైనధరిత్రి
యెటుమోచుఁ బటపట - నిరుపాయఁగాదె!
బంటనై సుతుఁడనై - పాయక నమ్మి
వెంట వచ్చిననన్ను - వినరానియట్టి
యీ వేఁడి మాటలి - ట్లేమిటికమ్మ
నీవాడెదవు మాఱు - నిన్నాడఁదగునె ?
ఇంతులకు స్వభావ - మీమాటలైన
నింతటి గతివి న - న్నేలుఁగ కాదుదువె!
కర్ణశూలంబులు - గాఁ బుణ్యపాప
నిర్ణయంబులులేని - నీవాక్యములకు
నీవనదేవత - లిందరుసాక్షి
దైవముల్ పంచభూ - తంబులుసాక్షి!
యనరాని మాటలి - ట్లాడిన పాప
మనుభవింపఁగఁ బాత్ర - మగు నీవెసాక్షి!
మనవంశమునఁ గైక - మగనిఁ బుత్రకుల
ననుపమదుఃఖంబు - లందించెఁగాని
నీవలె నీకీడు - నినుముంచు కొనఁగ
నీవాక్యములు వల్కె - నేచెడఁగోరి
యేమైన నేమినీ - వెటుపోయితేమి ?
రామునిఁ జేరనే - రము లేదు నాకు
పోయెద నిపుడె యీ - భూదేవి నన్నుఁ
బాయక రక్షింపఁ - బాల్పడు గాక!
వనదేవతలు సహా - వాసలై నీకుఁ
గనుఛాటు రాకుండఁ - గాతురుగాక!

ననునొవ్వనాడు వ - నంత పాపంబు
నిను ముంచుకొనక మా - ని తొలంగు గాక !
మానినీ ! నీకు సే - మము గల్గుగాక !
తానేఁగుచున్నాఁడ - తడకట్ట తోణఁగెఁ
దడయక దుర్నిమి - త్తములు మాయన్న
కడకేఁగి మఱలి యి - క్కడి కేమువచ్చి
నినుజూచునట్టి పు - ణ్యము సేతుమేమొ
కనఁజాల మిక్కిలి - కలఁగె నామనసు.''
అన సీత యేడ్చుచు - నరలేని మఱఁదిఁ
గని యశ్రులు దొలంక - గా నిట్టులనియె.
'' ఓలక్ష్మణ ! యెఱుంగ - కురక పల్కెదవు
చాలింపు నాకై వి - చార మేమిటికి ?
తాఋసించెదవేల - తనప్రాణవిభుని
సేమంబుఁ దలంచి రాఁ - జింతింప కిపుడు ?
గోదావరీనదీ - కూలముల్ నిండ
లేదో, శైలబిలంబు - లేదో, దావాగ్ని
లేదో, విషంబింత - లేదో ! కూపంబు
లేదో, యాయుధమైన - లేదో, చచ్చుటకుఁ
జూడు మీవనుచు గా - జులు పైకిఁద్రోచి
వీడిన కీల్గంటు - వెసఁ జక్కముడిచి
చుట్టఁబైఁట చెఱంగుఁ - జుట్టిరాఁ జెక్కఁ
బెట్టిన కమ్మల - బిగువంటి చూచి
రంగైన పైరాణి - రవికబిగించి
యింతం బెత్రిఁగించి - యెలుఁగు రాపడఁగ
నెగవెక్కి యేడ్చుచు - నిటునటు జూచు

మగువ కీలెఱింగి ల - క్ష్మణుఁ డూరడించి
యాయమ్మపదముల - కవనతుండగుచు
నోయమ్మ యిదె పోవ - నున్నాఁడ ననుచుఁ
దిరిగి చూచుచు మదిఁ - దేఁకువ మాని
యరిగెను సౌమిత్రి - యా రాముఁ జూడ.

—: రావణుఁడు సన్యాసివేషమునఁ
బర్ణశాల కరుదెంచుట :—

ఎప్పుడు లక్ష్మణుఁ - డెడవాసి చనియె
నప్పుడే రావణుఁ - డచటికి వచ్చి
చంద్రిక పూవల్వ - చెంగావి గాఁగ
చంద్రహాసము కర - స్థగిత దండముఁగ
గుజ్జరి కేడెంబు - కుండిక గాఁగ
సజ్జిక పూసరి - జపమాల గాఁగ
సైంహికేయ పతాక - ఛత్రంబు గాఁగ
సింహాదిమృగములు - చెదరి పాఱంగ
గొడుగుపావలు మెట్టి - గొడుగు వీతేర
వెడవెడ జపము గా - వింపుచు ముసలి
సన్యాసియై పర్ణ - శాలలో నున్న
సన్యాసిని విషాద - వతియైన నారి
శశిభాస్కరులు లేని - సంధ్యచీకటియు
శశిఁ బాయు రోహిణీ - సతిఁ బరగ్రహము
లాఁచినగతి రామ - లక్ష్మణుల్ దొలఁగఁ
జూచి చేరఁగవచ్చు - చో దశాననునిఁ
గనుఁగొని చల్లని - గాడ్పు రావెఱచె,

వనమహీరుహాములు - వడవడ వడఁకె,
తరలక నిల్చె గో - దావరీ తటిని,
హరిణాది మృగములా - హారంబులుడిగె,
రాముఁ డచ్చోటికి - రామున్న యతని
భామిని డాఁజేరి - పట్టెద ననుచుఁ
గడిమి చిత్రాకారఁ - గదియంగఁ జాయ
కొడుకు చేరిన యట్లు - కుటిలాత్మకుండు
గటికగప్పిన నూతి - కైవడిఁ గపట
మెఱుఁగనీయక చేరి - యిందీవరాక్షి
గుణవతిఁ గురువింద - కోరకవదన 8830
నణుమధ్యఁ గమలప్ర - తాయతనయనఁ
జపలాలతాగాత్రి - చంద్రబింబాస్య
విపులాతనూభవ - వెతలఁ జింతిలఁగ
నాదుష్టబుద్ధి కా - మాంధుఁడై చూచి
వేదంబుఁ జదువుచు - వినయాయుక్తముగఁ
గదియంగఁ బోయి యా - కార్యంబుఁజూచి
మదినుబ్బి పరవాదు - ర్మార్గుఁ డిట్లనియె.
"వెలఁది! తామరయిల్లు - విడిచి యిచ్చోట
మెలఁగఁగ వచ్చు ల - క్ష్మీవధూమణివొ!
శ్రీయను పేరింటఁ - జెలఁగి క్షీరాబ్ధి 8840
శాయినిఁ బాయని - శక్తివోనీవు!
వలరాజు నెడవాసి - వనభూములందు
మెలఁగ వచ్చిన రతి - మీనలోచనవొ!
యజగలోకముఁ బాసి - యవనిఁ గ్రీడింప
విజయంబు చేసిన - విబుధకామినివొ!

అచ్ఛోటఁ దగిన నా - యకుఁడు లేకున్న
వచ్చిన యచ్చర - వనితవో నీవు!
ముదిత! శ్రీదేవతా - మూర్తివో! కీర్తి
మదవతివో! భూత - మానినీమణివో!
ఎవ్వరిదానవే - యింతి నీ నిండు
జవ్వన మదనుని - సామ్రాజ్యపదవి!
నిగనిగమను డాలు - నిగుడించు సోగ
మగరాల చాలు నీ - మంచి పల్వరుస!
తరళతారకముతో - తమ్మిరేకులనుఁ
గరిసించి మీఱు నీ - కన్నులతీరు
జగతినెల్లడ నిండ్ర - జాలంబుఁ గప్పి
నిగ నిగ లీను నీ - నిడుదపెన్నెఱులు!
అరచందురుని చంద - మరసి యానంద
మిరవు కొన్నదిగదె - యింతి నీనుదురు!
తళతళమనుచు చి - త్తరములు చూపు
వలరాజు తూపు జ - వ్వని నీదు చూపు!
పులినమై మెఱసి రొం - ప్పులకుప్పయయ్యె
జలజాతనయన నీ - జఘన మండలము!
పదియాఱుకళలొప్పు - పరిపూర్ణచంద్రు
నెదురు కొల్గొనియె - నీ యెలనవ్వుమొగము!
తళుకులు చల్లు బం - గరు కలశముల
గొలిపించుకొని మేనిఁ - గులుకు పాలిండ్లు!
బంగరు నవఁటి కం - బముల చెల్వమున
సింగారమయ్యె నో - చెలియ నీ తొడలు!
కెంజిగురాకులఁ - గేలిసేయుచును

రంజిల్లె నీపాద - రాజీవయుగళి!
ఎంతపుణ్యము చేసె - నీ ముత్తెసరము
లింతి! నీ గుబ్బల - నెడవాయునెపుడు!
ఎటువలె నుండునో - యిగురాకుబోణి!
అటునిటు నడయాడు - నప్పుడు నీవు!
ఏ మాడ్కి నుండునో - మొలనవ్వు సొలవు
చేమించు నపుడు నీ - చెక్కుటద్దములు!
ఏవేడ్క సేయునో - యేకాంతవేళ
నీవు గారాపు చి - న్నెలఁ బల్కునపుడు!
ఏరు వాఱఁగ దరి - యిడిసిన యట్ల
నారి! నిన్నిటు జూచి - నామది కరఁగె!
యక్షగంధర్వ వి - ద్యాధరదివిజ
రాక్షసభామినుల్ - రారు నీసాటి!
ఇటువంటి జవరాల - వీపర్ణశాల
నిటు లొంటి నున్నచో - నేఁ డేరి చూచి
యోరిచి యూరక - యుందునే నిన్ను
నూరికేఁ గొనిపోవ - నూహ చేసితిని.
పూఁబోణి! రాక్షస - భూయిష్ఠ మగుటఁ
బ్రాఁబడి యుండదీ - పట్టు నీ కిపుడు
నీవు కాఁపురములుం - డిన నివాసములు
నీవు ధరించు మ - ణిభూషణములు
నీవు కట్టిన రమ - ణీయ వస్త్రములు
నీవు పూసిన యట్టి - నెమ్మేని పూఁత
నీకొప్పులోన వ - న్నియ గన్న విరులు
నీకేలుదమ్మిఁ బూ - నిన వలయములు

నీదు చన్నులమీఁద - నెలకొన్న సరులు
నీదండనుండువ - నీ మృగశ్రేణి
పొంది నిన్ను రమించు - పురుషరత్నంబు
నందందు ముఖ్యంబు - లని తలంచెదను
దేవతలకునైన - దృష్టింపరాని
యీవని సింహాది - మృగములఁ జూచి
వెఱవక యేరీతి - విహరించె దిట్లు ?
తరుణి ! నీవెవ్వరి - దాన వేర్పఱుపు
మేమి నిమిత్తమై - యిచటికి వచ్చి
తేమి గావలసిన - నేనిత్తు నీకు
పలుకవే పలుకేమి - పచ్చకప్పురమె !
తలయెత్తి చూడు మెం - తటి సిగ్గు నీకు
నెవ్వరు లేరిందు - నేనొక్కరుండ
జవ్వని ! నీవు ని - చ్చట నొక్కరితవు ''
అనిన నట్టి దురాత్ము - నతిథిగా నెంచి
తన యొంటిపాటు నా - తని ప్రల్లదములు
దిక్కులేమియుఁ జూచి - దీమసంబూని
యొక్కకై వడి వీని - కూరట సేయఁ
దనవారు వచ్చినఁ - దగ పాదపూజ
లొనరింతురని మది - యోజన చేసి
కపట సన్యాసిని - గాంచి యాసీత
యుపలపింపఁ దలంచి - యప్పుడిట్లనియె.
" భావింపుఁ డివె యర్ఘ్య - పాద్యాదికములు
కావలసిన భిక్షఁ - గైకొనుఁ డిపుడు
అయినది వంట చ - ల్లారక మునుపె

ప్రియముతో భుజియించి - తృప్తివహించి
వలసినగతి తరు - వాత వర్తింపుc
డలమితో వేగిర - మేల మీకిపుడు ?
అంగీకరింపుc డీ - యాతిథ్య "మనిన
యంగనామణిమాట - లాత్మc గైకొనక
తాను మృత్యువుc బొంద - దలcచిన యట్ల
జానకి నెత్తుక - చను బుద్ధి నెలమి
వేగిరపడు దైత్య - విభు తమకంబు
జాగుc జేసినc బోని - జాడయుcజూచి
యెప్పుడు వత్తురో - యేర్పడరాదు
తప్పెc గార్యంబు పా - తకువాతc బడితి
రామలక్ష్మణు లేల - రార్రైరి ? వార
లేమేర నున్నారో ? - యేమిసేయుదును ?"
అని యెదురులు చూచి - యతివేషధారి
తనతోడc బలుకంగ - తా నూరకున్న
శపియించునోయని - చాల శంకించి
యపుడప్రసక్తి పూ - ర్వానులాపముల
మఱల నెమ్మోము దా - మర మరలించి
జరపులc బెట్ట మ్రు - పాయతి కనియె.

—: సీత తనవృత్తాంతమును రావణునికిc జెప్పుట :—

" జనక మహారాజు - జనకుండు నాకు
తనపేరు సీత యూ - దశరథసుతుcడు
రామచంద్రుండు నా - ప్రాణవల్లభుcడు
సౌమిత్రి మఱcది యి - చ్చట వసింపుదుము

తనయింట వారింట - ద్వాదశవర్ష
దినములు నేబొంది - తిని వైభవముల
పదియుమూఁడవ యేఁడు - ప్రాపింపఁ దనదు
మదిలోన దశరథ - మనుజనాయకుఁడు
శ్రీరాముఁ బట్టాభి - షిక్తునిఁ జేయ
గోరి యుద్యోగింపఁ - గోపించికైక
రాముఁ గానల నంచి - రాజ్యంబు భరతుఁ
గామించి యేలింపఁ - గా వరంబడుగ
మా మామ యిచ్చిన - మది నట్లసేయ
నేమించి తండ్రికి - నిజము నిల్పుటకు
మునివృత్తి సవతి త - మ్మునిఁ గూడి యేను
వెనుకొనిరా వచ్చె - విపిన భూములకు
మావారు వేఁటాడి - మాంసముల్ దేర
నీవనంబుల కేఁగి - యెంత ప్రొద్దాయె
రారైరి! వచ్చు ప - ర్యంతంబు నిచట
మీరుండుఁ డింతేల - మీకు వేగిరము?
ఏమరణ్యము లకు - నేతేర నాదు
స్వామికిఁ బంచవిం - శతి హాయనములు
పదునెనిమిదియేండ్ల - ప్రాయంబు తనకు
నిది తుది పదియు మూఁ - డేండ్లవ వచ్చె
నినువంటిపెద్దల - నే చూచిరేని
తనుశక్తి దాఁపకెం - తయునుఁ జేకొద్ది
యాశలు దీర నీ - యగఁ గడఁదేర్ప
దాశరథులకు నెం - తయు నైజగుణము.
ఎందుండి వచ్చితి - వెచటికిఁ బోవె

దిందు రాగతమేమి - యేర్పడఁ బల్కు"
మనరావణుండుభ - యంబు జనింప
తన తెఱఁగెల్ల సీ - తను జూచి పలికె.
"గంధేభగమన ! రా - క్షస యక్షచార
గంధర్వసురభయం - కరుఁడ రావణుఁడ !
నీచక్కఁదనము క - న్నియ ! చూచి మెచ్చి
నోఁచి పెండ్లాడు మం - డోదరి ప్రముఖ
కులకాంతలను రోసి - కోరియు వేఁడి
వలచి వచ్చితిని నీ - వాఁడనై యిటకు !
ఎల్ల దిక్కులు గెల్చి - యెల్లలోకములఁ
జెల్లుగా నాముద్ర - చెల్లఁగ నేలి
వరియించు నారాణి - వాసంబులెల్ల
సరసిజానన ! నీదు - చరణముల్ గొలువ
నేలికసానివై - యెందునెవ్వరికి
భూలోకముల నేలి - పోఁడుముల్ గనుము !
ఇంతిరో ! పట్టంపు - టిల్లాలవైన
కాంతువు నేఁడె లం - కా పట్టణంబు
కమలాబ్ధి చుట్టున - గడ్తయై యుండ
నమరు త్రికూటాచ - లాగ్రంబు నందు
నున్న లంకాపురి - నోచకోరాక్షి !
నన్నుఁగూడి సుఖంబు - న మెలంగుమీవు
నాయింట దాసీజ - నము లైదువేలు
పాయక మణిమయా - భరణముల్దాల్చి
యచ్చర సతులుగా - నతివ నీసేవ
కిచ్చెద నీమన - సిమ్ము నాకిపుడు

విరిదోఁటలోఁ గల్ప - వృక్ష పంచకము
తరుణి! నీముడిపువ్వు - దండలకిత్తు!
అమరభూధర రోహ - ణాచల మణులు
రమణి! నీకిత్తు యా - రతులకే నిత్తు
అమీఁద కామధే - న్వాది ధేనువులు
భామిని! నీయింటి - పాఁడికేనిత్తు!
కల్యాణి! నాదు లం - కారాజ్యమెల్ల
మూల్యంబు వీడియం - బునకు నేనిత్తు
తరుణులలో నీవె - తరుణివి జగతి
పురుషులలో నేనె - పురుషుఁడ నిజము
అనుమతింపు" మటన్న - యాసీత వానిఁ
గనుఁగొని నెమ్మేను - గజగజ వడఁక
తెలివిఁ దెచ్చుక చాల - దిటముతో రామ
కులసతి వానిఁ జే - ర్కొని యిట్లులనియె.
"హరుఁడెక్కు వెట్టని - యమరభూధరము
కరుఁడు గలంకయుఁ - గనని వారాసి
అకళంక చంద్రుఁడా - హవసురేంద్రుండు
సకలసద్గుణగణై - శ్వర్య పూర్ణుండు
అట్టిరాముని దేవి - నన్యుఁ డొక్కరుఁడు
జుట్టన బ్రేల్చాఁచి - చూపశక్తుండె?
ఆమహాబాహుఁడై - నట్టి రాఘవుని
భామిని నతఁడు చే - పట్టినదాన
సత్యసంధుఁడు రామ - చంద్రుండు నన్నుఁ
బ్రత్యాశ గలిగి చే - పట్టిన దాన
పూర్ణచంద్రాననాం - బుజుఁడైన యాను

పర్ణసాయకుఁడు చే - పట్టినదాన
పట్టైయిన ధర్మంబె - పట్టిన రాజ
పట్టభద్రుండు చే - పట్టినదాన
కోదండపాణియై - కొమరొప్పు రాము
పాదపద్మములు చే - పట్టిన దాన
క్షుద్రనిశాచరి - స్తోమంబు దునుము
భద్రేభగమనుఁ జే - పట్టిన దాన
సాహసనిధిఁ గృపా - జలధి నాజాను
బాహుని కరుణ చే - పట్టిన దానఁ
గోరఁ జెల్లని సింహ - కులపతి నక్క
గోరిన చందానఁ - గోరితి వీవు
కాంచన వృక్షముల్ - గనినట్లు కాల
వంచితాత్మకుఁడవై - వాకొంటి విట్లు
ఆఁకొని యున్న సిం - హము కోఱపల్లు
వీఁక చే దివియ భా - వించెద వీవు
విషయాతురుండవై - విషమవాక్యములు
విషముఁ ద్రావిననీకు - విషమింపకున్నె
నాలుక నసిధార - నాకినయట్లు
పోలనూదిని కన్ను - పొడుచుకొన్నట్లు
మెడరాయి కట్టుక - మీరివారాశి
బడినట్లు రవిఁ గేలఁ - బట్టినయట్లు
కాలాగ్నివడి నడి - గట్టుకొన్నట్లు
శూలాగ్రముల నేఁగఁ - జూచిన యట్లు
రాముని దేవిఁ జే - రఁగఁ దలంచెదవు!
కామసాత్మక నీదు - తలవ్రయ్యనిపుడె

జలరాశి యెంత తు - చ్ఛపు నదియెంత ?
కులశైల మది యెంత - గొగ్గిరాయెంత ?
కల్పవృక్ష మదెంత - ఖాదిరం బెంత ?
అల్పమానస ! రాము - నంతటివానిఁ
జెనకెదు బంగారు - సీసంబు నెట్టు
లెనయు ? రామునితోడ - నీడురాఁగలవె !
గరుడునితో మాల - కాకి యేరీతి
సరివచ్చు రాముని - సాటివే నీవు !
రాముఁడుజ్జ్వల ధను - ర్బాణ సన్నాహ
భీముఁడై యుండనం - బేదనుబోల
ననుబట్టిమేనఁ బ్రా - ణంబులు డాపఁ
గనుకల్గి యేతల్లి - కడుపు మెచ్చెదవు ?
యాగబియ్యంబని - యత్తి వజ్రంబు
మూఁగిమ్రింగిన జీర్ణ - మున కేలవచ్చు !
నివుడె వచ్చెదరు వో - యినఁ బోతివింక
కపటాత్మ ! నిలిచినఁ - గడకుఁ బోలేవు
రాముని బాణప - రంపరల్ బొదివి
నీమేను దహియించు - నిమిషంబులోన !"
అని భీతిచే సీత - యాడినమాట
లనునయాలాపంబు - లను లెక్కఁగొనక
కావరంబున దశ - కంధరుండలిగి
యావధూమణి తోడ - నప్పుడిట్లనియె.

—: రావణుఁడు సీతకు నిజరూపంబును గనఁబఱచుట ; సీతదూషించుట :—

"తొయ్యలి ! ధనదుండు - తోఁబుట్టునాకు

నియ్యాన జగము ల - న్నియు నాకు వెఱచు
జనులు మృత్యువు గన్నఁ - జలియించు రీతి
ననుఁజూడ సురలప్రా - ణములు చలించు
దానవ గంధర్వ - దైత్యకింపురుష
మానవసురసిద్ధ - మండలియెల్ల
వెఱతురు, తల్లులు - వేరైన యన్న
నరవాహనుఁడు గాన - నాకు నాతనికి
నొక కారణంబుచే - యుద్ధంబుఁగలుగ
సకలుపాత్మీయ మ - హా ప్రతాపమునఁ
బాఱఁద్రోలిన యక్ష - పతి యందు నిలువ
నేరక ముక్కంటి - నెయ్యుఁడు గాన
కైలాసమునఁ దలఁ - కకయుండె నిట్టు
లాలంబు నేగెల్చి - యతని పుష్పకముఁ
గైకొంటి! నది కామ - గమనయోగ్యంబు
నాకు వేడ్కనుసేయు - నాఁడు నేఁటికిని
అందుమీఁదఁ జరింతు - లఖిల లోకముల
నిందీవరేక్షణ ! - యింద్రాది సురలు
నా పేరు వినిననె - న్నఁడు దమ యిండ్లఁ
గాఁపురంబులు చేసి - కనుకూర్కరెపుడు!
చల్లగా నారతి - శ్రమ మార్ప గాని
వెల్లావిరిగ గాలి - విసరఁగ వెఱచు
మదినాకు హితమైన - మార్గంబెకాని
గదిమి భాస్కరుఁడెండఁ - గాయంగ వెఱచుఁ
గలగఁగ స్వాదూద - కములచేఁగాని

బలువిడి వాహినుల్ - ప్రవహింప వెఱచు
సేనాజ్ఞ సేయక - యెవ్వారికైనఁ
బూని యయ్యముఁడు చం - పుకఁ బోవ వెఱచు
నెచ్చోట నాయిచ్చ - నేకాని తాను
విచ్చలవిడి నగ్ని - వెలుఁగఁగ వెఱచుఁ
బూయని తరువులఁ - బువ్వుల నిత్తు
కాయని వృక్షముల్ - కాయఁ జేయుదును
కురియింతు వానలు - కోరినయపుడు
భరియింతు సకలభూ - భారంబు నేను !
నావీడు జలధికి - నడుచక్కి లంక
రావణుఁ డందురు - రామ ! నాపేరు
అచట వజ్రమయంబు - లైన కోటలును
నిచితముక్తాఫలా - న్వితగోపురములు
గోమేధికపు పిల్ల - కోటలు రజత
హేమాది ధాతుస - మేత సౌధములు
చతురంగ బలపూర్ణ - సామగ్రిరత్న
చతురంతయానాది - సకల వస్తువులు
తలఁచినప్పుడు పండు - తరువుల వనము
లలరు నన్నియుఁ బూచు - నట్టి పూఁబొదలు
కలఁగి భేరీమృదం - గములు మిన్నంద
నలరెడు లంకామ - హాపట్టణమున
ననుఁగూడి క్రీడించి - నరుఁడైన రాము
మనసున దలఁతువే - మఱికొంత లేక
కొఱఁగాని వాఁడని - గుణహీనుఁ డనియుఁ
గరుణ సేయకచూచి - కన్నట్టితండ్రి

యడవుల తరిమించి - యాజ్ఞ సేయించు
గడసరి మగఁడనం - గానేల నీకు ?
సిగ్గు కాకేమని - చెప్పెదు రాము
నగ్గించి నాదుస - మక్షంబు నందు
నీపుణ్యవశముచే - నిన్ను గామించి
నాపాటి దొరవచ్చు - నా ? కానలేవు !
ఎఱుఁగ వింతయు కాక - యేకడ కేఁగ
తరుణి ! కూలుదువు చిం - తాసముద్రమున
ననుఁజూచు నట్టిమా - నవతీల లామ
మనసున నితరుని - మఱు చేరఁగలదె ?
జగడంబులో నన్ను - జనకజ ! నీదు
మగని నాయెడఁదృణ - మాత్రుగాఁదలఁపు !
అట్టినే నీవు భా - గ్యము సేయు కతన
గట్టిద నట్టిమం - గళసూత్ర మిపుడు
రా లేచి రమ్మన్న - రాముని దేవి
జాలిచే మదినీఁగొం - చక యిట్టు లనియె.
" ఇంద్రుని సతిఁదెచ్చి - యిముడుకోవచ్చు
చంద్రుని సతిఁబట్టి - సైరింప వచ్చు
శ్రీరాము నిల్లాలిఁ - జెనకి యొక్కరుఁడు
నేరుచునే మీన - నిలుపఁ బ్రాణములు ?
బ్రదుకనొల్లక యిట్లు - వలికిన నిన్ను
బ్రదుకనిచ్చునె రఘు - ప్రవరు బాణాగ్ని
యాదె వినవచ్చె రా - మానుజు మాట
ఇదెవచ్చు నాస్వామి - యెటకుఁ బోయెదవు ? "
అని బెదిరింప ఘో - రాకారుఁ డగుచుఁ

గనలుచు "నాపెంపుఁ - గనలేవు నీవు
యిలఁగాలు మోపక - యేమింట నిలచి
యిలనెల్ల నొకవ్రేల - నెత్తఁ జూచెదవా!
వనధులేడును హస్త - వనజంబులోన
నునిచి పుక్కిటఁ బట్టి - యుమియ నెంచెదవా!
ఏనుమృత్యువుఁ బట్టి - యిట్టట్టు జుణిఁగి
పోనీక చంపినఁ - బొందుసేసెదవా!
చంద్రసూర్యుల నొక్క - సరిగాఁగఁబట్టి
చంద్రాస్య! యొకముద్ద - సలుప నడ్డెదవా!
ఇలయు నింగియుఁగూర్చి - యేకంబుఁ జేసి
చెలఁగి యెక్కడ నిల్వఁ - జేరవచ్చెదవా!
కామరూపముమించు - కామరూపమున
నేమది యలరింప - నెయ్యముంచెదవా!
వలచివచ్చినవాఁడ - వట్టిమాటలను
తొలఁగిపోవుదునె? యె - త్తుక పోదుఁగాక!"

## —: సీతాపహరణము —

అని కన్నుదోయి సూ - ర్యాగ్నుల రీతిఁ
గనకన వెలుఁగ నం - గంబు జాడింప
నెటువలె దాఁచెనో - యిందాక ననఁగ
కటికి కాటుకకొండ - గతిమేను మెఱయ
నెందుండి తెచ్చెనో - యీదశాననము
లందుపై నిరువది - హస్తంబు లనఁగఁ
గరమొప్పి కామాంధ - కారంబురీతిఁ
గరకప్పు మేనితోఁ - గడు విరహమున

బదియవస్థలు దోఁచు - పగిది మస్తములఁ
బదియును మీఱఁగ - పదియవస్థలును
నినుమడించినయట్లు - యిరువది చేతు
లనువుగా నవి శాఖ - లై చిగురించు
కరణి హస్తంబులఁ - గనుపింప నవ్వి
విరుల ఫలంబుల - విలసిల్లు నట్లు
శరశరాసనకుంత - చక్రగదాసి
పరికరంబులఁ దాల్చ - బల గర్వరేఖ
భామిని వెఱఁగంద - బలిఁ జెంతఁ బెరుగు
వామనుండన దైత్య - వరుఁడు మిన్నంది
కంకణకుండలాం - గద కిరీటములు
సంకులచ్ఛాయ దం - ష్ట్రలు శోభిలంగ
దివ్యాభరణవస్త్ర - దేదీప్యమానఁ
భవ్యవిగ్రహుఁడయి - బాలకట్టెదుర
నిలిచి "నన్నెఱుఁగవే - నిర్జరప్రభుని
బలిమి నోడించిన - పంక్తి కంధరుఁడ!
అలివేణి! నీవునా - కనుకూలవైన
గొలిచెద నీతులా - కోటి నవీన
నిరుపమమణివిభా - నీరాజితాంఘ్రి
సరసిజయుగళదా - స్యమునిర్వహించి!
బిగిసెదవేల నే - బేలనే నీకు!
మగువ! యల్పాయువుల్ - మనుజులందఱును
వారిలో నధముఁడీ - వల పదభ్రష్టుఁ
డీరాఘవుఁడు శౌర్య - మింతయు లేదు
నీకు వానికి నేఁటి - నెయ్యంబు చాలు

నాకు దక్కితివి మా - నంబు దాఁచెదవు
నీవుదాళిన సేద - నిలుపోపఁజాల
భావజు చిగురు అం - దుపు కోఁతలకును
చేయిమ్ము నాకని" - సీత కెంగేల
దాయఁగఁ జేరి యు - ద్ధము లేక పట్టి
యీడిచి బుధుఁడు రో - హిణిఁ బట్టి నట్టి
జాడగా జఘనపా - ర్శ్వము క్రింద నొక్క
కరమొయ్యఁ జూచి రా - ఘవు దేవిఁ దెచ్చి
మొఱసేయ మాయచే - మొలిపించి నట్టి
రథముపై తన మనో - రథము చేకూడి
పృథుశక్తి నందుపై - పృథివీతనూజ
నునిచి తానాచెంత - నుండగఁ జూచి
వనదేవతలు భీతి - వగచి కలంగి
నలుదిక్కులకుఁ బాఱ - నానామృగములు
కలఁగిపోవఁగ లేక - కన్నీరురాల్ప
నదలింపుచును సీత - నంజక తిట్టి
బెదరింపుచును బ్రాణ - భీతిచేఁ గలఁగ
నూరడింపుచును తన - యూరువులందుఁ
జేరిచి పడనీక - చేతులు బాదివి
"హారామ! హారామ - హా! సుమిత్రాకు
మారక!" యనుచుఁ బ - ల్మారు కూయిడఁగఁ
బన్నగాంగనరీతిఁ - బలవింపుచున్న
కిన్నరరమణి పో - ల్కిని ప్రాణభీతి
గజగజ వడఁకుచు - కన్నీరురాల
నజరులు బ్రదుకుఁడీ - యని తెల్పఁ బోవు

కైవడి నాకేఁగ - గగన మార్గమునఁ
బోవుచో దిగులుచే - భూమిజ వణఁక
"హా లక్ష్మణా! హా ద - యానిధి! రామ!
పాలింపు" మని విధిఁ - బలవించె నిట్లు
"మఱచితిరే నన్ను - మదిఁ గ్రొవ్వి వీఁడు
చెఱపట్టుకొనిపోయి - చెడఁ గోరినాఁడు!
ఈ యధర్మంబు మీ - రేమియు నెఱుఁగ
రీ యధముని చేత - నే జిక్కువడితి
మేనులు సుఖము భూ - మియు ధర్మమునకు
మానువారలు నన్ను - మఱచి యున్నారు!
కాలంబు వచ్చిన - కలుగు సస్యములు
చాలఫలించిన - జాడ వీనికిని
కర్మానుభవసిద్ధ - కాలంబుఁ జేరి
దుర్మార్గుఁ డగుచు న - ధోగతిఁ బడగఁ
దలచె, కైకతలంపు - దైవయత్నంబుఁ
దులతూగి యదినేఁటి - తోఁ గడతేఱె!
ఓ జనస్థానంబ! - యూహించు నీవు
రాజన్యమణియైన - రామునితోడ
నీరాక్షసుని రాక - యిట్టి నా తెఱఁగు
కారుణ్యమునఁ దెల్పి - కాచి రక్షింపు!
కనుఁగొంటిరే కర్ణి - కారంబులార!
దనుజుఁడెవ్వరు లేని - తఱి నన్నుఁ బట్టి
కొనిపోవుచున్నాఁడు - కోరి మీరైన
ననుదెల్పుఁడా రాము - నకు వచ్చుగాని
చనవయ్యు నీవు ప్ర - స్రవణ శైలంబ!

ననుఁదెల్పు శ్రీరాము - నకు దయఁదలఁచి!
అమ్మ! గోదావరీ! - యకట! నీవైన
నమ్మించి మారాము - నకుఁ దెల్పవమ్మ!
వాకొనవే పంచ - వటి! కరుణించి
నీకు దండము రాము - నికి నా తెఱంగు!
ఓర్వలేదని నన్ను - నోపర్ణశాల!
సార్వభౌముని రామ - చంద్రు రమ్మనుము
తెలిపోవకవన - దేవతలార!
చాలవేగమె రామ - చంద్రు రమ్మనుఁడు!
మృగసమూహములార! - మీకు మ్రొక్కెదను
మొగమాటవ్రాని రా - ముని తోడితెండు!
శరణు జొచ్చెదఁ బక్షి - జాతంబులార!
కరుణించి వేగ రా - ఘవుఁ దోడితెండు!
చాలనమ్మితి వన - స్పతులార! యిపుడె
కాలూఁదనీక నా - కాంతుఁదోతెండు!
ఈలోకమున నున్న - నీమేనుఁ దొఱఁగి
యేలోకముల నున్న - నే నమ్మియున్న
మనువంశతిలకంబు - మఱలంగ నన్ను
గొనిరాక తానేల - గొదవ రానిచ్చు!
నమ్మితి రావయ్య - నా ప్రాణనాథ!
నమ్మితినే లక్ష్మ - ణా! నినుఁజాల!
అనరానిమాట ని - న్నాడిన ఫలము
తన కేల మాను యిం - తకుఁ జుట్టుకొనక!
ఏఁటికిఁ బొమ్మంటి - నేనిన్ను? రాము
నేఁటికిఁ బనిచితి - నెఱుఁగంగలేక!

అని పోవుచోట ని - న్నరికట్టు నొక్క
పెను మఱ్ఱికొమ్మపై - పృథుశక్తినున్న
యాజటాయువుఁ జూచి - యశ్రులు దొరఁగ
భూజాత యాసీత - పొక్కుచుఁ దనదు
నెలుఁగు రాపడనాల్క - నెడఁదడి లేక
కలఁగుచు నోవిహం - గవరేణ్య! తండ్రి!
కావవే! దనుజుఁడొ - క్కఁడు దిక్కులేని
కైవడి నెత్తుక - గగనమార్గమునఁ
జనుచున్నవాఁడు ల - క్ష్మణుతోడనైన
ననునేలు శ్రీరాము - నకునైనఁ బోయి
యెఱకలు గలవాఁడ - విప్పుడే యెగసి
యరుగుము నమ్మితి - ననికూయుచుండ
ఖగవంశమాళి యా - కస్మికంబైన
జగదేకమాత యా - జానకిమాట
విని చెఱఁగొని పోవు - విబుధారి నతని
ఘనమైనయూరుప్ర - కాండ పీఠమున
జలదమాలికలోని - చంచల లతిక
వలెభీతి గడగడ - వడఁకు భూపుత్రిఁ
గనుఁగొని మిగుల నా - గ్రహముతో విహగ
వనికబాంధవుఁడు రా - వణున కిట్లనియె

—: జటాయువు రావణునకు హితోపదేశము చేయుట :—

"ఓరి! దశానన! - యుచితమే నీకు
శ్రీరాము కులకాంతఁ - జెఱఁగొని పోవ?
సత్యపరాక్రమ - సద్ధర్మ పరుఁడ

భృత్యుఁడ రామున - కెప్పుడు నేను
సకలము నేలంగఁ - జాలి యింద్రాదు
లకునైనఁ జేరి యా - లము సేయరాని
శ్రీరాము నిల్లాలి - సీతనుఁబట్టి
యేరీతిఁ గొనిపోయె - దెటు వోవనిత్తు ?
సద్ధర్మ పరుఁడైన - జననాయకునకు
బుద్ధియే పరకాంత - పొంగాలాసింప ?
పరుఁడను మాత్రమే - భాస్కరవంశ
శరనిధి సంపూర్ణ - చంద్రుఁ డుత్తముఁడు !
అట్టి రామునిభార్య - ననదనుఁబోలి
పట్టితి మృత్యువుఁ - బట్టిన యట్లు !
కనుఁగొంటి నిమ్ము నా - కన్నుల యెదుర
జనకజ కింక వి - చారమేమిటికి ?
విడువు మీకల్యాణి - విడవేని యిపుడు
విడిపింతు నీమేన - వేగఁ బ్రాణములు !
ధర్మార్థకామముల్ - ధరణీశులాది
ధార్మికులకె గాని - తలఁప నన్యులకుఁ
గాటిల్లునే పుణ్య - పాపంబులెల్ల
హాటకంబగుట రా - జాధీన మింతె !
చపలాత్ముఁడవు దుర్వి - చారుఁడ వెపుడు
కపట మానసుఁడవు - కామాంధమతివి
యిట్టిదురాత్మున - కేరీతిఁ గలిగె
నిట్టి మహైశ్వర్య - మెన్న నచ్చెరువు !
గుణహీనులకు గాము - కుఁడు చాల హీన

గుణుఁడందురట్టి దు - ర్గుణ పరాయణుఁడు
చిరకాల మెట్లు లూ - ర్జితముగా బ్రదుకు !
ధరమీఁద నీకిట్టి - తలఁపెట్లు గల్గె ?
రాముఁడు సేయు నే - రము నీకునెద్ది ?
ఏమిటికి ద్రోహ - మెంచితి వీవు ?
ఆ చుప్పనాతి మ - హాపాతకంబుఁ
జూచి కానఁగలేక - శూరుల మనుచు
ఖరదూషణాది రా - క్షసు లెదిరించి
దురములోఁ బడిరని - తోఁచనే నీకు ?
పోరవచ్చిన వారిఁ - బొడుతురు గాక
విడుతురే యెందైన - వీరశేఖరులు ?
నిరపరాధుని రాము - నీవిట్లు చెనకి
ధరణిజఁ గొనిపోవ - ధర్మమార్గంబె !
రాముని ఘోర నా - రాచముల్ పిడుగు
భూమీధరంబులఁ - బొడి సేయునట్లు
మేను వ్రయ్యలు చేసి - మీవంశమెల్ల
హానిఁ బొందింపక - యవి యేలమాను !
వజ్రంబు వృత్రుని - వధియించునట్లు
వజ్రసారము రఘు - వరుని బాణంబు
తఱుముక వచ్చి నీ - తల లుర్విమీఁదఁ
దొరలించు, నీవేగఁ - దొరసేది యపుడు ?
భూమిజ యొడిలోని - భోగీంద్ర రమణి
కామాంధ ! మెడఁజుట్టు - కాలపాశంబు !
తెలియక కొనిపోవఁ - దీరునే నీకుఁ
జలమేల ! సీత ని - చ్చట డించిపొమ్ము

భరియింపఁ దగుమోవు - భరియించి పోవ
నరిగించుకొనిన నా - హార మింపగును!
కాక యితంబెఱుం - గని వానికెందు
రాకుండునే హాని - రాక్షసనాథ!
తనకు హానిజనించు - తలఁపు దలంచు
చెనఁటి యొండైన నీ - క్షితి నున్నవాఁడె?
అరువదివేలేండ్లు - లాయెను నాకు
ధరణి నీయంత పా - తకుఁ జూడలేదు!
వయసువాఁడవు నీవు - వార్ధకంబగుటఁ
బయిసేయ కున్నాఁడఁ - బదరి నీమీఁద
నధమరాక్షస! నీకు - నాయుధశ్రేణి
యధికంబు నే రిక్త - హస్తుండ నిపుడు
ఐనను నీకులో - నయ్యెడి తలఁపు
మాను మీచింతనా - మదిలోన లేదు
ఎటులైన మేలునే - నీక్షింపుచుండ
కటకట! సీతనా - కన్నుల యెదుర
చెఱవోవఁ బ్రాణమా - సింతునే! నిన్ను
నరికట్టి రాముని - కర్పింతు నిపుడె!
హేతువాదంబుల - నెల్లవేదములు
భూతలంబునఁ దన - బుద్ధికిందఱులు
నారీతి నీసీత - యుబ్బదు నీకు
కారాని పనిసేయ - గానెట్లు వచ్చు?
తనతో ముహూర్తమా - త్రం బెదిరించి
యనిసేయు మైనటు - లయ్యెడు నిపుడు!
ఖరుఁడు రాఘవసాయ - కములచేఁ బడిన

హరువున వజ్రసా - రాత్మీయ నఖర
నారాచములచేఁ దృ - ణంబుగా నిన్ను
జేరదఁ జట్టలు - చింతు నీపొట్ట
రామలక్ష్మణులు దూ - రము పోయిరనుచు
నీమదిఁ దలఁచితో - నీవు వాతెదవు ?
రామునికిని దశ - రథునకు హితము
నామదిఁ దలఁచి ప్రా - ణములైన విడుతు
విడువనీ జానకి - వేఁడి యాతిథ్య
మడిగితి నాతోడ - నవిసేయు " మనుచు
" పందును తొడిమెతోఁ - బాపినయట్లు 4870
భండనంబునఁ దల - వడవేతు నిన్ను "

—— జటాయువు రావణునితోఁ బోరిసేలఁ గూలుట :——

అన రావణుఁడు కన్ను - లందుఁ గెంజాయ
జనియింప నట్టహా - సము సేసి నిలిచి
తేరు మఱల్చిన - దిగ్గునపక్షి
వీరుఁడాగ్రహముతో - వృక్షంబు విడిచి
ఱెక్కలతోడ ధా - త్రీధరంబనఁగ
గ్రక్కున నెగసి రా - క్షసనాథుఁడాఁకి
పోరాడుచో మహా - ద్భుత చండవాత
ధారలఁ బెనగొన్న - ధారాధరముల
నుద్ధులై వారితో - డురువుల నాఁగి 4880
అద్దిరా ! వీరి బా - హాగర్వ మనఁగ
వదలక పోర రా - వణుఁడాగ్రహించి
కదిమి నాళీకవి - కర్ణి బాణముల

నాజటాయువుసేయు - నంతజస్వామి
తేజంబుతోడ శం - క్తిగ్రీవు నదిరి
భిదురసారములైన - పెనుగోళ్ళ వాని
మెదురొమ్ము నెత్తురు - లెగయఁగఁ గోటి
వ్రయ్యలు చేసిన - వాఁడల్గి వెనుక
తియ్యక విహగేంద్రుఁ - డెగుము పొమ్మనుచు
దండధరోద్దండ - దండప్రకాండ
చండిమ ద్వాదశా - స్త్రములు సంధించి
యేసిన నవి తన - యొఱకలు గాడి
దూసిపోయిన నల్క - తోఁ బక్షివిభుఁడు
మహనీయ మౌక్తిక - మాలికా స్తబక
మహితమా నతని భీ - మ శరాసనంబు
పైఁబడి వ్రేల్మినఁ - బరియలు గాఁగ
తాఁబూని విఱిచిన - దశవదనుండు
వేరొక్క విలుఁ గొని - విశిఖవర్షంబు
వారిదంబును బోలి - వాఁడు వర్షించి
శరపంజరముఁ జేసి - చదలనట్టిట్టు
సరుగరాకుండ త - న్నరి కట్టుటయును
గూడు వెల్వడు పులు - గును బోలి చూడ
నీడజోత్తంసుఁడ - న్నిశితాస్త్రకోటి
తెక్కలచే విద - ర్చినిశాటు దాఁకి
యుక్కు ముక్కున ధను - వొడిసి రాఁదిగిచి
మున్నుట్టివశి త్రుంచి - మున్నాడి మేన.
నున్నట్టి జోడు తా - నుథువడిఁ జించి
పాఱఁగవైచి త - ర్పంబునఁ జేరి

వారువంబుల దైత్య - వదనముల్ గలుగు
వాటి పీఁచమణంచి - వాని సారథిని
దోఁటిముక్కున రెండు - తునియలు చేసి
ధరణిపై వైచి ర - త్నమయంబుఁ గనక
గిరి సమానంబుఁ గిం - కిణీరాన్వితంబు
నగుచు నొప్పుచు సీత - యందుపై నుండు
గగనయానరథంబు - గ్రక్కునఁ దన్ని
పొడిసేసి చంద్రునిఁ - బోలిన తెల్ల
గొడుగు చింపులు చేసి - కుంభిని వైచి
టెక్కెంబు విఱిచి పం - టించి తాలెక్క
ముక్కాడనీయక - ముక్కునఁ బొడిచి
జేవురుఁ గొండగాఁ - జేసి గర్వింప
రావణుఁ డపుడు ధ - రాసుతఁ బట్టి
యిలఁ బాదచారియై - యేమియు లేక
నిలుచు నప్పుడు భూత - నివహంబు మెచ్చ
బలదర్పములనున్న - పక్షిపుంగవుని
బలహీనుఁడగు దైత్య - పతిఁ జేరి చూడ
సందిట గట్టిగా - జానకి నుంచి
యందఱు వెఱఁగంద - నాకాశవీథి
దానవవిభుఁ డేఁగ - దాను వెంబడిని
" పోనీను పోనీను - పోకుము పోకు !
నిలునిలు మీ రాము - నెలఁతను డించి
తొలఁగుము పావని - త్తుమ కాది నిన్ను !
అతివజ్రసారది - వ్యాత్రురాఘవుని
యతివను గొనిపోవు - నది కారణముగ

దానవకులమెల్ల - దగ్ధమై నీవు
హానిఁ బొందుదువు కా - మాంధుఁడ వగుచు
సీతఁ బట్టితివేలఁ - జెడగోరి దప్పి
చేత విషంబు మ్రు - చ్చిలి త్రావు వాఁడు
బ్రదుక నేర్చునె ? కాల - పాశముల్ నిన్ను
వదలక కట్టి యీ - వైఖరిఁ దెచ్చె !
గాలంపుటెఱ్ఱలఁ - గని చేరి మ్రింగి
పోలేక తగులు నం - బుధి మీన మనఁగ
వలవనిట్టి దురాశ - వలదురా ! నీకు !
ములుచదానవ ! యేల - మోసపోయితివి ?
ఈరావణుఁడు శౌర్య - హీనుఁడై వెఱచి
చోరకృత్యమునకుఁ - జొచ్చినాఁ డనుచు
నవ్వరే నిన్ను బృం - దారకులెల్ల !
దవ్వుగాపు యశః ప్ర - తాపముల్ నీకు
వీరధర్మము మాని - వెన్నిచ్చి పఱచి
శూరి ! రావణ ! పోవ - నుచితమే నీకు !
కాని కార్యము లంత్య - కాలంబు లందు
పూని చేసినవాఁడు - పొలసిన యట్లు
యిట్టి దుష్కర్మ మీ - విప్పుడు చేసి
కట్టఁ జిక్కితివేల - కాలపాశముల !
ఖలుఁడు సేయఁగరాని - కార్యముల్ చేసి
పొలియుఁ గావున నిన్ను - బొరిగొందు నిపుడు !
అనిమిత్త వైరంబు - నధిక పాపంబు
వనజగర్భుఁడు చేసి - వర్ధిల్లఁ గలఁడె ?
విడువు జానకి " నంచు - వీపుపై దుమికి

కడువాడిరైన వం - కరగోళ్ళచేత
పిక్కలఁ గాల్సేరి - పెరిగి మత్తేభ
మొక్కటియును బోవ - నోడక నిలిపి
యులుగు కొద్దిని డిగ - నంకుశంబెత్తి
వలదేరి నటుకు మా - వంతుని రీతి
వ్రయ్యలుగాఁగొట్టి - వాని మస్తములు
పయ్యాడి మకుటముల్ - పదియు డొల్లించి
తలవెంట్రుకలు కట్టి - తానీడ్చి తెచ్చి
యూలయించి ముక్కున - నంగముల్ బొడిచి
చాలఁ బీడింప రా - క్షసచక్రవర్తి
యాలోన భయకంపి - తాత్ముఁడై జడిసి
గట్టిగా నెతము చం - కను సీత నుంచి
కొట్టెను వలకేల - గొట్టఁ బక్షీంద్రుఁ
డాకొట్టువడి యుండ - జాధీశుఁ డలరి
పోర రావణు కరం - బులఁ జంచువులను
పదియును నఱికినఁ - 'బడిపోవు కరము
లది లేదు బొంకని' - నట్లు వెండియును
పుట్టలోఁ బన్నగం - బులు వచ్చినట్లు
నెట్టుక మొలిచిన - నిర్జరారాతి
సీత నొక్కెడనుంచి - చేతులఁగాళ్ళ
చేతను బొడిచినఁ - జేయుట లేక
యా విహగోత్తముఁ - డతి సాహసశక్తి
రావణుతోఁ బోర - రామకార్యమునఁ
దెగి ప్రాణముల యాస - దీఱిపోనీక
జగడించు ఖగకుల - స్వామి కీలెఱిఁగి

ఖండించి తనచేతి - చంద్రహాసమున
రెండుగాళ్లను రెండు - రెక్కలు దునియ
నఱికినఁ బెద్ద కొం - డయుఁ బోలి ధరణి
బొరలు జటాయువుఁ - బొగులుచు చూచి
'తన నిమిత్తముగ నిం - తటి పక్షిరాజు
దనుజునిచేత నిం - తకువచ్చె' ననుచు
చేరఁగఁ బోయి యా - సీత కన్నీరు
ధారలుగాఁగ నం - తయు నేడ్చుచుండ
నారఁబారినయట్టి - యగ్నియుఁబోలి
ధారుణిపై నీల - ధారాధరంబు
చెలువైన దేహంబు - సితకరద్యుతిని
తెలుపైన యుదరంబు - దీర్ఘతుండంబు
గలుగు జటాయువుఁ - గాంచి రావణుఁడు
'గెలిచితి నిట్టి ప - క్షివరేణ్యు' ననుచు
నలరుచో, సీత జ - టాయువు మీఁదఁ
గలఁగుచుఁ బడి - యార్తిఁ - గౌఁగిటఁ జేర్చి
జనకుని జూచి వి - షాదంబు నొందు
తనయకై వడి నేడ్చి - తాలిమి లేక
యంతంతఁ దనకైన - యపశకునములఁ
జింతించి యివికీడు - సేయుగా యనుచు
"ఓరామ! యెఱుఁగవే - కున్నావు! నన్ను
నీరాక్షసుఁడు పట్టి - యేగెడి, జాడ
నామొఱయాలించి - నానాద్విజంబు
లీమృగంబులు నీకు - నెఱిఁగింపవేమొ!
నాకు నష్టమువచ్చి - నాదురదృష్ట

మీాకీడు పొందగ - నిట్లున్నకతన
దానవు నెదిరించి - తనభుజాశక్తి
నైనమాత్రంబు జ - టాయువుఁ జూచి
మృతినొందెఁ రక్షింప - వే! రఘురామ!
హితమూని ప్రోవరా - వేలసౌమిత్రి!
అని చాల విలపించు - నవనిజఁ జూచి
దనుజనాయకుఁడు - చెంతకుఁ జేరఁబోయి
చేపట్టిదిగిచిన - శ్రీరామ! రామ!
కావవే! యనుచు వృ - క్షముఁ గౌఁగలించు
వల్లికయును బోలి - వదలక పెనఁగి
వల్లాడ, విడక కా - మవికార మొదవ
కేరడంబులు పల్కి - కీల్గంటు పట్టి
మాఱు మోమిడ నీడ్చి - మహిఁ బడవైచి
కరిచేతఁ జిక్కిన - కమలిని యనఁగ
తెరలి గాసికి నోర్చి - దిగులుచేఁ బొగల
మృతికి హేతువు సంత - రించుకొన్నట్లు
వెతఁబెట్ట నీపాటు - వీక్షించి పొరలి
సచరాచరంబైన - జగతిఁజీకట్లు
పచరించె, రావమ్యో - పవనాంకురములు
మాసె నభోమణి - మమత రోదనము
చేసె భూతావళి, - సీతపాటునకు
నావేళ నెంతయు - నబ్జసంభవుఁడు
భావంబులోఁ జూచి - "బ్రతికితి నిపుడు
దేవతావళికెల్లఁ - దీర విచార
మీావసుధాభార - మిఁకఁ గడతేరె!"

అని తలఁపఁగ దండ - కాటవి నున్న
మునికోటి "తమతప - ములు కొనసాగు
రావణుఁడిఁకఁ జచ్చు - రణములో" ననుచు
భావించి యానంద - భరితులై రపుడు!
తనభుజాంతరమున - ధరణితనూజ
నునిచి దశాననుం - డుప్పరం బెగసి
పోవుచో దివ్యవి - భూషణ ద్యుతుల
నావిశ్వజనని వి - హాయస వీథి
మెఱుఁగు వెట్టుచుఁ బోవ - మేదినీతనయ
ధరణీధరముఁబోలు - దనుజగాత్రమున
దావానలార్చి చం - దంబున వెలిఁగె!
ఆవేళఁ గనకాంబ - రాంచితయైన
సీత బాలాతప - శ్రీసంఘటించె
దైతేయ వరవారి - ధరరాజమునకు!
శ్రీరాము నెడవాయు - సీతనెమ్మొగము
చారువికాస ల - క్షణములు లేక
నాళంబుతోఁ బాయు - నాళీకమనఁగ
చాలఁగ వాడి తే - జము మట్టుపడియె!
పగలింటి చంద్రబిం - బమురీతి సీత
మొగము కన్నీటిచే - మురువెల్ల మాసె
జనక భూవరతనూ - జనుచంక నిఱికి
చనువేళ వానివ - క్షంబు చెల్వమరె!
చదల నుర్విని దిగి - సాగుమై సిరుల
నుదిరి మచ్చను బోలు - నొరగంటి రీతి
మణిమయ మేఖలా - మంజీరకటక

ఝణఝణ ధ్వనులొప్ప - జానకితోడ
పెళపెళ నురుములు - పెల్లుగ నురుము
జలదంబు చనురీతిఁ - జనియె రావణుఁడు !

—: రావణుఁడు సీతనెత్తుకొని పోవుచుండ నామె
యాభరణములు కొన్ని క్రిందఁబడుట :—

జానకీసతివెంట - జనుచోట వదలి
వేనలిలో రాలి - విరులు నల్గడల
దనుజేంద్రుఁ గనుఁగొని - తలఁకుచు రాల
మినుకు చుక్కలతోడి - మెఱవడిచూపె ?
సీత పాదాబ్జ మం - జీరంబు జారి
భూతలంబునఁ బడు - పొలుపుఁ జూపట్టె
దనుజేంద్రు మరణని - దానమై మింటఁ
గనుపట్టు నట్టి యు - ల్కాపాత మనఁగ
గగన మారుతముచేఁ - గదలి పయ్యంట
జగతితనూజ భు - జంబుపైఁ దొలఁగె
దశకంఠకీర్తిము - క్తామయధ్వజము
దశరథాత్మజునిచేఁ - దలఁగు నన్నటుల !
కొఱివిపోలిక మీఱు - కువలయతనయ
సురవైరి గొనిపోవు - చోభూషణములు
వ్రాలెను వీరరా - వణునకుఁ గీడు
వేళ గ్రహంబు లు - ర్విని బడినట్లు
ధరణితనూజ ము - క్తామణిసరము
పెరిగి యుర్వికి వచ్చు - పెంపుకన్పట్టె
వరుదుగా నప్పుడె - యువనికి డిగ్గ

గరమొప్ప నాకాశ - గంగయా నసఁగ !
చండవాయువులచేఁ - జలియించి కూయు
చుండుపక్షులబ్రోఁత - లొప్పు వృక్షముల
'మీరె వీనివధించు - మేదినీ తనయ
శ్రీరాముఁ డీఁకనని - చెప్పిన కరణి
దనుజుఁడు గొనిపోవు - ధరణితనూజఁ
గనుఁగొని వెన్నాడి - కదిసిపోలేక
మిన్నుల దాటి భూ - మికి వ్రాలె ! కాల
మన్ను ద్రవ్వుచు మింటి - మార్గంబుఁజూచి
కన్నీటితోడ మొ - గంబులు వాచి
విన్నఁబాటున నీడ - వీక్షించి యదియె
జనకజగా నెంచి - సడలిపోలేక
కనుచుండె నానామృ - గశ్రేణియపుడు !
సెలయేరు కన్నీరు - చిదంగ శిఖర
ములపేరి తమకరం - బుల మీఁదఁజాఁచి
'ఓయమ్మ ! జానకి ! - మోడకు మీవు !
మాయావి దనుజుని - మదమడఁగించి
వాఁడె నీపెనిమిటి - వచ్చెను పోవ
నీఁడన్న' గతి గిరు - లెల్లఁ జూపట్టె
'తన వంశజుని కాంత - దనుజుఁడు పట్టు
కొనిపోవఁ గని మాన్పఁ - గోరని యట్టి
యీజీవనం బేల - నీఁకఁ బక్షిమాత్రు
నీజటాయువుతోడ - నెనయ లేనైతి !'
అని యెంచి యొయ్యన - నర్కమండలము
తనతేజముడివోయి - ధవళిమం బూనె !

'ఈ రాఘవునిదేవి - నీ రావణుండు
పోరేది పట్టుక - పోవుచున్నపుడె
యెక్కడి ధర్మ మిం - కెక్కడి సత్య
మెక్కడి యార్జవ - మేటి శౌర్యంబు'
అని సర్వభూతంబు - హాహా నినాద
ఘన రోదనముల భూ - కంపంబుచేసె
వనమయూరంబు లా - వసుమతీతనయఁ
గనుఁగొని పొగులుచుఁ - గన్నీరు రాల్చె
పలుమారు ప్రాణేశుఁ - బలవరింపుచును
విలపించు జానకి - విధమాలకించి
'హా! పోయెదవె! జన - కాత్మజా!' యనుచు
వాపోయె విపిన దే - వతల మొత్తంబు!
కలఁగిన తెలివితో - కన్నీరుసోన
జలజలఁ గురియు లో - చనములతోడ
వదలిన కొప్పుతో - వదనాంబుజమునఁ
జెదరిన కురులతో - చెమటచేఁ గరఁగు
తిలకంబుతో వాడు - దేఱిన వదన
జలజంబుతో రాలు - సరిములతోడ
"సత్యసంకల్ప! కౌ - సల్యాకుమార!
అత్యుదార! జగజ్జ - నాధార! రామ!
కరుణింపవే దిక్కు - గావె! సమస్త
శరణాగతత్రాణ! - సౌమిత్రి!" యనుచు
శోకింప రావణా - సురుఁడు లోకైక
భీకరుఁడొక్కయుం - బేదయుఁ బోలి
రాముని పట్టపు - రాణివాసంబు

నామీఁద గోనిపోవ - నలుక జనింపఁ
గనుఁదామరల కెంపు - గనుపింప సీత
దనుజేంద్రు నీక్షించి - దర్పించి పలికె.

—: సీత రావణుఁడు చేసిన పనికి నిందించుట :—

"తగునె రాత్రించరా - ధమ! కానిపనులు
తెగిసేయ? దీనఁ జెం - దెదు లాభమేమి?
ఒంటిగానుండు న - న్నొడక పట్టి
బంట నేననుకొన్న - పౌరుషంబగునె!
కనరైరి గాక రా - ఘవులు నీ తలలు
తునిమివైవరె యొక్క - తూపుసంధించి!
సిగ్గేమియును లేక - చెప్పెదు బలిమి
యెగ్గులుంగక దొంగ - కేనోరు గనము!
నా నిమిత్తంబుగా - నాప్రాణవిభుని
కానల కెలయించి - కపటమృగంబు
కలిగించి యటు బందు - కట్టి లక్ష్మణుని
తొలఁగించి నన్నునె - త్తుకపోవఁజూచి
యరికట్టినట్టి జ - టాయువుఁ దునిమి
గరువించనేల? యీ - ఖగరాజు తోడి
వృద్ధునితోఁ బోరు - వేళ నీదైన
యుద్ధంబు భుజశక్తి - యును గానవయ్యె!
పరకాంత నెవ్వాఁడు - బలిమిచేఁ బట్టి
వరియింపఁ బూనును - వాఁడధోగతుల
నిందుకు రోసెద - వే నీ ప్రతాప
మందఱు వినినవే - యాడు దుర్మతివి

తగదోరి! యిట్టి య - ధర్మవర్తనము
మగనాలి నాసింప - మర్యాదగాదు
కాదను పనిసేయ - గా దేఁగు నవుడె
నీకు శౌర్యముకాల్ప - నే జగద్రోహి!
ఇంత వేగమున నీ - విటు వాఁఝకున్న
కాంతుఁడు వచ్చి రా - ఘవులు పోనీరు
కారుచిచ్చున పక్షి - గమలినయట్లు
శ్రీరాము బాణాగ్ని - చేఁ ద్రుంగ గలవు!
ఇదపథ్యముగ నెంచి - యిప్పుడే నిన్ను
వదలి పొమ్మను మేల - వలవని కీడు
నన్ను దక్కించుకో - నంగ లేవిదిసు
కన్యయర్థము చచ్చి - కనులాభ మేమి?
ఐన గానిమ్మను - నడియాస లేల?
మాను మొక్కనిమేష - మాత్రంబులోన
రాముఁ జూడకయున్న - బ్రాణముల్ నిలువ
వీ మేనిలో నెంత - నేమి సేయుదువు?
మృత్యువు నెడరింప - మించి నామాట
నత్యంత హితమని - యాత్మఁ గైకొనవు
నురవైరి నీమెడఁ - జుట్టినమృత్యు
సరములు కాలపా - శములుగాఁ దలఁపు
మింక నేఁడది నీకు - నేలెదనన్న
లంకాపురంబు కా - లపురంబు గాక
వైతరిణీనది - వహ్నులఁ దేలి
యాతరిఁ దరిలేని - యసిపత్రవనము
చిగురించు కత్తుల - చేత నీమేను

పొఁగ రెల్లఁ దీరి యి - ప్పుడె పోవఁగలవు!
పసిఁడిపూవులు నుక్కు - బలువుఁడు పచ్చ
మిసిమియాకులు గల్గి - మించు బూరుగను
గనక భూరుహమును - గాంతువు గాక
తునిసి యాసన్న మృ - త్యుఁడవైన నీవు!
రామునియెడఁ జేయ - రానట్టి కీడు
తామసాత్మకుఁడవై - తలఁచితి గాన
తడవుగా నింక నీ - తనువేల నిలుచు?
పుడమి వ్రేఁగడఁగి యి - ప్పుడె పడగలదు
విల్లంది పదునాల్గు - వేల రాక్షసుల
బల్లిదుఁడై తృణ - ప్రాయంబుగాఁగ
నొక ముహూర్తంబులో - నుక్కడగించు
నకలంక విక్రముఁ - డైన రాఘవుని
నిశితాస్త్ర కోటిని - నీవనంబెంత
నిశిచరాన్వయ మెల్ల - నీకు గాఁగలదు!
పోనీయఁ డెత్తుక - పోయిన నిన్ను
దానవాధమ! నన్ను - ధరణిపై డించి
పనుపుము రాఘవు - పాలికి నెందు
జనినఁ బోనీయఁ డి - క్ష్వాకువంశజుఁడు."
అనుచు కన్నీటితో - నడలుచు బలుకు
జనకజ నెత్తుక - చనుచు రావణుఁడు

— సీత తన యాభరణములు కొంగులో ముడిచి
వానరులవద్ద విసరివైచుట —

అంతరిక్షంబున - నరుగుచోఁ దమరు

మంతనంబున నున్న - మర్కటాధిపులు
యేవురు నొక్కమ - హీధరాగ్రమున
నావేళ వసియింప - నవనిజ గాంచి
"వీరైన నిచటికి - విచ్చేయునపుడు
మారాఘువునకు నా - మాట దెల్పుదురు"
అని యూహ చేసి ప - య్యంట చెఱంగు
కొనఁగొంత చించి యా - కొంగున దనదు
మేనిసొమ్ములు గట్టి - మేదిని మీఁద
దానవనాథు నిం - తయుగాననీక
కపులచెంగట నైవఁ - గ్రక్కున వార
లపుడాకసంబుపై - నరిగెడు తన్నుఁ
గనుఁగొని యిట్లని - కనలేక యుండ
దనుజనాయకుఁడు మఁ - దాకిని దాఁటి
పంపాదినదుల న - పారశైలముల
సంపూర్ణకాముఁడై - చను వేళ గడచి
కొదమ త్రాఁచును బోలు - గుణవతి సీతఁ
గుదుఱుగ తొడమీఁద - గూర్చుండ చేసి
కరడుల మిన్నంది - ఘుళఘుళారావ
భరితదిశానభో - భాగమై, లుళిత
మీనమై, నక్రస - మ్మిళితమై, తరళ
ఫేనమై, యలఘుగం - భీరమై, గుప్త
శైలమై, యతులవి - శాలమై, సప్ర
వాళమై యుప్పొంగు - వనవీథి దాఁటి
సిద్ధులు వీనికిఁ - జెడుకాల మగుట
సిద్ధంబు జానకిఁ - జెఱవట్టి తెచ్చె

ననుచు నాలోచింప - నమరులుప్పొంగ
తనరాజధాని య - త్తరిఁ బ్రవేశించి
యా లంకలోఁ దన - హర్మ్యంబుఁ జేరి
నీలవైడూర్య మా - ణిక్య సౌవర్ణ
ధామమైనట్టి యం - తఃపుర సీమ
నామానవతి మయుఁ - డాసురమాయ
నునిచిన గతి సీత - నునిచి వికాట
వనితలఁ జుట్టుఁ గొ - ల్వఁగ నియమించి
యారమణులఁ జూచి - యవనిజ వినఁగ
గారవంబున దశ - కంధరుండనియె.
' ఈరమణీమణి - యేలికసాని
మీరెల్ల నుడిగంపు - మెలఁతలీ చెలికి
యేసొమ్ము లేచీర - లెట్టిభోజనము
లే సంపదలు వేఁడె - నెడపక తెచ్చి
యప్పుడ చేకూర్పుఁ - డతివ నాసొమ్ము
కప్పురగంధి కేఁ - గడు విధేయుఁడను
నెవ్వరు సీతకు - నెగ్గుగానడచి
రవ్వేళఁ దెగ వ్రేతు - నాత్మజులైనఁ
గని కొల్వుఁడనుచు వే - గమ పడకిల్లు
దనుజనాయకుఁడు సం - తసముతో వెడలి
కొలువు సావడి కేఁగి - కోరిన కోర్కి
ఫలియించె ననుచు నా - ప్తముఁ దెల్పవేఁడి
తడయక యెనమండ్రఁ - దన ప్రధానులను
కడువేడ్కఁ జూచి రా - క్షసనాథుఁ డనియె.
"శ్రీరాము నావలి - చే జనస్థాన

మారడి నొంది పా - డై యున్నదిపుడు
నెలకొని మీఁకు తా - ణెము వోయి యచటఁ
దలఁగక యుండుఁడు - దైత్యులఁ గూడి
ఖరదూషణాదులఁ - గదనంబులోన
నఱికిన దశరథ - నందనుఁబట్టి
త్రెగవేసి యాసూడు - ద్రిప్పకయున్న
మగతనం బేడది - మజ్జాతికెల్ల
నిద్దుర వోవుదు - నేరాముఁజంపి
గద్దలకాతని - కండలునైచి
యూఱడు నందాక ? - యుర్విపైఁ బేద
యూరికేఁగగ నిధి - యొదవుచందమున
నెంత సంతోషింతు - నీరాము గెల్చి
చింతఁ దీఱినయట్లు - సేయక నాకు
రాముఁడు నడచు వా - ర్తలునాఁడు నాఁట
నేమఱకఁ కనైన - నిడి వేగువారి
చేత నెప్పుడు నడ - చిన కార్యమపుడె
నాతోడ నెఱింగింప - నాల్గుమూనాళ్లు
నొక కొమ్మ వనిచి - మీఁరుండుఁ డెచ్చరిక
నొకట నేమఱక సే - యుఁడు నాకు హితము
నేరూపమునప - యీఁడెర్చి రాముఁ
బోరిలోపల జయిం - పుఁడు మోస వోక
మీ వడిగల తన - మేకదా నాకు
నేవల వజ్రాంగి - యేకార్యములకు
ఇట్టి నమ్మికఁ జేసి - యేగడి నుండఁ
గట్టడిఁ జేసితిఁ - గదలి పొండిపుడు."

అని పల్కుటయు వార - లసురేంద్రు నాజ్ఞఁ
జనిరి యప్పుడె జన - స్థానంబుఁ జేర.
బలవద్విరోధ మీ - పని రఘువీరుఁ
డలిగిన మిక్కిలి - హానియౌ దనకు
నని తలఁపక చిక్కె - నవనితనూజ
తనకుఁ దక్కెను కామి - తములు చేకూడె
ననుచు నిశ్చింతత - నద్దశాననుఁడు

— రావణుఁడు సీతకుఁ దనవైభవముఁ జూపుట :—

జనకజ యున్నట్టి - సౌధంబుఁ జేరి
యాడుకుక్కలలో భ - యంపడు లేడి
పోఁడిమి శోకాగ్ని - పొగసూరి చుట్టుఁ
బనులు వూని పిశాచ - భామలున్నట్టి
జనకజఁ గేల్వట్టి - చయ్యనఁ దిగిచి
రమ్మని యంతః పు - రంబులో వేల్పు
కొమ్మలు కోటాన - కోటులు కొలువ
నవరత్నభాసమా - నములైన దనదు
భవనముల్ కలుగు సం - పదలను జూపి
యాసపుట్టింతు నే - నని రామురాణి
వాసంబులో దైత్య - వరుఁ డిట్టులనియె.
“కొమ్మ! ముప్పదిరెండు - కోట్ల చేరువలు
నెమ్మి నందొక్కొక్క - నికి వేయివేయి
దానవసైన్య మా - ప్త బలంబు నాకు!
దీనిచే దేవతా - ధిపుల గెలిచితిని.
అబలంబెల్ల నీ - యడుగులు గొలిచి

మోహబాల! యిటమీఁద - నుపాంగుగాక!
ఈనగరి వసించు - నింతుల నీకుఁ
గానుకగా నూడి - గమున కిచ్చితిని
నూతన ప్రీతి న - న్నుఁబరిగ్రహించి
శీతాంశుముఖ! కటా - క్షింపుము నన్ను
నొప్పకయుండి నే - నోడఁబాటు సేయు
నప్పుడు మనసిచ్చు - నతివ నామెచ్చు
యింపుమీఱఁ బరిగ్ర - హింపుము నన్ను
చంపకగంధి! వి - చారమేమిటికి?
నీవు గాదన్న నీ - నీరధి నడిమి
దీవి లంకాపురి - తేరిచూడంగ
నింద్రాదు లొప్పుదు - రే! యేల పూర్ణ
చంద్రబింబాస్య! వి - చారమేమిటికి?
కాదంటివేని జ - గత్త్రయి నాదు
కోదండమునకు మా - ర్కొన నెవ్వఁడోపు!
ఇలఁ గోలుపోయి తా - నిడుమల నాకు
నలములు దిని మాని - సై కొఱమాలి
యున్న రాముని మీఁద - నూరక యేల
కన్నిడి భాగ్యంబుఁ - గడకుఁ ద్రోచెదవు?
నేటికిఁ గలనీదు - నిండుజవ్వనము
పాటలాధర! చింత - పాలు చేసెదవు?
దేవతారమణివె? - తిరుగ నివయసు
చేవ నీమేన నూ - ర్జితమె యెప్పటికి?
మనసుదాఁచగ నేల? - మదిలోన నిట్టి
యనుమానమేల? నా - యక్కరల్ఁ దీర్పు.

ఏను గావలెనన్న - యిగురాకుబోణి
మానసంబున వేఱె - మగనిఁ గైకొనునె?
పురుషుల మనములు - పొక్కించి సరస
మెఱుఁగని నిను ధాత - యేల పుట్టించె?
కరువలి నురిగోలఁ - గట్టి తేఁగలరె?
తరలింప వచ్చునే - దహనుతోఁ గీల?
నాచేతఁ జిక్కియు - న్న మిటారినొకఁడు
చూచి తెచ్చెదనన్న - శూరుఁడున్నాఁడె?
అలివేణి! ఎంతపు - ణ్యముఁ జేసినావొ
యెలమితో నీలంక - నేలుము నన్ను
నేలుము రతికేళి - నేలితివేని
వేలుపుల్ నినుగొల్వ - విహరింపఁ గలవు!
వలసిన భూషణ - వసన సుగంధ
ములుఁ దాల్చి నావెంట - ముల్లోకములనుఁ
జరియింపు మిట్టి పు - ష్పకముపై నన్ను
వరియించు మారుని - వలకుఁ దప్పించి
దాసుఁడ నీదు పా - దములకు వినతిఁ
జేసెద హస్తరా - జీవముల్ మొగిచి."
అవ రెండు చేతుల - నవనిజ వదన
వనజంబు వొదివిభా - వము పల్లటిల్ల
హా! యని యెలుఁగెత్తి - యొగరాకు మొసవి
గోయిల యెలుగెత్తి - క్రోల్చినరీతి
యెగవెక్కి యేడ్చిన - నీసుతోమఱల
జగతితనూజపైఁ - జాలఁ గోపించి

యేమియు నవుగాము - లెఱుఁగఁగ లేక
కామాంధుఁడై దశ - కంధరుఁడనియె.
"అలివేణి! ఇది దైవ - యత్నంబు చేత
తలఁచని తలఁపు నా - దానవై నావు
నీభాగ్యమెంత యె - న్నిన నంతచెల్లు
నోభామ! ఇదినాకు - నుచితకృత్యంబు
కాని కార్యంబునఁ - గానేల మేము
దానవులముగాన - ధర్మమెయుండు
యవని రాక్షసవివా - హంబిది నీకు
నవుమోము విన్నద - నంబును మాని
కంటవెల్వడు నీరు - కడకొసరించి
బంటనైనట్టి నా - పలుకీయ కొనుము
సిగ్గు నీకేఁటికి - చిగురుంగటారి
కగ్గము సేయక - యుండకు రమ్ము
శ్రేణిగా నాదు కి - రీటనవీన
మాణిక్యకోటి తా - మరలనుఁబోలు
నీపాదములసోఁక - నేఁడెంత కంటి
నో పంకజేక్షణ! - యోర్చుకొమ్మిపుడు
ఇట్టి దైన్యంబుచే - నే యెలనాఁగ
చిట్టకంబులకు సై - చె దశాననుండు
పదిశిరంబులు సోఁక - పదముల వ్రాలె
సిది నీవెఱుంగ లే - వింతియే కాక
తఱితీపు లేల? బి - త్తరి! కౌఁగిలించి
మరుకేళి లాలించు - మా" యని పలుక

— సీత రావణుని నిందించుట - సీతను రావణుఁడశోక వనమున నుంచుట —

మదిరోసి తనదు స - మక్షంబునందు
చిదిమి తృణంబు వై - చి శిరంబు వాంచి
వానిఁజూడక కల - స్వనము రాయంగ
జానకీదేవి కొం - చక యిట్టులనియె.
సద్ధర్మపరుఁడు దా - శరథిప్రాజ్ఞుండు
సిద్ధసంకల్పుఁ డూ - ర్జితపరాక్రముఁడు
రామచంద్రుండు నా - ప్రభువునుఁ బ్రాణ
మా మీఁద దైవంబు - నఖిలప్రదాత
యట్టి రాముఁడు సుమి - త్రాత్మజుఁగూడి
చుట్టాలనాప్తుల - సుతులతోఁ బట్టి
ఖరదూషణాదుల - ఖండించినటుల
దురములోపల నిన్ను - ద్రుంపక పోఁడు
నీవెన్నినట్టి యీ - నీచరాక్షసుల
భావింపఁ దార్క్ష్యుచేఁ - బాములు బోలి
కోదండదీక్షాది - గురుబాణవృష్టి
నేవంశయును లేక - యిపుడమ్రగ్గెదరు
గంగాతటాంబు భం - గములును బోలి
సంగరంబున నీవి - శాలగాత్రంబు
కాంచనపుంఖరా - ఘవశరశ్రేణి
చించి వ్రయ్యలుచేసి - క్షితిమీఁదఁగూల్చు
నీవు సురాసుర - నికరంబు చేత
చావు లేదని క్రొవ్వి - చదరులాడెదవు
వారిలో నొకఁడె నా - స్వామి యారాము

చే రణంబున నీకు - సిద్ధంబు చావు
నాశహేతువునీకు - నాప్రాణవిభుఁడు
దాశరథియె నీకు - దండధరుండు
వశమె యూపమున బ - ల్వడి కట్టువడిన
పశువు తప్పించుక - బ్రదుకనెంచఁగను?
రాముఁడు నిన్ను నే - రఁగఁ దేటి చూడ
నేమేర బ్రదుకుదు - వెఱుఁగవుగాక
వలసిన నాకునై - వనజారినైన
నిలఁగూల సేయు న - య్యినకులోత్తముఁడు
జలధులింకించు భా - స్కరు నడ్డగించు
తలక్రిందుగావించు - ధరణీమండలము
పొడిసేయు మేరువు - పోనీఁడు నన్ను
నెడవాయఁజాలఁడొ - క్కించుక తడవు
నీయాయువును నీదు - నిఖలరాజ్యంబు
నీయశంబునుఁద్రుంగె - నేఁటితో నిజము
పతిఁ బాయఁజాల నీ - పడఁతులఁ బావు
నతిశయంబగు పాప - మది రిత్తవోదు
దైవబలంబు చే - దశరథాత్మజుఁడు
నీవారితో నిన్ను - నిర్జింపఁ గలఁడు
మృత్యువు పెడరేప - మేలని నన్ను
దైత్యాధమాధమ - తగదు తెచ్చితివి
యొనరంగ స్రుక్స్రువ - ద్యుపకరణములు
వినుతింపఁదగుయాగ - వేదికఁ జేర
చండాలుఁడర్హుఁడే - జానకిఁగర్న
చండాల! నీకెట్లు - చను నాస చేయ?

అరవింద సరసిలో - హంసంబుఁ గూడి
చరియించు హంసి తు - చ్ఛప్లవంబల్వలములఁ
గదలనేరని నీరు - కాకిపై నేల
మదినిల్పు ? నాకు నీ - మాట లింపగునె ?
రాముని( బాసియుఁ - బ్రాణాశ యింక
నేమిటి కిటమీఁద - నెటులైన మేలు
త్రుంపుము దండింపు - తునియలు సేయు
మింపగుగానియా - హింపకన్యముగ "
అని పరుషోక్తు లి - ట్లాడిన జూచి
కనలి కోపించి లం - కానాయకుండు 4930
సీత నెమ్మోము వీ - క్షించి నెమ్మదికి
భీతి పుట్టంగ ద - ర్పించి యిట్లనియె.
" అతివ ! నీకొక్క - యేడాత్మశోధింప
మితము చేసితి నందు - మీఁద సైరింప
యాలోన మనసిచ్చి - తేని నీచేత
నేలింతు లంకతో - నెల్లలోకముల
కాక యీ చలముతో - కడతేరుదేని
యాకడ నిను వండి - యటికలనుంచి
తెత్తురు నాకు నెం - తే నువారంబు
బెత్తరుల "ని చాల - బెదరు పుట్టించి 4940
యా చుట్టునున్నదై - త్యాంగనశ్రేణిఁ
జూచి యావైదేహిఁ - జూపి యిట్లనియె.
' మదిఁ గ్రొవ్వినది సీత - మట్టుకురాదు
మదమణంపక నాదు - మాటగైకొనదు
బుద్ధిరాఁజేసి యి - ప్పుడు దారి పడగ

దిద్దు కొండ"ని యుప - దేశించు నంత
వారలా సీతను - వలగొని చుట్టి
దారుణగతిఁజూప - దశకంఠుఁడనియె,
"రండు కామినులార! - రమణిని తోడుక
పొండశోకవనంబు - పొంతకు మీరు
నయము భయంబును - నానాఁట జూపి
ప్రియములు పలికి యొ - ప్పింపుఁ డుల్లమున
నడవిలో నున్నట్టి - హస్తినిఁదెచ్చు
కడక నేర్చిన చెంచు - కన్యలరీతి
నెలయించుకొని నాకు - నీ సీతఁగూర్చి
యలఘువైఖరి మెచ్చు - లందుఁడు మీరు
కదలిపొండ"నుచు నే - కతమునఁ బల్క
మదిరారుణేక్షణ - మదమత్తలగుచు
నందఱు నాసీత - నలముక దనుజ
సుందరుల్ గదలి య - శోకవనంబు
సకలర్తు ఫలపుష్ప - జాలజాలకము
మకరాంక కారోప - మాగమన్వితము
చేరి యానదు చక్కి - సీత నశోక
భూరుహచ్ఛాయ న - ప్పుడు నిల్పి తమరు
చుట్టును వసియింప - నూరెల పులులు
పట్టుకపోఁజేర - బలువలఁ దగిలి
వెతలఁ బాల్పడు లేడి - విధమున దనదు
కృతమెంచి వగలు ది - క్కెవ్వరు లేక
ధారాళముగఁ గంటఁ - దడిపెట్టి యపుడు
శ్రీరామునెమ్మదిఁ - జేర్చి చింతిలుచు

నెందు నూరటలేక - యొందునారడియు
నందు చింతాక్రాంత - లై యున్నయంత

—: రాముఁడు మారీచునిఁ జంపి వచ్చుచు దుశ్శకున
ములఁ గాంచి వగచుట :—

అచ్చోట రఘువీరుఁ - డామాయ లేడి
చిచ్చర యమ్ము నై - చి వధించి మఱలి
వచ్చుచో వరదులు - వాపోయఁ జుట్టి
వచ్చె నానామృగ - వ్రాత మేద్పుచును
ఈ యపశకునంబు - లేల కోపాడమె ?
మాయావి దనుజుఁడు - మహిఁ గూలునపుడు
నాడిన మాటచే - నవనిజ కొక్క
కీడును లేక సు - ఖంచు గావుతను !
ఇది లక్ష్మణుఁడు విన్న - నిప్పుడే వచ్చు
నది సీతవిన్న హా - మ్మనిపించు నతని
దనుజులా జానకిఁ - దమరు హారింప
ననువుగానక యీమృ - గాకారుఁడైన
దనుజుని బెడరేఁచి - తను నెలయించి
కొనిపోవఁ జూచిరి - కోరి జానకిని !
'హాసీత ! హాలక్ష్మ - ణా' యనివీఁడు
చేసిన రావంబు - చేవచ్చు హాని
నాదు సోదరుని జా - నకిని దొలంగి
ఖేదముల్ మాని సు - ఖంతురుగాక !
దనుజులతో జన - స్థానంబు కొఱకు
పెనుపగఁ గొంటిని - పెరుగకపోదు

కాని నిమిత్తముల్ - గనిపించెదికల
దీనికి హేతువే - తీరుగాఁగలదో ”
అని జాలినొంది ర - యంబుతో వచ్చు
జనకజాభర్తల - క్ష్మణుని దూరమున
వెలవెలఁ బాఱుచు - వెతలచే నెదురఁ
దలవాంచి కొనివచ్చు - తమ్మునిఁజూచి
వలకేలు బట్టి పో - వక నిల్చియార్తిఁ
గలఁగుచు జలజల - కన్నీరురాల

—: రాముఁడు సీతనుఁగానక శోకమున విలపించుట :—

“ సీతనేమి నెపమ్ము - చే డించివచ్చి
తీతఱి నీఁక సీత - యేడది మనకు ?
సౌమిత్రి ! మనపర్ణ - శాలలోపలను
భూమిజ నుండ యి - ప్పుడు చూడఁగలమె ?
ఎక్కడ సీత ది - క్కెఱుఁగక పొలియు
టొక్కటి చెఱవోవు - టొక్కటి ఖలులు
మొదలనీయక పట్టి - మ్రింగుట యొకటి
యిదిదప్పు దిప్పుడు - యెడమ కన్నదరె !
ఇంకొకమరి చూతు - మే వోయిసీత !
అంకిలినొంది నా - యాత్మ చలించె !
నీకు నొప్పనసేసి - నేవచ్చినాఁడ
చాకుండఁ దోతెమ్ము - జానకి యేది ?
సకలభోగములు ని - స్సారంబు చేసి
యొకతెయు నావెంట - నుగ్రాటవులకుఁ
బాయక వచ్చెయీ - పట్టున నన్ను

మాయామృగము గోరు - మన సీతయేది ?
నాసుఖదుఃఖముల్ - నాతోడ వంతు
చేసుక యనుభవిం - చియు చింత లేక
ముదమొందుచును నాదు - ముచ్చటలెల్ల
మదిలోన యీడేర్చు - మన సీత యేది ?
ఏచెలి నెడవాసి - యేనోర్వఁజాల
నాచంద్రబింబాస్య - యగు సీతయేది ?
సీతతో నెడవాసి - చేపట్టనొల్ల
భూతల సామ్రాజ్య - భోగంబులైన
నాయింద్ర సామ్రాజ్య - మైననాప్రాణ
నాయకి యగునట్టి - నాసీత యేది ?
మాటున నుంచి నా - మనసు చూచెదవె
మాట నేమిటికన్న - మనసీత యేది ?
యాప్రాణములకన్న - నాకుహెచ్చైన
నాప్రాణ వల్లభి - యగు సీతయేది ?
నావనవాసంబు - నకు తోడునీడ
కావలెనని నమ్మి - కామించి తెచ్చు
పూనికె నెరవేర్చ - పూని యున్నట్టి
మానవతీమణి - మనసీత యేది ?
కైక పూనిక చెల్లెఁ - గానోపు సీత
కాకుత్స్థకులమెల్లఁ - గడతేర్చునేమొ ?
కొడుకుఁ గోడలిజంపు - కొనిన కౌసల్య
యిడుములఁ బడికైక - నింకఁ గొల్చునేమొ?
సీతచచ్చినఁ జావు - సిద్ధంబు తనకు
నీతరి నన్ను నీ - వెడఁబాతువేమొ !

జానకి గలిగిన - సకలంబు గలుగు
వానిగా నెంచి దై - వము నోర్వదేమి?
ఎడవాయునప్పు డ - య్యెలనాఁగ మోము
కడపటి చూపుగాఁ - గనుఁగొంటినేమి!
ఇప్పుడు మనయింటి - కేఁగుచో నాదు
చప్పుడు విని పర్ణ - శాలలో వెడలి
నగుమోముతో వచ్చి - ననుఁబైఁట చెలఁగు
సగము జాఱంగ ము - చ్చట గాఁగిలించి
నిలిచిన ప్రాణముల్ - నిలుచు నామేన
తొలఁగిన నటమున్న - తొలఁగు నాతుణము!
మత్తుఁడవై నీవు - మదిఁ గ్రొవ్వియింటి
నుత్తమగుణవతి - నుర్విజనుంచి
వచ్చినవాఁడవు - వాకొనరాదె
చచ్చెనో బ్రదికెనో - జానకి వార్త!
సుకుమారగాత్రి మం - జులవాణి సీత
నొకనిచేఁ దగిలి కు - య్యోయంచుఁ బోవ
యీమేనితో నుండి - యిట్టి నీకతన
యేమేమి దుఃఖంబు - లేనందఁ గలనో!
ఆదురాత్ముని మాట - యాలించి సెవికి
వేదుఱుట్టఁగనిట్టు - వెడలి వచ్చితివి
వత్తురే యెటులైన - వనితను డించి
కత్తులబోనైన - గహనంబులోన
అక్కటా! పరులకు - నవకాశమిచ్చి
యొక్కింతయైనమో - మోటవో విడిచి
నామాటయును మీఱి - నా వట్టినిన్ను

యేమని యుందు నిం - కేమి సేయుదును ?
ఖరుని జంపినయాది - గా దైత్యులెల్ల
కరకరి మనమీఁద - కడు పగవూని
యుందురు గావున - నొక్కఁడు జనక
నందను బట్టి మి - న్నక మ్రింగి పోయె !
ఆలిఁ గోల్పోయిన - యధముఁడ నైతి
పాలుమాలిన యట్టి - పలుకు లేమిటికి ? ”
అనుచుఁ గన్నీటితో - నాపన్నుఁడైన
యనుజుని గడునొవ్వ - నాడి రాఘవుఁడు
వడిఁ బర్ణశాలకు - వచ్చుచో నచట
పుడమి పట్టియుఁ దాను - బ్రొద్దుపోకలను
మెలఁగు చోటులఁ జూచి - మిక్కిలి మదిని
కలఁగుచుఁ దమ్మునిఁ - గని యిట్టులనియె.

—: రాముఁడు లక్ష్మణుని రాకకుఁ గారణమడుగుట
లక్ష్మణుఁడాసంగతి రామున కెఱింగించుట :—

“ సీతను డించి వ - చ్చెదనను బుద్ధి
నీతలంపునఁబుట్టు - నేదైవ గతిని
ఎట్టి యెన్నికచేత - నీవు జానకిని
నట్టడవిని డించి - నన్నిట వచ్చితివి !
సీతను డించి వ - చ్చిన నిన్నుఁజూచి
నీతోడు నాగుండె - నెగ్గువఁ బగిలె
ఏమి వచ్చెనుసీత ! - యేలవచ్చితివి !
ఏమి హేతువులు ? ని - విఁక దాచనేల ?
ఆమాట వినిరాము - నద్దీనంగ

సౌమిత్రి!" యనిన ల - క్ష్మణుఁ డిట్లు పలికె.
"స్వామి! నాయిచ్చ ని - చ్చటికి రాలేదు
మీమాటగాఁగ భూ - మిజ విన్నకతన
ననరాని దుర్భాష - లాడినఁ జెవుల
వినలేక యిచ్చోటు - వెడలి వచ్చితిని
ఆయమ్మ ననువిడ - నాడిన మఱియు
నోయమ్మ! నీకిట్టి - యుపతాపమేల?
శరణాగతులఁ బ్రోవఁ - జాలు మాయన్న
శరణు వేడునె యల్ప - జనులనీరీతి?
ఎవ్వఁడో దానవుఁ - డిట్లువంచించి
యివ్వాక్యములు పల్కె - నింతియె కాక
నీనాయకుఁడు నాడు - నే యిట్టిమాట?
మానవతీమణి! - మాను మీవగపు
ఉన్నవారిఁక పుట్ట - నున్నట్టివారు
నన్నిలింపులు మహేం - ద్రాది దిక్పతులు
శ్రీరామచంద్రుని - చేత విల్లున్న
పాఱిపోవక నిల్చి - బ్రదుక నోపుదురె!
ఇదె వచ్చు నీనాథుఁ - డేమిటికమ్మ
మదిలోన దాలిమి - మాని పల్కెదవు?
అనినఁ గోపించి యా - యమ్మ మీతోడ
వినిపింప రానట్టి - వేఁడి పల్కులను
'ఓరి! పాపాత్మ! న - న్నొందకఁ బొందఁ
గోరి యీక్రియ నెచ్చుఁ - గుందులాడెదవు
మాయన్నఁ జంపి నా - మీఁదటి యాశఁ
బాయలేకిట్టి య - బద్ధముల్ పలుక

నీకు లోనాదాన - నే? యీతలంపు
నీకొనగూడదు - నిష్కలంకగుడు
భరతుఁడు నిన్ను బం - పఁగ ద్రోహచింత
విరసమేర్పడనీక - వెంటవచ్చితివి
అజ్జ చూచుక యుంటి - వన్నకు వెఱచి
సజ్జను గతిఁ బట్టి - జంపించి తిపుడు
నీవుచూడఁగ నేఁడె - నీకిత్తుఁ బ్రాణ
మావలఁ బొమ్మని - రాశ నూరికిని.'
అని పల్కనీవెట్టు - లయినఁ గమ్మనుచు
జనకజ డించి యి - చ్చటికి వచ్చితిని
ఏమి సేయుదు?" నన్న - నీసుతో వినియు
నామాట వినక "యె - ట్లైన నాఁగాక
యేమన్న నేమి? రా - నెట్లగు నీకు?
భూమిజ యేమైనఁ - బోవనిమ్మనుడు
నేరంబు నీమీఁద - నిలిచె హితంబుఁ
గోరక నన్నింత - కొదవ చేసితివి
ఆటది యనుమాట - లాగురి యిట్టి
పాటి యన్యాయంబు - పరగు నే సేయు?
నీకోపమే చూచి - నేనన్నమాట
యాకడఁ ద్రోచితి - వల్పుఁడవైతి
వెఱుఁగని జానకి - యేమన్ననేమి?
ఎఱిఁగి యెఱింగి నీ - కెట్లు రావచ్చు?
అమ్మనే దొడిగిన - యపుడె మాయామృ
గమ్ము చందముమాని - కపటదానవుఁడు
వడువేళ నీరీతి - పలుకుచు వాఁడ

పడియున్న వాఁడు నా - బాణపాతమున."
అని వచ్చి పార్శ్వమ - యాపర్ణశాలఁ
గనుఁగొని శోభావి - కాసంబు లేక
హేమంతమునఁ దమ్మి - నెఱవాసి యొప్పు
తామరకొలని యం - దము మించుదాని
సీత లేదని తెల్పు - చెలువునఁ బట్టి
జాతనానామృగ - స్వనములదాని
చెదరిన దర్భలు - శీర్ణపాత్రములు
ప్రిదులు నాసనములు - బెదరు నేణములు
తలఁగిన వనదేవ - తలు రాలువిరులుఁ
గలిగిన తమయిల్లు - కలఁగుచుఁ జొచ్చి
జానకిఁ గానక - కాలాంతరంబు
లోన నాలుగు దిక్కు - లునుఁ దేఱిచూచి

—పర్ణశాలయందు సీత లేకుండుటఁ జూచి
రాముఁడు దుఃఖించుట :—

వెదవడి" లక్ష్మణ ! - ఏమిరో సీత
వెదకినఁ గానము - వెడలిపోయినదో ?
దనుజులు మ్రింగిరో ? - తాను నామనసుఁ
గనవేడి డాఁగెనో ! - కానమేమియును
మృతినొందెనో భీతి ? - మేలిమి విరులు
లతలు గోయ వనంబు - లకుఁ బోయినదియొ !
నీటికేఁగెనో ! యొక్క - నెలవున నైనఁ
బాటలాధర గాన - బడదేమి సీత ?"

అనుచుఁ గన్నీటితో - నడలి యున్మత్తు
ననువునఁ జాలఁగా - మ్లాతురుండగుచుఁ
బొద బొద గవి గవి - పొలము పొలంబు
నది నది వని వని - నగము నగంబు
చూచి హా! సీత! హా - శోభనాకార!
హా! చంద్రబింబాస్య! - హా! చకోరాక్షి!
పలుకవే! యేను నీ - పాలిటివాఁడ
నిలుపోపలే నిఁక - నిమిషమాత్రంబు
నినుఁ బాసి ప్రాణముల్ - నిలుపవు మేన"
అని మేను మఱచి 'యు - న్మాని' వెచ్చ నూర్చి
"తిలకంబ! కానవే - తిలకలలాట
నళులార! కానరే - యలినీలకచను?
హరిరాజ! కానవే - హరిరాజమధ్యఁ?
కరివర! కానవే - కరివరగమన?
హరిణంబ! కానవే - హరిణాయతాక్షి?
గురివింద! కానవే - కురువిందరదన?
లతలార! చూపరే - లతికాలతాంగి?
శతపత్రమా! ఏది - శతపత్రగంధి?
మల్లిక! కానవే - మల్లికానఖరఁ?
బల్లవమా! చూపు - పల్లవాధరను!"
అని వెదకుచుఁ బోయి - "యవనిజ! నీదు
కనకచేలము గంటిఁ - గంటినే" యనుచు
"నీవశోకము చెంత - నిలిచియు రమణి!
కానవే నన్నుఁ జో - కము ముంచె" ననుచు
"ఓయి! లక్ష్మణ! సీత - యున్నదా మిర

పోయి తోతెమ్ము గొ - బ్బున జేర ''ననుచు
"నినువంటి చక్కని - నెమ్మోము దాని
జనకజఁ దోతెమ్ము - చంద్రా!" యటంచు
"వినవన్న లక్ష్మణ! - వెదకి రాక్షసుఁడు
చనియె సీతను మ్రింగి - చలపట్టి" యనుచు
"ఇంక నాతోనెయ్య - మేఁటికి నీకు
శంకింప కెందైనఁ - జనుము నీ" వనుచు
"జిలిబిలి నవ్వులు - జింకచూపులును
పలుచని చెక్కులు - పాటలాధరము
నెలవంక బొమలు క్రొ - న్నెలఁబోలు నుదురు
తళుకు కమ్మలును కుం - తలవిలాసంబు
తిలకంబు వలుద ము - త్తియపు ముంగరయు
తిలపుష్ప నాస హ - త్తిన పలువరుస
శ్రీకారములు నేలు - చెవులును మించు
రాకేందు నిభమైన - రమణి నెమ్మొగముఁ
గానక నేనర - గడియైనఁ దాళ
లేను లక్ష్మణ! సీత - లేదేమి సేతు?
కమనీయ శంఖమం - గళమైన గళము
గమగమ మను పచ్చి - కస్తూరి తావి
మిక్కుటంబుగమూరు - మెడపెట్టి కఱచి
రక్కసుఁడా సీత - రక్తపానంబు
సేయునప్పుడు దలఁ - చెనోసుమీ నన్ను!
కూయుచు "రఘువంశ - కుంజరా" యనుచు
సీత యొక్కతెయు వ - సించుచోఁ గెంపు
రాతిచొక్కపుటుంగ - రములు నీలంపు

గాజులు వజ్రాల - కడియముల్ రత్న
రాజికంకణములు - రంజిల్లు కేలు
తగులనీయక తావి - దర్పికొనంగఁ
దెగిపట్టి విఱచుకఁ - దినియెనో యసుర
నిన్ను శృంగారించి - నిలిచి రాక్షసుల
వెన్నాడి తినుఁడని - విడిచిపోయితిని!
కానవే నీవైనఁ - గమలాక్షి సీత
తానెందునున్నదో - తమ్ముఁడ! వెదకు
హా! సీత! పోయితి - వా? నన్నుఁ బాసి
హా! సుమిత్రాకుమా - రా! సీతయేది?
హా! దైవమా! యంచు - నరగన్ను మొగిచి
పోదమా వెదక నా - పొదరింటిచాయ?"
అని రెంటి బరువెత్తి - యటనిల్చి మఱలి
మునువున్న కడకుఁ ద - మ్ముఁడు దాను మఱలు
చూచిన చోటులే - చూచుఁ గూర్చుండు
లేచుఁ గూర్చుండు తా - లిమిలేక పొరలు
చరులలో వెదకును - సానువులెక్కు
గిరులు సాధించు తీ - గెలుద్రిప్పి చూచు
దొనలు పరీక్షించు - తోఁటలు దిరుగు
వనములు వెదకు శై - వలిను లీక్షించు
మేను బ్రమ్మాన్పడి నిల్చు - మిన్నక నవ్వుఁ
దానూరకేపల్కు - తలయూఁచి వగచు
కన్నీరు రాలుచుఁ - గరయుగళంబు
మిన్నక పొదవత్తి - "మేదినీతనయ
జానకి" యని పర్ణ - శాలకు వచ్చి

తానందుఁ బడి ముహూ - ర్తము మూర్ఛనొంది
తెలిసి కన్దెఱచి న - ల్దిక్కులు జూచి
వెలవెలనై తల - వ్రేలంగవైచి
"అక్కటా! లక్ష్మణ! - యవనిజ నేఁడు
నెక్కడ వెదకుద - మేమి సేయుదము?
ఎందు వోవుదు మింక - నెవ్వారు దిక్కు?
కందునే సీత చ - క్కని మొగంబింక!"
అనుచు దిగ్గనలేచి - "యదె సీతవచ్చె"
అని "కౌఁగిలించెద" - నని గమకించి
కాముని వలఁ జిక్కి - కళవళంబంది
యేమియుఁ దెలియక - "ఏమీ! లతాంగి!
పొలయల్క లెంతయుఁ - బ్రొద్దునీకేల?
అలిగి మోముద్రిప్పు - నగునె యిందాఁక?
పరిహాసమునకైనఁ - బాపి యుండుదురె?
తరుణి! నాచెంతఁ గై - దండగా రాదె?
డగ్గరి రమ్ము చి - ట్టకముల లేని
సిగ్గుల మఱుమోము - చేసి యుండుదురె!
నీవు పెంచిన మృగీ - నివహంబుఁ గంటె
నావలె నిన్ను గా - నక కలంగెడును
కన్నియ! కన్నీరుఁ - గార శోకింపు
చున్నవి దయఁజూచి - యూరార్పు మిపుడు
పద్మలాక్షిని సీతఁ - బాసినవెనక
లక్ష్మణ! నాకు నే - ల శరీరమింక!
పోవుచున్నవి ప్రాణ - ములు నిమిషమునఁ
గావవే జానకిఁ - గన్నులఁ జూచి

యేనింద్ర పదమున - కేఁగిన యపుడు
తానందు వచ్చి మా - తండ్రి కోపించి
'పదునాలుగేండ్లు నా - ప్రతినఁ జెల్లించి
తుదిరాక యిటకు వ - త్తురె నట్ట నడుమ
హానిఁ జేసితివి నా - యాజ్ఞకు భ్రష్ట
వై నీవు దబ్బర - లాడిపోయితివి
వ్యర్థజీవనుఁడవై' - యనుగదా! నన్ను
నర్థించి యింద్రాదు - లందఱు వినఁగ
నేల పోవుదు దివి - కేఁ బోక యెచట
నేల నిల్తును సీత - నెడబాసి నపుడె?
హీనమానవు కీర్తి - యెడవాసి నటుల
జానకి ననుడించి - చనియె సౌమిత్రి!
జలకేళి కేఁగెనో? - జానకి పోవఁ
దలఁపదెన్నడు నొంటి - దావెంట బోక."
అనుచు దిగ్గన లేచి - యదెపర్ణశాల
వెనక చాయను సీత - విధమునఁ బోయె
సౌమిత్రి! పొమ్మ"న్న - జని యందు వెదకి
యామేర లేదని - యతఁడు వల్కుటయు
విలపించునాశ రఘు - వీరునిఁ జేరి
కలఁగుచు సౌమిత్రి - కన్నీరుఁదుడిచి

—లక్ష్మణుఁడు రాముని నోదార్చుట:—

"స్వామి! యాబలిచేతి - జగతిఁ గైకొనఁడె
తాముస్న శౌరి సీ - తయునట్ల నీకుఁ

జేకూడు నేటికి - చింతిల్ల నింత
మీకు నాపదలు క్ర - మించు ధైర్యమున
నోరువు గలిగిన - నొచ్చెంబు లెల్ల
దీరు నెవ్వరికైన - ధృతి వదలుదురె ?"
అని వేడుకొనుచుండ - "హా ! సీత !"యనుచు

## — రాముఁడు మఱల సీతనుఁగూర్చి విలపించుట —

బనువుచు వెలికిలి - పాటుగా నొరిగి
చేతులధరమోపి - శిరమెత్తి యార్తి
"సీత ! సీతా ! సీత ! - సీతా !" యటంచు
కామమోహితుఁడయి - కన్నులు మొగిచి
'వామాక్షి నాచెట్ట - వట్టిన ఫలము 5290
నడవుల నిన్నాళ్లు - నలమట లొంది
కడపట నీరీతిఁ - గడతేఱవలసె"
అని కన్నుదెఱచి "య - ల్లదె వచ్చె వచ్చె
జనకజ యిపుడు - లక్ష్మణ ! బ్రతికితిమి
ఎటు వోయితివి సీత ! - ఇందాక నన్ను
కిటుకులఁ బెట్టి యీ - గేలి సేయుదురె !
తెరవునాకును నీవ - దిక్కింతె కాని
మఱివేరె లేదని - మదిఁ గానవైతె
ఈ శోకవారాశి - యేతేపఁ గడతు ?
ఓ శశివదన ! ని - ట్లొంటి నేఁగుదురె ? 5300
ఏల పాడుగఁ జేసె - దీ పర్ణశాల ?
బాల ! ప్రవేశింపు - భద్రమహాఁగారి"
అని కంటె లక్ష్మణ ! - యాసీత నన్నుఁ

గని యేడ్చుచుండగఁ - గరుణింపదయ్యె
సీత యెందది? కైక - చెల్లించుకొనియె
వేతరి నాథుమ్ము - వేనోములైన
పురుషాధముఁడు వీని - పుట్టువు సకల
దురితకారణము వ్య - ర్థుఁడు వెతగాక
యిల్లాలిఁ గోల్పోయి - యేమని వచ్చె
నెల్లరె యితఁడెంత - సిగ్గరి యనుచుఁ
బురికి నేఁగినఁ జూచి - పొడిచి యాడుదురు
నరులెల్ల నిఁకలక్ష్మ - ణా! ఏది బుద్ధి
హా! కైక! హా! లక్ష్మ - ణా! యేను జనక
భూకాంతుఁ జూచి న - ప్పుడు సీతనడుగ
నేమందు? నీ మాట - యించుక వినిన
నామహేశుడు వాయు - ప్రాణంబు లపుడె
తమ్ముఁడ! నేఁడు నీ - తనుఁ గడగాంచి
సమ్మతించిన కీర్తి - చాలదే నీకు?
ఇట మీఁద నిలిచితి - వేని నాచంద
మెటులౌనొ యాదుఃఖ - మేల చూచెదవు?
పొమ్ము గొబ్బున పురం - బునకు భూజనుల
సమ్మతిఁ బాలింప - సద్ధర్మ నిరతు
భరతుని తోడనా - పలుకుగాఁ దెలిపి
ధరణిఁ బాలింప బో - ధనుఁడవుగమ్ము
కైకసుమిత్రలఁ - గౌసల్యఁ జూచి
వాకొను మందంద - వచనసంగతులు
మెల్లనే తనపాటు - మేదినీతనయ
చెల్లిపోవుటయునుఁ - జెప్పనేర్పరివి

అమ్మలం బోషింపు - మని భరతునకు
ముమ్మాఱుగాఁ దెల్పు - ము కుమార! నీవు!"
అనుచు నేడ్చుచుఁ బల్క - నా రామచరణ
వనరుహమ్ముల మీఁద - వ్రాలి లక్ష్మణుఁడు
"హా! రామ! హా! జన - కాత్మజా!" అనుచు
భోరున గన్నీరు - పొరలి పాఱంగ
శోకించు లక్ష్మణుఁ - జూచి యేమియును
వాకొన నేరక - వాతెఱ యెండ
వదనంబువాడ "న - వ్వారె? యెవ్వఁడైన
మదిఁ గ్రొవ్వి క్రూరక - ర్మంబులు చేసి
యాపాపముల నెవ్వఁ - డైన నీపాటి
యాపదలకు నోర్చు - నాయనే కాక
పాపముల్ చేసిన - పరిపాటి తనకు
నాపదల్ దొంతర - లై చుట్టుకొనియె
రాజతండ్రి నిజంబు - రాజ్యంబు విడిచి
భూజనంబులఁ బాసి - భోగముల్ వదలి
యడవులు పట్టి యి - ల్లాలిఁ గోల్పోయి
చెడియెందు చేటులఁ - జేకొనవలసె
నిన్నాళ్లు నీసీత - నెడవాయకుండి
యన్నియు మఱచితి - నన్ని దుఃఖములు
మూట గట్టుక యెట్లు - మోవనోపుదును?
చాటి చెప్పెదఁ దన - చావు సిద్ధంబు!
మఱచితిమోయి లక్ష్మణ! మనచేత
కొఱమాలి చెవులు ము - క్కును బోవనాఁడు
జంతరక్కసివచ్చి - జానకిఁ బట్టి

యింత వేగిరమున - నిటుగ్రుంగిపోయె
ఆముక్కుఁడి నిశాటి - యవనిజ దిక్కు-
లేమిని చంకఁగీ - లించి పోయెనదొ ?
తామరసాననం - దామరసాక్షి
తామరల్ గోయ గో - దావరీనదికి
జనియెనో! చూతము - సౌమిత్రి! మున్ను
తనుబాసి యొంటిగాఁ - దరలదెచ్చటికి
లోకంబులెల్ల నా - లోకింతు వీవు
లోకలోచనుఁడవు - లోలాక్షి సీత
యెక్కడ నున్నదో - యెఱిఁగింపవయ్య ?
మ్రొక్కెదమిదె కేలు - మోడ్చి మార్తాండ !
ఇలయెల్లజరియింతు - వెప్పుడు నీవు
మలయసమీరణ ! - మా సీత యేది ?
ఆకాశవాణి ! నీ - వైన భూపుత్రి
యేకడ నున్నదో - యెఱిఁగింపవమ్మ !
నీపట్టి యెటువోయె ! - నీవైన సీతఁ
జూపవే కరుణతోఁ - జూచిభూదేవి ! ”
అనునంత సౌమిత్రి - యంజలి చేసి
యనఘాత్మ ! విపదిద్ధై - ర్యమనఁగ వినరె
సకలయత్నముల ను - త్సాహంబె మనుజు
లకు సకలార్థ మూ - లములంద్రు బుధులు.
సర్వప్రయత్నద - శత మదిఁ బూని
యుర్విజ వెదకు ను - ద్యోగంబు సేయ
జానకి యెటువోవు - జగతిపై లేక
మానునే ? యుండిన - మనకు దాఁగెడినె ?

ఇదివచ్చు వైదేహి - యేమిటికయ్య
మదిలోన నింతయు - మ్మలికింప మీకు ?
చాలింపుఁడని " పల్కు - సౌమిత్రిమాట
నాలకించియు నాలి - యందు విరాళిఁ
దాలిమి లేక " గో - దావరీ సలిల
కేళికి సీత యేఁ - గినదేమొ పోయి
చూచి రమ్మని " పల్కఁ - జూచెద నంచు
నేచాయ నచ్చోటి - యిరుకెలంకులును
వెదకి లేదని వచ్చి - విన్నవించుటయు
మది నమ్మలేక ల - క్ష్మణుఁడును దానుఁ

—: రామలక్ష్మణులు వెదకుచుఁ ద్రోవలోఁగనఁబడిన గుఱుతులచే సీత కొనిపోవఁబడెనని యెఱుంగుట :—

పోయి " గోదావరీ - పుణ్యస్రవంతి !
ఓయమ్మ ! మాసీత - యున్నట్టి చోటు
తెలుపవే ! యన వన - దేవతల్ నదియుఁ
దెలిపెదమనిపూని - దిగులుచే వెఱచి
రావణభయము కా - రణముగా వార
లీవిధం బనకున్న - నినవంశకులుఁడు
'కనమైతి మోయి ! ల - క్ష్మణ ! యింకమీఁద
మనమయోధ్యకుఁ బోవ - మనవారలెల్ల
యేమన్న నేమి ! తా - నింటికి వచ్చి
యామిథిలాధీశు - నతివ మాయత్త
" శ్రీరామచంద్ర ! మా - సీత మీవెంట
నీరాజ్యభోగము - లెల్లనుమాని

వచ్చె, నెచ్చట నుంచి - వచ్చితి ?" రనిన
నచ్చోట నేమందు - నాసాధ్వితోడ !
అన్నింటి మాఱు నీ - యవనిజచెంత
నున్నఁజాలు నటంచు - మారట చేత
నమ్మివచ్చితి లక్ష్మ - ణా ! నాకు నింక
నెమ్మియిఁ దెలవాఱు - నేమి సేయుదును ?"
అనుచు నట్టటు పోవ - హరిణాది వివిధ
వనమృగంబుల రఘు - వర్యుఁడు చూచి
"మృగశాబకములార ! - మృగశాబనేత్ర
జగతీతనూజ యి - చ్చట నున్నదనుచు
నెఱిఁగింపరే ! యన్న - నెల్ల జంతువులు
బరువుతో దక్షిణ - భాగంబు నడచి
మఱలి తోడనె నభో - మార్గంబు చూచి
ధరణిపైఁ బొరలి మెం - తయు విలపించి
మృగిఁ బట్టి యందొక్క - మృగమీఁడ్చి యెత్తి
గగనవీథికిఁ బోవ - గమకింపఁ జూచి
యపుడింగితజ్ఞుఁడై - నట్టి రాఘవుఁడు
"చపలాక్షి నెత్తుక - చనియె రాక్షసుఁడు
దక్షిణంబుగ" నని - తపన బింబంబు
దక్షిణాయనముగాఁ - దరలిన యట్లు
క్రవి తేజుఁడైనట్టి - రవివంశ తిలకుఁ
డవనిజ వెదకుచు - నటఁ బోవఁబోవ
పుప్పొడెత్తులు గొన్ని - పుడమిపైనుండ
దవ్వులఁ జూచి సీ - తాసహాయుండు
"ఇప్పువ్వుదండ తే - నీఁ బ్రొద్దె సీత

కొప్పులోఁ దురిమిన - గుఱుతఁ జూచితిమి
వాడనీయక భూమి - వాయువు రవియుఁ
జాడలోపల నివి - సవరించినారు!
చూచితివే!" యని - చూపుచు నచట
ప్రాచియాదిశను ప్ర - స్రవణశైలంబుఁ
గనుఁగొని "మాసీతఁ - గానవే" యనుచుఁ
జినుఁగు మృగంబుపై - సింహంబురీతి
గద్దించి "నీవెఱుఁ - గక నేఁడుసీత
ముద్దియ నేర్చునె - మూలల డాఁగ?
నీవె దాచితివి కం - టిని దొంగనిపుడు
వేవేగ దేవిని - విడువుము నిన్ను
నిర్ఝరంబులతో వ - నిశ్రేణితోడ
జర్ఝరితములుగా - శరపరంపరల
నిన్నుఁ జూర్ణము చేసి - నీయందుఁ గాంచి
యున్న మృగంబుల - నొకటమర్దించి
వైచెదనని రఘు - వర్యుండు మఱలి
చూచి, "లక్ష్మణ! వీఁడు - సులభుఁడు కాఁడు
గోదావరీనది - గ్రుచ్చి యింకించి
యీదుష్టశైలంబు - నినుముగాఁ దునిమి
పొడిపొడి చేసిన - ప్పుడుగాని వీరు
పుడమిజ దెచ్చి చూ - పుదురె వేఁడినను?"
అన విని శైలేంద్రుఁ - డాదశాననుఁడు
తనమీఁదఁ గోపించి - దండించు ననుచు
నేమియు ననలేక - యిరుసులు విఱిగి
ఘోష్మూలనో తన - ఝరకటంబులను

జరులలోఁ బడిన కాం - చన రథాద్యములు
ధరణిజారమణు ముం - దఱఁ బడవైవ
నా తేరుఁ గనుఁగొని - యటునిటు జూడ
సీత రావణుఁడు దె - చ్చినవేళ నచట
తనువుతోఁ బెనఁగు పా - దంబుల జాడఁ
బరికించి యాచెంతఁ - బడియున్న యట్టి
టెక్కెంబు గొడుగు కే - డియమును వింటి
చెక్కులు హరులు జ - చ్చిన సారథియును
జోడును నెత్తురుఁ - జూచి రాఘవుఁడు
జోడైన దమ్మునిఁ - జూచి యిట్లనియె.
“కండలు నెత్తురు - గంటివే యిచట ?
ఒండొండు కనుఁగొను - ముజ్జ్వలప్రభల
వైడూర్య కవచమె - వ్వనిదియో చినిఁగి
యీడ నున్నది చూడు - మీ టెక్కెయంబు
బంగరుగొడుగిది - పడియున్న దొకటి
ముంగలను పిశాచ - ముఖములతోడి
ఖరములు కాంచన - కవచితాంగములు
తెరలి యున్నవి చూచి - తే ? సూతునతని
చేతనున్న తరంటు - చేత నేయుండ
నీతఁడు ద్రెళ్లినాఁ - డిదె గనుఁగొమ్ము !
మాణిక్యమయములై - మహిఁబడియున్న
తూణీరములు పైఁడి - తూపులు గనుము !
హేమచామరయుగం - బిదివుర వ్రాని
యేమేరఁ బడినవా - రిదె విలోకింపు !

—: సీత నెవ్వఁడోపురుషుఁ డెత్తుకొనిపోయెనని రాముఁడు సకలజగత్తుపై కోపముఁబూనుట —

ప్రాణనాయకి సీత - పట్టున నాకు
ప్రాణపర్యంతమౌ - పగ గల్గెనిపుడు !
మనసీత యడుగులు - మఁగవాని యడుగు
లెనసియున్నవి కంటె - యీప్రదేశమున
మ్రింగెనో చంపెనో - మేదినీతనయఁ
బొంగిలి నెత్తుక - పోయెనో వాఁడు
నాతోడి పగవాని - నమ్మిప్రాణములు
పాతకుఁడెట్లు డాఁ - పగ నెంచెనొక్కొ ?
దయచేత సకలభూ - తము లందు నేను
చెయిగాచి యుండుట - చింతింపలేక
యెంతురో యింద్రాదు - లీతనిచేత
నింతయు గారని - హీనసత్త్వునిఁగ !
ధార్మికాగ్రణియయ్యు - తలమోఁచి యేను
ధర్మంబె చేపట్టి - దయఁగల్గి మెలఁగ
నట్టిధర్మమువచ్చి - యడ్డంబుగాక
పట్టియిచ్చెను సీతఁ - బగవారిచేత !
ఇప్పుడే విల్లంది - యెల్లలోకములఁ
జప్పుడు గాకుండ - క్షణములోపలను
హరిహయబ్రహ్మరు - ద్రాదులతోడ
శరపరంపరలతోఁ - జమరివైచెదను !
వనపర్వతద్వీప - వతియైన వసుధఁ
దునిమివైచెద నొక్క - తూపు సంధించి
మూఁడులోకంబుల - మొనచేసి యెదుర

వాఁడు గల్గునె? త్రుంప - వలచితినేని !
చంద్రాస్యకై యింట - శరమేర్చి యిపుడె
చంద్రసూర్యాగ్నులఁ - జక్కఁ జేసెదను !
గ్రహతారకాది న - క్షత్ర కోటులను
మహిఁ గూలనేసి దు - ర్మారంబు సేతు !
కులపర్వతము లేదు - గుదిగ్రుచ్చి యిపుడె
తొలఁగక పొడిచేసి - దుమ్ములు రేతు !
ఏడు వారాసుల - నింకించి పెద్ద
బీడులుగాఁ జేసి - పెల్లగించెదను !
పదునాల్గులోకముల్ - భస్మీకరించి
యిదియది యనకుండ - నేకంబు సేతు !
గ్రక్కునసృష్టి చీ - కట్లు గ్రమ్మించి
చక్కాడి వైచెద - సచరాచరాచరముల
దరికొల్పి సప్తవా - తస్కంధములును
శరవహ్నిచేత వీఁ - చమడంచివైతు !
స్థావరజంగమా - త్మకమైన విశ్వ
మీవేళఁ గోపాగ్ని - కిత్తునాహుతిగ !
ఇలనింగియును నింగి - యిలయును జేతు
తెలియనీయక రెండు - దెరల సేయుదును !
ఇందఱు జానకి - నిప్పుడే నాదు
ముందఱ తమకరదం - బులు ముకుళించి
యునిచిన నుంచిరి - యునుపక యున్న
దునిమివైచెదను దొం - తులతోడఁ గూల !
దేవగంధర్వదై - తేయకింపురుషు
లీవేళ మనసీత - నప్పటియట్ల

వేగంబె నాచేత – విల్లందు మునుపె
జాగు సేయక పర్ణ – శాలలోనుంచి
బోయినఁ బోయిరి – పోకున్న నటకుఁ
బోయినఁ ద్రుంతు నే – భువనంబులెల్ల
నూరక తెచ్చిన – నొప్పు కానంగ
నేరుతు మీ ధర – నీతనూభవను!
ముడిచిన పువ్వులు – ముడిచిన తీరుఁ
దొడిగిన సొమ్ములు – తొడిగిన కరణిఁ
గట్టిన వస్త్రంబు – గట్టినయట్లు
పెట్టిన తిలకంబు – పెట్టినమాడ్కి
వేసిన కీల్గంటు – వేసినజాడఁ
జేసిన వీడెంబు – చేసినపోల్కి
నవ్విన నెమ్మోము – నవ్వినరీతి
జవ్వని దెచ్చియుం – చక మాననిపుడు!"
అని జడల్ సారించి – యమరంగ ముడిచి
తన చీరములు కటి – స్థలి బిగ్గఁజుట్టి
నుదురు చెమర్పఁగ – న్నులు జేవురింపఁ
బెదవులు గదలఁ డ – ద్బించి కకాబోములు
ముడివడ మును పురం – బులమీఁద నలుక
వొడమ నిల్చిన చంద్ర – భూషణుం డనఁగ
"తే విల్లు" తెమ్మని – తీసి సౌమిత్రి
చేవిల్లు గైకొని – శింజినిఁగూర్చి
తన యంపపొదినుండి – తలచూపు నొక్క
పెనుమ్రాఁచు వంటి యు – ఘేద్యశరంబు
వలకేలఁ బట్టి యు – వార్య రౌద్రమున

నిలపట్టికై రాముఁ - డిట్లని పలికె.
వినుము "లక్ష్మణ! నాదు - విశిఖరాజంబు
ధనువుతోనిపుడు సం - ధానంబు సేయ
జనులకు ముదిమియుఁ - జావునుఁ బుట్టు
వును గాలమును గర్మ - మును దప్పనట్లు
తప్పదు చూడ మి - త్తరి పర్ణశాల
యిప్పుడున్నదొ లేదొ - యింటిలో సీత!
తోడుగగునే నాదు - తూపని" పలికి
కడునల్కతో లయ - కాలాగ్నిరీతి
పగలింటి సూర్యుని - పగిది నున్నట్టి
జగదేకవీరు కౌ - సల్యాకుమారు
రామచంద్రుని పాద - రాజీవయుగళిఁ
దా మౌళిఁ గీలించి - తలఁకి వే లేచి
యమ్ము సంధించిన - యన్న కేల్వట్టి
సమ్మతపఱప ల - క్ష్మణుఁ డిట్టులనియె.

—: లక్ష్మణుఁడు రామచంద్రుని శాంతింపఁజేయుట :—

"స్వామి! కృపాపర - జలధివి, శాంత
భూమికుండవు, సత్య - బోధాత్మకుఁడవు,
సకల సంరక్షణ - శాలివి, నీకు
నొక సీతకై యిట్టి - యుగ్రభావంబు
తగునయ్య? ఏనిమి - త్తముగఁ గోపించి
జగతి జీవుల నెల్లఁ - జంపఁ బూనితివి!
చంద్రుని చలువ భా - స్కరుని వేడిమియు
నింద్రు శౌర్యంబు మ - హిక్షమా గుణము

నీయందు నీకీర్తి - నిజముగా నెవుడు
పాయ నేర్చునె? యేల - పదరెదవిపుడు?
నేరమొక్కఁడు సేయ - నిఖిలలోకములు
నోరామ! పాలియింప - నూహసేయుదురె?
గుఱుతులు మనమొక - కొన్ని చూచితిమి
వెఱచి పాఱిన నేల - విడుతుము వాని
నెచటికిఁ గొనిపోవు - నీసీత నొకరుఁ
డచలుఁడై మెల్లనే - యరయుదమిపుడు
జానకికై యొంటి - జగడమిచ్చోట
నైనది యెవ్వఁడో - యుద్ధంబు వచ్చె! 5580
తెలియుద మిది నీదు - దేవేరి నొకఁడు
ములుచయై కొనిపోవ - మూఁడులోకములు
నీకేమి సేసె? దీ - నికి నింత తెగువ
కాకుత్స్థకులదీప! - క్రమమానె సేయ?
కారుణ్యమూర్తివి - కల్యాణనిధివి
నీరామ కెవ్వఁడు - నేఁడింత కీడు
దలఁచెనో యట్టి పా - తకు ద్రోహిఁ బట్టి
తలఁద్రుంపుమిది రాద - ధర్మమై యుండు
భూమిజ వెదక ని - ప్పుడు చింత యేల?
ఈమానులున్నవా - రేనున్నవాఁడ! 5590
శోధింత మెందైనఁ - జొచ్చి జానకిని
సాధింత మింకవి - చార మేమిటికి?
పోఁబడి దెలిసియుఁ - బోనీయ మనము
ఛీ! బీదలమె! యొండు - సీత లేకున్న
సురలవేడుదమట్టి - సురలును సీత

తెరవు చెప్పక యున్నఁ - దీఋని పనికి
నేను గల్గియు మీకు - నేల చింతిల్ల !
జానకిఁ దెచ్చి యీ - శాలాంతరమున
నిలుపుదు వజ్రస - న్నిభములౌ బాణ
ములచేత జగము ని - ర్మూలంబు సేతుఁ !
గాక యీమాటకుఁ - గల్లలాడినను
మీకుఁ దమ్ముఁడనుగాను - మీరల్గ నేల ?"
అనుచు వెండియును సా - ష్టాంగప్రణామ
మొనరించి శాంతుఁ జే - యుదునని పలికె.

—. లక్ష్మణుఁడు రామునకుఁ గర్తవ్యమునుఁ దెలుపుట .—

"తపములు గావించి - దానంబు లిచ్చి
జపములు సేయించి - శాంతులు నడిపి
యజ్ఞంబులొనరించి - యమరులఁ గొల్చి
ప్రాజ్ఞుఁడు దశరథ - పార్థివోత్తముఁడు
నోఁచి కన్నట్టి స - న్నుతపుణ్యమూర్తి
వాచక్రవాళ వి - శ్వావనియందు !
ఏ తండ్రి పుత్రకు - నెడవాసిపొలిసె
నోతండ్రి ! నీతండ్రి - యొక్కఁడే కాక !
అట్టి యనంత క - ల్యాణగుణంబు
లిట్టిమూర్తి వహించు - నీవల్గఁ దగునె ?
నీకు దాసుఁడగాన - నేనన్నమాట
చేకొనఁ బాడి యీ - చిత్తంబులోన
నీవు దలంచు పూ - నిక చేత దండ
కావనిలోపలఁ - గల మునీంద్రులకు

నభయమిచ్చిన పూన్కి - యుదియునుఁ దప్పి
సభయులై వారెల్లఁ - జత్తురీక్షణము!
అందాకనున్నదె - యటు మనవార
లందఱు నిపుడయో - ధ్యాపట్టణమునఁ
బురముతోఁడుతగ్రమ్మ - పోదు, రామున్న
భరతుఁడుం జచ్చు కో - పము చెల్లునయ్య?
కోపంబుచేత మీా - కు ఘయాతిపాటు
ప్రాపించు నిపుడు నా - పలుకు గాదనిన
మన కులగురుఁడు తా - మరమాలి పట్టి
ఘనుఁడు వసిష్ఠుఁడు - కన్నబిడ్డలను
కోపంబుచేత నె - కోల్పోయెఁ గాన
పాపంబుఁ దెచ్చు కో - పము రామచంద్ర!
గ్రహములచేపీడ - గ్రహరాజులైన
యహిమాంశుఁడును జంద్రుఁ - డనుభవించియును
దాఁటి గాక చే - తను గాక శక్తి
చాలక యుండిరె - జానకీరమణ!
దైవయత్నంబె ప్ర - ధానంబటంచు
దేవ! నాతో నాన - తి యొసంగువారు
పని లేదు మీాకిట్టి - పలుకు, దైవంబె
యనుకూలమైన నీ - యాపదల్ గలవె?
ఎప్పుడు నింద్రాదు - లేనియు నలిగి
తప్పింప నేర్తురె - దైవయత్నంబు?
దైవయత్నంబుచేఁ - దలఁగిన సీతఁ
గావలెనని యెంత - శశవలించినను
వచ్చునె? రాదని - వసుమతినెల్ల

చిచ్చఱయమ్ములఁ - జిదిమివై చెదవె?
మన యదృష్టంబుచే - మఱలిన మఱలె,
జనకజ రాకున్నఁ - జచ్చిన వారి
తోడి పాటగుఁగాక ! - తొయ్యలి కొఱకు
మూఁడులోకముల ని - ర్మూలింప నగునె?
ఈ వియోగమునకు - హేతువు లేక
పోవునె? సీత య - ల్పుని భార్యకరణి
స్వామి! ప్రాకృతునికై - వడి శోకమోహ
తామస వృత్తులఁ - దల్లడింపుదురె?
పడుచుఫాఁడాడిన - పలుకని నీవు
కడవఁద్రోయక వివే - కము దెచ్చుకొనుము.
ప్రాజ్ఞుఁడ వెఱుఁగుదు - వాత్మలో నిట్టి
యజ్ఞాన మితరుని - యట్ల పొందుదురె?
సూరోత్తములు శుభా - శుభకరములు వి
చారించి చేసిన - సౌఖ్యమొందుదురు!
అవుగాములెఱిఁగి హి - తాలోచనములఁ
దవులని వారలు - తలఁచి కామించు
క్రియలు ఫలించునె? - కీడాచరింప
నియతమె భుజశౌర్య - నిర్వాహకులకు?
చేతనావని మీరు - సృష్టిలోఁ గలుగు
భూతకోటుల నెల్లఁ - బొలివుచ్చఁ దగునె?
ఎంతటి పనియిది - యెవ్వాఁడు మనకు
నింతద్రోహము చేసె - నెటులైనఁ గాని
వెదకి వాని వధించి - వెలఁదిని మఱల
బ్రదికించి సాధించి - పగఁ దీర్చుకొనుము!

అయ్యా! బృహస్పతి - నైనను మిమ్ము
నెయ్యెడ బోధింప - నెంతటి వాఁడు!
మిమ్ము మీ రెఱిఁగి భూ - మిజఁ దెచ్చు బుద్ధి
నమ్మతింపుఁడు శౌర్య - సమయంబు గాదు
దేవతలకుఁ గల - దే! శక్తి మీదు
భావ మిట్లని యేరు - పఱచి కానంగ
నతశౌర్య! దేవమా - నుష పరాక్రమము
లతిశయంబుగఁ గల - వని మిమ్ము నెఱిఁగి
రాణివాసద్రోహి - రాక్షసుఁ బట్టి
ప్రాణముల్ గొనుట ద - ర్పంబవుగాక
పట్టి పాపంబు జీ - వశ్రేణి నేలఁ
బట్టి చంపుదురె మీ - పాటి ధార్మికులు!
వదలుము శోకంబు - వాయువు చేత
గదలునే మేరువు? - గాన సైరింపు
చాలించి నాకు ప్ర - సన్నులై మహికి
మేలెంచు" మనిన నే - మియు ననలేక
పరమకారుణ్యుఁడై - భవసాగరుండు
ధరణిజఁ బాయు ఖే - దమున నాగ్రహము
రానీక నిలిపి సా - రగ్రాహి గాన
జానకీపతి మహా - సారాంశమైన
తమ్ముని మనవి చి - త్తమ్మున నునిచి
యమ్ము ప్రేలఁగవైచి - యల్లైన వదలి
మీఁదటి కార్యమే - మియుఁ గానలేక
సోదరు నెమ్మోముఁ - జూచి యిట్లనియె.
"ఏమి సేయుదు మింక - నెచటికిఁ బోవ

నే మందు వేచంద - మింతేఁ దెప్పుటకు?
నాతోడ నాలోచ - నముచేసి పలుకు"
నాతోడనన లక్ష్మ - ణకుమారుఁ డనియె.
" రాజీవలోచన ! - రఘురామ ! చూత
మీ జనస్థానంబు - నీ పంచవటియు
వెదకుద మిచ్చోట - విపినభూములను
నదులునుఁ బొదరిండ్లు - నగములు గుహలు
చఱులును బిలములు - సానువుల్ తావి
విరులతోఁటలు నిండు - వెదుకంగఁ గలదు,
ఇందులఁ గ్రీడింతు - రెప్పుడు నమర
సుందరుల్ కిన్నర - శోభనాంగులును
రమ్ము పోద" మనంగ - రాజాస్య నన్న
దమ్ములు వెదకుచు - ధనువులమ్ములను
జతనమ్ములుగఁ బట్టి - శత్రులఁ దునుము
యతనమ్ముఁ గని చాయ - నై వచ్చి వచ్చి

— రామలక్ష్మణులు సీతనువెదకుచు జటాయువునుజూచి సీత వృత్తాంతమెఱుఁగుట :—

ముందటఁ గన్నులు - మూసుక వ్రాలు
మందరగిరి వోలి - మాంసరక్తములఁ
దొప్పఁ దోఁగిన మేని - తోడ జటాయు
వప్పుడు బడియుండ - నల్లంతఁ జూచి
కంటివే మనజన - కతనూజ యింట
నొంటి యుండఁగఁ బట్టి - ఊడకమ్రింగి
కైరభక గుటిక మ్రిం - గిన సిద్ధుఁడగుచు

నరిగించు కొనఁగ సా - ఖ్యమున నున్నాఁడు !
మాయామృగమురీతి - మఱియొక్క దైత్యుఁ
డీయెడ గృధ్రమై - యిటులున్న యపుడె
తలఁద్రెవ్వఁబడ నిశా - తశరంబు చేత
చులకగా నేసెఁ - జూడు" మీవనిన
నోటిలో నిండిన - నురుగు నెత్తురులు
మాటాడ సత్తువ - మాని గ్రక్కుచును
మెల్లనే యొకనేర్పు - మీఁ గన్నుఁదెఱచి
చల్లగాఁ గని రామ - చంద్రుతోఁ బలికె.
"అన్న! నీకెపుడు దీ - ర్ఘాయువౌఁగాక !
నిన్నుఁ జూచిన దాఁక - నిలిచెఁ బ్రాణములు !
శ్రీకరంబైన సం - జీవినీలతికఁ
జేకూడ వెదకుచుఁ - జేరినయట్లు
యేయింతిఁ గోల్పోయి - యిటకుఁ జేరితిరి
యాయమ్మ నొకరావ - ణాసురుఁడనెడి
దనుజుఁడెత్తుకపోయె - దక్షిణదిశకు
తనప్రాణములతోడఁ - దగఁ బెనవైచి
వానిచేఁ జచ్చి యి - వ్వసుమతిఁ బడిన
వానిఁ జంపఁగమీరు - వచ్చుటచ్చెరవు !
చచ్చినవానినే - జంపెద ననఁగ
వచ్చునె ? యోరఘు - వర ! జటాయువను !"
అనిసీతతోఁ గూర్చి - యాడినమాట
విని శోకమోహముల్ - ద్విగుణితంబైన
చేతులనున్నట్టి - సింగాణి విండ్లు
భూతలంబునవైచి - పొక్కుచుఁ గదిసి

యిరువుర పైఁబడి - యేడ్చి "హా" యనుచు
మరుగుచుఁ "బోయెదే - మాతండ్రి" యనుచుఁ
గౌఁగిలి వదలక - కన్నీరు మేని
పైఁగాలువలు వాఱఁ - బక్షీంద్రుమీఁది
మమతచే శోకించి - "మరణమిట్లేల
సమకూడె పక్షిరా - జా!" యంచునడిగి
"ధరణి యొక్కనికిచ్చి - తండ్రిఁబోనాడి
యరకె కానలువట్టి - యొంటిగా వెంట
నమ్మి వచ్చినయట్టి - నాతిఁ గోల్పోయి
యమ్మీఁద నినువంటి - యాప్తబాంధవుని
చావు చూచితి మన - స్తాపదావాగ్ని
యే వెంట నారునే - నెందులోవాఁడ
దహియించు నన్నియు - దహనుఁడా దహను
దహియించు నాదు సం - తాపానలంబు!
ఇంకించు వారాసు - లేనియు కలుష
పంకాత్మకుని నిన్ను - భంగించుటెంత!
నాకొఱకీవు ప్రా - ణంబు లిచ్చితివి
నీకుఁ బ్రత్యుపకృతి - నేఁ జేయఁగలనె?
పటుశోకవాగుర - పాశంబుచేత
నిటు గట్టువడి పార - మెఱుఁగక యున్న
ననువంటి భాగ్యహీ - నజనుఁడు జగతి
వనధి పర్యంత మె - వ్వఁడు గల్గనేర్చు
మాతండ్రి కీవు స - మానవయసు
చేత మించుటెకాదు - చెలికాఁడ వీవు
నాపాపకర్మంబు - నాదైన యట్టి

యాపదవేళకు - నడ్డంబురాఁగ
నిను బడవైచె దీ - నికి నేమి సేతు ?"
అని జటాయువు మేని - హస్తాంబుజముల
నివురుచుఁ బక్షీంద్రు - నెత్తురులంట
కవుఁగలించుక "యన్న ! - ఖగసార్వభౌమ !
ఏమాయె మాసీత - యెక్కడ బోయె !
ఏమంట యెత్తుక - యేఁగినవాని
నెవ్వఁడు ? వాని యూ - రెయ్యెడ" దనుచు
నవ్వేళ మఱుమాట - లాడలేనట్టి
యా జటాయువుఁజూచి - "హా ! పక్షిరాజ !
హా ! జానకీ !" యని - యవనిపైఁ బొరలి
క్రమ్మర లేచి యా - ఖగరాజుఁ జూచి
తమ్ముఁడు విన రఘూ - త్తముఁ డిట్లులనియె.
"నీపాటుఁ జూడక - నేస్వకార్యముగఁ
బాపంబులకు నోర్చి - పలుకరించెదను !
ఇట మీఁద నినువేఁడ - నేమియు సీత
నెట వలెఁ గొనిపోయె ? - నించుక పలికి
యురకుండు "మన విహ - గోత్తముఁ డొయ్య
మఱలంగ రఘువంశ - మణికి నిట్లనియె
"ఏరీతిఁ దెచ్చెనో - యెఱుఁగ రావణుఁడు
మీరమణీమణి - మింటి మార్గమునఁ
దేరుపై నుంచుక - దిక్కేది పోవ
"హా ! రామ ! హా ! రామ !" - యను నార్తరవము
చెవిసోఁకి యరికట్టి - చేసితిఁ గయ్య
మది వాని తురగంబు - లది వాని రథము

యిది టెక్కె మిది గొడు - గిది తనుత్రాణ
మిది శరాసనము సూతుఁ - డితఁ డూడిగములు
చామరహస్తు లి - చ్చటఁ బడి యున్న
చామనచాయ రా - క్షసు లిరువురును
నివి వాని హస్తంబు - లేనిట్లు ఘోర
జవము సత్త్వంబును - సన్నమాటయును
తనుఁ బడనఱికి యా - తఁడు సీతఁగొనుచు
ననుపమాత్మీయ మా - యాబలప్రౌఢి
నొకమబ్బు నొకవాన - యొకగర్జితంబు
నొకగాలి కల్పించి - యొక్కఁడు నందు
నవ్వారిఁ గననీక - యేఁగె వాఁడెటుఁగఁ
డవ్వేళ విసగడి - యలఁ బట్టినాఁడు
ఆముహూర్తము వింద - యందురుగాన
భూమిజ నిను వచ్చి - పొందు నిక్కముగఁ
బదిగడియలకైనఁ - బదినాళ్లకైనఁ
బదినెలలకునైన - పైఁ బనిలేదు
రామ! ఈవేళ సూ - ర్యస్వరం బౌదవె
కామితసిద్ధి ని - క్కముగ నీకొదవు!
కాలంబునకుఁ జిక్కి - గండెయుఁ బోలి
కాలునిచేవశం - గతుఁడయి వాఁడు
పోయెను దక్షిణం - బుగఁ గుబేరునకు
దాయాది యనఁగ వా - తను క్రొవ్వుదొట్ట!
అవిశ్రవసుపుత్రుఁ - డఖిలకంటకుఁడు
రావణుఁడన" నోట - రక్తంబు గ్రక్కి
"యేమేమి యెటకుఁ బో - యె"? నటంచు నాస

రాముఁడు హ స్తసా - రసములు మొగిచి
యెదుగఁగా బిరబిర - నక్షులు ద్రిప్పి

—: జటాయువు మరణము - శ్రీరాముఁడాతని కగ్ని
సంస్కారాదులఁ జేయుట —

విడిచెఁ బ్రాణంబు లా - విహగనాయకుఁడు !
తల వ్రేలగిలవైచి - తన కాళ్లు రెండు
యిలఁ జక్కఁగాఁ జాచి - యెఱకలు వదలఁ
బడిన జటాయువు - పైఁబడి రాముఁ
డడలుచో లక్ష్మణుఁ - డటులపై వ్రాలి
"నీకు నీక్రియ వచ్చె - నే కూర్తి !" యనుచు
శోకింపఁ దమ్మునిఁ - జూచి రాఘవుఁడు
"వినుము సౌమిత్రి ! యీ - విపినంబులోన
దనుజుల నింతయుఁ - దా లెక్కఁగొనక
వీరుఁడై యఱువది - వేలేండ్లు బ్రదికి
యీరాక్షసునిచేత - నిలమీఁదఁ గూలె ,
సీత నేఁడొక్కని - చెఱఁ జిక్కిపోవ
సీతఁ డడ్డమువచ్చి - యిచ్చెఁ బ్రాణములు
జానకిఁ బాయువి - చారంబ దెంత !
ఈ నిర్మలాత్ముఁ డ - నేక పక్షులకు
రాజటు విహగ సా - మ్రాజ్యంబు మాని
యాజిలోఁ బడియె నా - యవసరంబునను !
వృద్ధుఁడు దశరథ - విభునితో మొదల
బద్ధ సఖ్యము జేసి - పరమాప్తుఁడగుచు
నున్న మాత్రమె కాక - యొక్కఁడు నెదిరి

వెన్నీక రణములో - విడిచె ప్రాణములు !
శూరులు ధార్మికుల్ - సూనృతపరులు
ధీరులు నున్నారు - తిర్యగాత్ములును
నితని దహింపుద - మిపుడని'' కాష్ఠ
వితతి యమర్చిపై - విహగేంద్రు నునిచి
మథనాగ్ని వేగ ల - క్ష్మణుఁడు దెచ్చుటయు
వ్యథనొందుచును రఘు - వర్యుఁ డిట్లనియె.
"పక్షిపుంగవ ! నీకు - పరమధార్మికులు
దీక్షచే యాగముల్ - దీర్ఘపుణ్యులును
ఆహితాగ్నులు కామి - తార్థదాతలును
సాహసాధికులును - చనునట్టిగతికి
నాయనుగ్రహముచే - నాచేత నైన
యీయగ్నిసంస్కార - హేతువుచేత
నీవు వొందుదువని" - నీడజస్వామి
నావేళ దహియించి - యచ్చోటినదిని
స్నానంబు గావించి - తర్పణక్రియలు
పూనికఁ దీర్చి యా - పురుషరత్నములు
మమతతో వనమృగ - మాంసపిండములఁ
గ్రమమున నిడి మచ్చి - కను బ్రీతుఁ జేసి
క్రమ్మఱ మునిఁగి రా - ఘవులు శోకించి
యమ్మేరఁ బాసి వా - రవ్వలఁ జనగ
నాయెడ బంధుకృ - త్యంబుగా వారు
సేయు సంస్కార వి - శేషంబు వలన
నమరత్వమునఁ బొంది - యచ్యుతపదవి
నమరె జటాయువ - య్యర్కవంశజులు

నాకత్రోవఁ జనుచు నిం - ద్రోపేంద్రులనఁగ
నికటాటవిని ధర - ణిజఁ జూతమనుచుఁ
బడమరగాఁ గొంత - పయనంబునడచి
యడవిలోపల దక్షి - ణాశగాఁదిరిగి
శరచాపహస్తులై - సన్నమౌనడవి
తెరువునఁ బోవుచో - తెరువేరుపడక
కాలు మోపఁగరాని - కటికురానేలఁ
గాలిద్రోవైననుఁ - గానక పొదలు
కోరింద పొదలును - గుంపెనగచ్చ
యీరంబులును శమీ - వృక్షముల్ తుమ్మ
మ్రానులు చంద్రలు - మద్దులొద్దులును
రేనులుఁ బెనఁగి దూ - రియుఁ బోవరాక
పాములు గాములుఁ - బందులు పులులు
చీమలు దోమలు - జీంద్రుమనంగ
నట్టికాఱడవిలో - నర్ధయోజనము
పట్టునఁ గ్రౌంచాఖ్యఁ - బరగుకాననము
చేరి యయ్యడవిలో - సీతను వెదకి
వారుగాసిక కొంత - వడివడదీరి
బరవసంబున మూఁడు - పరువుల నేల
యరిగివారలు మతం - గాశ్రమంబునకుఁ
జనుబుద్ధితో నడు - చక్కిఁ జీకట్లు
పెనఁగొన్న యొకశైల - బిలము వీక్షించి

—: లక్ష్మణుఁ డయోముఖిని విరూపనుఁ గాఁజేయుట :—

చేరి యాచెంగటఁ - జేరాదుకడుపు
కోఱలు నెట్టివి - గుండ్లనువీఁచు

తలవెండ్రుకలు క్రూర - దంతముల్ గదుర
వలచుమేనట్టల - వంటిచన్నులును
బిల్లకాళ్లును మొద్దుఁ - బిక్కలుపెద్ద
పల్లముముక్కు చ - ప్పటయైన పిఱుదుఁ
గలిగిలక్ష్మణుఁజూచి - కామాంధయగుచు
వలకేలు వట్టియా - వలవచ్చు రాము
సడ్డసేయక "నీకు - చాలలోనైతి
వెడ్డువెట్టిననిన్ను - విడిచి పోఁజాల
నీపుణ్యఫలమిది - నేనయోముఖిని
వీపుపై నినుఁదాల్చి - విహరింపనేర్తు
నెటువలెయుంటివో - యిన్నాళ్లుగొంటి
నిటమీఁదననుఁ గూడి - యెల్లకాలంబు
రాజునువలెఁ గాపు - రము సేయుమీవు
నాజవ్వనంబు మా - నంబు నీసొమ్ము
కౌఁగిలిమ్మనిపల్కు" - గన్నెఱ్ఱఁజేసి
తాఁగత్తిజళిపించి - తలపట్టివంచి
చెవులునుముక్కునుఁ - జండ్లు వోఁగోసి
రవణంబుఁజెఱిచి పా - ఱంగఁ దోలుటయు
నతిభీతిచేఁ బారె - నామడమేర
నతిగని రఘువీరుఁ - డలఁతినవ్వొలయ
నావలజను చోట - నవశకునములు
భావించి యన్నతోఁ - బలికె లక్ష్మణుఁడు
భూమిజారమణ ! యి - ప్పుడు మదిఁగలఁగె
నేమొకో యదరెడు - నెడమభుజంబు

యెప్పుడు నాకైన - యీనిమిత్తములు
తప్పవే క్రియ నుపద్ర - వములందెదమొ ? ”
అనియొక నాలుగై - దడుగులమీరఁ
జనునంత నట్టహా - సము నింగిముట్ట
నొకమ్రోఁత వినవచ్చె - నురుమునుఁబోలి
యొకదమ్ముతో గాలి - యునుఁ జుట్టుకొనియె.
విని యాటదోయను - వేళ వంజులక
మనుపక్షియొక్క మ - హాశాఖనుండి
యెలిచిరొప్పినఁ గంటె - యీపైఁడికంటి
గెలుపుచెప్పెడి నేమి - కిటుకురాఁగలదొ ?
యన్నియుఁగనుఁ గొంద - మనుచు సౌమిత్రి
యన్నతోనాడియు - నాడకమునుపె

## —: కబంధ దర్శనము —

యేమ్రోఁతవినవచ్చె - నెందుండియెచట
నామ్రోఁతలో పర్వ - తాకారుఁడొకఁడు
కాటుకబలుఁ గొండఁ - కైవడి పెద్ద
మోటురీతిని నురం - బున తలమెఱియ
పచ్చనై మండుచుఁ - బటువైనకొమ్ము
బొచ్చులో తెల్లని - వునులు జాఱంగ
పెనుబొమ్మ పైనొడ - భీమదృష్టులనుఁ
గనుపట్టు నొక పెద్ద - కంటఁ జూచుచును
పంది కొమ్ములవంటి - బలుకోఱలమర
కందినమై చాయ - కడలిర్లు కొలఁప
వెడలుపౌ బొందితో - వెంట్రుకల్మైన

పొదువాటి దబ్బనం - బుల చాయనిక్క
సెలవులు నాలుక - చేనాకి కొనుచు
బలియుఁడౌ యోజన - బాహుకబంధుఁ
జేతులఁ జిక్కిన - సింహాదిజంతు
జాతంబు మెసవురా - క్షసుఁ దేఱిచూచి
తలలేని మొండెమై - తమపోవు త్రోవ
తొలఁగిరాకుండ చే - తులు బారచాఁచి
యుండు దానవుఁజూచు - చుండుచోనాఁడు
చుండునేలనె యుండి - యొడిసి హస్తముల
పరువునేలనె తమ్ముఁ - బట్టుక తివిచి
పిరువీకుడులు చేసి - భీతిపుట్టించి
యొక్కడునట్టి వీం - డ్లెందుకో కాని
చిక్కరి పొమ్మని - చేరఁద్రోయంగ
ధైర్యంబు వదలక - తల్లడ పడక
శౌర్యసహాయుఁడై - జానకీ విభుఁడు
యేమియు ననకున్న - నెట్లకోయనుచు
సౌమిత్రి చాలవిచా - రంబు నొంది
యొక్కడనైతిమి - యొడిచి మ్రింగెడును
దిక్కెదియని గుండె - దిట దప్పిచెదర
బాలుఁడు గావున - బ్రదుకుపై యాస
చాలంగఁ గలిగి ల - క్ష్మణుఁ డిట్టులనియె
"అన్న ! చిక్కితిమి గ - దయ్య ! యీయసుర
నిన్ను నన్నునుఁ బట్టి - నేఁడు మ్రింగెడును
యిరువురి కోనియుఁ - డెటులైన వీని
చెఱకు నన్నొప్పన - చేసి నీబారి

తప్పించుకొనిపొమ్ము - తనవంటివార
లిప్పుడుంచినను జో - యిన నేమిఫలము ?
నీవుగల్గినఁజాలు - నీదేవిఁ గూడి
దైవంబు తోడుగా - ధరణి యేలుచును
సాకేతనగరిలో - జనకజతోడ
వాకొని యొకమాట - వచ్చిన యపుడు
ననుఁ దలఁపుఁడు గాద - నఁగ నేలమీకు
మనమిర్వురముఁ గూడి - మడిసిపోనేల ? ”
అనిన వత్సలతను ద - యాజలరాశి
మనసు గలంగి ల - క్ష్మణున కిట్లనియె
“ ఏలయింత విచార - మింకటి పనికి
బాలక ! నీకిట్లు - వలుక ధర్మంబె ?
యేనుగల్గఁగ నని - యీమాట వలుకు
లోనుగా వాఁడు శా - లుని రీతిమండి
మీరలెవ్వరు ? పేరు - మీకెద్ది ? యేమి
గారణంబుగ నిట్టి - కంటకాటవికిఁ
జేరితి రాఁకటి - చేనున్ననాకు
మీర లాహారమ్మై - మించితి రిపుడు
కైదువుల్ నట్టి శృం - గములతో నొప్పు
పీదిలోపలి మహా - వృషంబు లనఁగ
పోలిక నాముఖం - బునఁ బడినారు
చాలింపుఁడింక నాశ - చావు సిద్ధంబు ”
అనిన మాటలు విని - యాస్యంబువాడఁ
గని తమ్ముఁజూచి రా - ఘవుఁ డిట్టులనియె
“ అక్కటా ! మనము రా - జ్యమునకుఁ బాసి

యిక్కడ నొకఁడింతి - నెత్తుకపోవ
నరయుచుఁ గడలేని -యాపదనొంది
తరుగుచునుండ న - దృష్ట మీరీతి
వచ్చునే మనవంటి - వారికి నెందు
నెచ్చోట నెవ్వారు - నెఱుఁగనికీడు
కాలంబు దొడ్డది - గావునదాని
వేలుపులకు గెల్చు - విధమేఱు పడదు
దైవంబునకు హెచ్చు - తక్కువ లేదు
కావద్దములు వివే - క పరాక్రములు
యినుముకట్టలు నది - నేరీతినాఁగు
పొసఁగవు వ్యర్థమై - పోవునంతయును"
అనిసత్య ధర్మ ప - రాక్రమశాలి
జనకజాభర్త యో - జన సేయుచుండఁ
జూచి కబంధుఁ "ఈ - చ్చో నాకుఁ దగిలి
యీచాయ గుజగుజ - లేల పోయెదరు ?

— రామలక్ష్మణులు కబంధుని హస్తములను ఖండించుట .—

విధిపడనీ పని - విధమునఁ దనకు
నడనుకు దొరికితి - రాహార మగుచు
రండు కూర్చుండుఁడూ - రక తామసింప
నుండలేఁడు కబంధుఁ - డోర్చియాఁకటను"
అన తెల్విఁదెచ్చుక - యన్న నెమ్మొగముఁ
గనుఁగొని యులికి ల - క్ష్మణుఁ డిట్టులనియె.
"చేతులే వీని యా - స్తి మ రేమి లేదు

హేతిచేఁ దెగ వ్రేత - మిరువుర మెదిరి
వీరి వారిని గెల్చు - విధమున మనల
నూరక దిగ మ్రింగ - నూహించె వీఁడు
యూపంబు చెంగట - నూరక యుండు
నాపశువులఁ బోలి - యల్పులరీతిఁ
జచ్చుట నిజమయ్యెఁ - జంకలకత్తు
లెచ్చుట నేమని - కింక డాఁచెదము ?
చేతనైనట్లు చూ - చినఁ గాక తీర
దీతఁడనిని హేతి - నెడమ భుజంబు
ధరఁగూలఁ దా నేయ - దక్షిణ భుజము
నరకె సీతాప్రాణ - నాథుఁడు దునియ
నెప్పుడు తనచేతు - లిలమీఁదఁ ద్రెళ్లె
నప్పుడే బలుకొండ - యనకబంధుండు
కూఁతలచేత ది - క్కులు పెల్లగిల్ల
రోఁతపుట్టఁగ నెత్తు - రులు మేననిండ
గదలక మెదలక - కడు దైన్యవృత్తి
సదయాత్ముఁడగు రామ - చంద్రున కనియె

—: కబంధుని పూర్వవృత్తాంతము :—

“ ఓరాజ సుతులార ! - యుగ్రహాసాహసులు
మీ రెవ్వరయ్య ! యే - మిటికి వచ్చితిరి ?
వినవలతును చేరి - వినిపింపుఁడనిన
దనుజునిఁగని సుమి - త్రాపుత్రుఁ డనియె
“ ఏము దాశరథుల - మితఁడు రాఘవుఁడు
సౌమిత్రి నేను మ - జ్జనకుని యాజ్ఞ

వనులనుఁ గ్రీడింప - వచ్చితి మిచట
జనకజ సీరాము - చంద్రుని దేవి
వంచించి నేఁడురా - వణుఁ డనువాఁడు
పొంచి యెత్తుక పోవఁ - బోలీక మేము
వెనుకొని సీతను - వెదకుచువచ్చి
నినుగంటి మెయ్యది - నీదు చందంబు
పరమొండె మునుఁబోలి - పదములు లేక
శిరమురంబునఁ జాల - చేతులుఁజాఁచి
యీాకతంబుననుండ - నెవ్వఁడ వనిన"
కాకస్వరమున రా - ఘవుల కిట్లనియె
"మీాకునిప్పుడు సేమ - మే? యన్నలార!
నాకుమున్నింద్రుఁడా - నతి యిచ్చుమాట
కలివచ్చె రామల - క్ష్మణు లొదరిపుడు
తలివచ్చె దనకుఁ నిం - తయు నిక్కువంబు
పుడమిపై వెదకుచుఁ - బోయెడి తెవి
యడుగులఁ దగులుకొ - న్నట్టి చందమునఁ
దన పుణ్యమున కర - ద్వయము నూరిట్లు
తునిమి వైచితిరి క - త్తుల చేత నరికి
తనకిట్టి వికృతగా - త్రంబు ప్రాపించు
ఘనమైన హేతువు - గలదెట్టు లనిన
నాదికాలంబున - నాదిత్యులందు
నాదిత్య చంద్రాన - లాభ తేజమున
మీాఱుచు దారిలో - మేటినై సత్య
సారంబుచేఁ గ్రొవ్వి - చాలగర్వమున
నిట్టి వాలికముతో - నెల్లర నెతలఁ

బెట్టుచు వెఱపించి - బెదరింపుచుండ
చెంతకు నొకస్థూల - శిరుఁడనుమౌని
యంత నింతటవచ్చి - యతిఘోరమైన
వేషంబు తోడినన్ - వీక్షించి వెఱచి
కాషాయ వస్త్రంబుఁ - గటిసీమఁ జాఱఁ
గందమూల ఫలాది - కంబులు భీతి
నందుఁ బాఱఁగ వైచి - యార్తిచేఁ బరువఁ
గనియేను నన్వీనఁ - గాంచి " యమ్మౌని
ననుఁగా నెఱింగి మా - వనములో నలిగి
యిట్టిభూమిక తోడ - నిందుండు మనుచు
దిట్టి శపించినఁ - దీఱనివగల
నడలుచు నమ్మౌని - యడుగులఁ వ్రాలి
కడు వేఁడుకొన్నచోఁ - గరుణించి యతఁడు
రామ లక్ష్మణులీ య - రణ్యంబులోన
నీమీఁద నలిగిన - నీదు కేల్దోయి
తునిమి మేను దహింపఁ - దోడనే ముక్తి
గనియెదవని " భావి - కార్యమూహించి
ననువీడుకొని పోయి - న యనంతరంబ
దనువను వానికిఁ - దనయుఁడ నగుచుఁ
దమ్మి చూలినిఁగూర్చి - తపమాచరించి
కొమ్మని యతఁడు నా - కు వరంబులొసఁగ
నావరగర్వ మ - హానుభావమునఁ
గావరంబున బల - గర్వంబు దొట్టి
పాకశాసను తోడ - 'బవరంబు సేయ
చేకొద్ది వజ్రంబు - చేతన శిరము

నరికిన తలఁద్రెవ్వి - నరములతోడ
నురముపై వ్రేలాడు - చున్న నే వెఱచి
శరణన్న నింద్రుఁడు - జలజ సంభవుని
వరముతోఁ బాలించి - వధియింపఁ డయ్యె
నెన్నినాళ్లిటులుందు - నేనంచు నడుగ
తన్నుఁ గన్గొని యిట్లు - తలయుండఁ జేసి
కడుపులో నోరిచ్చి - కరయుగళంబు
నిడుపుగాఁ బాలించి - నీదు చేతులకు
దొరకినయట్టి జం - తువుల మ్రింగుచును
చరియింపు మని పల్కి - సౌమిత్రితోడ
శ్రీరాఘవుఁడు వచ్చి - చేతుల హేతి
ధారచే ఖండించి - దహియించునప్పుడు
గాంతువు ముక్తి యి - క్కడ నని పోవ
నింతగాలంబు నే - నీగహనమునఁ
జేతికి లోనైన - సింహాదిజంతు
జాతంబు నిన్నాళ్లు - చలపట్టి మ్రింగి
వచ్చితి రేను మీ - వదనముల్ గంటి
విచ్చేట నాకోర్కె - లీడేరె నిపుడు
నమరేంద్రుఁడును కల్ల - లాడేగా యనుచు
మిముఁ గన్నదనుక న - మ్మిక చాలదయ్యె
రామలక్ష్మణులు మీ - రలె నిక్కువముగ
సామాన్యుఁడ కవై - శ్వానరుఁ దెచ్చి
తనమేను మీరలు - దహియింపుఁ డందు
ననుపమ వాక్సహా - యంబు చేసెదను
నామాట మీ రెన్ను - నములకు హితము

సేమంబు నియ్యనే – ర్చినది గావునను
కావింపుఁడట్ల" నఁ – గని రఘువరుఁడు
భావించి ప్రీతిఁ గ – బంధునకనియె
"ఏము లేనట్టిచో – నింటిలోనున్న
భూమిజఁ జెఱఁగొని – పోయె రావణుఁడు
యింతమాత్రంబె మే – మెఱుఁగుదు మతని
నింతటి వాఁడని – నిది నెలవనియు
నెఱుఁగ మేరీతివాఁ – డెచ్చటనుండు
పరిజనం బెంతయే – పట్టణంబునికి
మాసీత యేమయ్యె – మఱినీవెకాని
యీసుద్ది దెలుపువా – రవ్వారు లేరు
యేమనాథలము ది – క్కెఱుఁగక వెతల
సీమాడ్కి నడవుల – నెటుబోదు మనుచు
చేబారలిడుచోటఁ – జేసినపుణ్య
మీబాంధవునిఁ దెచ్చి – యిచ్చెనుమాకు
నోయయ్య! తెలుపవే – యొకమాట యనిన
వాయెత్తి యిట్లని – వచియింపలేక
సింధురగమనుఁడా – శ్రీరాము ప్రాణ
బంధుఁడైనట్టి క – బంధుఁ డిట్లనియె
"సీతకార్యము మీకుఁ – జెప్పెద దహన
హేతిలో వైచి ద – హింపుము నన్ను
అంటిది దహియించి – నప్పుడుగాని
యంటదు నాకు ది – వ్యజ్ఞానశక్తి
యిట్టిపాపంబుల – కిరవైన మేన
నెట్టు దెల్పుదుమీర – లెంచిన తలఁపు

రావణు నెఱుఁగ కా - రణమేమినాకు
దేవత్వమునఁగాని - తెలివిడిగాదు
కపటాత్ముఁగాననుఁ - గననేలమీాకు ?
నిపుడొక్క యుపకార - మేను చేసెదను
సేయుఁ డొక్కనితోడఁ - జెలిమి వాఁడెఱుఁగు
నీ యఖిలావనీ - వృత్తమంతయును
లోకంబులెల్ల నా - లోకించినాఁడు
మీాకుఁగావలయున - మేయసాహసుఁడు
అతనివర్తనము మీా - కాద్యంతములుగ
హితమతితోఁ దెల్ప - నిపుడేఱుపడదు
కరుణతోనగ్ని సం - స్కారంబుచేసి
పరిశుద్ధుఁ జేయుఁ డీ - పట్టున’’ననిన
బిలములోఁ బడద్రొబ్బి - పేర్చియామీాద
బలువైనకట్టులు - వఱచికాల్చుటయు
నేతిముద్దయుఁ బోలి - నిర్జరవైరి
వీతిహోత్రములోన - వెలుఁగుచు దీప్తి
యుతుఁడైన యట్టి యా - హుతవహునందు
నతిశయజ్వాలా స - మన్వితంబగుచు
నొక్కతేజమువోయి - యుడు వీధినుండి
చక్కని యచ్చర - సఖియలుఁ గొలువ
నవరత్నమయవిమా - నంబెక్కిదాన
దివిజుఁడై భూషణ - దీప్తులు వెలుఁగ
నిలిచి రాఘవుఁజూచి - నీరదనినద
విలసనధ్వనితోడ - విభుఁడిట్టులనియె.

—: కబంధుఁడు నిజరూపమునుఁ బొంది తగిన
మిత్రుని రామునకుఁ జెప్పుట :—

" రామ ! షడ్గుణములు - రాజులకెల్ల
భూమిఁ బ్రశస్తమై - పొలుచు నందులను.
అమరదు సంధి ము - న్నగు నైదునీకు
నమరు నిప్పటికి స - మాశ్రయంబొకటి
బలవంతుతోడ తాఁ - బగవూను హీన
బలుఁడు వేఱొక్కని - బలవంతుతోడ
చెలిమిసేయుట యొప్పు - చెలిమికి నతఁడు
బలియుతోఁ బగదీలు - పడియున్నవాని 6160
పొసగదు కొంచియం - బున వానికైన
దొసఁగుఁ దీఱిచి వాని - తోడ్పాటువలనఁ
దన ఘనకార్య మం - తయుఁ దీర్చికొనఁగ
ననువగుఁగాన మీ - కతఁడుగావలయు
నాయన సహవాస - మబ్బకయున్న
నేయర్థములు మీకు - నేల చేకూడు ?
వాఁడెవ్వఁడన్న ది - వాకర సుతుఁడు
వాఁడిమిఁగలవాఁడ - వార్యదోర్బలుఁడు
అగ్రణి బహువాన - రానీకమునకు
సుగ్రీవుఁడందు రె - చ్చో వానిపేరు 6170
వాలిచే నిల్లాలి - వసుమతి నతఁడు
కోలుపోయినవాఁ డొ - కండు నున్నాఁడు
పంపాసరోవర - ప్రాంతంబునందు
ముంపుభీతిని ఋష్య - మూకశైలమున

నలువురు మంత్రులం - దనుఁ గొల్వనచట
తొలఁగకయున్నాఁడు - దుర్జయుఁ డతఁడు
సత్యసంధుఁడు ప్రతి - జ్ఞాపాలకుండు
దైత్యపన్నగ దేవ - ఖగణ సిద్ధ
చారణాదులకు న - సాధ్యుఁడనేక
వీరవానరులు సే - వింతురాఘునుని
రావణుఁడెంత శ్రీ - రామ! మీరేమి
గావింపఁదలఁచినఁ - గడతేర్చునతఁడు
కానట్టి వాఁడో యా - తలి వాఁడునట్ల
కానిచో వారికక్కడివి - నెయ్యములు?
అరకమిగొన్న వాఁ - డాఁకటివాఁడు
దొరయైనవాఁడు నెం - దున బీదవాఁడు
నెవ్వఁడు వాఁడు చిం - తనుఁ బొందువాఁడు
చివ్వకాఁడును చెల్మి - చింతించువాఁడు
జతగూడనేర్తురే - జగతినట్లగుట
నతనికి నీకు స - ఖ్యము సేయుటొప్పు
నట్టి భానుతనూజు - నంతటివాఁడు
చుట్టమైననుఁ జాలు - చూపినపనులు
సమకూర్చునీకు ద - శగ్రీవుఁంటి
విమతులెందరికైన - వేఁటాడగలవు
రామ! యాతఁడు ఋక్ష - రాజునిసుతుఁడు
భూమిపై నౌరస - పుత్రుఁడురవికి
నినుడెంత పర్యంత - మెఱుఁగునో జగతి
యినసూనుఁడు నెఱుంగు - యిలయెల్లఁజూచి

సీతనీకతఁడు దె - చ్చియొసంగఁగలఁడు
నీతోడు సుగ్రీవు - నికి కార్యకారి
వెదకించుగపుల చే - విశ్వమంతయును
వెదకుమాత్రమె కాదు - వెదకి సాధించు
నీసులు లేకుండ - యిరువురుఁగూడి
బాసచేసికొనుఁడు - పావకుముట్టి
యాయుధంబులు గొట్టుఁ - దరలేకయుండ
పాయకన్యోన్యంబు - పనులుఁదీర్చుటకు
ధరణిపై సప్తపా - తాళంబులందు
సరసిజగర్భుని - సదనంబులోన
సీతను డాఁచి యుం - చినఁ జూడనేర్తు
రాతనిఁగొలిచిన - యగచరోత్తములు
యెచటనున్నాఁడని - యెంచితిరేని
యిచటికిఁ బడమర - నిదె చక్కఁజాయ
పొన్నతోపున్నది - పొందు మీరచట
నున్నవిశేషంబు - లూహించి కనుఁడు

—కబంధుఁడు రామునకుఁ ద్రోవఁజూపి పోవుట :—

నచ్చోటఁ గలవు మీ - కమృతఫలంబు
లిచ్చవచ్చినయవి - యెల్లగైకొనుఁడు
ఆరమ్యవనములో - నలఁతలన్నియునుఁ
దీఱి యుత్తరకురు - దేశంబులనఁగ
వాసవు నందన - వనమున విరుల
వాసించునొక పుష్ప - వనమున్నదవల

భూరుహంబులు దానఁ - బుట్టినవెల్ల
వారికిఁ గోరిన - వస్త్రంబులిచ్చు
ఫలములందుల నుండి - పడి తేనెయవిసి
యిలఁ జేసెకాలువ - లీనుచునుండు
ఋతువు లన్నియునందు - నెప్పుడుయాత్మ
రతినిచ్చునది చైత్ర - రథముచందమునఁ
బాదపంబులు ఫల - భారంబుచేత
మేదినిఁ జీఱుచు - మెచ్చులఁదెల్పు
నొకకొన్నియచలంబు - లున్నట్లుమెఱయు
నొకకొన్ని జలదంబు - లోయనఁదోఁచు
నోరామ! యిచ్చోట - నున్న వృక్షములు
మీఱిచూచిన మఱి - మీఱిపోలేదు
ఇట్టివనంబు ల - నేకంబు లచటి
చుట్టునఁ గలవవిఁ - జూచుచుఁబోయి
వొకకొన్నిశైలంబు - లొకకొన్నినదులు
నొకకొన్ని వనములు - నొకకొన్నిచరులు
కనుఁగొని యవ్వలి - కడకేఁగియుర్వ
రునుఁ బొంతు పంపాస - రోవరంబునకు
నచ్చోటమొరపతా - లడుసు పల్లములు
రొచ్చులు ముండ్లు జి - రుకులును లేవు
యేరేవుచూచిన - నిసుమును తేట
నీరనుఁగలిగి కం - టికి విందుసేయు
మునులు నిచ్చలు స్నాన - ములుచేసిపోవ
నసయంబుఁ గ్రీడించు - నలవాటుకతన

గనకుఁ బారవుమిమ్ముఁ - గని నీడజములు
కడు నమ్మిచేరి చెం - గట నుండుగాని
వెన్నముద్దలరీతి - వింతయెఱుంగ
కున్న పక్షులఁబట్టి - యొక్కటిరెండు
కమలించి ముక్కునుఁ - గాళ్లుఁబోవైచి
చమరుగారఁగ భుక్తి - సలుపుఁడుమీరు
వంపుముక్కులఁ జేర - వచ్చు వాలుగుల
నంపకోలను గ్రుచ్చి - యనుజుఁడు దెచ్చి
కాఁచుబోమాడిచి - గనియలుచేసి
నీచెంతనిడఁ దృప్తి - నీవందు మచట
సౌమిత్రి! యచటికా - సారంబులందు
తామరపాకులఁ - దలఁకకయుండ
తేటలై చల్లనై - తియ్యనై వలచు
నీటికి దోయిలి - నీవొగ్గి త్రావి
పహరింపు మాసరో - విమలజలంబు
మహిఁ గ్రోలు వారికి - మానురోగములు
పందు లాకెలఁకుల - బలుపెక్కునేతి
బిందెల వలెఁ దరుల్ - పెల్లగింపుచును
విచ్చలవిడిఁ బోవ - వేఁటాడితూవు
లుచ్చిపోవైచి బి - ట్టురువడిఁ గూల్చి
హత్తి కారగ్గుల - యందుఁబొరల్చి
కత్తిరాలనుఁ జివ్వి - కమరించి కడిగి
వాలిచి కరకుట్లు - వాచవిపుట్టఁ
గాలిచి నీకు ల - క్ష్మణుఁ డియ్యఁగలఁడు

పువ్వులు చుట్టిన – పురుషులఁబోలు
నవ్వనంబునఁ బుష్పి – కావనీజములఁ
జల్లనినీడలఁ – జందనానిలము
మెల్లనే రామేన – మించినయట్టి
శ్రమమెల్లఁదీరన – చ్చట శయనించి
క్రమియింపుఁ డెండల – కాఁకల పగలు
శ్రీరామఁయొదులు వెం – చినవిగా నచటి
భూరుహంబులు గొడ్డు – వోవందు నొకటి
"యెండవుఫలము లే – యే వేళఁగలిగి
యొండు నందులనిండి – యుండుదు రెపుడు"
"మునిచంద్రులు మతంగ – మునిశిష్యకోటి
దినము వా రాచార్య – దేవపూజకును"
పువ్వులు ఫలము లె – ప్పుడుఁ గొని తెచ్చు
నవ్వేళ యతుల శ్ర – మాంబు బిందువులు
చినుకొక్కటిగ మొల – చిన యవిగాన
ననుపమానముల మ – హావృక్షకోటి
చేరియచ్చట వారి – సేవించి యావల
మీఱుచో నచటి స – మీపమ్మునందు
శ్రమణి తపస్విని – శబరి కిరాత
రమణి యొక్కతె మీఁదు – రాకఁగామించి
యున్నది యాయింతి – నూరార్చియాపె
విన్నవించిన మాట – విని చిత్తగించి
పంపాసరోవర – పశ్చిమదిశను
చంపక పనసర – సాలహింతాల

నారికేళాశోక - నారంగవకుళ
పారిజాతతమాల - పాటలప్రముఖ
ధరణీరుహములచే - తను దివ్యమగుచు
ధరణిఁ జెన్నమరు మ - తంగవనంబు
పావనికిని మంతం - గాచలకరులు
రావెఱచును మాని - రాజుశాపమున
దాని తూర్పున మెచ్చఁ - దగు ఋశ్యమూక
మానగం బొకని శ - క్యముగాదు పొగడ
నెక్కరా దొరులకు - నేనుఁగగున్న
లక్కడ భయము లేక - భివృద్ధి నొందు
నజునినిర్మిత మది - యచ్చటఁగన్న
నిజమాను కలలెల్ల - నిర్దోషులకును
నానగం బెక్కిన - నగుఁగాక నీచ
మానవుల్ చేరిన - మాతంగశక్తి
చంపిపోవుదురు రా - తను లందునుండి
గుంపులై యెలుగించు - కొదమ యేనుఁగలు
మదమేనుగులకునై - మాని పుంగవులు
కొదమ యేనుగులఁ గై - కొని తోలిదెచ్చి
పోకపాళెల నీరు - వోసి పోనీక
యాఁకలిచేసి పా - యక ప్రోతురచట
పోషిత వనమృగం - బులు బహుశీత
పాషాణముల విజృం - భణ వృత్తి మెలఁగు
బలురాయి తనవాతఁ - బడయుండ నొక్క
బిలమన్న నగము న - భేద్యమైయుండు

దానికి బ్రాగ్దిశా - ద్వారంబునందు
నూనుచల్లని నీట - నొకదోన గలదు.
ఆదోనకును దక్షి - ణాశ నానాఫ
లాదులతోఁ దోఁట - యందమైయుండు
నాతోఁటఁ గోమ్మావు - లందు నీడలను
బ్రీతి వసించు సు - గ్రీవుఁ డెప్పుడును
నట్టిసుగ్రీవుని - యాప్తులౌమంత్రు
లెట్టిచోఁ దనుఁగాచి - హితవృత్తి మెలఁగ
నొకవేళ బిలములో - నొకయెడ వనుల
నొకతరి గిరి మీఁద - నొకకేవఁ దరుల
గ్రీడించు నచటి కేఁ - గిన నానరేంద్రుఁ
జూడఁగాంతురు మీకు - శుభమగుఁగాక
పోయెదనని" దివ్య - భూషణద్యుతులు
తోయద ద్వారంబుఁ - దోరణకట్ట
బంధంబుఁ దీఱి క - బంధుండు దీన
బంధుఁడౌ రఘుకుల - ప్రవరుఁ డంపుటయు

—: రామలక్ష్మణులు శబరిం జూడఁబోవుట :—

గంధర్వుఁడై పుష్ప - కము తోడఁజనిన
బంధుఁడౌ నతఁడు డె - ల్పఁగ విన్నసరణి
పంపకుఁ జక్కని - పడమటితోవ
గుంపులౌ వనులు గ - న్గొనుచు రాఘవుల
తారు సుగ్రీవ సం - దర్శనాపేక్షఁ
జారువైఖరివచ్చి - శబరియాశ్రమము

చేరినఁ గాంచియా - చిగురాకుఁబోఁడి
శ్రీరాముభక్తి న - ర్చించి పూజించి
కందమూలముల నాఁ - కలిదీర్పదాని
విందుల వికచార - విందలోచనుఁడు
రాముఁడు మెచ్చి కి - రాతభూమికిని
సేమంబు దెలియ నీ - క్షించి యిట్లనియె
" లెస్సలే నీకు పు - ళిందవధూటి!
గుస్సహాళక్తిఁ జే - తువె తపఃక్రియలు ?
నియమంబు కొనసాగు - నే నీకుమాకు
జయము సంధిల్లె నీ - సందర్శనమున
నీగురు శుశ్రూష నీ - మనోజయము
సాగుచున్నదియె యె - చ్చంబును లేక
అనిన తపస్విని - యంజలిచేసి
మునివృత్తి నున్నరా - ముని కిట్టులనియె
" అయ్య నీకరుణచే - నన్ని కార్యముల
నెయ్యెడలఁ గొఱంత - యేఁటికిఁ గలుగు
నాదుతపంబు మి - న్నక ఫలియించి
యో దేవ! మిముఁ దెచ్చి - యునిచెఁగట్టెదుర
నేధన్యనైతి నా ని - యమంబులెల్ల
సాధువాదముఁగాంచె - జన్మమీడేరె
నిపుడు మీచరణంబు - లేఁబూజచేసి
యపవర్గ సౌఖ్యంబు - లందఁబాలైతి
చిత్రకూట నగంబు - చేరిన మీ చ
రిత్రంబు సన్ముని - శ్రేణినాతోడ

దివికి నేగుచుఁబల్క - తెరువులుచూచి
రవివంశతిలక ! - నీరాకఁగామించి
నున్నాఁడ ననుఁబ్రోవ - నోస్వామి! మీర
లన్నఁదమ్ములు వచ్చి - యర్చ్చలందితిరి
మిముఁగనుఁగొని సంయ - మివ్రాతమెల్ల
నమరలోకమునకు - నరుగుచుఁదనకు
నింతయుఁ జెప్పితా - రేఁగినకతన
నింతసంతోషము - య్యెను నేఁటిదినము
అనఘ ! యీకనుచు వ - న్యంబులుడాఁచి
యునిచిన దానఁ గొం - దుపహారముగను
ననుఁగటాక్షింపుఁ" డ - న్న కిరాతిమీఁద
కనికరంబునిచి రా - ఘవుఁ డిట్టులనియె
"మాకుహితంబెంచె - మన్ననతోడ
నాకబంధుఁడు దెల్పి - నప్పటనుండి
యెప్పుడు వోవుదు - మెప్పుడుచూతు
మెప్పుడు భాషింతు - మేమనియెంచి
వచ్చినవారమో - వనిత ! నీమహిమ
మిచ్చట జూడఁగ - నిచ్చ యెంచెదము
నీసేయు పూజలం - దితిమని పలుక
దాసినేనట్లు చి - త్తంబు రానడతు
ననివారిఁ దోడ్కొని - యువ్వనసీమ
మునఁగల్గిన వి శేష - ములు చూడుఁడనుచు
నిదిమతంగాశ్రమ - మిచట మద్గురుఁడు
త్రిదశ సంప్రీతిగాఁ - దీర్చువహోమంబు

నిది దేవపూజ చో - టిది యాగశాల
యిది జపమొనరించు - నిరవని చూపి
శ్రీరామ! యిమ్ముని - శ్రేష్ఠుని మహిమ
నీరమ్య దేశంబు - లిపుడుఁ జూచితిరె?
శోభనరమ్యతే - జోవిశేషముల
సౌభాగ్య కరములై - చాలనొప్పెడును
అలమౌని తనకేల - యాయాసమనుచుఁ
దలఁచిన యంతస - ప్త సముద్రములును
వచ్చియమ్మౌనిఁ గా - వలసిన కోర్కు
లిచ్చి క్రమ్మర నవి - యేఁగు నాఘనుఁడు
ఆరఁగట్టిన యట్టి - యానారచీర
లారవార్ధంబులై - యవె భూరుహముల
నామౌని పూజించు - నలరు లింతయును
రామ! వాడకయవె - రాసులై యొప్పె
నతఁడు చరించు న - య్యడుగులజాడ
లతిపావనములు క - టాక్షింపుమీవు
యీవనమహిమంబు - లివియిమ్మెఁ జూచి
పావనినై తినేఁ - బనివిని యెదను
చనియెద నాచార్య - సన్నిధి కిపుడె
ననుఁజూడుఁడ" నిన నెం - తయు వెలిఁగంది
"పూజచేసితి మమ్మ - పొలఁతి నీవేమి
యోజించినావొ నే - యుదుపు గాకటుల
ననరాము వలఁగొని - యాచెంచువనిత
కనఁగన వెలుఁగు నింగ - లము లోపలను

మేను వేలిచి దివ్య – మృగ నేత్రయగుచు
తానేఁగె గురుసన్ని – ధానంబుఁ జేర
నివ్వేళతో తమ్ము – ని మొగంబుచూచి
యవ్వేళ సీతాస – హాయుఁ డిట్లనియె
" చూడుమిచ్చో మృగ – స్తోమంబులెనసి
కూడియున్నవి – వైరగుణములులేక
యిచటివృక్షములు గం – టే! ఫలభార
రుచిరంబు లగుచు జీ – గుచున్నవవిని
యెంతవాఁడు మతంగుఁ – డేడువారాసు
లింత కొంచెపు – పనియే రమ్మనంగ
నవియెల్లఁ దీర్ఘంబు – లై యున్నవిచట
నవిరళ వారిపూ – రంబనులగుచుఁ
దానంబు లొనరించి – తర్పణక్రియలు
పూనితీర్చితి మెంత – పుణ్యవాసరమొ
యీదినంబు కిరాతి – నీక్షించిచాల
మోద మందితిమిది – మొదలుగా మనకు
సకలకల్యాణముల్ – సమకూడునింక
నొకటయు గొదవలే – కుండు గార్యముల
నామది నిండియు – న్న తెఱంగుచూడ
భూమిజ వచ్చుగాఁ – బోలుఁ గ్రమ్మఱను
పదెబుష్య మూకము – న్నది యందుసీత
వెదకిన నుందునో – వీక్షింతమనుచు "

— రామలక్ష్మణులు పంపాసరస్సునకుఁ బోవుట —

ననుమతించిన సుమి – త్రాత్మజుంగూడి

చనిచని కొన్ని యా - శ్రమములు గడచి
ముందఱ వనమృగం - బులు పులుగులును
సందడి సేయు న - చ్చట రమ్యమగుచు
నమరు మతంగనా - మాబ్జిని గాంచి
తమరందు మునిఁగి యా - దండ సేయున్న
నొక్క రమ్యస్ఫటి - కోపల ప్రభల
నక్కజంబగు నీట - నమరిచూపట్టు
పంపాసరోవర - ప్రాంతంబుఁ జేరి
సంపూర్ణ జలపక్షి - చయకలస్వనము
పూచిన మల్లెపూఁ - బొదలునుఁ దరుల
నేచిమిన్నందు మ - హీరుహావళుల
పుప్పొడుల్ ముగ్గుల - పోలిక రాలి
విప్పుగాఁ బఱచిరో - విపిన మార్గములఁ
బైపయి రత్నకం - బళములనంగ
జూపట్టు నెడలు మె - చ్చుచు నికుంజముల
మాటువం గనరాక - మహిసుతఁ బోలి
చాటుననున్న కా - సారంబు చూచి
రాజగేహంబు లా - రాణివాసంబు
నోజఁ దానున్నచో - టొకరి కేర్పడక
యున్న పంపాతటం - బొక్కెడఁ జేరి
వెన్నుగాచుక వచ్చు - వీరులక్ష్మణుని
గాంచి సీతావియో - గంబుచేఁ దాల్మి
యుంచనేరక రాముఁ - డొక మాటవలికె
“ఈ పంపగనుఁ గొంటి - వే ? యనిమేష

కోపనాపుంభావ - కూజికాభ్యసన
చతురపారావతి - శారికాకీర
కృతకలారావ వ - ర్ధిష్ణు మనోజ
సంగరరసలోల - శబరాంగనాను
షంగిలతాగృహ - సంచరన్మలయ
పవమాన విగళిత - ప్రసవోపచార
నివహానిమోదిమా - నిగణంబు" దాని
నెంతి వేడుక చేసె - నీ సరోవరము
కాంతలతోడ నీ - కాసారసీమ
జలకేళి యొనరించు - జనులకేమిటికిఁ
దలప నందనవనాం - తర విహారములు ?
చెంగటఁ దేటి చూ - చితివే సమస్త
మంగళప్రదమహా - మహిమముల్ గాంచు
నవలోకమాత్రని - రస్తశోకంబు
దివిజభూమీధరాం - తి ప్రవేకంబు
అపహృతాద్వన్య క్ర - మాతిరేకంబు
తపనేందుమణిగణ - స్థగితరోకంబు
అమరాపగాకృతా - త్మాభిషేకంబు
యమదూతగదితన - ఉమోనువాకంబు
సారసినీచర - చ్చక్రవాకంబు
తీరవనీ సము - త్తీర్ణపైకంబు
కందరాంతర విశం - కటవనోకంబు
సందీప్తశృంగాను - షంగినాకంబు

హేలాచరిష్ణు గం - ధేభపాకంబు
తాలాదితరసము - త్కటవనీకంబు
ఋషికన్యకాకరా - హృత ప్రలాకంబు
విషయలోలాశర - ద్విపదభీకంబు
వాలిసంప్రాప్త భా - వవ్యళీకంబు
కాలాచరితమాని - గణసరాకంబు
ప్రతిపన్నయతి పుణ్య - ఫల విపాకంబు
శృతఋష్యనీకంబు - ఋష్యమూకంబు
యీకొండచేరఁగ - నేఁగి సుగ్రీవుఁ
జేకొందమెందు వ - సించియున్నాఁడొ ?
ఆఋతుకజు కు మా - రాగ్రణితోడ
నూరక యేరీతి - నోనఁగూడుఁ జెలిమి
నీవేఁగుమే సీత - నిమిషంబుఁజూడ
కేవగం బ్రాణంబు - లిఁక బూనియుందు "
ననుచుఁబంపాతీర - మల్లనం జేరి
తనసహోదరుఁగూడి - తగ విశ్రమించి
విలసిల్లెనని వేద - వేద్యుని పేర
నలమేలు మంగాంగ - నాధుని పేర
సంచితకరుణా క - టాక్షుని పేరఁ
గాంచనమణిమయా - కల్పుని పేర
వేదవేదాంతార్థ - వినుతుని పేర
నాదిత్యకోటి ప్ర - భాంగుని పేరఁ
గంకణాంగద రత్న - కటకుని పేర
వెంకటేశుని పేర - విశ్వాత్ము పేర

సంకితంబుగ వేంక – టాధీశచరణ
పంకజసేవాను – భావమానసుఁడు
హరిదాసమణి కట్ట – హరిదాసరాజు
వరదరాజు నితాంత – వరదానశాలి
రచియించు వాల్మీకి – రామాయణంబు
ప్రచురభక్తిని మదిం – బాటించి వినినఁ 6490
జదివిన వ్రాసిన – సభలఁజేర్కొనిన
మదిఁదలఁచిననెట్టి – మనుజులకైన
ధారుణి మీఁద సీ – తారామచంద్ర
పారిజాతదయా ప్ర – భావంబువలన
హయమేధరాజసూ – యాదియాగ
నియతఫలంబులు – నిరతాన్నదాన
సుకృతంబు నిత్య య – శోవైభవములు
నకలంక తీర్థయా – త్రాది పుణ్యములు
సత్యవ్రతపదంబు – సకలసౌఖ్యములు
నిత్యమహాదాన – నిరుపమశ్రీలు 7500
కలికాలసంప్రాప్త – కలుషనాశనము
కలుములు హరిభక్తి – గౌరవోన్నతులు
శత్రుజయంబును – స్వామిహితంబు
పుత్రలాభంబును – భోగభాగ్యములు
ననుకూలదాంపత్య – మంగనాశ్రయము
ధనధాన్యపశువస్తు – దాసీసమృద్ధి
మానసహితము ధ – ర్మ ప్రవర్తనము
నానందములు ఖేద – మందకుండుటయు

నలఘువివేకంబు - నతుల గౌరవము
వలయుకార్యములుకై - వశములౌటయునుఁ 6510
బావనత్వము దీర్ఘ - పరమాయువులును
కైవల్యసుఖము ని - క్కమ్ముఁగాఁ గలుగు
నెన్నాళ్లుధారుణి - యెన్నాళ్లుజలధు
లెన్నాళ్లు రవిచంద్రు - లెన్నాళ్లుగిరులు
యెన్నాళ్లు నిగమంబు - లెన్నాళ్లువిశ్వ
మన్నాళ్లు నీకథ - యలరు నార్షంబు
నాదికావ్యంబర - ణ్యాఖ్యకాండంబు
వేదసమానమై - విలసిల్లుఁగాత 6518

* శ్రీ రామార్పణమస్తు *



కట్టా వరదరాజకృతమగు

# శ్రీ రా మా య ణ ము

(ద్విపద)

---

## కిష్కింధాకాండము

శ్రీరాజితశుభాంగ! - చిరగుణిసంగ
హరికృపాపాంగ! - యలమేలుమంగ
భావుక! శతకోటి - భానుసంకాశ!
సేవకాత్మనివేశ! - శ్రీవేంకటేశ!
అవధారు కుశలవు - లారామచంద్రుఁ
డవధరింపంగ రా - మాయణంబిట్లు
వినుపించు తత్కథా - వృత్తాంతమెల్లఁ
గనుపించు నవ్వాలి - కథ యెట్టులనిన

—: శ్రీరాముఁడు వసంతాగమ శోభితమైన పంపాసరస్తీర
మునుగాంచి, సీతావియోగభరమును తాళఁజాలక లక్ష్మణునితోఁ
దత్తీరవర్ణనఁగావించి ప్రలాపించుట :—

ఆ రాఘవుఁడు పంప - నందముల్ నింప
చేరికన్ గొని తన - సీతావియోగ

విరహావేదనలచే - వేగి యా సరసిఁ
దరసి యా దరినీషఁ - దమ్మునిఁజూచి
యచటి వినోదంబు - లాత్మకింపొసఁగ
నుచితవైఖరితోడ - నొక మాట వల్కె
"వైడూర్యసిర్మల - వారిపూరంబు
చూడఁ జూడంగ నె - చ్చులు పాదు కొల్పు!
చేతోవికాస ల - క్ష్మి నిధానంబు
లీతీరవనభూము - లీక్షింపు మిపుడు!
ఒక కొన్ని శిఖరస - మున్నతశైల
నికరంబులనఁగ వ - న్నియఁ గాంచె తరులు!
భరతవియోగంబు - భామావియోగ
మిరువాగు జతఁగూడి - యేకీభవించి
మన విచ్చునే యీద్రు - మచ్ఛాయలందు!
అనుపమ ప్రసవ ప - ర్యంకపాళికలు
నీచోటి పుష్పితా - నేకవృక్షములు
నీచాయ మలయమ - హీధరానిలము
నీవేళఁ బ్రాపించు - నీవసంతంబు
భావంబులోనఁ దా - పము మించఁ జేసె
జలదముల్ వడగండ్లు - చల్లినరీతి
నలరులు రాల్పు ల - తాళిఁ జూచితివె!
చరులందు వాయువ - శంబుచేఁ దొరఁగ
విరులకొటారులై - విలసిల్లె నిచట!
రాలియు రాలుచు - రాలక నిలుచు
నీలతాంతములచే - నిచటి భూజములు
వలమానమృదుగంధ - వాహోవినోద

విలసనంబులు దెల్పు - విధముఁ జూచితివె!
ఎలతెమ్మెరలచేత - నీకొమ్మగుంపు
చలియింప ఝుమ్మని - చంచరీకములు
విలసిల్లె మకరాంక - విజయగానములఁ
సొలయుచు వినిపించు - సొబగుఁ జూపట్టు
నట్టువఁడై తరుల్ - నటియింపఁ జేసి
గట్టుల చరులకు - గానముల్ నేర్పి
గాయకుఁడై యనో - కహాలతాంతములఁ
బాయని పుష్పాళి - బలువసంతములు
చల్లు కుమారుఁడై - జాడలయందుఁ
జల్ల తావుల వీచెఁ - జందనానిలము !
తరువులతోడ ల - తాశ్రేణిఁ బెనచి
పురుషులతోడుతఁ - బొలఁతులఁ గూర్చు
నెడకాఁడు తానయ్యె - యీకోడె గాడ్పు
కడవఁ బల్కెడు విహం - గమ కలధ్వనుల !
ఈ కొండగోఁగుల - నేకముల్ పసిఁడి
కోకలు గట్టు లో - కులను గేరెడును!
ఈ వసంతమునందు - నీవనిలోన
నేవిధంబున సీత - నెడవాసి యుందు ?
ఉండిన నోరిచి - యుండఁగ నీఁడు
మండలీకృతచాప - మహితుఁడై మరుఁడు !
సీత యెలుంగుతోఁ - జేరంగఁ బిలిచె
నీతరిఁ గల కంఠి - యిదె పంచమమున
నత్యూహమను పక్షి - నను గలంగించె!
నత్యంతమును నీ ఝు - రాంబుపూరమున

వెనుకటి కీపక్షి - యింతగాఁ బలుకఁ
గని మదిలో మెచ్చఁ - గలకంఠి సీత
యీ పక్షి మిథునంబు - లెల్లవృక్షముల
నాపోని రతి నోల - లాడఁ జూచితివె!
కోకపారావత - కూజితావళులు
నాకుఁ గల్పించెఁగం - దర్పతాపంబు
పూచినమోదుగు - పువ్వులు వహ్ని
యీచిగురాకులు - హేతిమాలికలు
చిటచిటల్ భ్రమరికా - శ్రేణీరవముగ
నటు జూడు మదప్రతా - పాగ్నియుఁ బోలె!
ఈ తుమ్మెదలగుంపు - నెనయు ముంగురుల
సీతఁ బాసిన దన - జీవనంబేల?
జానకిఁ గూడి వ - సంతకాలముల
నేనిన్నినాళ్లు నే - యేవినోదములఁ
జరియించినాఁడనో - సౌమిత్రి! తనకు
మఱవు రాదేల? యా - మని వచ్చె నిపుడు!
మనసులోననె యుండు - మదనాగ్ని యేల
పెను చిచ్చుగా రాఁజఁ - బెట్టె నీగాలి?
ఒక మయూరముఁ గాంచి - యొక నెమ్మికొమ్మ
వికసిల్లఁ బింఛంబు - వేడుక నాడ
స్ఫటికోపమగవాక్ష - పాళిక యట్ల
యటఁజూడుము కలాప - మమరుచందంబు
నీమయూరి నొకండు - నెత్తుకపోక
కామసించిరదేమొ - దానబాధములు!
అటుగాద మగనితో - నసఁగి పెనంగి

యిటు నన్ను నుడికించె - నేమి సేయుదము!
ఈ వసంతము మర్త్య - లే యేల యెల్ల
జీవకోటులకు సం - జీవనౌషధము
తనవంటి కల్మషా - త్మకున కొక్కనికిఁ
దనువునఁ బ్రాణవే - దన సేయుఁగాక!
నను బాసి మేనఁ బ్రా - ణంబులతోడ
జనకజ యుండాఁక - సైరింపఁ గలదె?
అడవినిఁ గాయు చం - ద్రాతపంబగుచు
పుడమి నూరక యేల - పువ్వులురాలె?
నేనెంత కలిగెద - నీవనిలోనఁ
దానంత శోకించుఁ - దమ్ముఁడా! సీత
పట్టుకపోయిన - పట్టునసీత
యెట్టులున్నదొ కదె - యేమిసేయుదుము!
ఇరువురకును మఱు - లేకమై యునికి
నెఱిఁగి యుండుదు సీత - హృదయంబు నేను
జనకజ యున్నచోఁ - జల్లనై యుండి
తనకిప్పుడీ గాలి - దహనుఁడై తోఁచె
మన యాశ్రమమున ది - మ్మరి కాకి కాకు
నినదంబుతోఁ గూసి - నెలఁతను బాసి
యిపుడుఁ జూడఁగ వచ్చె - నీ వాయసంబు
చపలబుద్ధిని పక్షి - చండాలమగుట
నెడమ దిక్కున నుండి - యిపుడు గూయుచునుఁ
గడకుఁ బోదిప్పుడు - కాకా యటంచు!
తిలకగుచ్ఛము మీఁదఁ - దేఁటిఁ జూచితివె
వలపు నెచ్చెలి మీఁద - వ్రాలినట్లమరె!

బూచివాళకమును - బోలి నిండారఁ
బూచి యశోక మి - ప్పుడు వెలిపించె!
సుమితరసాలముల్ - చూడుము మీన
నమరు సౌమ్యులతో జ - నావళిం బోలెఁ
బంపాసరోవర - ప్రాంతకుంజములఁ
గింపురుషద్వంద్వ - గీతముల్ మొరసెఁ
గిన్నరుల్ మీటుచుఁ - గిన్నరాంగనలు
కన్నిబోయతలతోఁ - గలసిపాడెదరు!
ఇందున వికసించు - నెఱ్ఱదామరలు
చెందొవరేకుల - చెలిమి సేయుచును
బాలభాను విభా వి - భాసితరాగ
కేళిచే మదనాగ్ని - కీలలై వెలసె!
కప్పుఁగల్వల మీఁదఁ - గలమూఁగు తేఁటి
కప్పు సీతాకటా - క్షములతో నెనసె
రేవుల సింధుర - శ్రేణితుండములఁ
ద్రావెడు గళగళ - ధ్వనుల నంబువులు
కలహంస చక్రవా - క క్రౌంచముఖ్య
జలపక్షి నివహంబు - సందడిఁ గనుము!
ఇవి చూచి తాళుదు - నే ధరాతనయ
యవలంబనము లేని - యర్థగాత్రుఁడను.
ఈకావి కరువలి - నెనయించి యూర్పు
లీ తేఁటి డాఁటున - కిచ్చి ముంగురులు
యీవల్లికావళి - కిచ్చి కేల్దోయి
యీవనజంబుల - కిచ్చి నెమ్మొగము
యీకల్వబాలున - కిచ్చి లోచనము

లీకలహంసల - కిచ్చి లేనడుపు
లీబేడిసలచాలు - కిచ్చి దృగ్జాల
మాబాల సీత యెం - దరిగెనో నేఁడు!
పంపకు దక్షిణ - భాగంబునందు
నింపు మీఱినయట్టి - ఋష్యమూకంబు
జేవురుల్ నిండి పూ - చిన మోదువులకుఁ
దావలంబగుచు కం - దర్పప్రతాప
దావాగ్నిరాశి చం - దమున వీక్షింప
భావంబునకు భీతిఁ - బాదుకొల్పెడును!
ఒకకొమ్మపైఁ గాంత - యొకకొమ్మఁదాను
నొకచాయగానిల్చి - యొయ్యనవీచు
ముక్కుతెమ్మెరలచే - ముక్కును ముక్కుఁ
జక్కగాఁ గూర్చివా - చవిఁ గొసరుచును
బికములు క్రీడింపఁ - బెరిగిన తరువు
లకట! నామదికిఁ బా - యనిచింతఁ జేసె!
ఇది చూపి వలరాజు - నీవసంతుండు
కదిమి చించిరి ధైర్య - కంచుకంబిపుడు!
ఒక పువ్వులోనుండి - యొకపువ్వుమీఁద
మొకిరి తేఁటులగుంపు - మురువు చూచితివె!
తరువులు లతలఁ బొం - దఁగఁ బిల్చెననఁగ
వరపక్షి కలకల - స్వనమాలకింపు!
కారండవమ్ములు - గలసి క్రీడించి
మారుని వేట దీ - మంబులై తోఁచె!
ఏటికిఁ బెగడుదు - రెఱుఁగకఁ బంప
పాటిదియో యూరా - వగ షడ్గుణముల

నేమియు నేనొల్ల - నింకొక్కమాట
భూమిజఁ గనుపట్టి - పుణ్యంబుచాలు
ఈవనజంతువు - లీపంపలోని
జీవనజంతువుల్ - చింతపాల్జేసె
మనల కింకొకనాఁడు - మలయుచుండుదుమె
జనకజగూడి యీ - సానుభాగముల?
పంపాసరోవరో - పవనంబు లనుస
రింప మువ్వురము జ - రింపుదు మొక్కొ!
గలుగునే యొకనాఁడు - కలకంఠి సీతఁ
గలసి వినంగనీ - కలకంఠ రవము!
కందునే యొకనాఁడు - కమలాయతాక్షి
సందిటిలోన ము - చ్చటఁ దీఱఁ బెనఁగ?
దొరకునే యొకనాఁడు - తొయ్యలిఁ గూడి
సరససల్లాప ప్ర - సంగముల్ నడప?
కాంతునే యొకనాఁడు - కనకాంగితోడఁ
గంతుకేళిఁ గరంగి - కరఁగింపుచుండఁ
జూతుమే యొకనాఁడు - చుక్కలరాజు
రీతినున్న తలోద - రిముఖాంబుజంబు!
అబ్బునే యొకనాఁడు - హరిణవిలోక
బిబ్బోకమునకునేఁ - బ్రీతివహింప?
నావెంటవచ్చు జా - నకి వెంటఁ బోక
యేవెంట బ్రాణంబు - లింకనిల్పుదును!
కన్నుల నెఱిఁగించు - కలయింగితంబు
చిన్నినవ్వులఁ దెల్పు - చిత్తాభిమతము

సిబ్బితిచేఁ జూపు - శీల గౌరవము
గబ్బిచన్నుల నెఱుఁ - గఁగఁ జేయువలపు
యలిగియుండగ నేర - దవలిమోమిడదు
తలఁప దెవ్వరినిఁ జిం - తకులోను గాదు
యేను గాసిలియున్న - యెడఁగి హితోక్తి
దానూరడించి సం - తాపంబుఁదీర్పు
నడవి యయోధ్యగా - నన్నింటి మారు
పడఁతి తానయి నిల్చి - పరితుష్టిఁ జేయు
తలఁచినట్లు మెలంగుఁ - దనమది దాప
దలయికఁ జూప దే - మనినసైరించు
నగుమోముతోఁ జేరి - నాచెంత నిలిచి
తగినమాత్రంబె మె - త్తని మాటలాడు
నట్టి సీతకు బాయు - నట్టి నన్నీవు
చుట్టుకఁ దిఁగియే - సుఖము గాంచెదవు?
వలదన్న లక్ష్మణ! - వలసినట్లాడుఁ
దలఁప నేమిటికింకఁ - దడవక నన్ను
భరతునిం జేరి యా - పదలెల్లఁ దీరి
మఱవక మమ్మునె - మ్మది నుంచు మీవు!"
అని యనాథుని రీతి - నాపన్నుఁడైన
తనయన్నఁ గని సుమి - త్రాసుతుం డనియె
"దేవ! మీయంత సు - ధీనిధు లెందు
భావింప కీదీన - భావ మొందుదురె?
తడిసెనేనియు వత్తి - తైలసంగతిని
పొదవడంగిన యట్టి - పోలిక చేతఁ

దనవారిపై నింత - దయఁ బూంచువారు
మనసులోఁ జివికి నే - మము నొందలేరు
విడువు మింతటి యాశ - వెలఁదికై యేల
యడలెద విట్లుధై - ర్యముఁబోవనాడి ?
ఎందు వోయెడు సీత ! - యెత్తఁగి రావణుని
గందువ సాధింప - గా శక్తి లేదె ?
సీత నొప్పింపక - చెడిపోవవాన
కీతరి తలవ్రాఁత - యే త్రుంగిపోవ ?
జానకితోఁ గూడఁ - జని దిలికడుపు
లోనఁ జొచ్చినను గా - లుఁదమ బాణాగ్ని !
ధైర్యంబు వదల నీ - తమె దక్షునకును ?
గార్యభాగంబు లోఁ - గాములుగలవె ?
యత్నవంతున కసా - ధ్యము లెందుగలవు ?
యత్నంబె సేయు మ - య్యహితునిఁ దునుమ
నుత్సాహపరుఁడవై - యూహించి కపట
మాత్సర్యపరులను - మర్దింపు మీవు
మది జిక్కఁబట్టి నీ - మహిమంబుఁ దలఁచు
వదనెఱుంగక యేల - యార్తిఁ గ్రుంగెదవు ! ”
అని యన్నఁదోకొని - యాపంపఁ దాఁటి
చనుచు శ్రీరాము నె - చ్చటికఁ గాచుచును
జతనంబు యతనంబుఁ - జాలంగఁ గలిగి
ప్రతి పదంబున సీతఁ - బరికించి కొనుచు
గిరికందరంబులఁ - గ్రీడించు వారిఁ
వరణితనూజుఁడు - దవ్వులఁ గాంచి

—: ధనుర్బాణులగు శ్రీరామలక్ష్మణులఁగాంచి వాలిపంపిన
వారలనుగా సుగ్రీవుఁడు చింతించి భీతిల్లుట ; హనుమం
తుండు సయుక్తికముగా వాని సంశయమును
నివారించుట :—

భీతిల్లి యార్తిచే - బెదరి కలంగ
నాతరి నితరులై - నట్టివానరులు
వెఱచి పాఱిన కపి - వీరుఁడు దేవ
గిరి సమానుండు సు - గ్రీవుఁడు నిలిచి
యాజాను బాహుల - నలఘు విక్రముల
రాజీవనేత్రుల - రవివంశమణుల
విజితేంద్రియుల ముని - వేషధారులను
గజగమనులను రా - కాచంద్రముఖులఁ
జక్కని వారిని - జతయైన వారి
నెక్కడ కనివిని - యెఱుఁగని వారి
బాణబాణాసన - భర్మకృపాణ
పాణుల సత్త్వసం - పన్నుల రామ
సౌమిత్రులను జూచి - చాల శంకించి
తామగసాత్తనం - దనుఁడుచలించి
వెఱచిన వాఁడౌట - వింతచూపగుట
హరియాట నిలిచిన - యచ్చోట నిలక
మనసు నిల్కడ లేక - మలయుచో నెల్ల
తనుగాచి వెంట ప్ర - ధానులు రాఁగ
హితులైన తన వాన - రేంద్రులఁ జూచి
కృతనిశ్చయమున సు - గ్రీవుఁడిట్లనియె.

"కపులార! మీరు రాఁ - గారణం బేమి!
కపటాత్మకులు వాలి - గడివారు వీర
లతఁడు నాపైఁ బంప - నజ్జయైనట్టి
యతివేషముల ధను - రస్త్రముల్ దాల్చి
వచ్చిన వార లా - వాలి రావెఱచు
నిచ్చోటి కటుగాన - నిమ్మహాభుజులు."
అని యానగంబున - నవ్వాలి శిఖర
మునకేఁగి యనుజీవి - ముఖ్యవానరులు
కదురా పదాఘాత - ఘట్టనంబులను
పొడిపొడులై శృంగ - ములు దుమ్ములెగయఁ
బ్రత్యంత శైలముల్ - జలువిడినడవ
నత్యంతనిమ్నోన్న - తాయాతి మాన
మేని సోఁకులను భూ - మీరుహశ్రేణి
తోనఁ గూఁకటి వేళ్ళ - తోఁ బెల్లగిల్ల
గతిరయాయత మరు - త్కాండముల్ నిండి
ప్రతిపదాంచిత గహ్వ - రములు ఘూర్ణిల్ల
వినతనూజునిఁ జేరి - యిరుకెలంకులనుఁ
గనుగల్గి దిక్కులు - కలయఁగన్గొనుచు
నందఱు వసియింప - నాంజనేయుండు
ముందఱ నిలిచి కే - ల్మోగిచి యిట్లనియె.
"ఏటికి వెఱచెద - విది మలయాద్రి
కూట మన్యులకు రాఁ - గూడ దిచ్చటికి
వాలినిఁ జూడ మ - వ్వాలి కిచ్చటికిఁ
బోలదు చేర నా - ప్పాన యింత బెదర?
ఆవాలి ఘెడ నీభ - యంబున కేల

నీవింతవాఁడవై - నీకపిత్వంబు
వదలవై తివి మహీ - వల్లభులకును
మదిలోన నిలుకడ - మఱిచాలకున్న
దొరయందురే వాని - దొరకుఁ గావలదె
వెరవును సదసద్వి - వేక గౌరవము ?"
అనుమాట విని పవ - నాత్మజుఁజూచి
సునిశితబుద్ధి నా - సుగ్రీవుఁడనియె.
"ఆయుధపాణులై - యలఘు తేజముల
నాయమరకుమారు - లన జోడుగూడి
వీరల రాఁజూచి - వెఱవక నిలుచు
వీరులెవ్వరు పృథి - వీస్థలిలోన?
ఏ వెఱచుట యెంత - యిది యేటిమాట
పావని! నాగుండె - పట్టిచూచితివె!
తటతట నదరెడు - తప్పదువార
లిటు చూచెదరు వాలి - యే పంపనోవు
రాజులు దిక్కుల - రాజులతోడ
యోజించి చెలిమి సే - యుదు రట్లు చేసి
తమచేతఁ గాని య - త్నము వారిచేత
సమకూర్చు కొందురు - జాడవారలకు
పైకొని వంచనో - పాయముల్ తమరు
చేకొని నమ్మిన - చెఱుపకపోరు
బలవంతుఁడును నీతి - పరుఁడునై వాలి
దలఁచు నీరీతి మా - త్సర్యగార్యములు
పగవారి లెటులైన - బట్టి సాధింపఁ
దగుఁగాన నతనికిఁ - దగు నిట్టి తెఱఁగు

మనమేమఱక బుద్ధి - మంతులమగుచుఁ
జను వానిఁ బనుప రా - జన సేయువలయుఁ
గావున నీవ య - క్కడి కేఁగి మేని
లావు గానఁగనీక - లఘువృత్తి తోడఁ
గొంచపు మేనితోఁ - గొంకుచుఁ జేరి
యంచల నిల్చిన - యాలాప సరణి
వారల రాకయు - వారిచిత్తములు
వారి వాక్యములు స - ర్వంబునుఁ దెలిసి
నా దృష్టి పథమున - నాకు నౌగాము
లీదృగ్విధంబది - యేఱుపడంగ
నిలిచి పల్కుము పొమ్ము - నీవని " పనుపఁ
దలఁచి తాఁ బోవుట - తగవని యెంచి

—: హనుమంతుఁడు బ్రహ్మచారి రూపముఁ దాల్చి రామలక్ష్మణుల సందర్శించుట :—

యా కొండపై నుండి - యలఁతిరూపమున
రాకుమారకులఁ జే - రంగఁదాఁ దాఁటి
సన్నగావుల బ్రహ్మ - చారియై సిగయు
జన్నిదంబును ముంజి - సరము దండమును
మెఱయ రాఘవుల స - మీపంబుఁ జేరి
చరణపద్మములకుఁ - జాగిలి మ్రొక్కి
లేచి యంజలి చేసి - లెక్కనేనైతి
మీ చెల్వు దివ్యుల - మేరఁజూపట్టు
నే నిమిత్తమున మీ - రీవనిలోన
భానుసన్నిభ దివ్య - బాణతూణీర

కోదండపాణులై - క్రుమ్మరవలసె
నీదండ మృగముల - నెల్లఁ జంపుచును ?
నయనిధులు సువర్ణ - నాభులు నిరత
జయకీర్తిశాలు లా - జానుబాహువులు
కమలపత్రాక్షులు - కరుణాభిరాము
లమరసన్నిభులునై - నట్టి ధార్మికులు
పదములు కంద పం - పాసమీపమున
వెదకుచు నెయ్యది - వేఁడివచ్చితిరి ?
వేఁడుక నేనుఁగు - వేఁటాడవచ్చు
గోడె సింగములనఁ - గొంకులు దేఱి
చక్కని మేను లి - చ్చట వసివాడ
నెక్కడి కేఁగెద - రెవ్వారు మీరు ?
కరికరోపమ క్రమ - కరములు నరుణ
చరణముల్ సరిపూర్ణ - చంద్రాననములు
హరివలగ్నములు బిం - బాధరంబులును
సరసిజపత్ర వి - శాలనేత్రములు
పీనవక్షములు గం - భీరయానములు
మేనుల తేజంబు - మెఱుఁగుఁ జెక్కులును
కల మీరు రాజల - క్షణలక్షితాంగ
విలసచ్ఛ్రీల నీ - విశ్వమంతయును
నేలఁ జాలిన వార - లేటికి కొండ
మోలంబుఁ జేరితి - రో యయ్యలార !
జగతికి డిగు సూర్య - చంద్రులరీతి
మిగుల రాణించు మీ - మేనుల, చాయ

యీవను లీశైల - మీ నికుంజములు
పావనశోభాప్ర - భావముల్ గనియె
సకలవిభూషణో - జ్జ్వలులుగాకేల
యకట! యీ మునిచర్య - లందివచ్చితిరి?
కుపసమూడ్చిన క్రొంచు - కోదమల రీతి
నవరంజి కత్తులా - యతకరాగ్రములఁ
బూనుక యమ్మహా - భోగులవంటి
నానాస్త్రములతో దొ - నల్ నవరించి
యెక్కువెట్టిన విండ్ల - నిక్కడికేమి
యక్కరఁగలిగి మీ - రరుగుదెంచితిరి?
అనలేగదరన్న! - యప్పటనుండి
యేనెంత వేఁడిన - నేమియుననక
యురకయుండెదరేల - యో తండ్రులార!
అరసేయ కొకమాట - యానతియిందు
జలజాప్తసుతుఁడు నా - స్వామి సుగ్రీవుఁ
డలఘుతేజుఁడు నన్ను - నంపినవాఁడు
ఆ భానునందనుఁ - డన్నయౌ వాలి
చే భార్యఁ గోల్పోయి - క్షితియెల్ల నొగఁగి
యని నోడి యీకొండ - యండగానుండి
తనవెంట నల్వురు - త్తమసత్త్వనిధులు
యేను మున్నుగఁ గొల్వ - నిచ్చోట వాలి
రానిచోటని యెంచి - రాయిడిలేక
నెమ్మదితో నుండి - నేఁడిందువచ్చు
మిమ్ము విలోకించి - మిగుల శంకించి
'యెవ్వరో వీరు నీ - విప్పుడే పోయి

యివ్విధంబని వారి - నెఱిఁగిరమ్మనుచు
మీతోడిచెలిమి తా - మిగుల నాసించి
ప్రీతిఁ బంపిన నాదు - పెంపెల్ల మాఁటి
వచ్చితి నిట కేను - వాయునందనుఁడ
నచ్చుగా హనుమంతుఁ - డందురు నన్ను
పవమానమానస - పదవిజిగీషు
జవసత్త్వశాలిని ని - చ్ఛావిహారుఁడను 38
కామరూపము నందఁ - గలవాఁడఁ గాన
నీమేన సుగ్రీవ - హితమతి నగుచు
నే వచ్చినాఁడ నా - యెడఁ గృప యునిచి
యీ విధంబని మిమ్ము - నెఱిఁగింపుఁడనిన
నామాటలకు మది - నలరి యుప్పొంగు
సౌమిత్రితో రామ - చంద్రుఁడిట్లనియె.
"ఎవ్వానితోఁ జెల్మి - యిచ్చలోఁ గోరి
యివ్వనభూముల - కే తేరవలసె
నట్టి సుగ్రీవుని - యనుచరుండితఁడు
చుట్టమై వచ్చె ని - చ్చోనపూర్వముగ? 39
మంచిమాటలు పల్కి - మనసిచ్చి యాద
రించుము మది నల - రించె నిందాక
చాల ఋగ్వేదంబు - చదువని వాఁడు
పోల యజుర్వేద - ము పఠింపనతఁడు
సామవేదమున వా - సనలేని వాఁడు
నామీఁద నాథర్వ - ణానభిజ్ఞుండు
నేర్చునే యీరీతి - నిలిచిమాటాడ
నేర్చువ్యాకరణమీ - నిపుణమానసుఁడు

పునరుక్తులపశబ్ద - ములు లేక నుడుట
కనుబొమలను నాసి - కను జూపులందు
మొగమునందు వికార - ములు లేక మాట
సగము వల్కకయుగ్ర - సక్తముల్ గాక
వెనకయు ముందఱ - వెదుకక జోలి
వెనచక వినిన తె - ల్విడి గనుపింప
కొదుకుడు వడక త్రో - క్కుడుపాటు లేక
యదనుండి కుత్తుక - నెనసి మోమునకు
జవరనగా వచ్చు - శబ్దముల్ చెవికిఁ
జవి వుట్ట మధ్యమ - స్వర శేషమున
దుడుపరించక యింపు - దులకింప చిక్క
వడనీక త్రిస్థాన - భావ్యంబులైన
పరమకళ్యాణ సు - భాషితావళులు
సరళంబులగుచు ర - సస్థితుల్ గలుఁగ
నిటువలెఁ బలికిన - నెత్తిన కత్తి
యటువైచి నతికాద - నని వచ్చినట్టి
పగవాఁడు నేఁటికి - బద్ధుఁడు గాఁడు?
మగసిరి మంగళీ - మాటలన్నియును
నిట్టి యాప్తుఁడు లేని - యొడమహీపతుల
కెట్టు చేకూరు వా - రెంచిన పనులు ?
తగినట్టి యొక్క ప్ర - ధాని గల్గినను
జగతీశునకుఁ గల్గు - సకలభాగ్యములు!
ఇంతటివాని న - య్యినసూతి యొట్లు
సంతరించెనో పుణ్య - సంపదచేత!
ఇతఁడు గల్గిన వాని - కెల్ల కార్యములు

కతమిచ్చు కొంగు బం - గారముల్ గావె?
ఘాటాడు" మనిన ల - క్ష్మణకుమారకుఁడు
పాటించి పవనసం - భవున కిట్లనియె.
"నీచేత సుగ్రీవు - ని తెఱంగు మాకు
గోచరించెను చెల్మిఁ - గోరి వచ్చితిమి.
అతనితో నీవాడి - నట్టి చందమున
హితమాచరించెద - మినకుమారునకు
మానుతు ఏట మీఁద - మదివిచారములు
భానుసంగనుఁ డాప్త - బంధుండు మాకు."
అని పల్కుటయుఁ దన - యధిపతికార్య
మనుకూలమయ్యె కృ - తార్థుఁడనైతిఁ
జెలిమికి నగు చింత - సేయుదు ననుచుఁ
దలఁచి యాపవమాన - తనయుఁడుప్పొంగి

-: రామలక్ష్మణుల పంపాసరోవర ప్రాంతాగమన కారణమును
విని హనుమంతుఁడు వారలను సుగ్రీవుని యొద్దకుఁ
గొనిపోవుట :-

"చేకూడె వీరితోఁ - జెలిమి నాస్వామి
కే కార్యమో వీర - లీడేర్పఁదలఁచి
చెలిమి యాశించి వ - చ్చిరి వీరలొక్క
బలవంతుతోఁ జాలఁ - బగఁ గొన్నవారు.
అదియుఁ దీర్చెదమని" - యాత్మభావంబు
ముదితాత్ముఁడగుచు రా - మునికి నిట్లనియె.
"అయ్య! యీ ఘోరమై - నట్టి కానలకు
నియ్యెడవుడు మీర - లేల వచ్చితిరి

యానతిం"డని వల్కు - హనుమంతు మాటఁ
దానందుకొని సుమి - త్రాపుత్రుఁడనియె.
"దశరథుఁడను నయో - ధ్యానాయకుండు
దిశలెల్ల బాలించు - దినకరాన్వయుఁడు
ధార్మికాగ్రణి యజా - తవిరోధి సత్య
ధర్మపాలకుఁడు మా - తండ్రియవ్విభుడు.
మొదట యగ్నిష్టోమ - ముఖ్యయాగములు
పదిపదులును జేసి - బ్రహ్మను బోలి
తా సర్వసమవృత్తి - ధరయేలు నట్టి
వాసవ సన్నిభు - వరపుత్రుఁడితఁడు
పరమకల్యాణుఁడా - పద్బాంధవుండు
శరణాగతావన - జాగరూకుండు
సర్వలక్షణగుణ - సంపూర్ణుఁడఖిల
నిర్వాహకుఁడు సత్య - నియతమానసుఁడు
జనకుని యనుమతి - జానకిఁ గూడి
నను దోడుకొని గహ - నములకు వచ్చె
శ్రీరాముఁ డీరాజ - సింహుఁ డీయనకుఁ
గూరిమి తమ్ముఁడ - గొలిచిన వాఁడ
దాసుఁడ సౌమిత్రి - తనపేరు సౌఖ్య
భాసురుఁడౌదార్య - పరుఁడు ప్రాజ్ఞుండు
సూనృతవాది య - శోధనుఁడఖిల
దీనసంరక్షణ - దీక్షావినోది
సత్యపరాక్రమ - సంపన్నుఁడుచిత
కృత్యుఁడు పూజ్యుఁడ - క్లిష్టకర్ముండు

ధన్యుండు సర్వభూ - తహితుండు లోక
మాన్యుండు నైనట్టి - మాయన్న దేవి
యేమిర్వరము లేని - యెడఁ బర్ణశాల
భూమిజ యసహాయ - మున నున్నవేళ
నెవ్వఁడో రాక్షసుఁ - డెత్తుక పోవ
నవ్వామలోచన - నరయుచు వచ్చి
త్రోవలోపలఁ గబం - ధుని గాంచ వాఁడు
దేవత్వమున మింట - దివ్యయానమున
నిలిచి మీసుగ్రీవు - ని తెలుఁగు మిమ్ముఁ
జెలిమి చేసిన మాకు - సీత చేరుటయుఁ
బగఁ దీర్చుటయుఁ దేట - పఱచి వాఁడేఁగ
జగతీతనూజ ని - చ్చట వెదకుచును
నినుఁ గంటి మిదియ మా - నిర్ణయం బిట్టి
యనఘుఁడు సకలలో - కైకనాయకుఁడు
రామచంద్రుని యంత - రాజు సుగ్రీవుఁ
గామించి యాతనిఁ - గర్తగా నెంచి
కొలిచి యాయన కను - కూలుఁడై యతని
వలయు గార్యములఁ గై - వశుఁడై మెలంగ
శరణంబు వేడి యి - చ్చట మీదువలన
తరణినందనుని వ - ర్తన మెల్లఁ దెలిసి
వసుధ దివ్యులకు నె - వ్వని యనుగ్రహము
పొసఁగకుండిన సౌఖ్య - ములు లేక యుండు
నట్టి మాయన్న మీ - యర్కనందనుని
పట్టు చిత్తమున చే - పట్టినవాఁడు!
ఆసించు వారి స - హాయుఁడౌ స్వామి

మీసహాయంబు గా - మించినవాఁడు!
ఆపన్నుఁడగుచు సై - న్యములతో మీరు
ప్రాపుగావలసి మీ - పాలికిఁ జేరె!"
అనుచుఁ గన్నీటితో - నడఁకు లక్ష్మణుని
గని వాయుతనయుఁడు - క్రమ్మఱంబలికె.
"నరవరులార! య - నంతకల్యాణ
పరమసద్గుణగణ - పరిపూర్ణుఁడైన
శ్రీరామచంద్రుని - చెలిమి గల్గుటను
మారాజుభాగ్యసం - పద నెన్నఁదరమె!
సుగ్రీవుపాలిటి - సుకృతంబు ధార్మి
కాగ్రణులైన మి - మ్మరలేక తెచ్చె
నాయన రాజ్యంబు - నాలిఁ గోల్పోయి
పాయని వెతలఁ బా - ల్పడి యున్నవాఁడు
బలవంతుఁ డాతఁడీ - పట్టున సీతఁ
జలపట్టి యెటులైన - సాధింపఁగలఁడు
ఏమెల్లఁ గలుగ న - య్యిన సూనుచేత
నేమి దలంచిన - నీ డేరు మీకు!
చూతురు రండు మీ - సుగ్రీవు" ననిన
నాతరి సౌమిత్రి - యన్న కిట్లనియె.
"ఇతని మాటలు వింటి - రే భానుతనయు
కతమున సాధింపఁ - గలము జానకిని
వాయుపుత్రుఁబ్రసన్న - వదనభాషణము
లీయెడ సత్యంబు - లితవగు మనకు
బోవుద మసిన" య - ప్పుడె బ్రహ్మచారి
తావానరాకృతిఁ - దాల్చెమైపెంచి

తన వీపుపై రఘూ - ద్వహుల నెక్కించు
కొని మదోత్కట భద్ర - కుంజరంబనఁగ
నినతనూజుని చెంత - కేఁగి యాకెలని
వనములో వారల - వసియింపఁ జేసి
వారల రాక స - ర్వమును సుగ్రీవుఁ
జేరి తానంజలిఁ - జేసి తెల్పుటయు

— శ్రీరామ సుగ్రీవుల సమావేశము —

ననఘాత్ములని పూజ్యు - లనియు శరణ్యు
లనియు విశ్వసనీయు - లనియుఁ దానమ్మి
వానరరూపంబు - వదలి భానుజుఁడు
మానుషాకృతిఁ దాల్చి - మణిమయాహార
కోటీర కంకణ - కుండలకనక
శాటీవిభా చక - చకలు రాణింప
జానకీరమణుని - సంధించి కొన్ని
కానుకలునిచి యా - కపివరుండనియె.
" ధరణీశ ! సకలభూ - తహితుండవనియుఁ
గరుణాకరుఁడవు వి - క్రమనిధివనియు
సత్యసంధుఁడవని - సద్గుణైశ్వర్య
నిత్యుఁడవనియును - నీప్రభావములు
మా వాయుసుతుఁడు ప - ల్మారు వాకొనఁగ
దేవ ! నేనలరి సం - ధించితి మిమ్ము
యిట్టి నాకేఁటికి - యూపనచరుల
చుట్టఱికంబని - చూడక వచ్చి

నన్ను మన్నించుట - నాదువంశంబు
వన్నియఁ గాంచెఁబా - వనుఁడ నేనైతి
నాతపంబు ఫలించె - నాపుణ్యవాస
నాతిశయంబుచే - నబ్బె నీ చెలిమి
కరముసాచితి నన్నుఁ - గరుణించి నెయ్య
మరమరలేక నే - యఁగ నెంచెదేని
వలకేలొసంగి నా - వాఁడవీవనుచుఁ
బలుకుము నమ్మించి - పని గొమ్ము నన్ను!"
అనుటయు దక్షిణ - హస్తంబొసంగి
జనకవిభుండు భా - స్కరకుమారకునిఁ
గౌఁగిట నిండారఁ - గదియించి కంట
నాఁగినప్రమద బా - ష్పాంబుపూరముల
నోలనాడంగ వా - యుజుఁడు మథించి
కీలిఁ జేకొని తెచ్చి - కెలన నుంచుటయు
నిరువురు వలవచ్చి - యింధనవహ్ని
పరమసాక్షిగ మాట - పట్టుగైకొనుచు
నన్యోన్యవదన స - మాలోకనముల
ధన్యులై యిరువురు - తమకార్యములకు
నోరవారలు వోక - యొద్దిక యగుచుఁ
దీరుచుఁ గనునట్టి - తేఁకువల్ గలిగి
సామీరి యునుచు కే - సరపుష్పవర్ణ
కోమలంబగు నేపె - కొమ్మపానుపున
సరిగాఁగ వసియింప - చందనశాఖ
కరువలిపట్టి ల - క్ష్మణునకు నిడఁగ
నతఁడందు మీఁద స - మాసీనుఁడైన

శతపత్ర హితతనూ - జాతుఁ డిట్లనియె.
" అయ్య ! మీ రాడిన - యప్పుడే నాదు
తొయ్యలి చేకూడెఁ - దునిసెను వాలి
కలిగెను రాజ్యంబు - కడతేరె చలము
ఫలియించెఁ గోరికల్ - బంటనేనైతి
సేగులన్నియు మానె - సిలుగులు దీఱె
వేగె నాపాలికి - విరిసెఁ జీకటులు
వికసిల్లె మనము ప్ర - వేశించె శుభము
సకలేశ ! నీకటా - క్ష ప్రభావమున

సుగ్రీవుని సీతాన్వేషణప్రతిజ్ఞ–పాఱవేయఁబడిన సీతయొక్క-యాభరణముల నాతఁడు శ్రీరామునకుఁ జూపుట :—

శ్రీరామ ! మీరు వ - చ్చిన రాక విపిన
చారులౌటయుఁ బర్ణ - శాల నుండుటయు
మీరు లేనట్టిచో - మీదేవి నొకఁడు
చోరుఁడై యెత్తుక - జుణిఁగిపోవుటయు
హనుమంతుచే వింటి - నవనిజఁ దెచ్చు
పనియెంత యదినాదు - భారంబు గాదె !
పోయిన శ్రుతిఁదెచ్చు - పోలిక నీదు
జాయను జేకూర్పఁ - జాలుదు నేను
యేలోకమున నున్న - నేఁదెత్తు సీత !
పాలసుఁడై విష - పానంబుఁ జేసి
బ్రదుకునే నరుఁడు ? సు - పర్వనాయకుఁడు
తుదిముట్టునే నీదు - తొయ్యలిఁ బట్టి ?
అసురనాథుఁడు సీత - నాకాశవీథి

దోనఁగులఁ బెట్టుచుఁ - దోకొని పోవఁ
గనుఁగొంటి వాని యం - కములపై 'రామ!
నను గావవే! లక్ష్మ - ణా! యడ్డపడవె!'
అనుచు నేడ్చుచుఁ బోవు - నది మీఱు తెలుప
విని తలఁపున వచ్చె - వీరునల్వురను
నేనొక్కఁడను గూడి - యిచ్చోట నుండఁ
దా నాగకన్య వి - ధంబున సీత
యుత్తరీయములోన - నొకకొంత చించి
యత్తరిఁ దనమేని - యాభరణముల
నిచ్చోట బడవైచె - నేనవి తెచ్చి
యిచ్చెద గుఱుతుగా - నీక్షింపుఁ" డనుచు
బలికిన నవ్వి యా - భరణము ల్వాడ
వలయుఁ దెప్పింపు నీ - వారిచే ననిన
తన గుహలో నొక్క - తావున డాఁచి
యునుచు సొమ్ముల మూట - యున్నట్ల దెచ్చి
సముఖంబు నందు నుం - చఁగఁ రఘువరుఁడు
తమిఁ జూచి యామూటఁ - దనకేల నంది
విప్పిన దిగదిగ - వెలుఁగుచు సీత
నప్పుడు చూచిన - యట్లు భ్రమించి
నెమ్మోము మంచు నిం - డినఁ దల్వి మాయు
తమ్ముల పగర చం - దమ్మున వాడ
"హా! సీత! హా! సీత! - యని కన్ను మొగిచి
యా సుమిత్రాకుమా - రాదులు గలఁగ
ధరణిపై వ్రాలి యం - తని తేటి తొడవు
లురముపై నునిచి తా - నుసురసురనుచు

"చూచితే లక్ష్మణ! - సుగ్రీవుకొలని
పై చెన్ను జానకి - వరభూషణములు!
ఏరీతి వడలుచు - నేఁగెనో?" యనుచు
సూర్యాత్మజుని మోముఁ - జూచి యిట్లనియె.
"భానుజ! యేరీతిఁ - బలవరింపుచును
జానకి వోయె? నే - జాడఁ జూచితివి?
ఎవ్వఁడింతకు దిగి - యెత్తుక చనియె?
క్రొవ్వి వాఁడేటికిఁ - గూలక యుండు?
ఇంత పాతకుని నీ - వెఱిఁగింపు మిపుడె
యంతకు వీటికి - ననుపుదు వాని!"

—స్నేహితుఁడైన సుగ్రీవునికి శ్రీరాముఁడు వాలిని వధించెదనని ప్రతిజ్ఞఁజేయుట :—

అనిన గద్గద కంఠుఁ - డై భానుసుతుఁడు
మనువంశమణికిఁ గ్ర - మ్మర నిట్టులనియె.
"దేవ! వాఁడేఁగిన - తెఱువెఱుంగుదును
రావణనామ మా - త్రము విన్నవాఁడ
నతని యూరును లావు - నతని వర్తనము
నితర మేమియును నే - నెఱుఁగ నేమిటను
నిజము వల్కెద నవ - నిజ నెట్టులైన
నజరులు మెచ్చ నే - నర్పింతు మీకు
రావణుఁ బుత్ర పౌ - త్రయుతంబు గాఁగఁ
గావరం బణఁచి యె - క్కడనున్నఁ ద్రుంతు!
పొగడొందు మీకు నీ - బుద్ధి లాఘవము
తగవు కాదేటికి - ధైర్యంబువదల?

నింత చింతిలుదురే - యేఁ గల్గియుండ
నెంతటి పనికైన - నెటు గాకమాను
నిటు జూడుమయ్య! ప్రా - కృతవానరుండ
నెటువంటి దుఃఖంబు - నెంతలేదనుచు
నున్నవాఁడను! మహీ - శోత్తంస! నీకుఁ
గన్నీరుఁ దెచ్చుట - గాదు పల్మారు
బలవంతమై ప్రాణ - పర్యంతమైన
నలమట వచ్చిన - నతిధీరమతులు
తమలోన తాల్మిచేఁ - దాలుకొనంగ
నమరుగాకిట్లు దై - న్యంబుఁ జెందుదురె?
తెలియక మూఢుఁడై - ధృతిలేనివాఁడు
కలము భారమున సా - గరములో మునుఁగు
కైవడి శోకసా - గరములో మునుఁగుఁ
గావునఁ జలియింపఁ - గాదెట్టియెడల!
మ్రొక్కెద మీపాద - ములకు దీమసము
చిక్కఁబట్టుము చింత - చేఁ గుందవలదు
సుఖవిగమ్మప్పుడు - శోకించి నరుఁడు
సుఖముందలేఁడు తే - జోహానిఁ జెందు
ననఘ! యేనింత న - యస్యభావమునఁ
జనవిచ్చుకతన మీ - చల్లదనంబు
మది నమ్మితోఁచిన - మాటలాడితిని
నదయాత్మ! యిదిమీరు - సహియింప వలయు
ననుమీఁద సేయు మ - న్ననకఁ దార్కాణ
గనువింప సైరణఁ - గన్నుఁడని" పలుక

రాముఁడు నారచీ - రచెఱంగు చేతఁ
దామరసదళాయ - తవిలోచనముల
దొరగు కన్నీరు వోఁ - దుడిచి సుగ్రీవుఁ
బరమాప్తుగా మది - భావించి పలికె
"చెలికాని తనము మ - చ్చికయును దలఁచి
పలికిన నీహిత - భాషణంబులను
మనను రంజిల్లె నే - మంబుఁ గాంచితిని
నినుఁబోలు నింకొక్క - నెయ్యుఁడున్నాఁడె?
సీతను వెదకింపఁ - జేయుము యత్న
మాతతాయులఁ బట్టి - హతము సేయుదము
రావణవధకుఁ గా - రణమైన పూన్కి
యీవిధంబని మది - నెంచి హాకొనుము
తొలుకరియందు వి - త్తులువంచి నేల
ఫలియించుక్రియ నాదు - పలుకులన్నియు
నియందు ఫలియింప - నీడెందమునకు
చాయమై తోఁచిన - జాడ వర్తిలుము
నాసత్యమాన యె - న్నడు నాడి తప్పఁ
జేసినట్టి ప్రతిజ్ఞఁ - జెల్లింతుగాని!
కడమ యేఁటికి నాదు - కార్యభారంబుఁ
గడతేర్ప నీచేతఁ - గాక చొప్పడదు
నాదు ప్రాణాభిమా - నములు రక్షింప
నేదిక్కు చూచిన - నీఁక వేరులేదు
నేరమిట్లని పల్క - నీచేతిలోని
వారము వలయుకై - వడిఁ బనిగొనుము"
అనిన భానుజుఁడు త - దాప్తులుఁ జాల

మనముల నుప్పొంగి - మారాడ వెఱవ
నితరేతరము నిట్లు - లేకాంతవేళ
హితభాషణములాడు - నేతత్క్షణంబ
సీతను సాధించి - శ్రీరామవిభుని
చేతికందిచ్చిన - చెలువగ్గలింప
సౌమిత్రి యరల భా - స్కర కుమారకుఁడు
రామచంద్రునితోడఁ - బ్రమ్మఱఁ బలికె.

—: శ్రీరాముఁడు వాలిని వధించుటకుఁ బ్రోత్సహించుట :—

" శ్రీరామ! నినువంటి - స్థిరశౌర్యశాలి
కూరిమి వెనుచు నా - కు హితుఁడుగాన ?
నాకుఁ గావలయు మా - నస హితార్థములు
చేకూరెనని దలం - చితి నిక్కువముగ
నీవు చేపట్ట ని - న్నింటికేన తగుదు
నీవాఁడనైన నే - నిఖిలపూజ్యుఁడను
సాధింతు నింద్రుని - సామ్రాజ్యమైన
నీధాత్రి సాధించు - టెంత నీకరుణ!
ఇనవంశమణులతో - నిటవానరులకు
ననుపమ స్నేహ మి - ట్లబ్బిన కతన
మావారిలో నన - మాన గౌరవముఁ
బావనత్వమును సం - భావించె నాకు
నన్ను నేఁ బొగడు కొ - నంగరాదనుచు
నెన్ని మీతోడ నొం - డేమియుఁ బలుక
నాఁడు నాఁటికి నాదు - నడకల నింత
వాఁడని చిత్తంబు - వచ్చుఁ గార్యములఁ

బలుకుటేల ? మహాను - భావులతోడి
చెలిమి సామాన్యమే - చేసెద మనఁగ
నీతోడ నెయ్యము - నేక కార్యముల
హేతువుల్ కోరిక - లీడేర్చుటకును
జ్ఞానాధికుని మది - చలియింపనట్టి
పూనిక నిర్విఘ్న - ములు కామితములు
కలిమిని లేమి నొ - క్కసమంబె కాని
తొలఁగింప రాద్యలు - తోడ్పడువాని
చేపేదయైన నొ - చ్చిన దీలుపడిన
ప్రాపున నమ్మిన - పరమాప్తజనుల
విడువక తమసౌఖ్య - విభవరాజ్యములు
విడుతురు సజ్జనుల్ - విమలకీర్తులకు ''
అన విని యిటుల యా - నని సమ్మతించు
జనకజారమణల - క్ష్మణులఁ దోకొనుచు
నవ్వాలి వనికేఁగి - యచ్చోటనొక్క
పువ్వులతో సాల - భూరుహశాఖఁ
గొనివచ్చి తావైచి - కూర్చుండ రాము
నునిచి తా చెంగట - నొయ్య వసించి
యొకకొమ్మ పవనుజుఁ - డునుప సౌమిత్రి
యొకఁడు దాన వసింప - నుచితవాక్యముల
శ్రీరాముఁజూచి సు - గ్రీవుఁడు వినయ
గౌరవముకులిత - కరుఁడౌచుఁ బలికె.
'' వాలిచేఁ గులసతి - వసుధయు నిల్లు
కోలుపోయి వహించు - కొనువారులేక

నాచేతఁగాక మి - న్నక చెట్లువట్టి
యేచోటఁ దలయెత్త - నీఁక బ్రాసె ననుచు
నున్నవానికి నాకు - నోతండ్రి! యిట్టి
బన్నంబుఁ దీఱని - పదములుఁగంటి
మఱుఁగుఁజొచ్చిన నన్ను - మన్నించి బ్రదుకఁ
దెఱవు చూపఁగ నీవె - దిక్కయినావు
రక్షింపు" మనిన ధ - ర్మజ్ఞుండు ధర్మ
రక్షకుఁడును నగు - రఘువీరుఁడనియె
" ఉపకారమొనరింప - నుచిత మాప్తులకు
నపకారమొనరించు - నది శత్రువిధము
గావుననీవైరిఁ - గడ తేర్ప లేక
యీవిండ్లు నమ్ములు - నేల పూనితిమి ?
ఆపరంజికట్టు మ - హాశాతశల్య
నిపుణంబులును గరు - న్నిచయ ఝాంకృతులు
రత్నపుంఖములు వ - జ్రప్రతిమములు
నూత్నశలాకాభి - నుకములు నైన
కాకప్రకాండ ప్ర - కాండముల్ గ్రోల
నాశించె వాలి ప్రా - ణానిలంబులను
చూడు! మీవను" మాట - సుగ్రీవు మదికి
వేడుకయును జాల - వెలయఁగావింప
"దీనుఁడనగు నాకు - దిట దెచ్చిప్రాణ
దానంబుఁ జేసిన - ధన్యుఁడీతండు
ఇతని కార్యమునకే - నిత్తుశరీర
మతి మానుషంబులీ - యన చరిత్రములు
బ్రదుకఁ గంటి" నటంచుఁ - బలుకంగఁ బోయి

కొదుకుడు వడుచుఁ గొ - ల్కులవెంట జాఱ
కన్నీరు దొరుక గ - ద్గదకంఠుఁడగుచు
విన్నపంబని రఘు - వీరుతోఁబలికె
"శ్రీరామ! యేను కి - ష్కింధఁ గొన్నాళ్లు
స్వారాజ్య మింద్రుని - జాడ నేలితిని
ఆవెన్క మావాలి - యతి బలశాలి
తావచ్చి యిల్లాలిఁ - దగఁబట్టి యేలి
యువనియుఁ గైకొని - యదలించి త్రోచి
యవమతిచేసి న - న్నటు బాఱఁదరిమి
తిగిచి నావారి బం - దిగములవైచి
నొగిలించి కొండఱ - ను దొలంగఁద్రోలి
యిచ్చోటనేనున్కి - యెఱిఁగి కొండఱను
ముచ్చిలి పొడిపింప - మూఁకలనంప
వారినేఁ బోనీక - వధియించి తనకుఁ
దీఱనిపని గానఁ - దెగిచంపలేక
తానిందు రారాక - తక్కినవారి
చేనన్ను గెలిపింప - చేతనుఁగాక
యూరట చాలక - యున్నాఁడుగాన
మీరాక చూచి న - మ్మిక చాలనైతి!
వాలి పంచినయట్టి - వారిగా నెంచి
యోలక్ష్మణాగ్రజ! - యోడి పాఱితిమి
బలవంతులును నీతి - పరులును బుద్ధి
గలవారు నగుటయే - గద నన్నుగాచి
యీనల్వురునుఁ జెంత - నెడవాయలేక
సూనుల క్రియఁగాచి - చుట్లునుండుదురు

నలువురు దనకు ప్రా - ణసమానులగుట
యలమటలకు నోర్చి - యణఁగి యుండితిని !
జగదీశ ! నాదు వి - చారముల్ దీఱి
పగయణఁగదు వాలి - వడఁజూచికాని
సుఖదుఃఖ సమయముల్ - చూడక ప్రాణ
సఖులతోఁ దనదు ము - చ్చటలెల్లఁ దెలుప
వలయుఁ గావున మీరు - వగవుతో నున్నఁ
దెలుపఁ గావలసె నా - తెఱఁగెల్ల మీకు
రక్షింపుఁ" డనిన పూ - ర్ణదయాసముద్రుఁ
డీక్షించి సుగ్రీవు - నిట్లని పలికె. 790
"వాలికి నీకును - వైరంబు వచ్చె
నేల యింతటిపగ - కేమి కారణము !
అతని బలంబును - నతని పౌరుషము
నతని వృత్తాంతమే - నరసినవెనుక
వానకాలము నది - వలెఁ జాలవేగ
మైనట్టి నాకోప - మతనిపైఁ జూపి
తునిమెద నీకు ని - త్తును గోర్కులెల్ల
ననుమానములు మాని - యది తెల్పుమనిన"
ఆనమాటకు వాన - రాగ్రణి యలరి
యానమాధిక రహి - తాత్ముతోఁబలికె 800

—: సుగ్రీవుఁడు వాలితోఁ దనకుగల్గిన వైరకారణ
మునుఁ జెప్పుట :—

"శ్రీరామ ! మున్ను కి - ష్కింధఁ బాలించు
శూరుఁడౌ ఋక్షర - జఁడగచరుండు

ఆవానరాధీశుఁ - డగ్రకుమారుఁ
డౌ వాలి కతఁడిచ్చె - నఖిలరాజ్యంబు
నాయన చెప్పిన - యట్టికార్యములు
సేయుచు నేను గొ - ల్చినవాని కరణి
నరమర లేక భ - యంబు భక్తియును
దొరయ నేఁగాచిన - దొరయాట వాలి
నాయంద తనదు ప్రా - ణములట్లప్రీతి
సేయుచు చనవిచ్చి - సిరులుపాలించి
మెలఁగుచో నొకనాఁడు - మిన్నక క్రొవ్వి
యలుకతో దుందుభి - యనెడు రాక్షసుఁడు
చలపట్టి యొక్కఁడు - నరిప్రొద్దువేళ
బిలమువాకిట నిల్చి - పేర్వాడి పిలిచి
కలనికి రమ్మన్నఁ - గ్రక్కున వాలి
యలిగి కయ్యము సేతు - నని యిల్లువెడల
వలదని యవ్వాలి - వనితలు నేను
నిలిపిన క్రోధంబు - నిలుపక వాలి
యారేయి నను వల - దని యింటనునిచి
ధీరుఁడై యొకఁడు దై - తేయుపైఁ బోవ
మనసు నిల్వక యేను - మాయన్నవెంట
నని సేయ వెడలితో - డై వచ్చునంత
మమ్ము నిర్వురఁ జూచి - మల్లాడ వెఱచి
యమ్మదాంధుండు భ - యంబుచేఁ బాఱి
తరుముక నేము ని - ద్దఱము రా వాఁడు
ధరణి బిలంబు కొం - దలముతోఁ జొచ్చి
పోయిన నన్నునా - పొంతఁగాపునిచి

మాయన్న యతని వెం - బడి గుహఁజొచ్చి
యైరావతంబను - నమ్మహాబిలము
ఘోరాంధకార సం - కులమైన కతన
వెదకి దానవుఁబట్టి - విడవకయొంటి
కదనంబు సేయ న - క్కడ యేడు గడచె.
వాలిదుందుభుల రా - వంబులు రెండు
నాలకించితి నంత - నాగహ్వారమున
నిండారు నురువుల - నెత్తురుఁ గాల్వ
కండలతోడ న - క్కజముగా వెడలె
నది చూచి దానవుఁ - డక్కటా! వాలిఁ
గదనంబులోపలఁ - గడ తేర్చె ననుచు
నవనీధరంబా మ - హాబిలాభీల
వివరంబులో వైచి - విన్నఁబాటొదవఁ
బురికి నే తేర న - ప్పుడు మంత్రులెల్ల
దొరఁజేసి నన్నని - ర్దోషుగా నెంచి
పట్టంబు గట్టినఁ - బ్రజలనాప్తులనుఁ
జుట్టంబులను దయఁ - జూచి బ్రోచుచును
నున్నచో నవ్వాలి - యురుసత్వశాలి
యన్నిశాచరుఁద్రుంచి - యటకుఁ జేరుటయు

—: శత్రువిజయానంతరము మఱలివచ్చిన వాలి,
సుగ్రీవుని ద్రోహిగాఁదలంచి రాజ్యమునుండి
వెడలఁగొట్టుట :—

నెదురుగా నేనేఁగి - యేడ్చుచు వాని
పదములపై వ్రాలి - బాష్పాంబు లురుల

"అన్న ! వచ్చితివె ! నీ – వని కేఁగు నపుడు
తన్ను నా గహ్వర – ద్వారంబు నందు
నునిచి నీ వేఁగిన – నొక యేఁడు గాచి
వెనక మీ యిర్వుర – వీరనాదములు
వింటి నా వెంబడి – వివరమార్గమునఁ
గంటి సఫేనర – క్తప్రవాహంబు
నది చూచి వెఱచి నే – నచలంబుఁ దెచ్చి
వదలక యాబిల – ద్వారంబు మూసి
వచ్చితి నిట కేను – వలదన్న వినక
యిచ్చిరి సామ్రాజ్య – మీ మంత్రివరులు.
కాచితి నిన్నాళ్లు – కడఁక మీ సొమ్ము
నీ చేత కిచ్చితి – నీదు సేవకుఁడ
నివె బీగముద్రలు – హితులును బంధు
నివహముల్ వీరె మ – న్నింపు మిందఱను
నిదె ధవళచ్ఛత్ర – మిదె చామరంబు
నదియె కిష్కింధ మీ – రర్థిఁ గైకొనుఁడు
నను గావు మెపుడు ను – న్న తెఱంగుతోడ
నినుఁ గొల్చియుండెద – నీచిత్తమునకు
రాకున్న వెడలి య – రణ్యముల్ చేరి
యాకలములు దిని – యైన నుండెదను
ద్రోహిని గాను మీ – దు పదంబులాన !
యూహింపుఁడని మఱి – యును బ్రణమిల్లి
లేవక యున్న వా – లి దురాగ్రహమున
దీవింప కనరాని – తిట్టులు తిట్టి
పదముల ననుఁ ద్రోచి – బంధులఁ జూచి

" ఇది గంటిరే! వీని - నెటులోర్వవచ్చు ?
నేను దానవునితో - నెక్కటిఁ బోరఁ
దానొక్కనగము కం - దరమున వైచి
వచ్చియున్నాఁడేను - వాని వధించి
వచ్చిమున్ వచ్చు త్రో - వయుఁగాన లేక
నుడిగొని సుగ్రీవ! - సుగ్రీవ! యనుచు
వెడలఁ గానక వీఁడు - వేసిన యట్టి
బిలము వాకిట కొండ - బిట్టుగా పాద
తలమునఁ బొడిగాఁగఁ - దన్ని యాత్రోవ
వెలువడి వచ్చితి - వీని దుష్కర్మ
ఫలమేల యనుభవిం - పక పోవఁడీఁడు!"
" అని నాప్రధానుల - నందఱఁ బట్టి
పెను సంకెలలువైచి - వీఁచంబు లడఁచి
వారిండ్లు ముద్రించి - వారి ద్రవ్యములు
చూఱలు గొని నన్ను - నుడియఁగనీక
వెడలి పొమ్మన నూరు - వెడలి ప్రాణములు
పిడికిట బట్టుక - భీతిచేఁ బఱచి
యెడట నిల్వఁగ నీడ - యెఱుఁగక యిట్టి
యచలంబుపై వీర - లరసి పోషింప
వాలికి రారాని - వసతి గావునను
యీలీల నుండితి - నిన్నినాళ్లకును
గనుఁగొంటి మీపాద - కంజముల్ చేర
మనుగంటి తీఱె నా - మది విచారంబు
తనరాజ్యభోగముల్ - తానుఁగైకొన్నఁ
జనుగాక పొమ్మనఁ - జను నయ్యా! నన్ను

వెడలిపొమ్మనుగాక - విగ్రహించినను
పడఁతి నేమని చెఱ - వట్టి మాయన్న
తొలఁగుబావతనంబుఁ - దొలఁగి యావాలి
యెలమితో మఱఁదలి - నేలుచున్నాఁడు ?
వేయేల ? యీ చెఱ - విడిపించి తన్ను
జాయాసమేతుగా - సదయుండవగుచుఁ
గావింపుమన లేన - గవు మోముతోడ
నావానరేంద్రున - కనియె రాఘవుఁడు.
" చెలిమి నాతోడఁ జే - సియు నింత దింత
గలదె సుగ్రీవ ! యిం - కవిచార మేల ?
వాలిఁ జంపుదు నే న - వశ్యంబు నిన్ను
నేలింతు కిష్కింధ - నింతితోఁ గూర్తుఁ
గడ తేర్తు శోకసా - గరమెల్ల నీకు
గడియలోపల నెంత - గలదిది నాకు !
పని గొమ్ము నన్ను"ని - పలుకు శ్రీరాముఁ
గనుగొని వానరా - గ్రణి యిట్టులనియె.
" జగదేకవీర ! కౌ - సల్యాకుమార !
అగణితగుణధామ ! - అయ్య ! శ్రీరామ !
నీవు విల్లందిన - నిర్జరప్రభుఁడు
లావుల నెదుర నే - ల తలంప నేర్చు !
దేవాళియును నిన్ను - దృష్టింపఁ జాల
రీవాలి యెంత నీ - యేటున కోర్వ ?
పిన్న విన్నపము నే - బెదరిన వాఁడ
దన్ను ముంచినది గ - దా సముద్రంబు
వాలిని పడిగల - వాఁడని యెంచి

చాలఁగ నోడి యి - చ్చట నున్నవాఁడ!
ఏమి పల్కిన వినుఁ - డెఱిఁగించి మీర
లామీఁద ననిన వా - క్యము నాకు హితము.

—. సుగ్రీవుఁడు వాలి పరాక్రమమును వర్ణించిచెప్పుట :—

వానరబలవైరి - వాలి నిద్రించి
తాను నిత్యము ప్రభా - తంబుల లేచి
పడమటి వారాశిఁ - బదములుఁ గడిగి
వడిఁ దూర్పుకడలి క్రే - వలఁ దీర్థమాడి
దక్షిణ వార్ధిచెం - తనుఁ గర్మవిధులు
దక్షతఁ దీర్చి యు - త్తర సాగరమున
హరునిఁ బూజించి జా - మైనచో మఱలి
పురికి నేతెంచు న - ద్భుతజవశక్తి!
డాక నుప్పొంగి కొం - డలు పెల్లగించు
నాకంబు పొడవు మి - న్నక దాఁటి మఱలు
కుజముల మేని సోఁ - కునఁ గూల గెడపు
విజయార్థి యగుచు ది - గ్విభులఁ దిరుగు
నెదురెవ్వఁడును లేక - యెదురులు చూచు
కదియ మృత్యువునైనఁ - గబళింపనోపు
నతిశయమదసింధు - రాయుతబలుఁడు
నుతికెక్కినట్టి దుం - దుభి యనువాఁడు
మహిషరూపము గల్గు - మనుజాశనుండు
మహనీయశారీర - మదవికారమున
జలధిచెంతకుఁ బోయి - సమరంబు సేయఁ
బిలిచినఁ గంపించి - భీతిల్లి వార్ధి

"ఓయి! దానవనాథ! - యోడితి నేను
మాయందు నేటికి - మచ్చరంబిపుడు?
హరునికి మామ మ - హాశైలరాజు
గిరిజకుఁ దండ్రి తె - క్కింపఁడెవ్వరిని
యాహిమవంతుని - యంతవాఁడైన
నూహింప నీతోడ - నుద్దియాఁగాక
కడమవాఁ రెందఱె - క్కడ నిన్ను బోరఁ
బుడమిపై నచటికిఁ - బొమ్మని" పలుక
నతఁడంపకోల రి - వ్వనఁ బాఱు కరణి
నతివేగమునఁ దుహి - నాచలంబునకుఁ
బోయి యట్లనె కయ్య - మునకుఁ బిల్చుటయు
నాయద్రి యతుల భ - యాతురుండగుచు
వెలఱు వాఱిన మబ్బు - విధమునఁ గొండ
తలమీఁద నిలిచి హ - స్తంబులు మొగిచి
"యసురనాయక! నిల్చి - యని సేయ వెఱతు
నసమర్థుఁడను మదీ - యాధిత్యకాగ్ర
గండోపలములేల - కదలించి తన్ని
పిండి చేసెదు మాని - బృందంబు చాల
నాయందు నున్నార - నంతంబు రాఁవు
సేయరాదిచట వ - సింతురు మునులు
వెఱచిన వారిని - వెంటాడ వీర
వఱల దరము గాదు - వదలు మాగ్రహము"
అన "నోరి! హిమవంత! - యనిలోన నన్నుఁ
గినిసి మార్కొను వికం - కితఘరాగ్రముఁడుఁ

గలిగిన జూపుము - కాకున్న నిన్ను
గులగులల్గాఁదన్ని - కూల్చకమాన ! ”
అనిన దుందుభిఁజూచి - యచలనాయకుఁడు
తనలోన దలఁచి యా - దనుజున కనియె.
“ విను మసురాధీశ ! - విబుధనాయకుని
తనయుండు కిష్కింధఁ - దానేలు రాజు
రావణగర్వని - ర్వాపణశాలి
భావజాహితపాద - పద్మమదాళి
ఖరకరాత్మజ దర్ప - గహనోగ్రకీలి
గిరిచరవీరాగ్ర - కీర్తనశీలి
తారాహృదంబుజా - తనవీనహేళి
చారువిభూషణ - సౌవర్ణమాలి
యమితశౌర్యనిరస్త - హర్యక్షకేళి
సముదగ్ర బలజిత - సామజపాళి
కనకఘంటాసము - త్కర భీమవాలి
యనుదినవినుతదే - వాళి యవ్వాలి
వాలిన బలముతో - వడినిన్ను దీఁటి
యాలంబు సేయఁ బో - మ్మని ” పల్కుటయును.
ఆకొండఁబోతు మా - యావిరక్కసుఁడు
కేక నజాండంబు - గిటగిట వణఁక
కేళ్లు దాఁటుచునుఁ గి - ష్కింధకు వచ్చి
హల్లోహలంబుగా - నట్టహాసంబు
సేయుచు వాలి వ - సించు గహ్వరము
హో యని ఘూర్ణిల్ల - నుద్ధతి నార్చి
గుబ్బఁ గొమ్ములఁ దఱల్ - గోరాడి గోరజ

విజ్ఞున దన్నియు - వ్వివరంబుఁ గూల్చి
కనకకవాటముల్ - ఖండించు మించు
తనరాక వాలి చి - త్తంబునఁ దెలిసి
తారకాన్వితుఁడైన - ధవళాంశుఁడనఁగ
తారాదికులసతుల్ - తనుఁజుట్టు కొలువ
నమరాంగనలఁ గూడి - యుల్లన వచ్చు
తమ తండ్రియున బిల - ద్వారంబు వెడలి
" దుందుభి! నీకిట్టి - దుండగంబేల ?
ఇందురావచ్చునే - యేనింద్రసుతుఁడ!
వాలిని వానర - వంశవల్లభుఁడ
నేల క్రొవ్వున వచ్చి - యిచటఁ ద్రుంగెదవు ? "
అనిన నిశాచరుం - డయ్యింద్ర సుతునిఁ
గనుఁగొని బెడిదంబు - గానిట్టులనియె.
" ఇంతుల నీచుట్టు - నిడుకొని వట్టి
పంతంబులాడిన - బంటవయ్యెదవె ?
ఏ నుండి నీవుండి - యెందుకు నేఁడు
లేనికోపము మాట - లే పోటులగునె ?
వెఱచిన పగవాని - వెన్నిచ్చువాని
శరణుజొచ్చినవాని - సతులలోవాని
నిదురించువాని మ - న్నింప శూరులకు
వదలని ధర్మమై - వరలు గావునను
దాళితి నేఁటికిఁ - దన చేయిగాంచి
వాలి! వీటికిఁ బొమ్మ - వలదు కాచితిని!
నీయంతివానిగా - నిలువు పట్టమున
నేయుము ప్రీతి నీ - చెలులకందటికి

రమియింపు ప్రీతితో - రమణులఁ గూడి
యమలిన రత్నమా - ల్యములు దాలుపుము
వడకకొలంది దా - నము చేసికొనుము
తడవి ముద్దాడుము - తనయులఁబిల్చి
యీ రాత్రియేకాని - యిఁకమీఁద లేవు
నీరాజ్యసుఖములు - నీశరీరంబు
తప్పదు దుందుభి - తాను నమ్మించి
యిప్పుడు పులినాకి - యిటు నిన్నువిడిచెఁ
బొమ్మన్న" వాలియు - ప్పుడు కోపగించి
రమ్మని తారాది - రమణులఁ బిలిచి
నగరికి ననిచి వా - నరవజ్రపాణి
నగుమోముతోడ య - న్నరభోజిఁ బలికె
"లోలాత్మ ! యేను స్త్రీ - లోలుండఁగాను
వాలితో నినువంటి - వాఁడు నిట్లనునె ?
నినువిధి పెడకేఁప - నేఁడు నామీఁద
గినిసి వచ్చితివి ప - ల్కితివి నేరుపులు
పోక నిల్వు"మటంచు - పురుహూతుఁడిచ్చు
శ్రీకరకాంచనాం - చితపద్మసరముఁ
దాలిచి వాని ను - ద్ధతితోడఁ గదిసి
వాలి చేతులు చాచి - వాని శృంగములు
మెదలనీయక పట్టి - మెడ మెలిపెట్టి
చదికిలిపాటుగా - జగతిపైఁ ద్రోచి
పట్టిన పట్టుతో - బలువడి నీడ్చి
పొట్టపై మోకాలు - బొడిచికుదించి
ఫాలికలఁ బడవ్రైచి - వీపెల్లనలియఁ

బలువైన ఖురపరా – ఘట్టులఁ గొట్టి
బోరగిల్లఁగ నూకి – పొందుగాఁద్రొక్కి
నోరను జెవులను – నురుగు నెత్తురులు
మెదడును వెదలంగ – మిడిగ్రుడ్లు వడఁగ
సఱమదంబుగఁ ద్రొక్కి – చంపి మూ యన్న
నెత్తురెల్లను మహి – నిండంగ రిత్త
తిత్తిగా విదిలించి – దిర్దిరం ద్రిప్పి
కొమ్ములఁ బొడిచిన – గ్రుద్దిన కాల
రెమ్మిన చెట్లచే – వ్రేసిన తాను
వానికి లోఁగాక – వధియించి కొండ
తో నుద్దిమైన యా – దుందుభిమేను
విసరి యామటఁబడ – వేసిన వాని
యసలు నెత్తురు మతం – గాశ్రమభూమి
మునులపై దొరుగ న – మ్మునిరాజుఁ గినిసి
తనయోగదృష్టి నిం – తయు విచారించి
వాలికృతంబుగా – వగచి యాలోనఁ
గాలాగ్నియును బోలి – గ్రక్కున మండి
యెప్పుడు వాలి దా – నిచటికి వచ్చె
నప్పుడే పొలియుగా – కని శపియించి
వానిఁ గొల్చిన యట్టి – వారెవ్వరైన
నీనగంబులఁ గల – యిచ్ఛాఫలములు
మెసవిన యప్పుడే – మేనులు వాసి
వసుధఁ బాషాణ భా – వముల నుండుదురు !"
అనుచు నాజ్ఞాపింప – నాతఁడీమాని
ఘనుకంప నొంద న – మర్త్యుండు గాక

యది మొదల్ ఋష్యమూ - కాద్రికి రాక
మదిఁ గొంకి యుండ నె - మ్మదిగల్గె మాకు
దూరంబు లేదదె - దుందుభి కాయ
మో రామ! బలుఁగొండ - రూ యన మించెఁ
గనుఁగొమ్ము వాలి యి - క్కడి కొండ మీఁదఁ
దనరిన యీసప్త - తాళంబులందు
నొకతాళపర్ణంబు - లొక నిమేషమున
నొకటి చిక్కక యుండ - నురుశక్తిఁ దునుము!
ఇది వాలి విక్రమం - బిందుకు మీరు
మదిఁ దలంపుఁడు నన్ను - మనుచు మార్గంబు"
అన విని లక్ష్మణుఁ - డలఁతి నవ్వొలయ
వనజాప్తసుతుని భా - వమెఱింగి పలికె.
"ఎందుచే నమ్మదు - వీరాము శక్తి
యందుచే విశ్వాస - మందుము నీవు
నీవు వల్కిన వాలి - నిజశక్తిగరిమ
లావంతయును మెచ్చు - లైతోఁచ లేదు
శ్రీరాముఁడు వినంగఁ - జెల్లునే పలుక
తూరుపిగాఁ జంద్ర - జూటు నేవియును?
వాలికి వెఱచిన - వాఁడవై యెంత
జోలి చెప్పితివి హె - చ్చులు గావు మాకు
దేవదానవనర - తిర్యగాత్మలకు
నేవలనఁ దలంప - నిట్లనరాని
శౌర్యంబు గలిగిన - జానకీరమణు
మర్యాదఁ దెలియని - మాటలాడితివి!"
అన విని సుగ్రీవుఁ - డంజలిచేసి

—: శ్రీరాముఁడు సప్తతాళములఛేదించుట :—

తన సందియముఁదీఱఁ - దలఁచి యిట్లనియె.
"ఈతాఁటిమ్రాఁకులం - దేక వృక్షంబుఁ
జేతులఁ దావంచి - చిదుము పర్ణములు
వాలి యీరఘుకుల - వర్యుఁడం దొక్క
సాలమొక్కనిశాత - శరముచేఁ దునిమి
పాదాగ్ర నిహతిచేఁ - బలువిడి జిమ్మ
యీ దుందుభికబంధ - మిన్నూఱు విండ్ల
నేల యవ్వలఁ బడ - నేఁడు మీటంగఁ
జాలిన వాలిని - సమయింపఁ జాలు!"
అని పల్కి మఱియు దా - నాత్మఁ జింతించి
యిన తనయుఁడు రాము - నీక్షించి పలికె.
"దేవ! మీశక్తి శో - ధింపఁ దలంచి
యేవ పుట్టంగనే - నిటు వల్కలేదు.
ఆవాలిశక్తి యే - నరసినవాఁడ
గావున మీకెఱుఁ - గఁగఁ దెల్పవలసె
వెఱపింపలేదు మీ - విక్రమచర్య
లరయ భస్మచ్ఛన్న - మగు నగ్నిరీతిఁ
దెలియకున్నది గాన - దెలుసుకోవలసి
పలికితిఁ దప్పుగాఁ - బాటింపవలదు!
ఆకారమున దోఁచు - నఖిలంబు మహిఁ వి
వేకుల కట్టి వి - వేకమొక్కడిది
కపులకు? నేనట్లు - గాన మీతోడఁ
జపలబుద్ధిని పరీ - క్షయొసంగు మంటి!"

అన దరహాస ముఖాంబుజుఁ డగుచు
మనువంశుఁ డర్కజు - మారుతో ననియె.
"కపట మెఱుంగవు - గాన సుగ్రీవ!
యిపుడు నీవచనంబు - లింపగు మాకు
బలియుని తోడుతఁ - బగవూని యొరుల
చెలిమిఁ దా నెఱుఁగక - సేయుటల్ దగునె?
పగగెల్చునే హీన - బలునితోఁ గూడి?
తగవె చేసితివి సం - తసమయ్యె మాకు
కొదఁ దీర్తు"నని పదాం - గుష్ఠంబుచేత
పదియోజనంబుల - పాటి దూరమున
దుందుభికాయంబుఁ - దొలఁగ మీటుటయు
నందుకు సుగ్రీవుఁ - డలరి యిట్లనియె.
"నాఁటికి నిక్కబం - ధము రక్తమాంస
పాటవంబున మించుఁ - బలుగొండ వోలి!
ఇపుడు వానల నాని - యెండల నెండి
విపులమై కాష్ఠంబు - విధమునఁ జివికి
నిస్సారమైన దీ - నిని మీఁటి నంత
దుస్సహసత్త్వమిం - దునఁ దేట పడదు
ఈ మహాశాలము - నేకపతుండ
భీమబాహాదండ - భీకరకాండ
సంధానమున మహీ - స్థలిఁగూల్చి దీన
బాంధవ! నాశంకఁ - బాపుము నీవు!
అటులైన విలుకాండ్ర - యందుల నీవు
పటుతర మృగములఁ - బంచాననంబు
ధరణిఁ దేజములందుఁ - దపనబింబంబు

ధరణీధరముల బృం - దారకాచలము
నసమవిగ్రహులని - యాత్మలో నెంచి
కొసరులన్నియుఁ దీఱి - కొలిచియుండెదను
సత్యమీమాట నీ - చరణంబులాన
నిత్యకల్యాణ! మ - న్నింపు నన్ననిన

—: శ్రీరాముని నిజశక్తిప్రదర్శనముమెచ్చి సుగ్రీవుఁడు వాలిపై యుద్ధమునకు వెడలుట .—

ఆమాటలోనఁ బ్ర - త్యాలీఢచరణ
తామరసుండయి - దండప్రూనికను
కలగుండువడఁగ జ - గంబులన్నియును
విలు గుణధ్వని జేసి - విశిఖంబుఁ దొడిగి
వ్రేసిన నాతాళ - వృక్షంబులేదు
దూసి కుంభినిఁ గూల్చి - తొలుచుకఁ గొండ
యావల వెలువడి - యవని నాఁటుటయు
భావించి వానర - పతి వెఱఁగంది
గజగజ వడఁకి రా - ఘవుని పాదముల
నిజవాలి సోఁకఁ బూ - నికఁ బ్రణమిల్లి
లేచి హస్తములు గీ - లించి నెమ్మొగము
చూచి యుప్పొంగుచు - సుగ్రీవుఁడనియె
' శరమొక్కటేర్చి యా - సప్తతాళములు
నశికి యుర్వరఁగూల్చి - నగము భేదించి
భూమి వ్రయ్యలుసేయు - భుజశౌర్యనిధిని
స్వామి! నిన్నేమని - సన్నుతించెదను
నాకవాలి యననేల - యుడుశక్తివింట

నొకకోలఁ దొడిగి ప్ర - యోగించితేని
యమసురేంద్ర దిక్పాల - కావలినైన
సమయింపనేర్తువు - క్షణములోపలను
సకలోన్నతంబైన - శౌర్యంబు గలుగు
నొక నీదు చెల్మి నా - కొనరిన కతన
నాకోర్కు లీడేరె - నాకన్యమేల
నీకు దాస్యము పూని - నిల్చికొల్చెదను
ప్రొక్కెద"నను గపి - ముఖ్యుఁ గౌఁగింట
నొక్కి సౌమిత్రి పీ - నులు చెలరేఁగ
కెలన నున్నట్టి సు - గ్రీవునిఁ జూచి
కలఁకఁ దీఱంగ రా - ఘవుఁ డిట్టులనియె
"పొమ్ము సుగ్రీవ! యీ - ప్రొద్దె కిష్కింధ
కమ్మెర వాలి నీ - వనికి రమ్మనుము."
అని పల్కి యతని ము - న్ననిచి యావెంటఁ
జని యిర్వురును పుర - సవిధకుంజముల
తరువుల మాటునఁ - దమ్ము గాననీక
మఱపు నేమఱపు నె - మ్మది లేకయుండ

—: వాలిసుగ్రీవుల మొదటియుద్ధము :—

కేలప్పళించి కి - ష్కింధాగుహాంత
రాళంబు మోఁసల - రవికుమారకుఁడు
కయ్యంబు గావింపఁ - గదలి రమ్మనుచు
నయ్యెడ భయదాట్ట - హాసంబుఁ జేసి
వాలినిఁ బిలిచిన - వరభుజాగర్వ
శాలియై తమ్ముని - సద్దుగానెంచి

పడమటికొండకు - భానుండు చేరు
వడువున సుగ్రీవు - వలనికిఁ జేరి
పొడిచిన యిరువుర - భూరి యుద్ధంబు
పుడమి చలింప న - ద్భుతకరంబయ్యె!
కలను గావించు నం - గారకబుధుల
పొలుపున నిరువురు - భుజవిక్రమముల
పిడికిటి పోట్లచేఁ - బృథివీధరములఁ
బిడుగులు వడియెడి - పెక్కువఁ దోఁపఁ
బోరుచో వారి న - ప్పుడు దేరి చూచి
శ్రీరామలక్ష్మణుల్ - చిత్తంబులందు
నాశ్వినేయులనంగ - నాహవభూమి
శాశ్వత శౌర్యులై - జగడింపుచున్న
వాలిసుగ్రీవుల - వైవుల చూచి
వాలి వీఁడితఁడు ది - వాకరాత్మజుఁడు
నని నేర్పఱచు నుపా - యము వాలినేయ
ననువును గానక - యటునిటు జూచి
యూరక చేసాచి - యుండ సుగ్రీవుఁ
"డా రాఘవుల నమ్మి - యనికివచ్చితిని
నను దెచ్చి వాలి ముం - దఱ నొప్పగించి
కనుపించుకొనక చ - క్కఁగనేఁగినారు
తనువెల్ల నొగిలె నీ - తని ప్రహారముల
తను జంపు వాలి యిం - తటఁ జాలకున్న"
ననుచు వచ్చిన త్రోవ - నతిజవశక్తి
వెనక చూడక పాఱె - వీఁడంచు వాలి
నగుచుండ మునుపున్న - నగమున కేఁగి

మొగమెల్లఁ బగుల నె - మ్మొలఁ దిరుగంగ
కదుములు గట్టి ర - క్తములుమైనిండ
నదరులవారలా - నడుగడుగునకుఁ
గుట్టూర్పులుచ్చి మూ - ల్గుచు నింకనొక్క-
పెట్టుచె సుగ్రీవు - పీఁచమణంతు
నని వెంబడించి తా - నటుఁజేరరామి
మనసులో నలిగి క్ర - మ్మఱవాలి చనిన 1229
తలవట్టి చూచుక - తనదు భంగంబుఁ
దలపుచు నొకచెంత - తరణినందనుఁడు
చేరుచోఁ బావని - చెంతరా నృపకు
మారకుల భాను కు - మారునిఁ జేరి
నిలుచున్న శ్రీరాము - ని మొగంబు జూచి
తలఁకుచు వంచిన - తలయెత్తి పలికె.
"అనలుండు సాక్షిగా - నరలేని చెలిమి
యొనరించి యడిగిన - యొడబాటు లిచ్చి
సత్తువల చూపి బా - సలనునమ్మించి
శత్తులు దాఁటి సం - గటివచ్చినిలిచి 1230
వాలితో హత్తించి - వానికిఁ దనకు
నాలంబు దురుసైన - యట నిల్వవెఱచి
యొదిగి యెచ్చట నుంటి - రో! యన్నలార!
ఇది యేమి చేసితి - రెఱుఁగలేనైతి
నిటువంటి వాఁడని - యెఱిగింపలేదో?
పటుశక్తి మాకు జొ - ప్పడదని మీరు
వాకొన్న నేరము - వచ్చునో యెందు?
రాకొమారులు స్వకా - ర్యంబు లేమఱరు

వాని నేఁ గెలిచిన - వచ్చి నాచేత
జానకి సాధింప - సమకట్టినారు.
అది తప్పి నాచేత - నయ్యెడిదేమి ?
మదికిఁదోఁచినయట్టి - మార్గంబుఁ గనుఁడు
పదివేలువచ్చెఁ జం - పక పోవరేము
కొదవగల్గినఁ బేరు - కొనుఁడు చేసెదను."
అను మాటలకు సిగ్గు - హాస్యంబుఁ బొడమ
జనకజారమణుఁడి - చ్చఁ గలిగి పలికె.
"ఏల కోపించెద ? - వేనమ్ము దొడిగి
వాలినేయని హేతు - వచనంబు వినుము
రూపులు నడపులా - రూఢముల్ బలము
చూపులు పలుకులు - సొబగులంగములు
నొక్క రూపముకాని - యొకరందు నెచ్చు
తక్కువల్ వెదకియు - తడవుచింతించి
యూహింపఁ జాలక - యుంటిమింతటికి
నీహనుమంతుండు - నెఱిఁగియున్నాఁడు.
ఏము ద్రోహము సేతు - మే ? నీకు నెఱుఁగ
లేమైతి మపుడు వా - లిని నిన్నుఁజూచి
నాయమోఘాస్త్ర సం - ధానంబు చేసి
చేయి గాయక యున్న - సీమకు లేని
యపకీర్తి మాకునై - హాని నీకైన
నపుడేమిసేయుదు - వది యెన్నవైతి
నీకొక్క కీడైన - నేము చింతించి
యాకడ మఱిసేయు - నది యేమి గలదు ?
అవివేకపడుచుఁ గా - ర్యము చేసెననుచు

నవనీజనులు నన్ను - నాడకుండుదురె ?
నమ్మించి నినుఁజంపి - న యనంత దురిత
మెమ్మెరఁ గడతేరు - నెఱుఁగవుగాక !
శరణంబు నీవు ల - క్ష్మణునకు నాకు
ధరణిజకును మన - స్తాపమేమిటికి ?
ఒక గుఱుతేనీకు - నునిచెద నింక
నొకపరి వాలితో - యుద్ధంబు చేసి
మఱిచూడు మాత్మీయ - మానుషచర్య
లరమరల్ దీరి పో - మ్మని సేయ వలదు
ఇలువెడలిన వాలి - నిలఁగూలె ననుచు
తలఁపుము చూచి నం - తనెపారి పొమ్ము
ముమ్మాటు మమ్ము న - మ్ముము నాదు చేతి
యమ్ము నీమదిలో భ - యమ్మువారించు"
నని పల్కి "లక్షణ ! - యల్లదే పూచి
కనుపట్టె వనములో - గజపుష్పలతిక !
అది తెచ్చి సుగ్రీవు - నఱుతఁ గీలించి
కదియింపు వాలితోఁ - గదనంబు సేయ."
అన్నచో సౌమిత్రి - యన్న వాక్యములు
మన్నించి గజపుష్ప - మాలిక దెచ్చి
సుగ్రీవు మెడను వై - చుటయు నాఁడయ్యె
సుగ్రీవుఁడతఁడు తే - జోవిలాసముల
విపరీతమున నుడు - వీథిలో సూర్య
నుపమింప నవ్వాన - రోత్తంసుఁడలరె !
చదలున సంధ్యాప - సర వారిదంబుఁ
గదియు బాలార్కు రే - ఖను మించినట్లు

లక్ష్మణార్పితపుష్ప - లతికానవీన
లక్ష్ముఁడై బలగర్వ - లక్ష్ములఁదనరి
రామునితో వాన - రకులోత్తముండు
సేమంబు దలఁచి కి - ష్కింధకు నేఁగ

## — సుగ్రీవుని ద్వితీయ రణప్రస్థానము, సప్తజనాశ్రమ మహిమాను వర్ణనము —

విల్లెక్కువెట్టి యా - వెనుక రాఘవుఁడు
భల్లమొక్కటి యేర్చి - పట్టి యావెనుక
నలనీలతారాంజ - నానందనులును
గొలువ మార్గమునందుఁ - గువలయకముల
లలిత మృణాళడో - లాసంచరిష్ణు
కలహంస చక్రవా - కక్రౌంచమిథున
కేళీవిలాససం - కీర్ణంబులగుచు
రోలంబమాలికా - రుతివీనులలర
సుమహిత వైడూర్య - శోభావిభాసి
కమలపలాశరే - ఖలు శోభిలంగ
వెలయు తటాకముల్ - వీక్షించి పచ్చి
కల మచ్చికల కురం - గములఁగన్గొనుచు
గిరిమేఘ నిభములై - ఘీంకృతుల్ సలుపు
కరులను కిరులను - కాసరంబులను
జెదరిపోఁద్రోలుచు - సీతావిభుండు
కదిసిన సుగ్రీవుఁ - గాంచి యిట్లనియె
“ఎవ్వారి నెలవిది ? - యిచ్చోటి తావి
పువ్వుఁదోఁటలును గ - ర్పూరపుటనఁటి

గుంపులు పండిన – గుజ్జుమామిళ్లు
సంపెగల్ మదికింపు – సమకొల్పె నిచట
వినిపింపు" మన రఘు – వీరునిఁ జూచి
యినకుమారుఁడు భక్తి – నిట్లని పలికె.
"రామ! యీపావనా – శ్రమము మనోభి
రామమై స్వాదునీ – రంబుల గలుగు
కొలఁకుల విహగసం – కులముల నమృత
ఫలముల విలసిల్లు – పాదపంబులను
చాలమీఱును సప్త – జనులను మౌని
జాల మిచ్చటి జలా – శయముల యందుఁ
దలక్రిందుగా నుగ్ర – తపములు చేసి
తలయెత్తి సప్తరా – త్రములకు నొక్క
నాఁటి కందఱు పవ – నంబు భక్షించి
నీటిలో మఱల ము – న్నిటిచందమున
శయనింపుచును శత – సంవత్సరములు
నియమంబుగా నిట్లు – నిండిన పిదప
బొందులతో దివం – బులకు వారేఁగి
రందు నయ్యాశ్రమం – బిది చిత్తగింపు
మిపుడు వారలయాజ్ఞ – నీమహాసాల
విపులమహాశాఖ – వృత్తగౌరవముఁ
దేఱిచూడఁగరాదు – దివిజులకైనఁ
జేర నేర్చునె మృగ – శ్రేణి చెంతలకు?
వినవచ్చుచున్నవి – వేదఘోషములు
సనుపమ స్వాహాస్వ – ధానులాపములు
తుదకొమ్మలను హోమ – ధూమమాలికలు

గదియుచో నిచటి న - గశ్రేణి యెల్ల
ఘనసమాకలితన - గశ్రేణి యనఁగఁ
గనుపండువయ్యె రా - ఘవ! విలోకింపు
చోరవచ్చుగాని యీ - శోభనారామ
మరుదెవ్వరికి పున - రాగమనంబు
శింజానకనకకాం - చీరత్నకటక
మంజీరనినద సం - పదలాలకింపు!
వినవయ్య! యీవన - వీథులయందు
ననుపమ నృత్తవా - ద్యాదిరావంబు!
రాసి నాసావివ - రప్రీతిగాఁగ
వాసన వలిగాలి - వచ్చునిచాయ!
నాహవనీయాది - హవ్యవాహనస
మాహిత జ్వాలిక - లవె విలోకింపు
మివియన్నియును నమ్మ - నీంద్రుల మహిమ
లవని జాగిలి మ్రొక్కు - మనుజుఁడు నీవు
వారలఁ దలఁచి యె - వ్వారు మ్రొక్కినను
శ్రీరామ కలుగు న - శేషసౌఖ్యములు!"
అన విని యభిముఖు - లై రఘువరులు
మునుల నుద్దేశించి - మ్రొక్కి ప్రార్థించి
యలరుచు సప్తజ - నాశ్రమ స్థలము
తలఁగి కిష్కింధచెం - తకుఁ జేరఁబోయి
యావాలిపాలితం - బైన పట్టణము
క్రేవఁదమోవని - శ్రేణులయందు
కరచాపహస్తులై - కలనుఘుతనయ
చరణిత సంగర - స్థలిఁ జొచ్చి యుండ

రవికుమారుఁడు ముంద - ఱను వెన్కఁగడలఁ
బవనజాదులు చాల - బలిసి సేవింపఁ
జట్టులు తాఁదేటి - చూచుచుఁ జెలఁగి
యట్టహాసమున బ్ర - హ్మాండంబుఁగదల
బహుయంత్ర చిత్రాత - పత్రధ్వజాంశు
మహితమహా వాలిధా - మము విలోకించి
సమ్మతపడఁ బల్కి - శాత్రవుఁ దునుమ
నమ్మించు జానకీ - నాయకుఁజూచి
వెఱచినవాఁడయ్యు - వెఱవక నిలిచి
తరణితనూజుఁడు - ద్ధతి నిట్టులనియె.
"వచ్చితిమిదియె మా - వాలినివాస
మిచ్చోట మీరు నా - కిచ్చిన ప్రతిన
మఱవకుండని" పల్కి - మహిసుతాప్రియుఁడు
కరుణించి సుగ్రీవుఁ - గాంచి యిట్లనియె.
"నీ కంధరాస్థలి - నిలిపిన తీవె
మాకు నేర్పడ వాలి - మార్కొను మీవు.
ఎప్పుడు చూచితి - మింద్రకుమారు
నప్పుడె హతుఁడయ్యె - నని యెన్నికొనుము !
ఒకతూపె కాని యొం - డొకతూపుఁ దొడుగ
నొకయంతఁ దీర్తు నీ - యుపతాపమెల్ల !
తెలిసియుఁ దెలియక - దిట దప్పి నన్ను
పలుమారు నమ్మక - పలుకనేమిటికి ?
భయసంభ్రమములేల ? - పలికిన పలుకు
నియతి నేడప్పుడు - నే ! యెట్టియెడల

శతమఘుం డవని స - స్యములు ఫలింప
మఱియించుగతిఁ దెమ్మ్ర - మఘవనందనుని
వెనుకటి కొకనాఁడు - విజయుంబె కాని
యనిలోన నీకు లో - నగువాఁడుఁగాఁడు !
అదిగాక సతులస - మక్షంబునందు
మదగర్వములు హెచ్చు - మది నెల్లఱకును
నీమహాధ్వని విని - నిలువక వెడలి
తామున్న పోలె యు - ద్ధము సేయు వాలి
యంతట నాయమో - ఘాస్త్రంబుచేత
నంతకు వీటికి - ననుపుదు "ననిన
పెళపెళ నార్చి కు - ప్పించి కిష్కింధ
జలదరింపంగ గ - ర్జానినాదమున
రాజదోషమునఁ జే - రక కులకాంత
లేఁజాడఁ బరువెత్తు - నెన్నికదోఁప
నావుల మందలు - నచ్చోట నిలక
తావులు దప్పి కొం - దంముతోఁ బఱవ
రణములో విఱుఁగు తు - రంగంబులనఁగఁ
దృణభక్షణము మాని - మృగములు చెదర
సడలిన పుణ్యావా - సన వారిఁ బోలి
సుడివడి యొల్లప - క్షులు మహిఁబడఁగ
దారుణ పవమాన - ధారాభిహతిని
భోరనఁ గలఁగు నం - బుధిమ్రోఁత యనఁగ
దట్టించి సింహనా - దము సేయ వాలి
పట్టణంబున మహో - త్పాతంబు పుట్టె

— వాలియుద్ధమునకుఁబోవఁ బ్రయత్నింపఁ
దారహితము చెప్పుట —

ఆగర్జితము విని - యప్పుడువాలి
తాగహ్వరమునఁ గాం - తా మధ్యమమున
రాహువు పట్టిన - రవిరీతిఁ దనదు
దేహకాంతి యొకింత - తెఱఁగు మాయంగ
కలితమృణాళ ప్ర - కాండకాసార
కలనఁ గోఱలతో ము - ఖంబు శోభిల్ల
తరుణసంధ్యారాగ - తను కాంతి నిలయ
గిరి గహ్వరమునఁ దీ - గెలు సాగి వెడల
గమనవేగమున ప్ర - క్కలుగాఁగ ధరణి
సముదగ్రగాఢ ప్ర - చండకోపమున
వచ్చు మహావాలి - వాలినిఁ గాంచి
మచ్చిక గల్పించి - మదిభయంబుంచి
యనునయాలింగన - మాచరింపుచును
వినయంబుతోఁ దార - విభున కిట్లనియె
" వల్లభ ! సిగనున్న - వాడినపువ్వు
లొల్లక మఱునాఁటి - యుదయకాలమునఁ
దొలఁగవైచినగతి - దుస్సహంబైన
యలుక యేఁటికి మాను - నదిగార్యసరణి
యీరాత్రి జగడింప - నేఁటికి తెల్ల
వాఱిన సుగ్రీవు వధి - యింపుమీవు
రాక్షసులకెకాని - రాత్రియుద్ధములు
లక్షింప మీబోఁటు - లకు మేరగాదు

యిందుచే నీవైరి - కెచ్చును నీకు
గుందును లేచు కై - కొనుము మామనవి
దురమున కిప్పుడు - దురదురఁబోవ
సరిపోదు నాకట్టి - చందంబు వినుము
జగడంబునకు వచ్చి - చాలంగనొచ్చి
తెగిపారి ప్రాణభీ - తినిఁ బోవువాఁడు
యీవెంటనే వచ్చి - యెదిరించి నిన్ను
లావుతోఁబోరఁ బి - ల్వఁగడంగి నవుడె
యిదియేమియో యను - యెన్నికనాదు
మదిలోనఁ గదు నను - మానంబు పుట్టె!
అట్టహాసము జేసి - యంబుజ హితుని
పట్టిని పైజల - పట్టి యీవేళఁ
బిలిచిన చందంబు - బిరుదు పోటరుల
చెలిమిచే ననుచు నేఁ - జింతఁ జేసితిని
యోర్పరియును గదు - నుచిత కృత్యముల
నేర్పరియును నైన - నీ సహోదరుఁడు
తాఁ బరీక్షించి యిం - తకుఁ దగువాని
చేఁ బగదీఱుపఁ - జింతించి వచ్చె
మన యంగదుఁడు నేఁటి - మాఁపటివేళ
నను జేరి తాను వి - న్న తెఱంగుఁజెప్పె.
చారులు తనతోఁ బ్ర - సంగించు మాట
యేఱుపాటుగ నది - యేవిన్నవింత
వడిగలవారు చె - ల్వముఁగలవారు
పుడమియంతయుఁద్రోవ - బ్రోవనేర్పరులు

వారయోధ్యాపుర - వల్లభుండైన
వీరుఁడౌ దశరథ - విభుని నందనులు
రామలక్ష్మణులు ధ - ర్మస్వరూపకులు
తాము సుగ్రీవుని - దండకు వచ్చి
చెలిమి చేసినవా ర - జేయులందులను
బలవంతుఁడగు రామ - భద్రుఁడీపనికిఁ
బూని వచ్చినవాఁడు - పూనినకార్య
మానిది కాదిది - యనరానివాఁడు
పరమతి సాదు ని - వాసవృత్తంబు
శరణి నాపన్నుల - గతియైనవాఁడు
నార్తులకెల్ల స - మాశ్రయుండతఁడు
కీర్తికిఁ దానె సం - కేతస్థలంబు
జ్ఞానసత్వవివేక - సంపన్నుఁడఖిల
దీనబాంధవుఁడు శ - క్తిత్రయాధికుఁడు
తలిదండ్రిమాట యా - దలఁ దాల్చువాఁడు
కలనైన బొంకెఱుం - గని సత్యవాది
కోదండ దీక్షాది - గురుఁడైనవాఁడు
వేదండగమనుండు - విజయలోలుండు
ధాతువులకు పర్వ - తముఁబోలి సుగుణ
జాతంబులకు సమా - శ్రయుఁడైనవాఁడు !
ఆరఘువీరుని - యసమువిరోధ
మేరికిఁగడతేరు ? - నెఱుఁగవయ్యోదవు
హితము నామాట నే - నెఱుఁగుదు నతని
నఖిలోకధర్మ స - త్యపరాక్రమములు

చూడఁజాలక నిన్ను - నుద్దులచేత
నోడించి పగవాని - యురువెంచలేదు
నీమేలుఁగోరి నే - నిలుపోపలేక
స్వామి! యడ్డమువచ్చి - వలదంటిఁ జలము
ఆ రవితనయుని - యౌవరాజ్యమునఁ
గోరిపట్టముఁ గట్టి - కోపంబుఁదీర్చి
శ్రీరాముతోడుతఁ - జెలిమి గావించి
యూరక సుఖమున - నుండుట మేలు
కడనున్న నేమి యి - క్కడ నున్న నేమి?
కడవాఁడు గాడు భా - స్కరకుమారకుఁడు
లాలనీయుఁడు తమ్ము - లను వేఱుసేయు
పాలసులకు నిత్య - పదవులు గలవె ?
ఎవ్వరాతనికన్న - హితులైన బంధు
లెవ్వరున్నారు నీ - కెందుఁ జూచినను?
నీవు రాజ్యము సేయ - నీతోడఁ బుట్టి
యీవగ సుగ్రీవుఁ - డిడుమలఁ బడునె!
ఇలమీఁద యాసయు - నింతులయాస
కలిమిపై యాస యొ - క్కటియె యెల్లరకు!
పిలిపింపు మతనిఁ జె - ప్పినయట్ల నడచు
చలముఁగడు సర్వ - సముఁడు సౌమ్యుండు
రమ్మనకేమి నే - రము నీకుఁ జేసె?
నమ్మలేనైతి బ్రా - ణము వంటివాని
సోదరుఁగడవ న - న్యులును జుట్టములె?
కాదు సుమయ్య! రా - ఘవమిత్రుఁ జెనక!
హితురాలవని నన్ను - నెంచితివేని

మతినాగ్రహముమాని - మనవి గైకొనుము
ఇంద్రాదులైన జ - యింతురే రామ
చంద్రుఁడు కేలన - స్త్రము పూని యున్న?
నీవెంత? జగముల - న్నియు గెల్వఁజాలు
చేవిల్లు గైకొన్న - శ్రీరామ విభుఁడు!”
అని యెన్నివలికిన - నవియెల్లఁ జెవులఁ
జొనుపక కాలవ - శుండైన వాలి
తనువిధి పెడరేప - దట్టించి తారఁ
గనుఁగొని పరుషవా - క్యముల నిట్లనియె.
“పగవాఁడు వచ్చి ద - ర్పంబుతో నన్ను
జగడంబునకుఁ బిల్వ - సైరింపఁ గలనె?
ఇయ్యవమతి కన్న - నెట్లైన నేమి
కయ్యంబు సేయక - కాదింసువదన!
ఏలీల సైరింతు - నెఱుఁగవుగాక
బాల! తోడను బుట్టు - పగయోర్వఁగలనె?
సుగ్రీవు నినదంబు - శ్రుతి సోఁకెగాన
నాగ్రహం బణపలే - నట్టులనయ్యె
రాముని యెడ నకా - రణభీతి తనకు
నేమిటికీచింత - యేఁటికి నీకు?
ధర్మమానసుఁడు కృ - తజ్ఞుఁడు నైన
ధార్మికాగ్రణి కీడుఁ - దలంచునే తనకు!
హితము వల్కితివి నీ - కిది యుచితంబు
ప్రతికూలమని యెంచఁ - బడదు నీమాట
భానుజు నదిరించి - వట్టిపధించి
వానిగర్వమణంచి - వచ్చెద గాని

కోటులతో నంతి - పురి కేఁగుమీవు
పాటలాధర! విన్నఁ - బాటు నొందకుము
నిలుచునేవాఁడు నా - నిగ్రహంబునకు?
శిలల వృక్షంబుల - చే బుద్ధిచెప్పి
వచ్చెద నాయాన! - వనిత! యేమనిన
నిచ్చట నీయాన - నీకుఁ దాళఁజాల!"
అనఁ దార కన్నుల - నశ్రులు రాలఁ
దన నాయకుని మోముఁ - దనివోక చూచి
కౌఁగిట నిండారఁ - గదియించు వెతల
వేఁగుచు వలవచ్చి - "విచ్చేయు మనికి
జయమందు" మనుచు సే - స శిరంబు మీఁదఁ
జెయి చాచియునిచి తాఁ - జింతతో మఱల
నావాలి వెడలి మ - హాంధకారమున
నేవగ నున్నాఁడొ - యినసూనుఁ డనుచుఁ
గలయ దిక్కులు జూడ - గజపుష్పి పుష్ప
కలికాకలితలతా - గ్రైవేయకమున
దిగదిగ వెలుఁగి యా - దిత్యానలేందు
యుగపత్ప్రకాశ స - మున్నతుండైన
తమ్మునిఁ గనుఁగొని - దట్టించియాగ్ర
హమ్మున భయదగ్ర - హమ్ముచందమున
దండపూనికఁ గాల - దండాభబాహు
దండైకముష్టివి - ధాప్రహారమునఁ
బొలియింతునని చేరఁ - బోవు నవ్వాలిఁ
జులకగాఁ గనుఁగొని - సుగ్రీవుఁ డనియె.
"ఎప్పటివలెఁ జూచె - దింక నాకేలు

దప్పుడు నీకుఁ బో - దగదింక బ్రతికి
యిదె చూడుమని కేల - నెత్తిన వృక్ష
మదరంట గిరిమీఁద - నశనియుఁ బోల
వాలిపై నేసిన - వాలి వారథినిఁ
జాలభారమునఁ జం - చలమైనయోడ
తీరునఁ జలియించి - ధృతిశాలి వాలి
ఘోరున పై బ్రాలి - పొడమి చేకొద్ది
యిద్దఱు నభమున - కెగసి సింగముల
యుద్ధులై రవిచంద్రు - లోయన దొరసి
కదిసి ముష్టాముష్టి - గరుడ వేగమున
నెదిరి బాహాబాహి - నెడమీఁక పెనఁగి
బ్రాలి కచాకచి - వసుధపై బొరలి
వాలిసుగ్రీవుల - వార్యశౌర్యముల
నన్యోన్య జయకాంక్ష - ననిసేయ నలఘు
మన్యువుతో శాంత - మన్యువుం డలగి
బలగర్వముల హెచ్చ - పైపయిఁ బెరిగి
తలనాఁటి పాటిల్లఁ - దలఁచుకోఁ జేయ
సత్తువ దఱిగి మో - సమువచ్చె నెందు
చొత్తు నేనని యెంచి - చూచెద నింక
కొంతసేపని కాళ్ల - గోళ్ల చేతులను
దంతంబులను మహో - ద్ధతిఁ బోరుచుండ
నిరువురు వృత్రాసు - రేంద్రుల రీతి
సరఘోర భయదగ - ర్జలతోడఁ బెనఁగు
మబ్బులవలెఁ దోచు - మర్కటాధిపులు
బొబ్బలు వేటులు - పోటులు నొక్క

రీతిగా మాల్యమె - ఱింగింపఁ జేతి
ఘాతల నలసి న - ల్లడఁ జూచుచున్న
రవితనయుని గాంచి - రఘువీరుఁడొయ్యఁ
జెవిసోఁక సింజిని - చే యమ్ము దిగిచి
యల్లె మ్రోతను గూళ్ళ - నణఁగిన పులుఁగు
లెల్లఁ దానున్న మ - హీరుహాగ్రమునఁ
జలియింప మెల్లనే - శరము చేవదల
బలువైన పిడుగద్రి - పైఁబడు నటుల
వాలిపేరెద నాటి - వ్రయ్యలు సేయ
కాలువలగుచు ర - క్తంబులు దొరుఁగఁ
వినిమూర్ఛ నొంది కుం - భిని వ్రాలి వాలి
కను దేలఁగిలనైచి - గాజువారుచును
మేనికాంతి యడంగ - మేదినిఁ జంద్ర
హీనమౌ నభముతో - నెనయంగ మూర్ఛ
వచ్చియుండియుఁ దండ్రి - వరదుఁడై తనకు
నిచ్చినసురభిళ - హేమదామంబు
మహిమఁ బ్రాణంబును - మదిలోని యెఱుక
మహనీయ కాంతియు - మానకయుండె
పూచినమోదుగు - పోలుపున రక్త
రోచుల సంధ్యారు - రుచిమీరి యున్న
వారిదంబన పుణ్య - వాసనల్ దీరి
యారీతిఁబడిన య - యాతి చందమున
జ్వాలలన్నియుఁబోయి - శాంతమైయున్న
కీలికైవడి ధాత్రి - కిని వ్రాలియున్న
విలయ భానునిరీతి - వేదనఁబొంది

తెలివిడితోఁ గన్నుఁ - దెఱచిన యట్టి
వాలిచెంతకు రఘు - వరులు ప్రమోద
శాలులై చేరంగఁ - జని మహామహుని
దుర్జయు నింద్రసు - తో సరివాని
నార్జవాన్వితు నిదే - వాసురాసాధ్యు
నుత్తుంగ భుజుని సిం - హోరస్కునిం బ్ర
మత్తుని గాంచన - మాలి నాజాను
బాహుని హరినేత్రు - భాసురవదను
నాహరినాయకు - నాహా జనింపఁ
గనుఁగొనుచుండ రా - ఘవుని నెమ్మోముఁ
గనివాలి ధర్మయు - క్తంబు సమ్మతము
నుచితంబు నిందాప్ర - యుక్తంబు నైన
వచనంబు దీనభా - వమున నిట్లనియె.
"ఏమఱిపాటున - నేనుండ నేసి
యేమి లాభముగంటి - విదియుఁ బౌరుషమొ ?
పోరికి నేరాఁగఁ - బోవల దనుచుఁ
దార నీతెఱఁగెల్ల - దనకుఁ దెల్పుటయు
గుణవంతుఁడవు ధార్మి - కుఁడవు ప్రాజ్ఞుఁడవు
బలవంతుఁడవు దయా - పరుఁడవు సత్య
వాదివి సౌమ్య భా - వనుఁడవు శస్త్ర
వేదివి నీతికో - విదుఁడవు సర్వ
సముఁడవు వీతమ - త్సరుఁడవు కీర్తి
రమణీయుఁడవు పరా - క్రమ భూషణుఁడవు
యని విన్నవాఁడనై - యది నిజంబనుచు
మనసులో నమ్మియే - మఱియుంటి నిపుడు

రాజులు ధర్మమా - ర్గంబుఁ జేపట్టి
భూజనంబుల బాధఁ - బొందింపుచున్న
ఖలుల శిక్షింతురు - కలుషభయంబు
దలఁచి వర్తింతురు - తప్పరెవ్వరును
ఏను నాతమ్ముఁడు - నెక్కటిఁ బోర
మౌని వేషము బూని - మాయావి వగుచు
వచ్చి చంపుదురె? యీ - వసుధను నీకు
నెచ్చోటనైన నే - నెగ్గు చేసితినె?
మునులకై వడి ఫల - మూలముల్ మెసవి
వనులఁ గ్రుమ్మరు నట్టి - వనచరుఁ బట్టి
పడనేయ నీకేమి - పని? కలనైనఁ
జెడఁజూడ వెన్నడు - క్షితినెల్లవారిఁ
దను జంపునది రాజ - ధర్మంబె నీకు?
వినికని యెఱుఁగుదు - వేయిట్టి వారి?
ఇల వెండిబంగార - మివి మొదలైన
కలుము లాశించి యొ - క్కరునిఁ ద్రుంపుదురు
రాజు లీయాస శ్రీ - రామ! నీమదిని
యోజింప లేదు ప్ర - యోజనంబేమి?
విలుకేలఁ బట్టియీ - వేషమైనపుడె
కలుగునే ధర్మార్థ - గరిమముల్ మీకు
కామాతురుండవై - కర్మవాసనల
చేమతి చరియించి - చేసితి కీడు
నిరపరాధుని నన్ను - నీవట్టు లేసి
ధరణీశ! సభల ను - త్తర మియ్యగలవె?
క్రూరాత్మకుఁడు నాస్తి - కుఁడు పతితుండు

చోరుడు శఠుఁడు నీ - చుఁడు మద్యపాయి
రమణుల నావుల - రాజుల ద్విజుల
సమయించువాఁడు పా - షండ వర్తనుఁడు
గురుతల్పగమనుఁడు - కొండీఁడు ద్రోహి
పరివేత్తయన్యాయ - పరుడు హింసకుఁడు
నిరయగాములు గాన - నీకేఁటి కయ్య!
కొఱమాలి యీకోతి - కొలఁగట్టుకొనఁగ?
ఈమాంస మీచర్మ - మీదంత శల్య
రోమాదికంబులు - రోతురుగాని
రోయరెవ్వరు వాన - రుల ధార్మికుండ
వీయపకీర్తి ని - వేల పొందితివి?
పంచనఖంబులఁ - బరఁగిన జంతు
సంచయంబుల నైదు - చనుగాని మీకు
కడమవాటిని దినం - గాదేమి దలఁచి
పడవేసితివి నీకు - భక్ష్యంబె యేను?
అంటుదురే కేల - నైగవానరుల
యొంటి మాంసంబు? ని - న్నొకనిఁ జూచితిమి!
రామచంద్ర! వివేక - రాలు మాతార
వేమారు నాకు నీ - వృత్తంబుఁ దెలిపె
నది వినియుండియు - నహమిక చేత
విధి పెడరేఁపఁగ - వెడలి వచ్చితివి
నను నేయఁబనియేమి? - నానేర్పునేర
మునకు నెవ్వాఁడ వ - మ్మునఁ బడనేయ?
నీవురాజవుగావు - నీవెంటఁ బరమ
పావని యాసీత - పతివైన కతన

మది నమ్మి నిను సధ - ర్మపరుఁడ వనుచు
హృదయంబులోనఁ దా - నెఱుఁగక వచ్చి
యీపాటు బడిపోయె - హీనకర్ముఁడవు
పాపివి యన్యాయ - పరుఁడ వల్పుఁడవు
ద్రోహివి శఠుఁడవు - దుర్బుద్ధి వధమ
సాహసాత్ముఁడవు వం - చకుఁడ వజ్ఞుఁడవు!
అక్కట! దశరథు - నంతరాజునకు
యెక్కటి సుతుఁడవై - యీవు గల్గితివి?
పెక్కేల ధర్మంబు - పేరిటి యొరిజ
చక్కని నీత్యంకు - శంబును లేని
నీవను మదదంతి - నిర్నిమిత్తముగ
నీ వాలి యను తరు - విలఁగూల్చె నేఁడు!
ఇంతటి సాహస - మేఁజేయు శౌర్య
వంతుఁడనని సభ - వారెల్ల వినఁగ
నేమని యనుకొందు - వే నికుఁ గీడు
గామింప నొకనాఁడు - గాదు జేసితివి!
నిలిచి నాముందఱ - నే బంటననుచు
నలుకతోఁ గనుపించ - వైతివిగాక
వింటితో నంతకు - వీటికిఁ బనిచి
మంటితోఁ గలపనే - మాటమాత్రమున!
వరుసయే సిద్ధించు - వానిఁ గాలాహి
గఱచిన గతి నెఱుఁ - గక యుండు వాని
చెట్టు చాటుననుండి - చిటుకనకుండ
మెట్టుకోలను పుడ - మిని ద్రెళ్లనేయ
వీఁడేమి భ్రాంతిని - వెలఁదిఁ జేకూర్చు

వాఁడని వాని బ - వంతముల్ నమ్మి
యెందుకుఁ గొఱగాని - యినకుమారకుని
బొందుచేసుక తన్ను - బొడవడంచితివి !
బుద్ధి చాలక మోస - పోతివి గాక
వద్దికివచ్చి మీ - వార్త నాతోడ
నొకమాటు వినిపింప - నురక రావణుని
సికవట్టి తెచ్చి మీ - శ్రీపాదమునకు
నొప్పగింపుదు సీత - నొక నిమేషమున
నిప్పుడే చేకాన్క - నేను సేయుదును !
జలధిలోనున్న ర - సాతలంబునను
జలపట్టి డాఁచిన - జానకీదేవి
నీకిత్తు నాగమ - నికరంబు ఖలులు
దాఁకొని మునుపశ్వ - తరిగానమర్చి
కడలినుండగ శౌరి - కడవఁడై తాను
జడధిలో డాఁగు రా - క్షసుల మర్దించి
చేకొన్నగతి నీతి - సీతతోఁ గూడి
శ్రీకర రాజ్యల - క్ష్మి నెసంగఁ జేతు !
తను బడవైచి యీ - తపననందనుని
తనరాజ్యమేలింపఁ ద - లఁచితిగాక
దీన నీకేమి సి - ద్ధించు ? నీబుద్ధి
జానకి వెంటనే - చనియె గానోపు !
రామ నీకీ యధ - ర్మము ప్రాప్తమయ్యె
నేమి సేయఁదలంచి - యేమి చేసితివి ? ''
అని నోటఁదడిలేక - యాస్యంబువాడ
తను జూచి పల్కియుం - తట శక్తిలేక

శరమెల్ల నుడివోవు – జలదంబు రీతిఁ
గరిబొగ్గువడిన శి – ఖావంతు కరణిఁ
తేజంబు మాసిన – దినరాజు మాడ్కి
నాజిలోఁ బడిన మ – హాసత్త్వశాలి
వాలి యాడిన యట్టి – వచనముల్ ధర్మ
మూలముల్ నిష్ఠురం – బులునైన కతన
చెవిసోఁక విని రఘు – శ్రేష్ఠుండు చాల
వివరంబుగా వాలి – వినఁగ నిట్లనియె.
"కపివీర! ధర్మార్థ – కామలౌకికము
లిపుడింతయు నెఱుంగ – కేల పల్కెదవు?
ఇందుకోఁ గాదని – యెదువారు లేని
యందుచేఁ దోఁచిన – యట్లు వల్కుదురె?
వనపర్వతద్వీప – వతియైన జగతి
నినవంశమనులైన – యిక్ష్వాకు కులులు
పాలింపఁ దమరు పా – ల్పడి మృగపక్షి
జాలంబులను మహీ – జనుల రక్షింపఁ
బాలియింపఁ గర్త లె – ప్పుడుగాన భరతుఁ
డలఘు పుణ్యుఁడు ధార్మి – కాగ్రణి సకల
లోకరక్షకుండు సు – శ్లోకుఁడుత్తముఁడు
చేకొని రక్షింప – శిక్షింపఁ గర్త
గాన యాయన యను – గ్రహముచేఁ బంపు
పూని వచ్చితి మట్టి – పుణ్యశీలుండు
నెలమి నధర్మాత్ముఁ – డేలుచున్నట్టి
యిలమీఁద నెవ్వారి – కేమన వచ్చు?
కామాంధుఁడును నీతి – గతిలేనివాఁడు

యన్యాయమని నీకు - ననరాదు వాలి!
కలుషపంకములెల్లఁ - గడిగి స్వర్గాది
విలసన శోభనా - న్వితునిఁ జేసితిని!
ఇంక నీకొకమాట - హృదయకళంక
సాంకర్యములు దీఱ - సమ్మతి వినుము
రాజులు లతికావ - రణములు దాల్చి
యోజించి దీమంబు - లుద్దిగా నునిచి
మిట్టుపల్లములైన - మేదినులందు
కట్టలనురులును - గండెలివైచి
వలలొడ్డి పొంగులు - వారి చాటులను
నిలిచి వంచనల వ - నిమృగంబులను
పరమధార్మికులయ్యు - భయముచేఁ బఱవ
కరుణ యింతయు లేక - కదిసి చంపుదురు
మీరును వనచర - మృగములు గాన
చేరువఁ బొంచి యే - సితి వినోదమున
తెలియక నన్ను నిం - దించిన నేమి?
ఫలము నీకిట మీఁదఁ - బరికించుకొనుము
దేవతల్ రాజుల - తీరున బుట్టి
భావించి పుణ్యపా - పములేర్పరించి
రక్షింపఁ దగు వారి - రక్షింతురెఱిఁగి
శిక్షించు వారల - శిక్ష సేయుదురు
కననేరవైతి వా - గ్రహముచే ధర్మ
మనరాని దుర్భాష - లాడ నేమిటికి?
చాలింపు" మనిన నం - జలి చేసి వడఁకి
వాలి యారఘుకుల - వరునకిట్లనియె.

స్వామి! మీయానతి - సత్యంబు ఖలుఁడ
తామసాత్ముఁడ నీచ - తరుఁడ నీయెదుర
నెదిరించి మాటాడ - నెంతటివాఁడ?
సదయాత్మ! యిది నాదు - జాతి చేష్టితము
ఎఱుఁగని వానరుం - డేమన్న నేమి?
మఱచి యానేరముల్ - మది నోర్చుకొనుఁడు
నేరంబులకునైన - నిష్కృతిఁ జేసి
శ్రీరామ! నన్నుర - క్షించితిరిట్లు!
సర్వభూతహిత ప్ర - చారుండ వఖిల
నిర్వాహకుఁడవు మా - నితపుణ్యనిధివి
పరమధార్మికుండవు - పాపమానసునిఁ
గరుణతో శిక్షించి - గడ తేర్చినావు
నిగ్రహింబిదిగాదు - నీయనుగ్రహము
సుగ్రీవుమీఁది యా - సున ముక్తి గలిగె
నున్నబల్కులను వీ - నులఁ జల్లచేసి
నన్ను రక్షింపుమ - నాథ శరణ్య!"
అని రొంపిలోఁ బడు - హస్తి చందమునఁ
దనమోము కన్నీటఁ - దడిసి సొంపరగఁ
గాయంబువెంట ర - క్తప్రవాహంబు
కాయంబు నిండ గ - ద్గద నిస్వనమున
శ్రీరామచంద్ర! కూ - రిమి చుట్టములకు
తారాదిసతులకుఁ - దన దేహమునకు
మదిలోనఁ జింతించి - మగుడ నాప్రాణ
సదృశుఁడౌ రత్నకాం - చన శుభాంగదుని
యంగదునిఁ దలఁచి - యడలెద బాలుఁ

నీమహిం నీవె కా - కెవ్వఁడున్నాఁడు?
తగునె జ్యేష్ఠభ్రాత - తండ్రితోసాటి
యగు విద్యనేర్పిన - యతఁడట్టివాఁడు
తనయుఁడు శిష్యుఁడు - తమ్ముఁడు నొకట
యని యెంతు రాగమాం - తార్థకోవిదులు
ధర్మమర్మమెఱుంగఁ - దరముగా దాత్మ
నిర్మలు లన్నిఁట - నిండుక యుండి
చూచుచుందురు శుభా - శుభకర్మరతులు!
ఏచోట దగుఫలం - బిచ్చువారలకు
చపలాత్ముఁడవు నీవు - చపలులైనట్టి
కపుల సంగతి నేమి - గని యెఱుఁగుదువు?
అంధుఁడంధుని గూడి - నట్ల మీజాతి
బాంధవుల్ నీకన్న - బ్రాజ్ఞులన్నిటను
తెలివిడి సేతు నీ - తెఱఁగు మాతెఱఁగు
కల విఱుచుక విని - కడతేరు మీవు
కానక నిందింపఁ - గాదు మమ్ములను
నీనేర మెఱుఁగగ - నేరవు నీవు
తమ్ముని సతి రుమా - తరుణితో నెట్లు
సమ్మతంబునఁ గ్రీడ - సల్పెద వీవు!
పాపాత్ముఁడవధర్మ - పరుఁడవుగాన
తూపుఁగైకొని నిన్ను - ద్రుంగ నేసితిని
యెవ్వఁడు నడవని - యీకాని నడక
క్రొవ్వుచే నడచు నీ - కును హాని రాదె?
చెలియలిఁ దమ్ముని - చెలియఁ గూఁతురిని
వలచి పట్టిన వాని - వధియింపఁదగవు

భరతుని యాజ్ఞఁ ద - ప్పఁగరాదు మాకు
దొర సెప్పినటుసేయ - గోసంబురాదు.
ఇలయు నిల్లాలి నీ - కిప్పింతు ననుచుఁ
జెలిమివేళఁ బ్రతిజ్ఞఁ - జేసినవాఁడ
నీరవి సుతునితో - నేనాఁడి తప్ప
నేరఁగానవు నిన్ను - నిగ్రహించితిని !
చెలికానికైన యొ - చ్చెము మాన్పలేని
చులకనివాఁడు యశో - నిధి యగునె ?
నమ్మినవాని మా - నంబుఁ గాచుటయె
సమ్మతంబును ధర్మ - సరణియు నగుట
గట్టిగా నిది యెఱుఁ - గని నేఁతగాడు
పట్టి నిన్ను వధింపఁ - వరమధర్మంబె
రాజదండనము కా - రణముగా ధర్మ
రాజదండనము నే - రదు నీకుఁ గలుగ
నమరలోక సుఖంబు - లందెదు వింక
సమబుద్ధిఁ గ్రోధంబుఁ - జాలింపు మీవు
జగతి నాజ్ఞాధుని - సమయింపకున్నఁ
దగులు రాజునకు పా - తకము వెంబడినె
కావున మారాడ - గా రాదు నీకు
జీవనాపేక్ష దూ - షింపకుమమ్మ.
మావంశకర్తయౌ - మాంధాతచేత
నీవిధంబుగ ధర్మ - మీడితంబయ్యె
మత్తులు పాపక - ర్మంబులు సేయ
నుత్తములగు రాజు - లోర్తురే చూచి ?
అన్యోన్యతారకం - బగుట నాచైది

డంగద శౌర్వకే – మనువాఁడో వాఁడు !
ఆతపంబున నింకు – నల తటాకంబు
రీతిఁ గృశించి జీ – ర్ణించు నానాఁట
ననుబాసి నిమిషమై – న సహింపఁ జాలఁ
డనయంబు నారొమ్ము – నందె నిద్రించు
నేనిడకాహార – మెవ్వరిచేత
నైన నొల్లఁడు తల్లి – యుండకుఁ బోఁడు
పసిబిడ్డ మనసు ని – ల్పఁగ లేఁడు మాట
రసికుండుగాఁడు తా – రాకుమారకుఁడు
ఆయొంటి కొడుకుల – కై కలంగిడును
నాయాత్మ నీచర – ణంబులే కాని
వాని కాధారమె – వ్వరు లేరు సకల
దీనబాంధవ ! కడ – తేర్పు మెట్లైన
నమ్మితిఁ బుత్రదా – నంబు సేయుటకు
నమ్మింపు నీకీలు – నామహాళినుంచి
రక్షింపు నేర్పు నే – రములు సహించి
పక్షీకరింపు మీ – భానుజునట్లు !
ఇరువురు సరి మీఁకు – నీ లక్ష్మణుండు
భరతసుగ్రీవులు – భావింప మీకు
రామ ! యేకై వడి – రక్షింపఁ ద్రోయ
రామిరొమా యటుల తా – రాకుమారుఁడును !
కొలువు పట్టున నొక్క – చెలమైన నిలుపఁ
బఱగుట దీరని – పని యిది మీకు
హంతుఁడైన పగవాని – యాత్మజుఁడగుట
హితశత్రుఁ డితఁడని – యెవ్వారలైన

— వాలి తనకర్తవ్యము రామునకుఁ దెలిపి పరలోకమున కేఁగు స్థితిలోనుండుట —

బట్టించియిది విన్న - పము సేయఁజెవిని
బెట్టకప్రోవుఁడీ - బిడ్డని మీరు
తనమీఁదఁ బగచేతఁ - దారపైఁజాల
గినిసి సుగ్రీవుఁ డం - కిలి సేయకుండ
నాయనాథను గావు - మనఘ ! మీకరుణ
నీయవనీచక్ర - మెల్లఁ బాలించి
తరువాత స్వర్గంబుఁ - దాఁజేరఁ గలఁడు
తరణితనూజుఁడెం - త కృతార్థుఁడయ్యె ! ”
అనిపల్కు వాలి మ - హా శౌర్యశాలిఁ
గనుఁగొని రఘుకులా - గ్రణి యిట్లులనియె
“ చేమించి యిటునడ - చిన కార్యమునకు
నేమిదలంచిన - నిఁక నేమి గలదు ?
ఇందుచే నీపాప - మెల్లను దీఱె
నందవు నినుద్రుంప - నఘములునాకు
శోకమోహంబుల - సుడిఁ జిక్కవడక
యేకడఁ దత్త్వమూ - హింపు సత్యముగ
దిరమున కేఁగుము - ధృతిపూని తార
నవమతి యొనరింపఁ - డర్కనందనుఁడు
నాయంబు నీభాను - నందను నందు
నీయందుఁ గలభక్తి - నిలుపు నంగదుఁడు
అతని కేమి కొఱంత - యాత్మజుఁ దలఁచి
యతినీచ మగుదుఃఖ - మంద నేమిటికి ?”

అని యుచితంబుగా - నాడిన రాముఁ
గనుఁగొని యావాలి - క్రమ్మఱంబలికె
" జానకీరమణ ! ని - శాతసాయకము
చేనేసితివి రొమ్ము - చినిఁగి కూలంగ
నానొవ్వి యదియంత - యనరాని మాట
లేనిన్ను బలికి నా - హృదయంబులోన
మిగులఁ దపించెద - మీరవి మఱచి
పగమాని నన్ను జే - పట్టుఁడుల్లమున
నాపట్టి బాలుఁడై - నను రవితనయు
ప్రాపున మేనుడాఁ - పడ సంగరముల
మీపనిపాటల - మెలఁగఁగ నేర్చు
నోపు నెంతటికైన - నోడఁడెవ్వరికి
వానికేమి గొఱంత - వాఁడు నీవాఁడు
జానకీరమణ ! వి - చారమేమిటికి ?
ఏనెవ్వఁడను విశ్వ - మెల్ల రక్షింపఁ
బూనిన మీతోడఁ - బోసఁగఁ బల్కుటకు ?"
అని శరవేదన - నరగన్ను వెట్టి
తనువు మ్రాన్పడనచే - తనుఁడయి వాలి
యిలమీఁద వ్రాలిన - యెడఁదార తనదు

— రామబాణహతుఁడైనవాలి యవస్థఁగని
తారవిలపించుట —

నిలయంబులో వాలి - నిర్యాణవార్త
విని మూర్ఛనొంది యా - వెంబడిఁ దెలిసి
తనవెంట వృద్ధ బాం - ధవకోటి రాఁగ
నంగదుఁ దోడ్కొని - యావాలి పడిన

సంగరస్థలికి రా - సకలవానరులు
భీతిచేఁ బఱచిన - బెదరక తార
" హేతువెయ్యదిపాఱ - నేమిభయంబు?
వసుధ యేలఁదలంచి - వాలినింజంపె
బిసరుహాప్తసుతుండు - బెగడ నేమిటికి?
నిలుఁడన్న వారలా - నెలఁతను జూచి
కలఁగుచు " నోయమ్మ! కనుమల్లవాఁడె
శరము కీలనమర్చి - శమనునిరీతి
దురుసైన బలువిల్లు - దొనలును బూని
వికట భాగమునందు - నిలిచిన వీరుఁ
డొకఁడెవ్వఁడో చూచి - యోడిపాఱెదము!
ఇటువంటి దొరఁజూచి - యేమేల నిలుతు
మటుపోవ నేల నీ - యాత్మజుఁగూడి
మఱలుము నేఁడె కు - మారునిం దెచ్చి
పురికిఁ బట్టము గట్టి - పోషింపుమమ్మ
వజ్రనిభంబైన - వాలమ్ముచేత
వజ్రిసూనుఁడు రణా - వనిఁగూలినాఁడు
మనమేఁగ జెల్లదు - మాయమ్మ మఱలి
చనుదెమ్మ కాదన్న - చనుమెందునైన
బ్రదుకుపై యాస దె - ప్పరముగ మేము
గదియవత్తుమె వాలిఁ - గన్నులఁజూచి?"
అనవిని యావాన - రావళిఁగాంచి
తనమదిఁ చింతిల్లు - తార యిట్లనియె
"అవివేకులార! మ - హాశౌర్యశాలి
ప్రవిమలాత్మకుఁడు నా - ప్రాణ నాయకుఁడు

వాలియిట్లుండ నీ - వసుమతి యేల ?
ఏలయంగదుఁడు ? నా - కేమియు నేల ?
వచ్చినరండు రా - వల దేని పొందు
విచ్చలవిడి " నని - వెలఁది తావచ్చి
పిడుగుగొట్టినయట్టి - పెనుగొండమాఱు
పడు గాత్రమున నుర్విఁ - బడియున్న వాని
నసురనాయకుల బా - హాశక్తి చేతఁ
గసిమసఁగు ప్రతాప - ఘనలీలవాని
కొండలు పొడిచేసి - కుంభినిఁ గూల్చు
చండిభుజాసత్త్వ - సంపదవాని
తనతండ్రి మెచ్చని - ధైర్యశౌర్యములు
గనువాని సజలమే - ఘధ్వని వాని
మృత్యుపాశములు నె - మ్మెయిఁ గట్టువడుట
యత్యంత మూర్ఛితుం - డై నట్టివానిఁ
బతిఁజూచి జానకీ - పతిఁజూచి మఱఁది
నతనిచెంగటి సుమి - త్రాత్మజుఁజూచి
వారల మీఱి యాఁ - వాలి చెంగటికిఁ
జేరి పైప్రవాలిమూ - ర్ఛిల్లి యాతార
తానంతఁ దెలిసి సం - తాపంబు నొంది
"హా ! నాథ ! హా ! యంగ - దా యంచు" వగచి
యన్నువ పులుఁగు చా - యను విలపింపఁ
గన్నుల నశ్రువుల్ - గ్రమ్మ నంగదుఁడు
పలవింప వారల - భావించి తాను
కరఁగుచు నన్న చెం - గటఁ జేరవచ్చి
సుగ్రీవుఁడును జాల - శోకింప రాఘ

వాగ్రణి శరముచే - నాహవభూమి
తొడిఁబడ మూలంబు - తోఁ బెల్లగిల్లి
పడిన వృక్షమనంగఁ - బరవశుండైన
వీరుని వానర - విభువాలిఁ గూర్చి
తారాది పావన - తార యిట్లనియె
"హరిరాజ! నీ వేల - యరగన్ను మొగిచి
ధరణిపైఁ మొదలి సం - తాపమొందెదవు?
పరపుల మీఁదటఁ - బవళింపకేల
పరమైన రానేలఁ - బవళించనీకు?
కనువిచ్చి చల్లఁగాఁ - గనుఁగొనవేల?
ననుఁజూచి యేలయా - వనము వాంచితివి?
అకట! కిష్కింధా మ - హా పట్టణంబు
నకుబోడుగా నొక్క - నగరంబునీకు
సంతరించితి రేమొ - స్వర్గవీథికల?
ఇంతటి వానికే - యిటువంటిపాటు!
నందనవనము మి - న్నక పాడుచేసి
నందనోద్యానంబు - నకుఁ బోవనగునె?
ననుబాసి దివిజకాం - తలఁగూడఁ దలంచి
తనుఁ గొంచపఱతురె - తరుణులలోన?
ఎటువలె నోర్తుని - న్నెడవాసి నేను!
కటకటా! క్రోధంబె - కడ తేర్చెనిటుల!
ఇలయేల? నీవెంట - యేవత్తు దివికి
నిలుతునె యెడవాసి - నిమిషమేనియును!
దేవతాసతులు నీ - తీరుఁ జూచినను
భావజునకు నేల - బందాలు గారు!

తప్పక విధివిహి - తంబైన బుద్ధి
నిప్పుడు సుగ్రీవు - నెదిరించితీవు!
తన కేలమాను వై - ధవ్యాదులైన
యనుపమ దుఃఖము - లవిచుట్టుకొనక ?
అక్కట ! సుకుమారుఁ - డైన యంగదుఁడు
దిక్కెవ్వరును లేక - దీనతనొంది
కితవుఁడైనట్టి సు - గ్రీవునిఁ గొలిచి
బ్రతిమాలి యేరీతి - బ్రదుకువాఁడింక ?
వానికెయ్యదిబుద్ధి ? - వచ్చియున్నాఁడు
నూనునిఁ గనువిచ్చి - చూచిమాటాడి
యిదిబుద్ధియనుచు వా - యెత్తవు ! నీదు
పదపద్మముల మీఁదఁ - బడియున్నవాఁడు
హా ! హరిహయపుత్ర ! - హా ! వాలి ! ”యనుచు
నాహిరిఁ బాడిన - యనువుగానేడ్చి
'అంగద ' రమ్మని - యంగదతోడ
యంగంబు వట్టియొ - య్యన లేవనెత్త
“ఏతండ్రి పోషించు - నిఁకనిన్నుఁ దండ్రి ?
మీతండ్రి పోవన - మ్మినవారిఁ జెఱచి
భానునందనునితోఁ - బ్రతినఁ జెల్లించి
జానకీజని సి - జనకునిఁ జంపె
ఏమయ్య ! సుగ్రీవ ! - యీవాలిఁ జంపి
నీమచ్చరంబెల్ల - నేఁడు దీర్చితివి !
ఆపదల్ గడతేరె - నా రుమంగూడి
యీపురంబేలు మీ - వేక చిత్తమున !
చింతించిచెయిగానిఁ - జేతఁబట్టితివి

పంతంబుతోఁ బగ - పాతరం బడియె"
అనియంగదకుమారు - నావాలిచెంత
నునిచి యాతార వి - యోగ దుఃఖమున
శోకింప నావాలి - సుదతులందఱును
గాకలీరవముతోఁ - గన్నీరు చింద
"హా! యంగదకుమార! - హా! ప్రాణనాథ
హా! యీశ! హా! వాలి! - యనిపలవించి
"అయ్య! కుమారు నా - రార్పవదేల?
తొయ్యలి యీతార - తోఁ బల్కవేల?
ఏమేమి నేరంబు - లేము జేసితిమి
మామీఁదఁ గరుణించి - మాటాడవేల?
ఎవ్వరు వాలింతు - రీకపిరాజ్య
మెవ్వరుదిక్కు మా - కేమి సేయుదుము?"
అని వాలిపై వ్రాలి - యందఱు నేడ్వఁ

— హనుమంతుఁడు తారనూరార్చుట - ముందుచేయఁగల కార్యమును తెలుపుట —

గని వాయుతనయుఁడు - గ్రక్కునవచ్చి
తారపాదముల మీఁ - దనువ్రాలి కంట
నిఱుంచి తారక - న్నీరు వో దుడిచి
"ఓయమ్మ! నీవింత - యుమ్మలికింప
నాయమే వాలికై - నకొఱంత యేమి?
ఇలయెల్ల నేలె న - నేక దానవులఁ
బొలియించె భుజబలం - బునఁగీర్తి గాంచె
రాముబాణంబుచే - రణములోఁ బడియెఁ

గామింపఁ దగిన స్వ - ర్గముఁ జూఱవట్టె
నంగదు సంతతి - యాత్మజుండుండ
నంగనామణి! యేటి - కమ్మ యీచింత?
విజ్ఞానరాశివి - విమలమానసవు
ప్రాజ్ఞురాలవు భూత - భావికార్యములు
తెలియనేర్తువు నీకుఁ - దెలివిడికాని
నిలనేమియున్నవి? - యీవాలి కొఱకు
సేయంగఁదగు క్రియల్ - చేసి యంగదునిఁ
బాయక కిష్కింధఁ - బట్టంబుఁ గట్టి
యిల యేలుచుండ నీ - వీక్షించి కీశ
కులమెల్ల రక్షించి - కొడుకును నీవు
మమువంటి మంత్రుల - మాన్యుల నెఱిఁగి
ననుబుద్ధిఁబోషించి - చలముఁ జాలించి
మఱఁదినిఁ దగినట్టి - మర్యాదనుంచి
గుఱిచేసి యీ నమ్మి - కొలిచిన వారిఁ
జెదరనీయక వాలి - చేసిన మేర
లదనుతో నడిపింప - నగు గాక నీవు
చింతించి 'గతజల - సేతు బంధనము'
కాంతునిఁ దెచ్చెదే - కడచన్నవాని?
భామిని! బుద్బుద - ప్రాయముల్ మేను
లేమి యెవ్వరికైన - నివియార్జితములె?
పుట్టినయప్పుడె - పోలియుట నిజము
గట్టిగా దేహికిఁ - గనమె లోకులను
క్షణభంగురంబైన - సంసారమునకు
నణుమధ్య! యెఱుఁగక - యాత్మనమ్మదుఘ

వాలి యహంకార - వశతచేఁ గూలె
నేల యీమమకార - మిప్పుడు నీకు ?
సేయు కార్యంబులు - చింతింపవమ్మ !
జాయలే యిహపర - సౌఖ్యదాయినులు
ఎట్టివారికిఁగాన - యిన్నియు నెఱిఁగి
యిట్టికై వడి నేడ్వ - నీకనేమి గలదు ?
చాలింపు " మనిన యం - జనకుమారకుని
వాలి యిల్లాలు పా - వనశీల వలికె.

— హనుమంతునకు తార ప్రత్యుత్తర మిచ్చుట —

"అన్న ! వాయుకుమార ! - యంగదుఁ బోలి
కన్నట్టి కొడుకు లే - కడ నెందఱైనఁ
గలిగిన వారలు - గపిరాజ్యమేల
గలరె ? సింహబలంబు - గాకరక్షింప
నక్కలచేనౌనె ? - నాచేత నగునె ?
ఒక్కని దొరఁజేరి - యునుపరాజ్యమున
వీనికిఁ బినతండ్రి - విభుఁడు సుగ్రీవుఁ
డేనెవ్వతెను ? నాకు - నేమి గార్యంబు ?
తల్లియుఁ దండ్రియుఁ - దైవంబు గురువు
నెల్లను రవిసూనుఁ - డీకుమారునకు
వీరశౌర్య సమ - న్వితుఁడైన వాలి
యీరణంబున బడి - యెటకు నేఁగడినో ?
అచ్చోటికే వెంట - నరుగుదు నీవు
సచ్చ్రతుఁడ విట్లు - జనునె భాషింప ?
వాలియే తనకు దై - వము యేల వట్టె

జోలి మాటలు రాజ - నూనులు వినఁగ ?"
అనునంతఁ దనకన్ను - లల్లనవిచ్చి
తనయుని హనుమంతుఁ - దారనుఁజూచి
యాచెంతఁ గన్నుల - నశ్రులు రాలఁ
జూచు భానుతనూజుఁ - జూచి చింతించి
శతమఘతనయుఁడు - సాంత్వన వినయ
హితగౌరవములఁ దా - నిట్లని పలికె.

—: మరణోన్ముఖుఁడైనవాలి, తనకుమారుఁడైన యంగదుని తన భార్య తారను, సుగ్రీవున కప్పగించి మృతిఁజెందుట :—

"ఓయి! సుగ్రీవ! నా - యొచ్చంబులెల్ల
నీయాత్మ మఱవక - నిలుపంగరాదు
ఇరువురకును సౌఖ్య - మేడది యొక్క
ధరణియాశించు పా - తకమానసులకు ?
తగినట్టివాఁడవు - ధరణికిఁ దానుఁ
దెగినట్టి తరువాతఁ - దెల్లమెల్లరకు
నిట్టి యవస్థచే - యేనుండి పలికి
నట్టి మాటలు విను - నది నీకుఁదగవు
ఇలమీఁద వ్రాలి ది - క్కెవ్వరు లేక
కలఁగుచు నుడివోని - కన్నీటఁ బొరలి
యున్న యంగదుఁ వాఁడు - మొక్కఁడె తనకుఁ
కన్నట్టికొడుకు చ - క్కనివాఁడు నీవు
నుపలాలనము సే - యు యోగ్యుఁడు వీత
గపట మానసుఁడెఱుఁ - గఁడు వివేకంబు
నాకుమారుఁడు గాఁడు - నమ్మిక వాఁడు

నీకుఁ బుట్టినవాఁడు - నెగులొందనీకు
నిన్నాళ్లు లాలించి - నేనీకుమారు
నన్నిగారవముల - నేది పెంచితిని
యాతీరు దప్పక - యరయుము ప్రాణ
దాతవు నేతవు - త్రాతవు నీవు
ఋణమున బోఁడు ధా - ర్మికుఁడు చేచూపి
రణములఁ జూడు తా - రాకుమారకుని
నీవంతవాఁడయి - నీవిరోధులను
మాయించుఁ దోడాస - మసలఁడెచ్చోట
నాశక్తి యెంత యం - తటి సత్త్వశాలి
యాశిశువు వెపుడు వ - జ్రాంగి నీకతఁడు!
అల సుషేణుతనూజ - యైన యీతార
యలఘు వివేక కా - ర్యసమర్థురాలు
యేరీతిఁ బలికె నీ - విట్టట్టులనక
యారీతి నడచి మే - లందుమేయెడల
శ్రీరాముతో నేమి - చేసెదనంటి
వా రామచంద్రుఁడే - మనియె నీతోడ?
అటుల కావింపు మీ - వది తప్పితేని *
యటమీఁద నిహపర - హానిఁ జెందుదువు.
ఈ యింద్రదత్తమా - హేమదామకము
మీయన్న! దాల్చి నా - మాఱుగామనుము!
అసువులు బాయక - యటమున్న నీకు
నొసగదఁ దగువాత - యోగ్యంబు గాదు
నీవు ధరింప దీ - నికి నియ్యకొమ్ము"
నావుడు శోకదై - న్యముల నీఁదుచును

రాహువుచేఁ జిక్కు - రాజునుఁ బోలి
యా హరిదశ్వుని - యాత్మనందనుఁడు
కలఁక నొందకఁ బిల్చి - కాంచనమాలఁ
దలవంచికొని చేరఁ - దా మెడనైచి
సుగ్రీవు నెమ్మోము - చూచి హర్షించి
యగ్రభాగమునందు - నంగదుఁ గాంచి
"రమ్ము కుమార ! యీ - రదు మేల వగవ ?
ఇమ్మీఁద సుగ్రీవుఁ - డేదిక్కు నీకు
నన్ను జూచినయట్ల - నాసహోదరుని
వెన్నాసయై నిల్చి - వీక్షింపు మెపుడు
వేరుసేయక కాల - విధము దేశంబు
నారసి సుగ్రీవు - నాజ్ఞప్తి వినుము.
అనిచిన పనులందు - నాకలిఁదప్పి
యును దేహసౌఖ్యంబు - నూహింపఁ బోక
మదిలోన నిన్నాళ్లు - మందెమేలంబు
వదలి సేవక వృత్తి - వర్తింపు మీవు
భానుతనూజుని - పగవారి నతని
కాని వారిని వారి - కడవారిఁ జేరి
మాటాడఁ బోకుము - మధ్యమరీతిఁ
బాటించి చొరవలఁ - బైకొనఁ బోక
కడలనుండక యొక్క - క్రమమునఁ గాచి
నడువుము నీవని" - నందను కేలు
తమ్ముని కరములోఁ - దానుంచి రాము
సమ్ముఖంబున ఘోర - శర మహావ్యథను

దయితలందఱు మూఁగి - తనమీఁద వ్రాల
నయశాలి వాలి ప్రా - ణంబులు విడిచె,

— వానరులు తారాసహితముగ వాలిమృతికై శోకించుట —

అపుడు వానరులు మ - హారోదనంబుఁ
గృపణభావమునఁ గి - ష్కింధ చలింపఁ
గావింప గిరివని - కందరావళుల
భావింప మున్నంటి - ప్రభ మాసియుండ
హితబాంధవులు చేరి - "యెవ్వఁడీ వనము
లతిశయంబగు నాజ్ఞ - నరయ శక్తుండు?
ఈవాలియేకాక - యిఁక నేఁటి బ్రదుకు?
పోవుదమెందైన - పుడమిపై వలస!
గోలభుఁడును యక్ష - కుంజరుతోడ
నాలంబుఁ బదియు నే - నబ్దముల్ చేసి
పదియునాఱవయేఁట - బట్టివధించె
నిదుర యాహారంబు - నిరసించి వాలి!
ఇంతటివాఁడింక - నెవ్వఁడు పాప
మెంత చేసితిమొ నేఁ - డితని బాసితిమి!"
అనిపల్కఁ దారాదు - లందఱు తమదు
పెనిమిటిపై వ్రాలి - బిట్టుశోకింప
ఒతలతోఁ గూడి మూ - లంబుతోఁ బెకలి
క్షితి వ్రాలి భూజంబు - చెలువున నున్న
వాలిమొగంబుపై - వ్రాలి యాతార
యాలింగనము చేసి - యడలుచుఁ బలికె,

"ఏను జెప్పిన బుద్ధు - లేఁటికి వినక
యీనేలఁ ? బ్రాణంబు - లీనేల కీవు
విషమభూమిని రాము - విషసాయకమ్ము
విషసర్పమునుఁ బోలి - వెదకి వధించె !
నాయన ! యీభూమి - నాకన్న నీకుఁ
ద్రోయరానిదియె హా - త్తుక కాఁగిలింప ?
తరణినందను పాల - ద్దైవంబు గలిగి
పరిణామమొందించెఁ - బగయణఁగించి
నమ్మిన ఋక్షవా - నర సమూహంబు
కమ్ముక వేళలు - గాచి కొల్వునకు
నిదె వచ్చియున్నవా - రీ యంగదుండు
పదముల చెంగటఁ - బడియున్నవాఁడు
వారికిఁ గొలువిచ్చి - వాని లాలించి
కూరిమి నెత్తి య - క్కునఁ జేర్చుకొమ్ము
అలిగియున్నావె ? మా - టాడవదేల ?
అలిగిన నీకు నిం - ద్రాదు లడ్డంబె ?
నీచేతఁ దెగినట్టి - నీచులు వశిన
యీచాయఁ బడియుందు - రే నీవునట్ల ?
జగడంబులన్న ని - చ్చలు నుబ్బునీవు
తగునె నన్నిటులనా - థను జేసి వదల
శూరులకును బడు - చుల నియ్యరామి
కారయ నేనేయు - దాహరణంబు
తన తల్లిదండ్రులు - దానును శోక
వనధిలోఁ బడితిమె - వ్వరుదిక్కు మాకు !

ఎందుకు చుట్టంబు? - లెందుకు తనయు?
లెందుకు సంపద? - లెందుకు దేహ?
మెందుకు ప్రాణంబు? - లెందుకు మాటు
చందమై పతిలేని - సతినిల్చ నేని?
నెత్తురు కండలు - నీకు కెంజాయ
మొత్తని పరుపులే? - మేదినిఁబడఁగ
జగతిపై ధూళి వా - సన గందవొడియె
నిగనిగమను మేను - నిండఁ దాల్చుటకు?
మొరపరానేలపై - మొగముఁ జేర్పంగఁ
బఱచిన పువ్వుల - పానుపే నీకు?
గిరిదూరి యిలదూరి - గెడపిసాలములు
మరలి తూణముఁ జేరు - మహిసుతాప్రియుని
శరము నీమేనిలో - సరికట్టెఁగాని
యురము భేదించివె - న్నుచ్చి పోదయ్యె!
వజ్రికుమార! ప - ర్వతమనరాదు
వజ్రహారంబు నీ - వరగాత్రయష్టి!
కాయమ్ముఁ జించి యీ - కడవీపు వెడలి
యాయమ్ము కనుపింప - దాయనుగాక!
ఆయమ్ము నాఁట ని - న్నాలింగనంబు
సేయనే యిటుల వం - చింతురే నన్ను?
గరుడుని రెక్కల - గరులపరంజి
మెఱుంగు పింజయు నీదు - మేనిపై నెంత
సింగారమయ్యె నీ - క్షించిన మాకు

—. వాలితేజము సూర్యమండలముం జొచ్చుట :—

నంగదునకు భయం - బైన నోఁగాక !"
అని యేడ్చునెడ నీలుఁ - డచటికి వచ్చి
కనకపుంఖంబు రా - ఘవసాయకంబు
గవిఁ జొరఁబారు నా - గకొమరుఁ దివియు
నవధానమునఁ గేల - నతిశక్తిఁ బట్టి
దిగదిగ వెలుఁగఁగఁ - దిగిచిన తొఁగల
పగరమయూఖంబు - పగిది వెలుంగ
వాలి గాయము వెంట - వడియు నెత్తురులు
జాలెత్తి జేగురుల్ - చరముక పాఱు
సెలయేరులన నుర - స్సీమ శైలంబు
పొలుపున మించున - ప్పుడు చూడనయ్యె !
అది గనుఁగొని తార - యంగదుఁ జీరి
"యదె కంటె ! మీతండ్రి - యంతిమావస్థ !
కనుఁగొంటివే వాలి - గాత్రంబు వెడలి
దినకర ప్రభ నొక్క - దివ్యతేజంబు
చనుచున్నది నమ - స్కారంబు సేయు"
మన విని యంగదుం - డటుల మ్రొక్కుటయు
తార యాప్రాణేశు - దరసి యోస్వామి !
"ఊరకయుందురే - యొల్లకమమ్ము ?
వీఁడె యంగదుఁడు దీ - వెనలిమ్ము కొడుకు
గాఁడె యిట్టేటికిఁ - గరుణింప విపుడు ?
సింగంబుచేతఁ జ - చ్చిన వృషభంబు
సంగిడి నావు వ - త్సంబుతోఁ గదియు
కైవడి నీచెంతఁ - గాచి కొల్చెదము

దేవ! యుపేక్షింపఁ - దీయునే నీకు ?
సమరయోగముచేసి - శరవారిధార
సమబుద్ధి నవభృత - స్నానంబు నీవు
నను వెలిగాఁ జేయు - నాయమే ? నీదు
తనువుపై కాంచన - దామమేమయ్యె ?
అమరసంగంబుపై - నాతపలక్ష్మి
యమరినరీతి నీ - యంగంబునందుఁ
దఱుగదు శోభావి - తానమిందఱినిఁ
జెఱపగాఁ దలఁచి యీ - చెడుబుద్ధిపుట్టి
నామాట గాదని - నాథ! యిల్వెడలి
సేమంబు రవిసూనుఁ - జేర్చి పోయితివి.''
అని విలపింపు చో - నర్కనందనుఁడు
కనుఁగొలుకుల నుబ్బి - కన్నీరు రాఁగ
దాలిమి చాలక - తనవారుఁ దాను
చాల శోకించి భూ - స్థలి మీఁదఁ బొరలు
తార నూరార్చి సీ - తాప్రాణవిభునిఁ
గ్రూరసాయక హేమ - కోదండధరుని
వీరరసావేశు - విమలప్రకాశు
శ్రీరామవిభుఁ జేరి - చేమోడ్చి పలికె.
"స్వామి! నాతో మీరు - శపథంబుఁ జేసి
యేమి వల్కితి రది - యీడేర్చినారు
ప్రతినఁ జెల్లించి నీ - పలికిన పలుకు
ప్రతిపాలనము జేసి - ప్రౌఢి మించితిరి

—: తనయన్నవాలి మృతికై సుగ్రీవుఁడు శోకించుచు, తనకు రాజ్య మక్కఱలేదని విరక్తుఁడగుట :—

ఇటమీఁద నేనొల్ల - నిలయుఁ బ్రాణములు
కటకట! యెంతటి - కష్టుండనైతి
నన్నరణంబులో - నటువడి యుండఁ
గన్నట్టి తనయుఁడం - గదుఁడు శోకింప
నతని కులాంగన - యైన యీతార
వెతనొంద నిందఱ - వీక్షించువాఁడ!
ఎందుకు రోయుదు - నిటమీఁద? నన్ను
నెందులోఁ జతచేసి - యెంతురందఱును
అవమానరోషదై - న్యాదులచేత
నవశమై నాచిత్త - మప్పుడట్లుండె
యిప్పుడిట్లున్నది - యింతటిపాటి
తప్పునకోర్చు పా - తకుఁడెందుఁ గలఁడు?
ఈకొండపై నొంటి - నే జరియించి
యాకుల నలముల - నాఁకలి దీర్చి
యుందు నింతియెకాని - యొల్ల నీధరణి
యందుపై స్వర్గంబు - నటమున్న యొల్ల
శ్రీరామ! యెట్లువ - చింపుదు నాదు
క్రూరబుద్ధికి వాలి - గుణగౌరవంబు!
ఎటులన్న! వినుపింతు - నేనునీతండు
పటుశక్తిఁ బోరాడ - బవరంబులోనఁ
గళవళింపుచుఁ బడి - కదలంగలేక
వెలవెలనైనఁ జే - వృక్షంబు వాలి
నామీఁద వ్రేసి ప్రా - ణములకుఁ దెగక

యీమేర చెయిగాచి - యర్కకుమార !
పొమ్ము మెల్లగ లెమ్ము - పోరికి రాకు
తమ్ముఁడవని నిన్నుఁ - దాళితి నిపుడు
నీమాట తారతో - నేనని వచ్చి
నీమీఁదఁ దెగనైతి - నిలువకు మిచట
పనిచెద చంప నీ - పగ ద్రెంపఁ బోల"
దనుమాట లాడియు - నాడక మున్న
పెనుగొండపై బెద్ద - పిడుగును బోలి
ఘనమైన నీసాయ - కము రొమ్ము నాఁటి
యీయనం బడనైచె - నతఁడట్టివాఁడు
నేయిట్టి వాఁడని - న్నన్ని మాటలకు
నతనితోఁ బోరాడి - యని సేయలేక
యతిలోక శౌర్యుని - న్నర్థించి తెచ్చి
చావ సేయించితిఁ - జాలవంచించి
దేవ ! నా కేదిబు - ద్ధి దురాత్మకునికి?
తలఁప చూడను గోరఁ - దగనట్టి ఘోర
కలుషంబుఁ జేసితి - గతియేది తనకు !
కోపించి త్వష్టనుఁ - గూర్చిన యింద్రు
శాపంబు తనకు సం - భావితమ్మయ్యె !
ఆతని బ్రహ్మహ - త్యాదోషమెల్ల
భూతలం బతివలు - భూజముల్ నీళ్లు
పంచుకపోయిరి - పాపంబు దాని
మించిన దగుటయే - మిటుఁ దీర్చుకొందు !
కులనాశనంబైన - క్రూరకర్మంబుఁ
దలఁచిన దనకు న - ధర్మ భోగంబు

నిలయును బ్రాణంబు - నీబహుమాన
ములునేల ? మిము నెట్లు - మోము జూచెదను ?
దేవ ! క్షుద్రుఁడ నింది - తుఁడ వంచకుండ
మావాఁడవని మీఱు - మాటాడఁ దగఁడు !
నీరు పల్లంబున - నిలిచినయట్లు
భూరిపాతకదుఃఖ - ములు తనుఁజేర !
అన్నఁ జంపించిన - యపకీర్తి తనువు
నన్ని యంగములు మ - హాపాతకములు
కానున్నయట్టి దు - ష్కర్మగజంబు
పోనీక తనుగఱిఁ - బోడిచిన యట్లు
హానిఁ బొందించుచు - న్నది పుటపక్వ
మైన హేమము గూడి - నట్టి లోహములు
తొలఁగినకైవడిఁ - దొలుత నాయందుఁ
గలుగు సద్గుణలేశ - గౌరవోన్నతులు
నీపాపమున నశి - యించె నంగదుఁడు
హాపోవ మాజాతి - వారికి నెల్ల
సగము ప్రాణములయ్యె - జానకీరమణ !
పొగులుచున్నట్టి యీ - పుత్రునిఁజూచి
తమ్ముని గన్న చం - దంబున నాదు
నెమ్మది కిప్పుడు - నెవరు సంధిల్లె
భువి నంగదునివంటి - పుత్రుఁ డెవ్వారికి
నవనిపై మఱిచూడ - మనిన నున్నాఁడె ?
కొడుకుమాత్రమె వీఁడు - కులము రక్షింపఁ
గడుఁ జాలుపడిన ము - త్తాఫలం బితఁడు
వాలినిఁ బాసి తా - ర్యాఁగ లేఁడు వీఁడు

చాలదు బ్రతుకఁ త - జ్జనని శోకమున
నంగదతారల - ప్రాణంబులొకటి
యంగభావములై వే - ఱైయుండు గాని
వీరలిద్దఱఁ జంపి - వీఱిఁడి ప్రాణ
మేరికిఁ బ్రీతిగా - నేఁదాల్చువాఁడ ?
అనలంబులోఁ జొచ్చి - యన్నను వాలి
తనయుని దారను - దాఁగూడువాఁడ !
నీమాట మదినమ్మి - నిన్నుఁ జేపట్టి
యేమినిమిత్తమై - యావాలిఁ జంపి
యింత చేసితినవి - యెంచితిరేని
యంత నేనెఱుఁగని - యల్పుఁడగాను
యేమి మీరానతి - యిచ్చిన నదియె
తామాచరించి సీ - తా నిమిత్తముగ
మేనులు దాఁపక - మీకార్య భరముఁ
బూని యీడేర్పనో - పుదురొక్కఁ డొకఁడె
యీనలుఁడీ నీలుఁ - డీ జాంబవంతుఁ
డానయనిధి యైన - యాంజనేయుండు
గలుగ నాపనియెంత ? - కాకుత్స్థవంశ
తిలక ! యిన్నియుఁ బల్కి - తిని గాకమీకు
నీపవనజుఁ డొక్కఁ - డే చాలునతని
ప్రాపు గల్గినఁ గల్గు - భద్రంబులెల్ల
పరమ పాతకుఁడనై - బ్రదుకంగఁ దగని
కొఱమాలినట్టి నా - కు ననుజ్ఞ యిందు
వాలిఁ జేరఁగ" నన్న - వచనముల్ చెవుల
నాలించి కన్నుల - నశ్రులు రాలఁ

గడుచింతతో రెండు - గడియలేమియును
నుడువక సీతావ - నోనాయకుండు
ప్రాణనాయకు మీఁదఁ - బడి యేడ్చుచున్న
యేణాంకముఖి తార - నీక్షించుటయును

## — వానరులు తారను రామునియొద్దకు తీసికొనివచ్చుట :—

నాసన్న యెఱిఁగి మ - హాకపుల్ బలిమి
చేసి యీడ్చినరాక - చిత్తంబు గలఁగ
వాలిఁగాఁగిటఁ జేర్చి - వదలకయున్న
"ఏలమ్మ! రఘువీరుఁ - డేమి వల్కెడునొ!
విని నీదుహృదయంబు - వినిపించియతని
యనుమతి నేమైన - నగుట యుత్తమము"
అని రాఘవుఁడు బిల్చె - ననుమాట యెపుడు
వినియె నప్పుడు లేచి - వేనలిఁ దురిమి
పయ్యెద సవరించి - పట్టఁ జేపట్టి
యొయ్యారమున నిలు - చున్నట్టి వాని
శరచాప హస్తుని - శతపత్రనయను
హరిమధ్యు నతిలోకు - నాజానుబాహు
లక్ష్మణాగ్రజు రాజ - లక్షణపూర్ణ
లక్ష్ముని రవిమండ - లవిభాసమాను
రాముని గరుణాభి - రాముని సుగుణ
ధాముని ధీరుఁ బ్ర - భాసపూరుషుని
యెన్నఁడు మును జూచి - యెఱుఁగనివాని
యన్నులంతుక యంగ - దాలాపసరణి

సొలఁగి వేగము చేర - నేతెంచి హృదయ
మొలఁగింపఁ దెగువతో - నిట్లనిపలికె

—: తార రామునితో సంభాషించుట-తనభర్తతోఁ
గూడ తన్నుఁజంపుమని యాతని ప్రార్థించుట :—

"అప్రమేయుఁడవు ద - యావారినిధివి
యప్రతీపప్రతా - పాభిరాముఁడవు
ధృతిమంతుఁడవు యశో - ధికుఁడవు సత్య
రతుఁడ వింద్రియజయ - ప్రౌఢభావుఁడవు
అవనిపై వెలసిన - యమరేంద్రుమూడ్కి
నవతారమందుమ - హానుభావుఁడవు
దేవ! నామనవి చిం - తించి కాదనక
కావింపుడిది యవు - గాదనవలదు 2410
ఏయమ్ముచేఁ వాలి - నేసితిరిప్పు
డాయమ్ము చేఁదన - యాయమ్ము నాఁట
నేసినవాలితో - నెడవాసియున్న
గాసి యంతయుఁ దీఱ - కాంతు సద్గతిని!
ననుఁబాసి వాలియుం - డఁగ లేఁడు క్షణము
కవనొల్లఁడమరలో - క సరోజ ముఖుల
మీఱు జానకితోని - మేమంబుఁ బాయ
నేరనిగతి నర్థ - నిమిష మాత్రంబు
ననుఁ బాయ లేఁడు వా - నరవజ్రపాణి
యనువుము కూర్చి పు - ణ్యము నీకుఁ గలదు' 2420
స్త్రీవధ దోషంబు - చేకూడు ననుచు
దేవ! నీయాత్మఁ జిం - తించెదవేని

యేనాఁటు దానఁగా - నీమేను వాలి,
లో నర్ధభాగ మా - లోకింప వీవు!
వాలిఁ జంపెదనని - వరమిచ్చి ప్రతిన
చాల చేసితిగా భా - స్కర పుత్రుతోడ
నట్టి ప్రతిజ్ఞకు - హానిరాకుండ
గట్టిగా నేయు మీ - కడమసగంబు
వాలిఁ జంపినకీర్తి - వన్నెకు నెక్క
నీలోన తనుఁబడ - నేసితివేని
జలజాక్ష! యిదివేళ - శాస్త్రసమ్మతము
వాలినేసిన యట్టి - వాఁడవే తారఁ
గూల నేసినఁబతిఁ - గూర్చితివేని
నీకుఁ గన్యాదాన - నియతఫలంబు
చేకూడదు నాఁటికిఁ - జేసిన పెండ్లి
కల్ల నీవిప్పుడు - గట్టింపు వాలి
పల్లవారుణ పాణి - పద్మంబు చేత!
నాకంధరను దాలి - నాదు దీవెనను
జేకొందు వటులైన - సీత నీప్రొద్దు
మత్తేభనిభ హేమ - మాలిని వాలి
హత్తించి తనుఁ ద్రుంచు - నదియెధర్మంబు
కాదన్న దనపాప - కంబులోఁజొరఁగ
నో దేవ! యనుమరి - యొసఁగుఁడు మీఱు."
అన నూరడించి హి - తానులాపముల
వనితామణికి రఘు - వర్యుఁడిట్లనియె.

— శ్రీరాముఁడు ప్రత్యుత్తరమిచ్చి తారయొక్క
కర్తవ్యముఁ దెలుపుట :—

" వీరభార్యవు నీవు - వీఱిఁడి దాని
మేర నీక్రియఁబల్క - మేరయే నీకు ?
ఎవ్వని తలయందు - నేరీతి వ్రాసె
నవ్వనజాసనుఁ - డదిగాకపోదు 2450
దైవయత్నమునకు - తను దూరనేల ?
నేవాలి కహితుఁడ - నే పడనేయ ?
నను నన్ననేల ? యీ - నలువకట్టడకు
తనశక్తి నెవ్వఁడు - తలఁగిపోనోపు ?
చింతయేమిటికి ! నేఁ - జేయుదు నీకు
నింతి యింతటికన్న - హెచ్చయిన హితము
అంగదు యౌవరా - జ్యంబున నునిచి
యంగదలేని సౌ - ఖ్యమునొందు మీవు
కొడుకులు లేనట్టి - కొమ్మలు దలఁచు
కడమాటలేల ? భా - గ్యము చేసినావు 2460
పతిలేక యుండి శో - భనవతు లెందు
సుతులను గనినమం - జుల వాణులెల్ల
సుతుఁడన్న మాత్రమె - శూరత వాలి
కత మఱపించు నం - గద కుమారకుఁడు !
వలవదీబుద్ధి నా - వచనంబుఁ జేసి
యలివేణి ! తగినకా - ర్యము చూడు మిపుడు "
అనిన నేడుపుమాని - యశ్రులు దుడిచి
మనసు కొండలపాటు - మట్టుకుఁ దెచ్చి

పదరి కానిమ్మని - పలుకక గుట్టుఁ
బెదరక తలవాంచి - శ్రీరాముఁజూచి
వినయంబు భయము ని - వేశంబు ప్రియముఁ
దనర నూరకయున్న - తారను జూచి
సాత్త్వికజ్ఞానవి - శారదుండగుట
తత్త్వబోధముగ సీ - తాకాంతుఁ డనియె

—. శ్రీరాముఁడు తారకుఁ దత్త్వబోధఁ గావించి వాలి యగ్నిసంస్కారమునకుఁ బ్రోత్సహించుట :—

"కామిని! ధర్మార్థ - కామమోక్షములు
నేమించి పొందుట - నియతిచేఁ జుమ్మీ!
నియతి కానాధీన - నియమంబుగాన!
నియమింపఁదగు నొక్క - నికి విభుత్వంబు
ఉర్వికి దొరలేక - యున్న నేపనులు
నిర్వాహకములు గా - నేరవు గాన
జలజాక్షి! చింతించు - సమయంబుఁగాదు
తలఁపుమీ వేళ మీఁ - దటి కార్యచింత
కాలమందఱికిని - గర్తయౌగాని
కాలమునకు నొరుల్ - కర్తలుగారు
పగలును రాత్రులై - పరఁగుడు నదియె
మగువ! కాలము ; కాల - మయుఁ డీశ్వరుండు
జగతి మిత్రజ్ఞాతి - సంబంధమెల్ల
విగణింపఁ గాలప్ర - వృత్తమైయుండు
కాలధర్మంబునఁ - గడచన్న యట్టి
వాలికి నెందాక - వగలఁ బొందెదరు!

అతఁడు వీరస్వర్గ - మందినవాఁడు
కృతకృత్యుఁడ వాలి - కినిఁ దగినట్టి
భావికార్యముఁ దీర్పఁ - బరగు మీకనిన"
నావేళ రాముని - యనుమతి వలన
సౌమిత్రి తారను - సమ్మతపఱచి
తామరిసాప్తనం - దనున కిట్లనియె
"కావింపు ముత్తర - కర్మముల్ వాలి
కావలఁ బెక్కుకా - ర్యంబులు గలవు
తడవు సేయఁగరాదు - ధార్మికుండతఁడు
పడియున్నవాఁడుర్వి - పై మృతినొంది
యీ తార నంగదు - నీవు లాలించి
యాతని కొనరింపు - మగ్నికృత్యంబు

—·వాలికి నగ్ని సంస్కారము చేయుట·—

అర్కనందన! రాజ - వవనికి నీవు
మర్కటేంద్రుల నంపి - మఱికాష్ఠములను
గంధపుచెక్కలుఁ - గదళికాండములు
గంధపొడియు నూత్న - కనకాంబరంబుఁ
దెప్పింపు మంగదుఁ - దెమ్మని పసుపు
మిప్పుడు, లాజలు - నెఱ్ఱి పువ్వులును
పరిమళప్రసవధూ - పము లక్షతములు
పెరుగు పాలును నెయ్యి - బెల్లంబు తేన
తామసింపకు" మని - తారునిఁ బలిచి
" యీ మఘవతనూజు - నింటిలోనున్న
కనకవల్లికి నీవు - గ్రక్కునఁ దెమ్ము

చనుము కిష్కింధకు - జతఁగూడియున్న
కోయీలఁ బిలిపింపు - పురముఁగై సేయఁ
జేయుము తగువారి - చేత శీఘ్రమున."
అనిపల్క విని తారుఁ - డప్పుడేపోయి
యనుపమంబగు చతు - రంతయానంబు
తన పార్శ్వమైన బె - త్తలుఁ దాను దెచ్చి
యనుప రాముఁడు చూచి - యుల్లాసమొంది
"పోయి లక్ష్మణ! కపి - వ్యూహంబుచేత
నీయందలంబులో - నెత్తించి వాలి
నంగదతారార్క - జాదులచేత
సంగతి నగ్నిసం - స్కార మీడేర్చి
రమ్మన్న నట్లనే - రామాజ్ఞ వాలి
తమ్ముఁడా యన్ననం - దలములో నునిచి
సాగింప రత్నభూ - షణ కాంచనములు
నాగవల్లీదళాం - తరముల నునిచి
ముందఱను వసంత - ములుగాఁగ జల్లి
సందడిగా బంధు - జాలంబు గొలువ
తారాది రమణులు - తనయుఁడుఁ దాను
చేరిక నిరుఁగడ - జేరి శోకమునఁ
జితి సమీపమునకుఁ - జేరి యచ్చోట
శతమఘతనయు భూ - స్థలిని డించుటయుఁ
నన తొడపై వాలి - తలయుంచి తార
కనుఁగొలుకుల నుబ్బ - కన్నీరురాల
శోకింపఁ జెంతల - సుదతులూరార్చ
యాకలభాషిణి - ననలకుఁ దివియఁ

నంగద సుగ్రీవు - లావాలిఁ గాఢ
సంగతుఁ జేసి సం - స్కారంబుఁ జేసి
తిల తర్పణములిచ్చి - తీర్చి కర్మములు
జలములఁ గ్రుంకి ల - క్ష్మణసహితముగ
శ్రీరాము చెంతకుఁ - జేరిన వారి
నారాఘవుఁడు చూచి - యాత్మలోఁ గలఁగి
కరుణారసంబుతోఁ - గన్నీరు నించి
తిరణిజముఖుల నం - దఱి నాదరించి
యుపలాప మొనర్చు - చున్న నచ్చటికిఁ
గపివీరులెల్ల మూఁ - కలు గూడి వచ్చి
యినకుమారునిఁ జేర - నెల్ల దేవతలు
వనజసంభవుచుట్టు - వసియించున ట్టు
లందఱు రామున - కంజలిఁ జేసి
నందిత భక్తితోఁ - నలువంకఁ గొలువ
నాసమయంబున - ననిమేషశైల
భాసురగాత్రంబు - భానుసంకాశ
వదనంబు నుత్తాల - వాలంబుఁ గలుగు
సదయాత్ముఁడైన యం - జనకుమారకుఁడు
కరములు మొగిచి రా - ఘవకులోత్తముని
చరణపద్మములకు - సంప్రీతిఁ బలికె.

### —: ఆంజనేయుఁడు శ్రీరామునిఁ గిష్కింధకురమ్మని ప్రార్థించుట :—

" ఈసూర్యసుతుఁడు లో - కేశ్వర ! మీకు
దాసుఁడై తండ్రి తా - తల తరంబునకుఁ

గలిగిన కిష్కింధఁ – గ్రమ్మర నేలి
చెలులఁ జుట్టముల ర – క్షింపఁ బాల్పడియె
వేడుక మీరలు – విచ్చేసి పురముఁ
జూడఁగావలయును – సుగ్రీవుఁ బట్టి
పట్టంబు గట్టి చే – పట్టి మీరనుచు
చెట్టుగా నతనిఁ జూ – చిన వారికెల్ల
సంతోషముగ మాకుఁ – జాలగౌరవము
సంతరించిన పూన్కి – సఫలంబు మీకు
నాకుఁ దోఁచినది వి – న్నపము చేసితిని
మీకెట్లు సరిపోయె – మీరది చేసి
రక్షింపుఁడన నకా – రణ దీనలోక
రక్షకుండగు రఘు – రాముఁ డిట్లనియె.
"వాయుతనూజ! నీ – వచనముల్ మాకుఁ
జేయుట మిగుల వి – శేషమౌ నైనఁ
దప్పనేరము మేము – తండ్రికట్టడగు
నెప్పుడు పదునాలు – గేండ్లు కానలనుఁ
జరియించువార మై – శపథంబు చేసి
పురములకెట్లు రాఁ – బోలు? నట్లగుట
మాకు రారాదు మా – మారుగా నీవు
చేకొని రాజ్యాభి – షిక్తునిఁ జేసి
భానుజుఁ గట్టుము – పట్టంబు నాదు
పూనిక చెల్లింపు – బొమ్మని" పలికి
శ్రీరామవిభుఁడు సు – గ్రీవునిఁ జూచి
కారుణ్య మిగురొత్త – గా నిట్టులనియె.

—— శ్రీరాముఁడందుల కిష్కింధకొనకుండుట - సుగ్రీవ
పట్టాభిషేకమున కనుజ్ఞయిచ్చుట :—

“ ఈ యంగదుఁడు చాల - హితుఁడైనవాఁడు
మీయన్నకొడుకు న - మ్మినవాఁడు నిన్ను
పాలించి యువరాజ - పట్టంబు గట్టి
యేలింపు మతనిచే - నెల్లరాజ్యంబు
శ్రావణప్రథమవా - సర మిది గాన
రావణు మీఁది కా - ర్యము సేయరాదు
కలఁగక యీవాన - కాలంబు నాల్గు
నెలలు నీపురములో - నిశ్చింతముగను
నూరక సుఖమున - నుండుము నీవు
మారాడ వలదది - మాల్యవంతమున
నీలక్ష్మణుఁడు నేను - నీ బిలాంతమున
కాలూఁది దినములు - గడపుచుండెదము
కడివోని వికసిత - కమలముల్ గలుగు
కడపటి నెలఁ గార్తి - కమునందు నీవు
వెదకింపు వానర - వీరులచేత
వదలక మన సీత - వసియించు చోటు
పొమ్మని పలుకిన - ప్పుడు పైఁడికట్ల
కొమ్మునుఁ బవడపు - గోళ్లుదంతములు
పలకతాపనలచేఁ - బసిఁడి మెఱుంగు
ములుకుల బలుచీర్ణ - ముల హారువైన
రథగజసుభట తు - రంగ మావళులు
పృథుతరలతికలు - బిసరుహాంబులును
మదవతీకాముక - మహనీయమదన

కదనసానావిధ - కరణవైఖరులు
ముత్తేల కుచ్చును - ముదురబల్కాపు
కత్తెరలును బూర్త - కాళి మెత్తలును
బురుసామెఱుఁగు పికిల్ - పూవు దస్తులును
పరపైన కుంకుమ - పరవు కురంగి
బటువులు తాపితాఁ - బన్నాగమెచ్చు
దిటమైన యపరంజి - దిండునుకెంపు
బోడిగ కోఁలు - పుత్తడి యునుసు
జోడును గలిగి రా - జులకెందులేని
పల్లకిఁ గడు జోక - పఱచి తారుండు
బొల్లు మోములు గల్గు - బోయీలతోడ
తెచ్చిన రాముని - డెసఁ జూడనతఁడు
నిచ్చె ననుజ్ఞ యంఁ - డెక్కి పొమ్మనుచు.
ఆపల్లకీ మీఁద - నర్కనందనుఁడు
చూపట్టెఁ దపన తే - జోరాశి యగుచు
భేరీమృదంగాది - బిరుదవాద్యములు
భోరుకలంగ నా - ప్తులు చేరి కొలువ
నావెన్క నంగదుఁ - డందలంబెక్కి
తావాలిహితులు చెం - తలఁ గొల్చి రాఁగ
చెంగట దిడ్డు వై - చిన పల్లకీల
సంగడిఁ దారాది - సతులఁ దోకొనుచు
వానరసైన్య రా - వము నింగి ముట్టఁ

—. సుగ్రీవుని పట్టాభిషేక మహోత్సవము :—

దానొక్క శుభముహూ - ర్తమునఁ గిష్కింధఁ

జేరి వేడుకఁ బ్రవే - శించె, నారతులు
నారు లెత్తఁగ వాలి - నగరిలోపలికి
నటులఁ బ్రవేశించి - యలివేణి రుమను
గుటిలకుంతలఁ జూచి - గూర్మినటింప
నాసతి వచ్చి గా - ఢాలింగనంబుఁ
జేసి కన్నీటితోఁ - జింతిల్లుచుండ
నూరార్చి వెలువడి - హుజూరుసావిడికిఁ
జేరిన బాంధవ - శ్రేణి మంత్రులను
నవరత్నసింహాస - నంబున నుంచి
గవరనకాంచన - కలశకోటులను
ద్రిభువనాఖిలనదీ - తీర్థముల్ దెచ్చి
నభిషేక మొనరించి - యంబుజాతములు
హేమాక్షతంబులు - నేకాతపత్ర
చామరయుగళముల్ - శాతఖడ్గంబు
పచ్చిబెబ్బులితోలు - పడుచుల జంట
దచ్చియు నిలువుట - ద్దమ్ములు పంది
వాఱు లుద్దములు న - వ్యప్రసూనములు
గౌరవస్త్రంబులు - గంధాక్షతములు
పాలు తేనియ నేయి - ఫలవివేషములు
పాలు గల్గిన చెట్ల - పల్లవంబులును
గోవజవ్వాది కుం - కుమము కస్తూరి
కావలసిన రత్న - కనకాంబరములు
సకలౌషధులును లా - జలు దెచ్చియిచ్చి
యకలంక హోమశాం - త్యాదులుఁ జేసి
ధారుణీసురలెల్లఁ - దనియ వారలకు

భూరిపదార్థముల్ - భూరిగానొసంగి
బలియులు జాంబవ - త్పవనజ కుముద
నలనీల శరభమైం - దద్వివిదాది
వానరోత్తము లష్ట - వసువులు మఘవుఁ
బూని స్వర్గమునని - ల్పు విధంబుఁ దోఁప
రాజుగా వానర - రాజధానికిని
రాజీవహిత కుమా - రకుఁ గర్తఁజేసి
యానందముల నొందు - నప్పుడుప్పొంగి
భానుసూనుఁడు - వాలిపట్టిఁ జేపట్టి
పట్టాభిషేక మై - భవమాచరించి
పట్టైన యువరాజ - పట్టంబుఁగట్టి
యా మహోత్సవము స - మస్తలోకులకు
నామోదకరమైన - యప్పుడావార్త
పవమానతనయునిఁ - బనుప రామునకు
నవిరళప్రీతిగా - నటువిన్నవించి
నుతశౌర్యులగు ప్రధా - నులు నీతి చేత
క్షితి యెల్ల బాలింపఁ - గిష్కింధలోనఁ
దాను రుమాసహి - తముగ సుగ్రీవుఁ
డానందకలితాంత - రంగుఁడై యుండె.

### —: రామలక్ష్మణులు గుహాయందు నివాసము చేయుట :—

ఆవేళ రఘువీరుఁ - డనుజుఁడు దాను
నావర్షఋతుస - మాగంబునను
వివిధమృగంబుల - వింతపక్షులను
నవనిజముల నంద - మైన ప్రస్రవణ

శైలబిలంబు ల - క్ష్మణునకుఁ జూపి
వాలివిరోధిభా - వమెలర్పఁ బలికె.

—: గుహావర్ణనము - రాముఁడు సీతకై విరహమునొందుట :—

"లక్ష్మణ! వానకా - లమునకు నెంత
లక్ష్మీకరంబీ బి - లంబుఁ జూచితివె?
వలసిన మాత్రంబె - వాయువు లిచటఁ
బొలయు చున్నవి చలి - పుట్టదిచ్చోట
ఈకొండ తెల్లనై - యెఱ్ఱనై నల్ల
నై కనుపట్టె మ - హా శిఖరములు
మూఁడు మూర్తులకును - మొదలింటి మూర్తి
జాడగా నున్నదీ - శైలరాజంబు!
ఇందులోఁ గల తోఁపు - లీసరోవరము
లెందు జూచినవి గా - వీ వసుంధరను.
ఈపడమటఁ జూడు - మిదియొక్క బిలము
చూపట్టె పడమటి - చోటున్నతముగ
నీయుత్తరపు దిశ - నీశాన్యమైన
చాయ పల్లమున వి - శాలమై నీల
నీలమై మణిదీప - నిచయమై నిబిడ
సాలమై మించె న - చ్చటి కందరంబు
అల్లదె నైఋతి - యగు దిక్కునందు
తెల్లని మగఱాల - దిగదిగ వెలుఁగు
గనుల చెంగట నొక్క - కందరాంతరము
కనకమయం బౌచు - కనుపట్టె గనుము

తెలుపును నలుపునై - తిన్నగాఁ బెరిగి
కలసిన రెండు శృం - ముఁగలొప్పుఁ జూడు
హరిహరమూర్తియో - యన నెల్లవారి
వెఱఁగించు నర్ధనా - రీశ్వరుఁడనఁగ
నలత్రికూటంబుపై - నమరుజాహ్నవినిఁ
దలపించు నీకొండ - దక్షిణ దిశను
ఉల్లోల జలశీక - రోర్ములఁబొలుచు
తెల్లని యీయేరు - తేరికఁ గనుము
అయ్యేరు వికచప - ద్మాళిఁ గైసేయు
తొయ్యాలిగతి నింపుఁ -దులకించ నెదుర
దవ్వుల మృదుసైక - తముల నీయేరు
నవ్విన రీతిను - న్నవి యంచలిచట
ఇచ్చట మనమున్న - నెప్పుడు వినఁగ
వచ్చుఁ గిష్కింధలో - వాద్యఘోషములు
చెవిసోఁకె వినవన్న ! - సింహనాదములు
రవళి వానరులచే - రవిజు మేలునకు
నెంత వేడుకనుండు - నిపుడు సుగ్రీవుఁ
డంతిపురంబులో - నతివలఁ గూడి !
అతనికి నాకును - నన్యోన్య మతుల
వెతలొక్క చందమై - వేగుచుండంగ
నందులో నొకరికి - నైన దైవంబు
సంధిచ్చె దరిఁజేర్చి - సతితోడఁగూర్చి ! ”
అనుచు లక్ష్మణుఁ గూడి - యాశైల నికట
వనభూములను రఘు - వరుఁడు గ్రుమ్మఱుచు
పాదపుగుబ్బలి మీఁదఁ - బొడము చందురుని

పొడవుఁగన్గొని "విరిఁ - బోడి మాసీత
కుంకుమ నలుగిడు - కొనువేళ మిగుల
పొంకమా నగుమొగం - బును బోలె" ననుచుఁ
దలఁచి యంతన పరి - తాపంబు నొంది
కలఁగుచు భ్రమసి - కాఁ - క వహించి మిగుల
పండువెన్నెలఁ జిక్కి - "బలువిడిఁ గాదె
నెండలు సౌమిత్రి! - యెటకుఁ బోవుదము?
తపియింపఁ జేసి మా - ర్తాండ మండలము
చపలాక్షి యెటువోను - జానకి యిపుడు"
అనుచు గూర్చుండి - యాయనుజు నూరువులఁ
దనమేను జేర్చి "సీ - తా!" యంచుఁబలికె
కన్నులు మొగిచినఁ - గాంచి సౌమిత్రి
యన్నతో భయవిన - యముల నిట్లనియె

—. లక్ష్మణుఁడు శ్రీరామునికిఁ గర్తవ్యముఁ దెలుపుట.—

"దేవ! ధార్మికుఁడ వా - స్తికుఁడవు ధైర్య
భావనుఁడవు కార్య - పరుఁడవా మీఁద
నీమేరఁ జింతింతు - రే? దీనులైన
పామరులకు జయ - ప్రతిభలు గలవె!
మానసోత్సాహంబు - మానక వైరి
దానవహరణ య - త్నము సేయు మీవు
నీవు గావలె నన్న - నిమిషమాత్రమున
నీవసుమతితోడ - నెల్ల లోకములు
శరము సంధించి భ - స్మము సేయఁ గలవు!
పరశౌర్యకేళి రా - వణుఁ ద్రుంచు టెంత!

ఎపుడు శరత్కాల - మేతెంచె నపుడె
నిపుణత బూది నిం - డిన ధనంజయుని
యాజికవర్యుఁడా - జ్యాహుతిచేతఁ
దేజంబు నొందించు - తెఱఁగుగా నిన్ను
నెచ్చరించెద నేల - యాలోన కలఁగి
యిచ్చలోఁ దాల్మివ - హింప వేరయన
నామాట విని సుమి - త్రాత్మజుఁ జూచి
రాముఁడు సుగుణాభి - రాముఁడిట్లనియె
"హితము పల్కితివి మే - లీవానకాల
మతికరించి శరత్స - మారంభమైన
యప్పుడె తగినట్టి - యత్నంబుఁ జేసి
చొప్పరులగు కపి - శూరులచేత
జానకియున్నట్టి - చందంబుఁ దెలిసి
దానవాన్వయమెల్లఁ - దరిగి వేయుదము
మనకార్యభారంబు - మఱివక పూని
తనకార్యముగ నెంచుఁ - దపనందనుఁడు
భక్తితో నొక రును - పఁగ మనువాఁడు
శక్తికొద్దిని సహా - చరుఁడవుఁ గాక
యేల కృతఘ్నుఁడౌ - నింగితజ్ఞుండు?
మేలెఱింగినవాఁడు - మిహిరాత్మజుండు
అతఁడుండ మనకసా - ధ్యము లేల కలుగు
హితము జేసినవారి - నెఱుఁగఁడేవాఁడు?
గడుపుద మీవాన - కాలంబుఁ గలఁక
లుడివోయి సుగ్రీవు - నుల్లంబురీతి
నదులన్నియును బ్రస - న్నతిలొందు నొక్కొ!

కదియునో కో శర - త్కాల వాసరము ?
అనవిని సౌమిత్రి - యంజలిఁ జేసి
యనఘాత్మ ! సుగ్రీవుఁ - డటువంటివాఁడు
చాల కృతజ్ఞుఁడు - జానకి వెదకఁ
జాలు నీకార్యంబు - సమకూర్ప నేర్చు
మనము చెప్పినయట్టి - మాటలో నడచి
మననేర్చు కడుబుద్ధి - మంతుఁ డుత్తముఁడు
ఈ మాల్యవద్గిరి - నీ మూఁడు నెలలు
రామ ! సోఁకోర్చి యా - రట నొందు " మనిన
తమ్ముని మాట హి - తమ్ముగా నెంచి
సమ్మతిననియెఁ గా - సల్యాసుతుండు

## — వర్షఋతు వర్ణనము —

" సౌమిత్రి ! యిపుడు వ - ర్షాకాలమగుట
నీమేర మిన్నెల్ల - నెడమీఁక నిండి
భానుని కిరణముల్ - బలసి వారాసి
నీనవమాసంబు - లేఁకట దీఱ
జలదంబులై వ్రద్ర - సములకు తామె
నెలవైన యుదకముల్ - నిండారఁగ్రోలి
ధారుణిపై వర్ష - ధార లేమేర
ఘోరునఁ గురియు న - ద్భుత కరంబులుగ
మేఘ మాలికలను - మెట్లుల వెంట
నాఘుర్మకరుఁడు దా - నాకాశమంది
యర్జున కుటజ ల - తాంతముల్ చూపి
నిర్జించె నాచిత్త - నీరజమిపుడు

పొలయు నూర్పులుగ న - భోమారుతములు
మలయ సంధ్యామేఘ - మాలికారక్త
వసనుఁడౌ విటునికై - వడి నాకసంబు
లసమానగతి నొప్పె - లక్ష్మణ ! కనుము.
గ్రీష్మాతపములఁ గ్రాఁ - గినయట్టి వసుధ
యూష్మంబె గావిరు - లుప్పతిల్లంగ
ననుభాసియున్న జా - నకిఁ బోలి తాప
మున నున్న చంద మి - ప్పుడు విలోకింపు
కేతకీ కైరవ - క్రీడాసమీర
పోతముల్ సీతమై - పొలపంబుఁ దెలిపె
ఈయేరుమద్ది కం - టిగిరి మీఁదఁ
ఛాయక నవసుమ - ప్రచుర సంపదలు
యేవిచారము లేసి - యీరవిసుతుని
కైవడి దృష్టి మం - గళకరంబయ్యె
ఆలఘు మేఘములు కృ - ష్ణాజినంబులుగ
జలధార లురముల - జన్నిదంబులుగ
యీనగంబులు చూచి - తే తమ మీఁది
మానులు వేషముల్ - మార్పుడఁ దాల్చె
మెఱుపు గుంపుల చిరి - మిణి తరుటులను
హరిహయుఁడను సాది - యదలించివేయ
సకిలించు నుత్తమా - శ్వముఁరీతి జలద
మకలంక గర్జల - వదె వచ్చెఁ గనుము
నీలమేఘంబులో - నెఱిమించునట్టి
వాలిక మెఱపు రా - వణుని యూరువుల

వసియించు మనసీత - వలె వడంకుచును
దెసలకు వన్నియఁ - దెచ్చెఁ జూచితివె!
పర్జన్యుఁడను నొగ - పరి మావటీఁడు
గర్జితంబనెడి ఘీం - కరణంబు సలుప
మెఱుపు టంకుశముచే - మీఁటి కాల్మెటి
పఱువసీక యడంచి - పట్టిన నిలచు
మదసింధురరీతి - మబ్బుసంజోకఁ
జదలు గన్పట్టె ల - క్ష్మణ! విలోకింపు
మేదిక్కు చూచిన - నిలయెల్ల నిండి
యీదిక్కనెడిమాట - యేర్పడనీక
యిరులు కొల్పుచునున్న - యీప్రావృషేణ్య
శరదంబు లింతుల - సందిళ్లలోన
పొదువుక సుఖయించు - పుణ్యులకెల్ల
మదికి నానంద మి - న్మడి సేయకున్నె,
ననువంటి పాపాత్ము - నకు దుర్దినంబు
లనిపించు యహితంబు - లైన నొఁగాక
ఈకొండ మల్లియ - లెల్లెడఁ బూచి
నాకు వేదన నెమ్మ - నంబులోఁ జేసె
విడవని వేసవి - వేఁడిమితోడ
నడఁగె మహీరజం - బవని నంతటను
రాజులు దండయా - త్రలు మానిరిపుడు
భూజనుల్ నిజపురం - బులకు నేఁగుదురు
నానానదముల నుం - డక మరాళములు
మానససరము దీ - మముగానఁ జేరె
చక్రవాకద్వంద్వ - సమితిఝరాంబు

వక్రత లెంచక - వసియించెఁ గనుము
అడుసు ద్రోవలుఁగాన - నవనిపైఁగానఁ
బడ దెందుఁ జతురంగ - బలసమూహంబు
కరుడులు లేనట్టి - కడలియుఁ బోలి
శరదముల్ గప్పిన - చదలు చూచితివె!

ఒకచాయఁ దోఁచక - యొకచాయఁదోఁచి
ప్రకటిత లీల నం - బరభాగ మిపుడు
నమరె వాణియుఁ బోలి - యవనికలోన
నమరు, పాత్రము బోల్ప - నలఘుపాత్రముగ
కడిమి పువ్వులతావిఁ - గమిచి తేగురులు
గడుగుచుఁ బఱచె నే - కడ నిర్ఘరములు
కేళీనటత్కేకి - కేకారవంబు
లాలింపు లక్ష్మణ!! - యా కోనలోన!
గండు తుమ్మెదల పొం - కమున నేరేడు
పండులు చూడు మ - పార మీవేళ.

ఈరసాల ఫలంబు - లిల మోవనీక
ధారగా మధురస - ధారలు చిలుక
ముక్కుగంటులను గ్ర - మ్మకవచ్చు తరుల
పెక్కువ యెంత యొ - ప్పిదమయ్యె నిచట!
మెఱుపు దంతములతో - మెఱయు నీమొగులు
తెర లేనుఁగల బారు - తీరున మించె!
పచ్చని పచ్చిక - పట్టుల లేళ్ళ
రచ్చలై వర్షధా - రలు మీఁదఁ గురియ
నిట్టి సంధ్యావేళ - నీక్షించు పాంథు
లెట్టుగా వేగింతు - రెటుదెల్లవాఱు!

ఓయి సౌమిత్రి! మే - ఘోదయ వేళ
నేయెడ జూచిన - నీనభోవీథిఁ
గదలెడు పుండరీ - క సరంబుఁబోలి
కదలిపోవు బలాకి - కాశ్రేణిఁ గనుము.
ఈనేలఁ బచ్చిక - నెనసి మహీజ
సూనముల్ రాలియె - చ్చో నింద్రగోప
భాసురంబయి పట్టు - పైని పుష్పాళ్లు
రాసిగా రాలిన - రత్నకంబళ్లు
పఱచినగతి చిత్ర - పట్టాంబరములు
నెఱపినకైవడి - నెయ్యంబు వెనిచె!
నిదురింప తరియయ్యె - నీరజాక్షునకు
నదులకుఁ జెయిచాఁచి - నచ్చి వారాసి
సతులు మానధనంబు - సడలించి తారె
పతులఁ బైకొనునట్టి - పాళంబువచ్చె
నావులఁ గదిసె మ - హావృషభములు,
కావరించెను గీట - కాసరశ్రేణిఁ
బొలిమేర వనగజం - బులు చెలరేఁగె,
కోలగట్టుకొనె విహా - గులనేఁచి మరుఁడు
వానరభల్లుకా - వళి చెలరేఁగె,
నేనుఁగులు నెమల్లు - నెసకంబు లెనఁగె,
కైతక గంధమా - ఘ్రాణముల్ చేసి
గీతముల్ బాడె భృం - గీనిచయంబు
వానచేఁ బ్రాణంబు - వచ్చిన బొగ్గు
లానుక యున్నవో - యలరు దావులకు,
బ్రాలిన తేఁటులో - వాటియగ్రముల

వ్రేలు బండ్లోయన - వెలసె జంబువులు
వనభూము లవికల - స్వన ఖగవ్రాత
మునకెల్ల పానభూ - ములరీతిఁ దోఁచె,
పులుగులు తరుపర్ణ - పుటములయందుఁ
దొలఁకని వారి బిం - దువులు గ్రోలెడును
తేఁటుల మ్రోఁత తం - త్రీస్వనంబులుగ
పాటలు కోకిలా - పారనాదముగ
దారుణ గర్జ మ - ర్దళనినాదముగ
తారుచు నాడు పా - త్రలు మెఱుఁగులుగ
భూనభోంతరరంగ - మున దంపతులకు
మానసంబులను బ్రే - మము నించెనిపుడు.
ఒక్కట నదులు న - వోఘలో యనఁగ
జక్కవగుబ్బలు - జతఁగూడి నిక్క
తటనాగవల్లికా - దళములు తరులఁ
జిటులు పోకలు సూన - సీర్యత్పరాగ
పూరంబులను గంధ - వోదులు లతాంత
వారంబు కదళికా - వనదళగళిత
కర్పూర ఫలకముల్ - గైకొని చెలుల
నేర్పున జలపక్షి - నికరంబు రాఁగఁ
గనుఁగొంటివే వార్ధి - గదియంగఁ జేరె
పెనిమిటులెంతటి - ప్రియులు కాంతలకు '
కారుచిచ్చులను ద - గ్ధములైన గిరులఁ
జేరినగతి నీల - జీమూతములను
నల్లనిమబ్బుల - నలుగడఁ గూడి
యల్లుకొన్న తెఱంగు - లందమై మించె.

వానకాళ్ళను జెలు - వము హెచ్చ విరియఁ
బూనియున్న కదంబ - పుష్పగుచ్ఛముల
తమ్ములపై నాడు - తమిమాని కొదమ
తుమ్మెదల్ విపినవీ - థుల వచ్చివ్రాలె.
రాజులకెల్ల నూ - రటలు గల్పించి
తేజోభివృద్ధి దం - తిశ్రేణి కొసఁగి
సింగంబులను దరి - సీమలనుంచి
పొంగి యాడెడు కలా - పులఁ బ్రోదిచేసి
వనములకెల్ల జీ - వనము గల్పించి
వనజాతములకుఁ జె - ల్వము గలిగించి
యిలకెల్ల నానంద - మిచ్చెనోరారా!
జలదాగమము ఋతు - స్వామి గావలయు!
వాహినీతతి పతి - వ్రతలు దారగుట
యూహించి ఘోషించె - నుదధియుఁ బోలి
తెరువరుల్ ప్రాణభీ - తిఁ బోవరాక
తెరువులు వెదక న - దీకూలములను
పట్టముల్ గట్టు భూ - పతులకుఁ బోలి
దట్టంబులగు జల - ధర కలశముల
నగములనెల్ల ను - న్నతిఁ దీర్థమార్చె
నగవైరి యనఁగ వా - నలు విలోకింపు!
చెలువేది? దిక్కులు - చీకటుల్ గ్రమ్మ
తలచూపకున్నాఁడు - తపనుఁడు నేఁడు!
రాజులు తమపేరు - రమ్ముల మీఁద
రాజిల్లు ముత్తాగ - రములుంచి నట్లు
సెలయేరు మొత్తముల్ - శిఖరభాగముల

వెలువడి తెల్లనై - విలసిల్లెఁ గనుము !
ఝురములు తటగండ - శైలభాగములఁ
బొరలి యాక్రిందఁ జ - ప్పుడుగాఁగ దుమికి
తరులందుఁ జెదరి ము - త్యపు వసంతములు
మెఱయించు బాగు సౌ - మిత్రి ! వీక్షింపు.
వరవిమానములపై - వచ్చునచ్చరల
సురతావసరముల - సురవిటశ్రేణి
గేలిసేఁతలఁ జెరి - గిన తారహార
మాలికల్ వచ్చు క్ర - మంబు చూపట్టె
తెమలు మేఘముల ను - దీర్ణమై వచ్చె
రమణీయవారి ధా - రా ప్రపంచంబు !
కుటములఁ బక్షులు - గూండ్లు వీడుచును
పటుకలారావమం - బరము నిండింపఁ
జల్లగా వికసించు - సన్నజాజులను
వెల్లుబ్బ వాసనల్ - పృథివినిండింప
నినుఁడ స్తమించుట - యెల్లవారలకుఁ
గనుపించె నిపుడు ల - క్ష్మణ ! ప్రొద్దుగుంకె.
ఆమిక నిగమాధ్య - యనపరాయణులు
సామగానముసేయు - సమయంబువచ్చె
గృహమేధులగువారు - గృహిపదార్థ ములు
గ్రహియించి మఱలి ర - గారంబులకును
బలశాలి కోసల - పతి భరతుండు
సొలవక యాషాఢ - శుద్ధపౌర్ణమిని
యుపవాస నియమ వ్ర - తోచితక్రియల
నిపుడుండు మనరాక - కెదురులు చూచి

మనలఁజూచి యయోధ్య - మనుజులందఱును
వినతులు సేయఁ బ - ర్వినప్రమోఁత యనఁగ
సలిలవేగంబుచే - సరయూప్రవాహ
ఘుళఘుళధ్వానమా - కర్ణింప దిగియె.
పగదీరి తనరాజ్య - పదవులుజేరి
మగువలఁగూడి నె - మ్మది నున్నవాఁడు
రాజీవహితకుమా - రకుఁడు జేసినవె
పూజలు! వాఁడెంత - పుణ్యమానసుఁడు?
ఇలనొడ్ల పాల్చేసి - యిల్లాలిఁ బాసి
యలమటలను బడి - యధముని రీతి
నిట్టుగా నొచ్చితి - నెంత పాపంపు
పుట్టువుఁ బుట్టితిఁ - బుణ్యహీనతను!
బలవంత మైనట్టి - పగయును నింత
యలజడిగావించు - నలజడివాన
తనమదిలోని ఖే - దము నింక నెట్టి
యనువునఁ దీఱునే - మనువాఁడ నింక?
"కపివీర! కిష్కింధఁ - గదలకయుండు
మిపుడని" యవకాశ - మిచ్చితిఁగాని
"యీవేళఁ బోవుద - మెచ్చటనున్న
రావణాసురునిపై - రమ్మ"న నైతి!
అవదుల నొందినాఁ - డనియు నీవేళ
నవని దండెత్తరా - దనియు నేఁజేయఁ
దలఁచితానిట్టి య - త్నము సమకూర్ప
బలవంతమున గాని - పాటిల్లదనియు
నెంచి "మీనగరిలో - నీవుండు"మనుచు

నుంచితి నదియుఁగా - లోచితంబగుట
నేఁజేయు నుపకార - మెంచి భానుజుఁడు
కాఁజేయకున్న నా - కామితార్థంబు ?
తలఁతునే ' సుగ్రీవ - తటినీ ప్రసన్న
తలు' మది ధరణిను - తాప్రాప్తి కొఱకు ?"
అని ఖిన్నుఁడై యున్న - యన్నచందంబుఁ
గనుఁగొని మరల ల - క్ష్మణుఁ డిట్టులనియె.
" అయ్య ! యెప్పుడు శర - దాగమంబయ్యె
నయ్యెడఁ దావచ్చు - నర్కనందనుఁడు
తాలిమిఁ గైకొని - తాళుమీ వాన
కాలంబు సత్యసం - కల్పుఁడ వీవు,
యెల్లకార్యంబులు - నీడేరు"ననుచు
చల్లని మాటలు - సంప్రీతిఁ జేసి
కొన్నాళ్ళు వసియింపఁ - గువలయశ్రేణి

— రామకార్యముచేయఁదగునని హనుమంతుఁడు సుగ్రీవునితోఁ జెప్పుట .—

చెన్నులుమీఱె ప - చ్చికలింపుదీరె
మబ్బువెల్వలఁ బాఱె - మంచుదైవాఱె
నబ్బురంబుగ మాఱుఁ - డమ్ములు నూఱె
నావేళ హనుమం- - తుఁ డలఘుధీమంతుఁ
డావానరాధిపు - నల్లనఁ జేరి
కృతమాత్మఁ దలఁచి తా - నింగితంబెఱిఁగి
హితము విచారించి - యిది ధర్మమనుచు
మది నెంచి సమయక - ర్మము నిశ్చయించి
కదిసి యేమియు నెఱుం - గక మత్తుఁడగుచు

రేవగల్ తారాప - రీరంభ సుఖ స
మావహారాగర - సానందుఁడగుచు
నున్న యేలిక బుద్ధి - యును వివేకంబు
కన్నుఁగానమియును - గాంచి యిట్లనియె.
"నీతియు రాజ్యంబు - నీ సంప్రదాయ
భూతియు ఖ్యాతియుఁ - బొందితి వీవు
చెలిమి యేమరి యుండఁ - జెల్లదు తగిన
చెలికాని నెఱుఁగక - చే వదలుదురె?
చుట్టరికము జేసి - సోఁకోర్చి వారి
పట్టున వలసిన - పనులఁ జేకూడి
యక్కరల్ దీర్ప నీ - యర్థముల కేల
దక్కును? చిరకీర్తి - ధర్మసౌఖ్యములు
హితుని కార్యంబు నీ - వెన్నక కామ
రతుఁడవై యునికి మ - ర్యాదగాదిపుడు
వారలీపని సేయ - వలయు మాకనుచుఁ
బేరు కోనట మున్న - పిలిచి వానరుల
సీతను వెదకింపఁ - జేసిన ప్రతిన
సీతాప్రియుని మాడ్కి - చెల్లించుటొప్పు
రాముఁడు మిక్కిలి - ప్రాజ్ఞుండు శౌర్య
ధాముఁ డాయనమాటఁ - దలఁపకుందురె?
ఆయన కరుణచే - నాపదల్ దీరి
శ్రేయోభివృద్ధులు - చేకొన్న నీవు
అతని సీతను గూర్చు - నందాక మదిని
వెతమాలి యునికి వి - వేకంబు గాదు
కర్తవు మాకెల్లఁ - గావున నీకు

కర్తవ్యమైన మా - ర్గముఁ దెల్పవలసె
దేవగంధర్వాదై - తేయాది సకల
జీవకోటులతోడ - సృష్టియంతయును
నొక్కతూపునఁ ద్రుంప - నోపు రామునకు
రక్కసు లెదురు వా - రా సంగరమున ?
రావణుఁడన నెంత ? - రఘువీరుఁ డెంత !
కావలసిన జేయఁ - గావలెనన్న.
అతని కార్యమునకు - నరమార లేక
హితము సేయుట నీకు - హితమైన తెఱఁగు.
ఇహపరంబుల యతఁ - డీకాక నిన్ను
వహియించుకొని ప్రోచు - వారలుం గలరె ?
కావలెనని నీవు - కట్టడసేయ
లేవుగా కిందఱు - లేరు సాధకులు ?
సీతను దివియందు - క్షితిమీఁద జలధిఁ
బాతాళమున డాఁచి - పదిలంబు జేసి
యుంచిన వెదకి తే - నోపుదు మేము
మించనాడుటగాదు - మీచిత్తమెఱుఁగుఁ
బిలిపించి పనుపుము - పృథివిపై వెదకఁ
గలవారి జవశక్తిఁ - గలవారి నెనరు
గలవారి నమ్మిక - గలవారి నేర్పు
గలవారిఁ గీశపుం - గవుల నేర్పఱచి."
అనిన పావని పావ - నాలాపములకు
మనసులో నలరి స - మ్మతమంది మెచ్చ

— సుగ్రీవుఁడు హనుమంతుఁడు చెప్పిన ప్రకారము సీతను
వెదకుటకు నీలున కాజ్ఞాపించుట —

నీలునిఁ బిలిపించి – "నీవీక్షణంబ
భూలోకమునఁ గల్గు – భూరిసాహసుల
కపులను దగిన లే – ఖలు వ్రాసి కార్య
నిపుణులౌ వేగు మా – నిసి ముఖంబులను
దమదమ మూఁకలఁ – దమసాధనములఁ
దమచుట్టములతోడఁ – దవిలి రమ్మనుచుఁ
బనిచి దప్పింపుము – పడవాళ్ల విలువ
పనిపూని యిచటికిఁ – బదియేనునాళ్ళ
వచ్చినవారెల్ల – వచ్చిరి రాక
యెచ్చోట నాయాజ్ఞ – యెఱుఁగనివారు
ఒకనాఁడు దప్పిన – నుసురు గాలముల
సకలవానరులు మె – చ్చఁగనైతు వాని
కొండలు వనముల – గొలిపించు కొనక
నిండు పంటలతోడ – నిలువఁ బూజ్యముగఁ
బుట్టాస్తి సంబళం – బుల కిచ్చుగాఁగ
కట్టడ చేసి మా – కార్యాంతరముల
రమ్మన్న వేళకు – రండన్ని నాళ్లు
నెమ్మది మీయిండ్ల – నెలఁతలఁగూడి
యురకపసా పడ – కుండడంచేను
గరిమతో బహుమాన – గతినడిపింప
నీకార్యమునకు రా – కెందుకు వారు
నాకు ? బొమ్మంగదా – నకు వినిపించి

యతని యొప్పవుకమ్ము - లన్నిదిక్కులకు
నతిశయంబుగఁ బంపు" - మని సెలవిచ్చి
యంతిపురంబున - కరిగిన నీలుఁ
డంతయుఁ దెలియఁ దా - రాత్మజుతోడ
విన్నపం బొనరించి - వేగులవారి
నన్నిదిక్కులకుఁ బొం - డని పంపునంత

—: శరదృతు సమాగమము - రాముఁడు సీతావియోగమునకై దుఃఖించుట :—

ఆవేళ రాఘవుం - డంబుదాగమము
తావల వంతలు - దరిచేర నిండి
శరదవసరమైన - చదలెల్ల మిగులఁ
బరిశుద్ధముగ మేఘ - పటలంబు విరియఁ
బిండి చల్లినయట్లు - పృథివి దట్టముగఁ
బండువెన్నెలలు ని - బ్బరముగాఁ గాయ
నెడవాయు జనకజ - నింటిలోఁ దనదు
పడఁతులతో నెడ - వాయుక యున్న
భానుజుఁ దనవెంటఁ - బడిపోరుచున్న
సూనసాయకుఁ దలం - చుక యోర్వలేక
పరవశుఁడై చాల - భ్రమసి వివేక
పరుఁడయ్యు మదినిల్వఁ - బట్టఁగలేక
తులకించు హేమధా - తు విచిత్ర శిఖర
తలమున వసియించి - తమకంబు వెంచి
సారసపక్షి ఘో - షములఁ జెన్నొందు
శారదాకాశ మి - చ్ఛఁ గలంగఁజేయ

నాయంచ నడపుల - నవనిజఁ దలఁచి
"హా!" యని పలవించి - యరఁగన్ను మొగిచి
తెలివిడి నొంది "యే - తీరున సీత
మెలఁగునో తనుబాసి"? - మించు సంపెఁగల
కొమరు గాంచిన కొండ - గోఁగులఁ జూచి
"కమలాక్షి నెన్నడు - గందునో యేను?"
జక్కవల్ రొదసేయు - జానకి వినినఁ
బొక్కవే చెవులు నా - పొంత లేకునికి?
ఈ సానువులు గిరు - లీ కందరంబు
లీ సరోవరము లే - నేవేళఁ జూచి
యోర్తునే జానకి - యొద్ద లేకున్న!
నేర్తునే నామది - నిలుప ధైర్యంబు?
మెత్తన జనకజ - మే నంతకన్న
మెత్తన మనసెట్లు - మీనాంకు చేతి
రాయిడి కోర్చునో - ప్రాణముల్ పట్టి?
ఆ యింతితోడిదే - ప్రాణముల్ తనకు!"
అనుచుఁ జాతకము జ - లాపేక్షచేత
వనదంబుఁ దలఁచుక - వగచిన యట్ల
సీతఁ దలంచుచు - శ్రీరామవిభుఁడు
చేతోభవుని మాయా - చేఁ గట్టువడియె.

—: లక్ష్మణుఁడు శ్రీరామునోదార్చుటకు మాటలాడుట :—

అటమున్న సౌమిత్రి - యా నగోపాంత
విటపంబులను ఫల - వితతియుఁ గంద

మూలముల్ గొనుచు రా - ముఁడుఁ దదుపాంత
శైలాగ్రమున నొంటి - జానకిఁ దలఁచి
కన్నీరు రాల్చుచోఁ - గని చేరఁబోయి
యన్నకు మ్రొక్కి తా - నంజలి చేసి
హితమును వినయంబు - నెఱుకయుఁ దోఁపఁ
జతురవాచా విశే - షమున నిట్లనియె.
" దేవ ! నీయంతటి - ధీరమానసుఁడు
లావున శౌర్యవి - లాసంబు మఱచి
చింతిల్ల నిం దేమి - చేకూరె ? నేల
యింతటి యార్తి ? ని - న్నెఱిఁగి వర్తిలుము
మది ప్రసన్నతయు నే - మఱక కార్యంబు
వదలకుండుటయు నే - వలన ధైర్యంబుఁ
దలఁచినపని సేయఁ - దగిన కాలంబు
బలములఁ జేకూర్చి - పగఱనోర్చుటయుఁ
దగు నట్టియెడ దేవ - తాప్రార్థనములు
దగు గాక యిట్టిచోఁ - దగవౌనె వగవ ?
నిను వరించిన యువ - నిజ నొక్కఁడంటి
తొనియక తనమేని - తో నుండగలఁడె !
పావక జ్వాలిక - వట్టిన కేలు
లావెల్లఁ బొలిసి కా - లక నిల్వఁగలదె ?
ధరఁబగ సాధించు - తరిగాని యిపుడు
తరిగాదు మనసు కొం - దలమందఁ జేయ !
ఆనతీయగఁ దగు - నది పల్కుఁడనిన
జానకీవిభుఁడు ల - క్ష్మణున కిట్లనియె.

—: శ్రీరాముని ప్రత్యుత్తరము - శరదృతు వర్ణనము .—

"ఇల జీవకోటుల - నెల్లను దృప్తి
వెలయించి సుఖయించె - విబుధనాయకుఁడు
తనయందుఁ గల వారి - ధారలు గురిసి!
వనదముల్ చాలించి - ప్రావాలె నూరటను
జలదభీకమయూర - ఘురసామజములు
గలలితారావ మె - చ్చట లేక యణఁగె,
ధారాళవర్షాంబు - ధౌతంబులగుచు
గౌరగౌరములైన - గంబులు వొలిచె
యేడాకరంటుల - నెనసిన పొరల
గూడు కప్పురపు రే - కులనొకకొంత
కళుకుచుక్కలఁ గొంత - కలువలరాజు
కళలందు నొక కొంత - కమ్మని బొందు
మల్లెల నొకకొంత - మార్తాండు నందు
వెల్ల దమ్ములఁ గొంత - వితరణప్రౌఢిఁ
దనకల్మి పంచి యం - దఱియందు నుంచి
కనిపించుకొనె శర - త్కాలవాసరము!
శరదవసరమున - సారసశ్రేణి
విరిసె భానుని కరా - విర్భూతి వలన!
కపురంపునెత్తావి - కడలందు నుడిసి
రపముతో మకరంద - రసములు గ్రోలి
ఘుమ్మను తుమ్మెద - కొమ్మలచాలు
గమ్మన మొరయు మం - గళ గానములకు
వీనులు చొక్కఁగ - విని మేనులుబ్బ
దానధారలు గమ - త్కాటముగాఁ గురియఁ

బొలయుచుఁ గరులున్న - పొంకంబుఁ జూడు!
చలదద్రులన మీఱె - శారదవేళఁ
దామరపుప్పొడిఁ - దడియు రెక్కలను
సాములు మట్టిని - చల్లు కొన్నట్లు
తనువులపై నంట - దరలహంసములు.
పెనఁగెడు జక్కవ - పిలుకలఁ నరిమి
తొలఁగని హంసికిఁ - దూఁడు లందించి
మెలఁగు చెల్వములెంత - మెచ్చొదవించె!
సెలయేటి కెలని ప - చ్చికల మచ్చికలఁ
దలఁకసి యాలమం - దల విలోకింపు
మాకాశమున నిసు - మంతయు మబ్బు
లేకున్న నెడబాసి - లేమ నీవేళ
పురివిచ్చఁబోయినం - బురి విచ్చలేక
తొరగఁగన్నీరు మూ - తులు విరియించి
కుత్తుకల్ పల్లకీ - కొమ్మలఁ బోలి
యుత్తరి మువ్వంక - లై సాగిలంగఁ
గేకల రాక యీ - కేకులు వోవు
పోకలు చూడు మి - ప్పుడు వియోగముల!
కుచభారముల వ్రాలు - కొమ్మలు వోలి
యిచటి భూరుహముల - నెల్ల కొమ్మలును
పూవు గుత్తులభరం - బులనసియాడు
తీవెలు బెనఁగొన్న - తీరుచూచితివె!
కరిణిఁగొనక యల్ల - కరి సరోవరము
దరిఁజేరి సలిలంబుఁ - ద్రావంగ మఱచి
యూరట లేకయే - యున్న చందమున

నారటంబునఁబొందు - నది విలోకింపు!
చికిలి చేసిన కత్తి - చెలువునఁ జూడు
మకలంకమయ్యె నీ - యాకాశమిపుడు.
అలఘునదీప్రవా - హంబులు దరిగి
వెలుతులయ్యెను కూల - విసరంబులకును!
కలువలపై నున్న - కమ్మనెత్తావి
గ్గిలుబాడివచ్చె ద - క్షిణగంధవహుఁడు
అర్కుని వేడిమి - నడుసెల్ల నెండి
కర్కశత్వంబులు - గనియె మార్గములు.
గర్వితాసులగెల్వఁ - గా విచారించు
నుర్వీశ్వరులకు ను - ద్యోగముల్ గలిగె.
నీరంధ్రవృష్టిచే - నెమ్మేని దుమ్ము
వారించి వృషభముల్ - వడి అంకెలిడియె.
పెంటి యేనుఁగులపైఁ - బెరిగిన బాళి
వెంటాడి క్రీడించు - విపినవీథులను.
నీరాస వికచాబ్జ - నికరస్రవంతిఁ
జేరి యంచలబారు - చెదరిపోఁద్రోలి
గళగళధ్వనులతోఁ - గరములనిండ
జలములు వట్టి వి - చ్చలవిడిఁ ద్రావి
యురముల శిరముల - నురు ఫూత్కృతులను
విరళాంబువులు జల్లె - వేదండకోటి.
వసివాళ్లు వాడుచు - వాల్మీక గోళ
విసరరంధ్రంబులఁ - వెడలి యన్నియును
వానలచేఁ గరు - వలిఁ గ్రోలరాక
మేనులు డస్సి భూ - మికి వెలువడుచు

విషములు గ్రక్కెడు - వివృతాస్యభీమ
విషధరంబులను భా - వింపు మెల్లెడల.
పరిపూర్ణచంద్ర బిం - బవికాసముఖము
సురుచిర నక్షత్ర - శుభలోచనములు
చంద్రికాధవళ వ - స్త్రంబును మీఱ
చంద్రాస్యగతిని ని - శాలక్ష్మి మెఱసె!
కారుపోతుల బారు - గంటివె క్రోవ
దీరిచినటుల నం - తే పోతరించి
నీలవర్ణములఁ బం - డిన రాజనంపు
చేలలో మేసి వ - చ్చె వనాంతములకు.
ఒక యంచ నిదురింప - నుత్పలశ్రేణి
వికసింపఁ జూడ్కికి - విందు సేయుచును
హరిణాంకతారాస - మన్వితనభము
కరణిఁ జూపట్టె నీ - కాసారమిపుడు.
అడుగులఁ దొడిగిన - యందెలమ్రోఁత
కడల హంసముల క్రేం - కారముల్ గాక
కడవోక విరిసిన - కైరవశ్రేణిఁ
దొడవులు గాఁగ ని - ద్దురపోవుచున్న
ముక్కులు విరియని - మొగడ తామరలు
మొక్కచన్నులు గాఁగ - ముందఱనున్న
నడబావిఁ గంటివె - నారీలలామ
వడువున మిగులఁ జె - ల్వము గనుపట్టె.
జీర్ణవైణవరంధ్ర - ఝుంకరణంబు
కర్ణామృతరసంబు - గా విని చొక్కి
మేపులు మఱచి యీ - మృగసమూహంబు

చూపట్టె సౌమిత్రి! - చూడుమిచ్చోట.
చూచితె కాశప్ర - సూనగుచ్ఛంబు
లీచాయ వెలిజల్లు - లెత్తించినట్లు
ఆరఁగట్టిన చీర - లన సెలయేటి
యొరలఁ దెల్లనై - యున్న చందంబు
మదిరాస వోన్మత్త - మదవతీ మణులఁ
గదిసి క్రమ్మరు కాము - క శ్రేణిఁ గనుము.
ఎంత తేఁటలు పుట్టె - నీవేళ వాగు
వంతలన్నియు శర - ద్వాసరమహిమ
బెళుకు బేడిసలును - బెరిగిన నాఁచు
జలరుహమ్ములు నక్ర - చయమును గలిగి
నీకైన చూపులు - నెఱివంకకురులు
తేటమోములు నవ్వుఁ - దేఱు చెక్కులును
గాఁగ నీనదులు న - ల్గడ తెరచాటు
మూఁగు నప్పుడు మీలి - మునుఁగులతోడి
రమణుల వదనవి - భ్రమవిలాసముల
నమరెను శరదాగ - మారంభవేళ.
కొండగోఁగుల తేనె - గ్రోలి మొగుడ్చు
పుండరీకములకుఁ - బోక దింటెనల
వ్రాలెడు తుమ్మెదల్ - వలరాజు గెలుపు
పాలించవచ్చిన - భాగ్యదేవతలు
ఈపంప చెంగట - నెఱిఁగించె వినుము.
రేపుమాపులు కుర - రీసమూహంబు
సైకపు చీరలో - జఘనంబు దోఁచు
రాకేందువదన తె - అంగుచూపట్టె

యిసుమంత గనుపట్టు - నిసుముదిన్నెలను
పసమీఱెఁ జూడుమీ - పంపాస్రవంతి
జడివాన లుడివోయి - శరదవసరము
పొడచూపె దండెత్తి - పోవురాజులకు.

—: శ్రీరాముఁడు లక్ష్మణునితో సుగ్రీవుఁడు తమకార్యము మఱచినాఁడని తెలిపి, కిష్కింధకుఁబోయి యాతనికి చెప్పవలసిన మాటలను చెప్పుమనుట .—

ఇదివేళయని మది - నెఱఁగియు రాక
మదిలోన మనల నే - మఱి భానుసుతుఁడు
ఊరక నగరిలో - నున్నాఁడు తనకు
నూతేండ్లుగాఁదోఁచె - ను నిమిషమైన
వనములలో చక్ర - వాకంబుఁ గూడి
చను జక్కవమిటారి - చాడ్పున సీత 3290
నావెంట రాఁగ ని - న్నాళ్లు నుద్యాన
భావమై యుండె నీ - భయదకాననము!
ఇలయేల నొల్లక - యిల్లాలిఁ బాసి
కలఁగుచున్న నా - గతి విలోకించి
దయఁ జూడఁదగుఁగాక - తనవంటివాఁడు
నియతి యేమఱియుండు - నే నన్నుమఱచి?
తనవంటి యాశ గా - దా వీరిదనుచుఁ
గనలేక యున్నాఁడు - కాముకుండగుచు
వానకాలము దీర్చి - వత్తువుగాక
వానరబలముతో - వలదిప్పుడనుచుఁ 3300

బొమ్మంటి నిపుడైన - భూమిజ వెదకఁ
బొమ్మని కపికోటిఁ - బుత్తేరఁడయ్యె !
కిష్కింధకేఁగి వా - కిట నీవు నిల్చి
ముక్కారు మూర్ధని - మాధు సుగ్రీవు
నచటికిఁ బిలిపించి - యనఁదగినట్టి
వచనముల్ నేనన్న - వాఁడగాఁబలికి
'యుపకారమునకుఁ బ్ర - త్యుపకారమెవ్వఁ
డుపమించి సేయక - యుండునో వాఁడు
ఎందుకుఁ గొఱకాని - హీనుఁడటంచు'
నందఱు ననుకొందు - రని పల్కుమీవు. 3310
తగినకార్యమునకుఁ - దగినట్టి పనికి
తగవుపల్కిన పల్కు - తప్పరాదనుము.
ఒరులచేఁ దనకు మే - లొదవిన మేలు
మఱచినట్టి కృతఘ్ను - మాంసరక్తములు
నంటక రాక్షసు - లైన రోయుదురు !
కంటగింపుచు నని - కనిపించుకొనుము.
వినవలతువా రఘు - వీరు కోదండ
ఘనతర జ్యావల్లి - కారవమనము.
తాళభేదనము ఖా - ద్య ముగైన క్రియల
చాల రాఘవుఁ బరీ - క్షఁగొనంగ నేర్చి 3320
వాలిఁ జంపించిన - వాఁడవు మఱచి
స్త్రీలోలమతినున్నఁ - జెల్లునే యనుము.
ఆడుమన్నటులెల్ల' - నాడి నీసేయు
కోడిగంబులకు లోఁ - గుచుఁ జెల్మిచేసి
యిచ్ఛకమ్ములు పల్కు - టెల్లను సీతఁ

నామాట విని మంత్రు - లందఱుఁ గూడి
యేమఱిపాటొక్క - యింతయు లేక
శతసహస్రమదేభ - సత్త్వ వానరుల
శతబలిగజతార - శరభ ముఖ్యులను
మూఁకలతోఁ గూడి - మొనసేయఁ జనుప
నాకసం బగలించు - నట్టహాసముల
వారెల్ల కిష్కింధ - వాకిట నిలిచి
భూరుహంబులు నగం - బులు బెల్లగించి
కరములఁ గీలించి - గవనులు మూసి
మరుగులఁ గోట కొ - మ్మల నిండ బలిసి
వాలమ్ము లార్చుచుఁ దు - ర్వారవిక్రముల
శైల సన్నిభుల ని - శాత దంష్ట్రలను
నతిశూరులను వికృ - తాకారయుతుల
జితదానవులఁ గపి - శ్రేష్ఠులఁ జూచి
యాలక్ష్మణుఁడు కోప - మగ్గలింపంగ
వాలితమ్ముఁడు తమ్ము - వంచించుటయును
నతని వారలు తమ్ము - నరికట్టఁ దలఁచి
ప్రతికూలురై కోట - బలిసి యుంటయును
రాముఁడు విరహాభా - రంబుచే నోర్వ
లేమియుఁ దలఁచి తా - లిమి లేక కనలి
కాలాగ్నికల్పుఁడై - కన్నులయందు
కీలికీలలు గ్రమ్మఁ - గిటకిటఁబండ్లు
గీఁటుచు నూర్పులు - గురలఁ గోదండ
కోటితో శింజినిఁ - గూర్చి యమ్మొర్చి
శరజిహ్వికలు శరా - సన శరీరంబు

సరిలేని తేజోవి - భవంబున వెలుగు
సౌమిత్రి పంచాస్య - సత్వంబు క్రూర
మైమించి కిష్కింధ - యగ్రభాగమునఁ
జేతులు మొగిచి ని - ల్చిన వాలిసుతునిఁ
గ్రోధుఁడై రమ్మని - పిలిచి యిట్లనియె
'ఆ నగరంబునకు ల - క్ష్మణుఁడదె వచ్చె
తనరాక మీరాజు నెం - తయుఁ దెల్పుమనియె
నను భావజునితో - "నను నమ్ము" నుచు
బనుప నంగదుఁడును - బరువున వచ్చి
రవిసూనుతో నత్తె - ఱంగుఁ దెల్పుటయు
నవివేకమును నిద్ర - యలసభావంబు
మదమత్తతయును కా - మార్థ వికారంబు
పదవిచే నగుక్రొవ్వు - పైఁబడి యుండ
నామాట వినక మా - రాడక యతఁడు
తామసప్రకృతి ని - ద్రవహించి యున్న
వాకిట గావలి - వానరుల్ గూడి
మూఁకలై లక్ష్మణు - మందఱు నిల్చి
కిలకిలాశబ్దాను - కృతినుగుల్ సేయ
బలుమ్రోఁత పిడుగులు - వడిన చందమున
నవని యంతయు నిండ - నమ్మహారవము
రవితనూజుని కర్ణ - రంధ్రము సోఁక
దిగ్గన లేచి యు - దీర్ణభావమున
నగ్గలిక "నదేల - యార్భట" యనిన
బరువుతో వచ్చి ప్ర - భావస్వతేజు
లిరువురు మంత్రులా - యినసూనుఁ జూచి

"అయ్యా! మహారాజు - లైనట్టివారు
నెయ్యం బపేక్షించి - నినుఁ జేరువారు
రాములక్ష్మణులు వి - క్రమ కళానిధులు
భూమియంతయు నేలు - పోడిమివారు
ఈరాజ్యసుఖము నీ - కిచ్చినవారు
వారిచర్యలు మఱు - వఁగఁ దగునయ్య?
అన్న పంపఁగ సుమి - త్రాత్మజుఁ డిప్పుఁ
డున్నాఁడు! వచ్చి పు - రోపకంఠమున
బాణబాణాసన - పాణియై సితకృ
పాణియై యున్న య - ప్పరమ సాహసునిఁ
గపులందఱును జూచి - గడగడ వడఁకి
యిపుడు సన్నుతి సేయ - సిద్ధని వుట్టె"
ననుచు నింద్రసమానుఁ - డైన సుగ్రీవుఁ
గనుఁగొని పలికి "యో - కపిలోకనాథ!
ఆలాపసారథి - యాత్మీయకార్య
కేళీరథంబు మి - క్కిలి బతచేసి
యమ్మహారథవర్యుఁ - డంగదుఁ బిలిచి
పొమ్మన్న మీకు దె - ల్పుటకునై వచ్చె
నతఁడు చూపులచేత - నగచరావళిని
హుతవహువలె నేర్చి - నూహించినాఁడు
నీవు బాంధవులతో - నేఁడు రేఁగి
యావీరవరుని స - మర్చనఁ జేసి
వారువచ్చిరాక - వారితో మీరు
మీఱిపల్కిన మాట - మేకొని తీర్చి
కని కొల్వుఁడన విని  కమలాప్తసుతుఁడు

తనమంత్రివరుల నం - దఱఁ జూచి తగవు
గురులసుతత్వము లన్య - గుణ గౌరవంబుఁ
బరికించి తానున్న - పట్టెమంచమున
నుండక దిగువఁ గూ - ర్చుండి వివేక
పాండిత్య శాలియై - భానుజుఁడనియె.

— సుగ్రీవుఁడు లక్ష్మణుఁడు వచ్చినకార్య మడుగుట —

" రామున కేను నే - రము సేయలేదు
తామసింపను మితేఁ - దప్పమేమఱచి
యేమి నిమిత్తమై - యింతకోపమున
సౌమిత్రి వచ్చె న - సహ్యంబుగాఁ జేగ
నెవ్వారేనియు వాలి - హితులు వంచించి
దవ్వుల నేనున్కి - ద నివాఁడనుచుఁ
జెవిసోఁక కొండెముల్ - చెప్పిరో కాక
చెవులె కన్నులుగదా - క్షితిపాలకులకు!
అతఁడు స్వకార్యప - రాయణుఁడటట
హితమతి మీకార్య - మీడేర్తు ననుచు
నాకమాట యొకింత - యు డినఁజాలు
దోసమెంచక యొక్క - తూపు సంధించి
పంతగించిన యట్లు - పడవేసె నేని
చింతించి యామీఁదఁ - జేసెడిదేమి
నామాట వినియొక్క - నారాచమేర్చి
రాముఁడు వాలి నూ - రక చంపలేదె?
ఎవ్వఁడేలుంగు? నా - కీరాజ్యమేల?
దవ్వులఁ బ్రాణముల్ - దాఁచి యుండెదను

చెలిమి చేసిన నది – చెడకుండ నెప్పు
గలిగి మెలంగ దు – ష్కర మెవ్వరికిని!
సంపోదు నాకు ల – క్ష్మణుఁ డాగ్రహించి
శరశరాస ము లు – సవరణ నేస
వచ్చినప్పుడ కదు – వలెఁ దోఁచె మీకు
నిచ్చఁ దోఁచి బుద్ధి – యుడిఁగింపుడపుడు
దోసమేమియును లే – దు మదాత్మయందు
నిషద్భయంబైన – నేఁటికి నాకు?
వారల యెడ్డనైన – వారొక్కరల
ధారుణి నొరుల చి – త్తము లెవ్వఁ డెఱుఁగు?
మనసులు నిలుకడ – మానిన వగుట
మనకిట్టి చో నను – మాసింప వలస"

— హనుమంతుఁడు సుగ్రీవునకు హితము చెప్పుట —

అనుమాట విని చేరి – హనుమంతుఁడపుడు
వినయంబుతోఁ గపి – విభుఁ గన్గొనియె.
"ఇది యేమి యరదు? నీ – వింగితజ్ఞుఁడవు
మది నుపకారంబు – మఱచి యుండుదువె?
నీ నిమిత్తము వాలి – నిఁ బ్రతాపశాలి
జానకీ విభుఁడొక్క – శరముచే నేసె
తనవాఁడవని నిన్నుఁ – దలఁచి రాఘవుఁడు
కినిసి లక్ష్మణుఁ బంపెఁ – గిష్కింధ కపుడు
కినుక యేమిటికన్న! – కృతమాత్మ నెఱిఁగి
యును శరత్కాల మ – భ్యుదయంబు నొందె.

మత్తుఁడవై వారి – మఱచితిగాన
క్రొత్తయే నిమీఁదఁ – గోపించికొనుట?
కాలజ్ఞుఁడవు వివే – కము లేనియట్టి
పాలసుఁడవుగ వు – బలశౌర్య నిధివి
యరులసాధింపఁగ – సమర్థవైన యట్ట
తెరివచ్చియును నీవు – తేఁపకయున్న
నూరక తమరేల – యుందురు? వారి
నేరమేయిది? నిదు – నేరమిగాఁక
ఇంతిని గోలుపో – యినవారి మీఁద
నెంతయు దయవలె – నింతియే కాక
సరకు సేయక యుపే – క్షాబుద్ధి నున్న
దౌర్మైన నైతివి – దోషంబుగాదె
తప్పునకై పోయి – దండమర్పించి
చెప్పిన బుద్ధులు – శిరసావహించి
పనుపు సేయుట మంచి – పని ప్రధానులకు
కనిపించుకొని యంత – గదిమి చెప్పినను
నదిహితం బుచితంబు – నగుగాన యేను
మదిశంక లేక యీ – మాట లాడితిని
వారు గోపించిన – వలదని మాన్పఁ
దీఱునను చు నెంచి – తే? నిల్వఁగలమ?
పాఱిపోనేర్తుమె! – వ ఱెదమనిన
వారు వోఁసత్తురో? – వలవ దీభయము
ప్రతికూలుఁడే రఘు – పతి? మనకతఁడె
గతి! సదేవాసుర – గంధర్వమైన
జగ మెల్ల నొకతూపు – సంధించె నేని

నిగుడఁజేయు నతండు - నిమిషంబులోన !
అదిగాక నీకు నా - యన చేసినట్టి
విదితోపకారంబు - వీటి బోనాడి
పౌరద్రోహులను నీవు - పోయిన వారు
విరసింతురంటు గాన - వినుము నాబుద్ధి.
రాయశాసనమతి - క్రమము జేసితివో !
స్వామికార్యముల వం - చన జేసినావో ?
కల్లలాడితివో ? సం - గరములో విడిచి
యిల్లు చేరితివో ? నీ - కేల యీతలంపు ?
ఇంటికి వచ్చిన - నెవ్వారినైన
వెంట బెట్టుకరాని - వీటేడి గలఁడ ?
గప్పింపు పూజింపు - రాముని తమ్ముఁ
డప్పుడు మనమీఁద - నలుగఁడేమియును."

— అంగదుఁడు లక్ష్మణుని సుగ్రీవుని యొద్దకు దోడి తెచ్చుట :—

అన విని తారాస - హాయుఁ డంగదునిఁ
గనుఁగొని "నీవు ల - క్ష్మణుఁదోడి తెమ్ము
వేగంబె చను"మన్న - విని వాలితనయుఁ
డాగుణనిధి నూర్మి - ళాధీశుఁ జేరి
ప్రణమిల్లి "నగరికో - పలికి విచ్చేయుఁ
డణిమాదులైన య - ష్టైశ్వర్యములను
మీరిచ్చినవి వచ్చి - మీరుచూచినను
శ్రీరాము కరుణ నూ - ర్జితములై వెలయు !
రండు ! మాపినతండ్రి - రమ్మనె మిమ్ము.

ఉండనేమిటికి పు – రోపాంతసరణి ”
అనిన సుగ్రీవుపై – నలుక యంగదుని
గనుఁగొన్న కరుణాయుఁ – గడలేక యుండ
మాఱు మాటాడక – మర్కటసైన్య
వారమంగదుని క్రీ – వలఁ గొల్చిరాఁగ
వాలి సూనుని వెంట – వచ్చె సౌమిత్రి.
నీలమేఘంబులు – నిలిచిన కరణిఁ
గాలు వనంబులు – దాఁటి సుగ్రీవ
పరిపాలితంబైన – పట్టణంబునకు
మేరుకైలాసోప – మేయంబ లగుచు
భూరిరాజిత సౌధ – ములు మిన్నుముట్ట
కరుణ నింద్రుఁ డొసంగు – కామితఫలద
తరుకోటి యరికట్లు – తలఁపు పుట్టింప
విపణిమార్గంబుల – వివిధవస్తువులు
నపరిమితంబులై – యబ్బురపఱుపఁ
దమ్మి కొలంకుల – తావులు దెచ్చి
తెమ్మెరల్ బడలికఁ – దీఱంగ వీవ

— కిష్కింధ వర్ణనము —

నమరావతియొ కాక – యలకాపురంబొ
హిమవన్నగమొ వేల్పు – టరనైన గిరియొ
యనఁగఁ గొండలు చుట్టు – నమర నన్నడుమ
ననుపమ భోగ భా – గ్యములఁ జూపట్టు
వానరపురము త్రో – వను రాఁగ వీధి
లోనఁ దారుండు నీ – లుఁడు శతబలియు

విజయసూర్యాంగద - ద్వివిద సుషేణ
గజగవయగవాక్ష - గంధమాదనులు
పనసమైనాక సం - పాతి సూర్యాక్ష
హనుమంతసురగోము - ఖాగ్ని నేత్రులును
నలజాంబవద్వ్యాక - ర్ణక మయకుముద
మలయ విద్యున్మాలి - మైందగోకర్ణ
దధిముఖ ఋషభ మం - దారసునేత్ర
దధివక్త్ర వీరహా - స్తసుపాటలులును
మొదలుగాఁగల కపి - ముఖ్యులు జెరి
ముదము మీరఁగఁ గొల్వ - మ్రొక్కులు వేయ
నంగీకరింపుచు - నావలి కేఁగి
బంగారమిటికల - ప్రహరిగోడయును
నవరత్నముల రోహ - ణగిరీంద్రమున గ
రవణంబుగలహజా - రము మగరాల
బోరు దల్పులు ద్వార - ముల మరకతపుఁ
దోరణంబులు నింపుఁ - దొలకించు నట్టి
నగరిలో భానుమం - డల మంబరమున
మొగులలోఁ జొచ్చిన - ముగువు చూపట్ట
నావలఁ జని యుఱు - దాఱు మానికపు
సావడుల్ గనుచు న - చ్చట వాహనములు
కగ్గని మణిదీప - కళిక లేకడల
నెగ్గళ్ళ కంచుకుల్ - వృద్ధులాప్తులును
పట్టెమంచంబులు - పఱుపులు వివిధ
పట్టాంశుకములు కం - బళ్లును పరఁగి
పీఁటలు తలగడల్ - బరుదులు టంక

వాటపు కొప్పెరల్ - వాద్యఘోషములు
గంధోత్తమాపూర్ణ - కుశంబముల్ దవ్వ
గంధ ధూపములు న - ల్గడలఁ గ్రగ్గొనుచుఁ
చక్కని యుడిగంపు - జతులు మలంగు
చక్కటఁ జేరి య - ష్టమ కక్ష్య నిల్చి
పిలుగుణధ్వని సేయ - పని భానుసుతుఁడు

## —. సుగ్రీవుఁడు తారను లక్ష్మణునితో మాటలాడుటకుఁ బంపుట —

కలఁగి దిగ్గన లేచి - గడగడ వణఁక
వెఱవకుమని తార - వెన్నుపైఁ జఱచి
పరిరంభణము జేసె - పడనీక నిలుప
నపుడంగదుఁడు వచ్చి - "యయ్య! సౌమిత్రి
కుపితాత్ముఁడై మన - కోటవాకిటను
వచ్చియున్నాఁడన" - వాలితోఁ బుట్టు
నిచ్చలోఁ 'దనతో' డ - నేకాంత వేళ
హితముగా నంగదుఁ - డేమి యన్నాఁడో?
సతమయ్యె నది" యని - చాల శంకించి
నోరెండ "బ్రహ్మకు - నూఱును సండెఁ
దారా! యయ్యది బుద్ధి - తనకిట మోఁద?
మంచివాఁడనుచు ల - క్ష్మణుని నమ్మితిమి
చంచలేటుణా? కాల - శమనుఁడైనాఁడు!
ఇతని కప్రియము నే - నేమి చేసితిని?
కతమేమొ యిట్ట యా - గ్రహముతోఁ జేర?
వలదన కీనేల - వాలిఁ జంపించి

కొలఁగట్టుకొంటి నా - కును వీరికేల
చెలిమి వాటిలె? నింత - చేసిన యట్టి
తులువ వాయుజుఁడు మం - త్రులు ద్రోహులైన
కడతేర వచ్చునే? - కపిరాజ్యములు?
అడియాసఁ గైకొంటి - యతివకై యేను
కనుపోవు నిద్దుర - గాదిట్టివారి
చనుమానములు చాలు - సఖ్యంబు చాలు
నిల యేలుటయుఁ జాలు - నేమియు నొల్లఁ
దొలఁగించి తనకొక్క - ద్రోవఁ గల్పింపు
నారీలలామ! ప్ర - ణాపంబు సీతుఁ
జేరి నీచరణ రా - జీవముల పోఁక
కాదన్న మునుమున్న - గా నిపు వోయి
నాదు మాఱుఁ లక్ష్మ - ణపదాంబుజముల
వ్రాలిన నాఁటి - వచ్చె నే డనుచుఁ
జాలించు గనుక ప్ర - శాంతాత్ముఁడైన
నతనితో నీ నేర్చి - నట్లు భాషించి
హితముఁ జేసితివేని - యేవచ్చి వెనుకఁ
బొడగంది నతని ని - ప్పుడు రమ్మటన్న
పడఁతి రానొల్ల నా - ప్రాణంబు గాచి
బ్రదికించుకొను"మన్న - భర్తమాటలకు
మదిరాయతేక్షణ - మదన సంగ్రామ
కేళీరసాల స - కిన్నరకంఠి
లాలితభూషణా - లంకారకలిత
మంజీరమేఖలా - మాలికాకటక
శింజితఝుణఝుణ - శ్రీభాసమాన

యలినీలకచ కించి - దవనతగాత్రి
కలవాణి తారరా - ఘవసహోదరుని
జేరవచ్చినఁ జూచి - స్త్రీ సన్నిధాన
మేరకి మదినాగ్ర - హింపరాకునికి
తేటి చూపిక పర - స్త్రీ పరాఙ్ముఖుఁడు
శ్రీరాముఁ దలఁచి వం - చినమౌళితోడ
నూరకయున్న హా - లోద్రేకమదవి
కారంబుతో సిగ్గు - కడకోసరించి
దట్టతనంబునఁ - దియ్యఁ బల్కులను
గట్టువాచిలుక ప - క్కాణించి నట్లు
నీతియు వినయంబు - నెనరును గలుగఁ
జాతుర్యవతి తార - సౌమిత్రి కనియె

— తార లక్ష్మణునితో సంభాషించుట —

"స్వామి! నీకేల రో - షము నాగ్రహంబు?
ఏమి నేరముచేసి - రెవ్వారలైన?
మేదిని నీయట్లు - మీఱినవారు
మీదు బుద్ధి యెఱుక - మించినవారు
యెంతైనఁ గలుగుదు - రే? కల్గిరేని
పొందుదురే వారు - భూరిసౌఖ్యములు?
శాంతమూర్తివి సర్వ - సముఁడవు నీవ
నంతకల్యాణగు - ణారాత్మ్యుఁడవు
తగునయ్య? యింతక్రో - ధము నీకు? దాసు
లగు వారిపై 'నన్న - యంగదుతల్లి
మాట నేర్పులను నె - మ్మది విస్మయంబు

గాటంబుగాఁగ ల - క్ష్మణుఁ డిట్టులనియె.
"కిన్నరకంఠి! సు - గ్రీవుఁడు నీతి
నెన్నిక ధర్మార్థ - కృత్యముల్ మఱచి
కామోపభోగ సం - గతి నార్తుఁడైన
రాముని కార్యభా - రము నేఁడు విడిచి
మంత్రులతో పాన - మత్తుఁడై యస్వ
తంత్రుఁడై స్త్రీ పర - తంత్రుఁడై యిట్లు
గొడ తెలియక యున్న - యునికి వీక్షించి
శోకమానసనై క్రోధ - ము యతీంద్రులకును?
దాఁకు నేర్పు మా - తంబుఁ జేటియును
మనసున నేమఱి - మత్తుఁడై వాఁడు
ఏమని వచ్చితి - వే వచ్చుగాక
కామిని! యుచితంబొ - కాదొ భావింపు
పానంబు ధర్మార్థ - పటిమలఁ జెఱచుఁ
గాన నీ మగని కె - గ్గిది సత్యంబు?
ధర్మంబుఁ దలఁచి గుం - తలనైన నీవు
దుర్మానశీలుని - శోకహంతాదేశ
పద్ధతిగాఁ బోయి - భాషించి వాని
బుద్ధిమంతునిఁ జేసి - పూనిన ప్రతిన
నడిపింపఁ జేయు"మ - న్న సుమిత్రపట్టి
నుడువుల కలరి య - న్నల మిన్న వలికె
"కోపకాలము గాదు - కొలిచిన వారిఁ
జేపట్టి నేరముల్ - చేసిరేనియును
సహియింపఁ దగు కార్య - సంగతులందు
విహితమె యాగ్రహ - వృత్తి రాజులకు

రాజులలోఁ దమో - రాజసగుణము
లేఁబాడ విమ్ముఁ జేర - నీక సాత్త్వికమె
పూని యుండిన మీఁకుఁ - బోసఁగునె యలుఁగ
వానరప్రభుఁడైన - వాలి సోదరుఁడు
కామాంధుఁడై కన్ను - గానకుండుటయు
స్వామికార్యముఁ దీర్పఁ - సమయమాటయును
మీరు చేసిన యట్టి - మేలు దలంప
నేక వీఁడుండు - నే యని తలఁచి
సుగ్రహంబున రాకుఁ - డనుపుట యితని
నిగ్రహించెదనని - నీవు వచ్చుటయు
నన్నియు నెఱుఁగుదు - నైన నామనవి
చిన్నబుచ్చక వీఁడు - చేతిలోవాఁడు
మాలోన నొకఁడని - మన్నించి కరుణఁ
దాలి ప్రోచుట మీకు - ధర్మమైయుండు
తెలివిచాలక జితేం - ద్రియులైన యతులు
నలివేణులకు లొంక - నై యున్నచోట
నితఁడు వానరుఁడౌట - నెన్న నేమిటికి?
అతివలఁ దగిలి రా - గాంధుఁడై యునికి
చపలస్వభావుని - శరణంబు వేఁడి
కృప మీరు తెచ్చి కి - ష్కింధలో నునుప
నున్నవాఁ డేక్రియ - నోర్చు నీవింత
కన్నెఱ్ఱఁ జేసినఁ - గాకుత్స్థతిలక?
వెఱచి యుండాక నే - విన్నవించుటకు
మఱుఁగు చేసితి నా - రుమానాయకుండు
నీవు రాఁకట మున్న - నిఖిల వానరుల

రావించి రామకా - ర్యభరంబుఁ దెలిపి
యందుకుఁ దగఁ గా - ర్యాలోచనంబుఁ
గందువ నెఱ్ఱుఁగి - గనియున్నవాఁడు
నెయ్యుని పట్టున - నెనరుంచి మీర
నయ్యంతిపురమున - కరుదేరవలయు
"గాకున్న మీకుఁ - రాదు మీ ప్రోవు
వారెల్ల తనయుల - వలెఁ గాదె మీకు?
విచ్చేయుఁ"డని సుగాత్మ - విభు హితంబెంచి
యచ్చపలాక్షి ప్రి - యంబులు వలుకఁ
దారవెంబడి సుమి - త్రాకుమారకుఁడు
పోరామిచే నంతి - పురముఁ జొచ్చుటయు
కట్టెదురుఁ బైడి - గద్దియమీఁదఁ
జట్టును వలకాఁడి - సుదతులు గొలువ
రుమతోడఁ గూడి మె - ఱుఁగడియముల
నమరు కీలాయింతి - యంసంబుఁ జేర్చి
యొయ్యింతి తొడలపై - నొకపాదమునిచి
సకలమణీభూషణ - చయములు వెలుఁగ
హాలాగిసారుణి - తాలోలుఁడైన
వాలిసోదరుని భా - వముఁ దేఱి చూడ
నతఁడును రామకా - ర్యార్థియై మోల
నతిశయక్రోధకా - లాంతకు రీతిఁ
గుపిత వృత్తినధిజ్య - కోదండుఁడైన
తపనతేజుని సుమి - త్రాపుత్రుఁ జూచి
బగ్గన గుండియ - వగులఁ బీరంబు
దిగ్గన డిగ్గి భ - క్తి స్నేహములను

నొకయింతి తొడలపై - నొకపాద మునిచి
సకలమణీ విభూ - షణములు వెలుఁగ
హారసాగరసి - తాలోకుఁడైన
వాలిసోదరునిభా - వముఁ దేటిచూడ
నతఁడును రామకా - ర్యార్థియై మ్రోఁగ
నతిశయ క్రోధకా - లాంతకునీతిఁ
గుపిత వృత్తివధిక్య - కోపండుఁడైన
తపన తేజుని సుమి - త్రాపుత్రుఁ జూచి
యవని పాలకుఁడు రా - జ్యము సేసె నేని
యవినింద్యుఁడై నుతు - లంది వర్ధిల్లు 3790
క్రూరకర్ముఁడు కృత - ఘ్నుఁడసత్యపరుఁడు
దారాభిగతుఁడు పా - తకియునై నేని
నందఱును నృశంసుఁ - డందురు వానిఁ
బొందును పాతకం - బు లపారములుగ
నుపకార మొకరికి - నొనరింతు ననుచు
నపుడాడి తనకార్య - మొనర్చి వెనుక
నామాట నిలుపని - యన్యాయ పరుని
భూమిఁ బాపము లెల్లఁ - బొందునేకముగ
నందుపై శ్రీరాము - నంతటివాని
పొందు నీవంటి య - ల్పుఁడు సేయునపుడు 3800
నాడిన మాటలు - యందఁ గొంతైనఁ
గోడు చూపకయున్న - దోషంబు గాదె?
తనకుపకార మొం - తఁగఁ జేయువాని
మనసురాఁ జేనైన - మాత్రమేనియును
ప్రత్యుపకార సం - పన్నుఁడు గాని

యత్యధము నృశంసుఁ - డని బ్రహ్మవలికె
భ్రష్టుని గోఘ్నుని - పానాభిరతు ని
కృష్టని చోరునిఁ - గెడ తేర్పఁ దలఁచి
యిటు సేయుఁడని విధి - యుంచిరి గాని
కటకట! మేలెఱుఁ - గని దుష్టమతికి
నెందుఁ బ్రాయశ్చిత్త - మిదియని లేదు!
నిందకోరిచి రాము - నికి రెండు దలఁచి
కల్లలాడిననీకుఁ - గమల సంభవుఁడు
చెల్లరె! యెట్లు ని - ష్కృతి విధియించు
సీతను వెదకింపఁ - జేపట్టెగాక
సీతోడు శ్రీరాము - నికి నేమిపనికి
కప్ప వల్కినయట్ల - కాలాహి వల్కి
కప్ప నమ్మికఁ జేరఁ - గని మ్రింగినట్లు
ఏకార్యముఁ గొనె - నెయ్యంబుఁ జేసి
వాకొంట వప్పుడు - వలసిన యట్ల
వాలినిఁ జంపి నీ - వారమై రాజ్య
మేలించి నిను దెచ్చి - యింటలోనునిచి
యిన్ని పాటులఁబడు - టెల్లను నీవుఁ
గన్నెలు నేవేళఁ - గలుద్రావి చొక్కి
కామాతురుండవై - కడపట మమ్ము
నేమియుఁ దలఁపక - యిట్లుండు కొఱకె?
ఓరి! రామద్రోహి! - యొకతూపుఁ దొడిగి
నిరొమ్ము నాటించి - నేఁడె కూల్చెదను!
వాలి చన్నట్టి త్రో - వను నిన్నుఁ బనిచి
కాలుని వీటిలోఁ - గాపురంబుంతు!

అన్నదమ్ములము మే - మగుటచే మీరు
నన్నదమ్ములు గాన - నదియెయుక్తంబు
శ్రీరాము నానతి - సేయక తక్కు
మీఱరాదటు గాక - మెలఁతలలోఁగ
నున్నవాఁడవు గాన - నోర్చిచేకాచి
నిన్ను మన్నించితి - నీకింకనైన
సీతను వెదకించి - చేసిన ప్రతిన
యేతెఱఁ జెల్లించి - హితుఁడవై మాకు
రామకార్యముల పో - రామి వాటించి
సేమంబు గనుమేల - చెడు ద్రోవ నీకు ?
నీమాట వినికాని - నేఁడాళ” యనిన
నామాటలోఁదార - యడ్డంబు వచ్చి
“నట్టింటి కీతని - నమ్మి నేఁదెచ్చి
చెట్టనైతి” నటంచుఁ - జేరి యిట్లనియె

— లక్ష్మణు మాటలకుఁ దార ప్రత్యుత్తరముఁ జెప్పుట —

అనరాని మాటలి - ట్లపరాధిఁ బోలి
యనఁజెల్లునయ్యా ? యి - య్యర్కనందనుని
కానివాఁడనరాదు - కల్లయు లేదు
హీనుఁడు గాఁడు మే - లెఱిఁగిన వాఁడు
కపిరాజ్యమును రుమా - కాంతయు నన్ను
నపరిమితములైన - యైశ్వర్యములును
నవనిజాతా సహా - యానుగ్రహమున
రవితనయుఁడు గాంచి - రాజయినాఁడు
బహుకాలమాపదఁ - బడినవాఁడగుట

మహిళలతోఁ గూడి - మఱచె మితంబు
ఇంతిలోఁ దప్పన - దేమి? కౌశికుని
యంతవాఁడును దొల్లి - యచ్చరఁ గూడి
కాలంబు మఱవఁడే? - కపినాథుఁ డిట్టి
పాలార్పనగునె గ - బ్బరలాకె ననుచు?
కరుణింపఁ దగవు రా - ఘవునకు నీకు
వెఱపు దీర్పుట యొప్పు - విశ్వాసపరు!
ఇంతటివారు మీ - రితరుల మనసు
లెంతయు నెఱుఁగ లే - కిటులాడఁ దగునె?
ఏమివల్కిననేమి - యిదిమీకు కొదవ?
సామాన్యులే మీరు - సద్ధర్మపరులు
ప్రాకృతరీతిఁ గా - ర్యజ్ఞుఁడ వయ్యు
వాకొందువె యిచ్చ - వచ్చినయట్లు?
తగ నెఱుఁగుదువు సీ - తను దెచ్చి కాక
నగరికి రం డర్చ - నా భానుసుతుఁడు?
చెల్లిమాంకణ గాఁడఁ - జెల్లునే? యిట్టి
బల్లిదులకు మీఁదు - పరికింప వలదె?
చులకఁ జేసెదరె? భాను - జుఁడు క్రొంచగాఁడె?
తొలుత నెఱుఁగక - తోడు వేఁడితిరె?
కార్యాంతరంబుఁ - కనిమొద రితని
మర్యాద నాయూడు - మాట లిప్పటికి
సరిపోదు మీకు రా - జ్యముఁ గుసతిని
గొరులు చేకొని యార్తి - నొందించు కతన
మేలు గీడుల నొక్క - మేర నే నగువఁ
బోలునే యెంతటి - బుద్ధి శాలులకు

వాఁగ లెవ్వరు నేఁడిం - పఁగ నోపువారు ?
ఆబలంబెల్ల స - హాయంబు గాఁగ
చేబారలిడితివి దె - చ్చెదరె జానకిని ?
వానరప్రభురాశి - వాసంబులెల్ల
దీనత భయము నొం - దిరి నిన్నుఁ జూచి
శాంతమూర్తివి గమ్ము - సభయుఁడౌ నంశు
మంతుకుమారుని - మన్నింపు" మనిన
గౌరవంబు హితంబు - ఘనమును గార్య
కారియు ధర్మయు - క్తంబునైనట్టి
తారానులాపంబు - తనకోపవహ్ని
నారించు జలధార - యైమట్టుపఱుపఁ
దాలిమితో నున్న - తనుజూచి మైని
చేల యూడిచి చల్వ - చేకొన్నయట్లు
వెఱవు దొరంగించి - వేడుకఁగాంచి
దొరతనమున కెల్ల - తోడనైన యట్టి
కాంచనమాలిక - కడనున్నపట్టె
మంచముపైనైచి - యుందహాసమున
మగువలు దాను ల - క్ష్మణుఁ జేరవచ్చి
మోమెత్తి నయయుక్త - ముగ నిట్టులనియె

— సుగ్రీవుఁడు లక్ష్మణునితోఁ బ్రసంగించుట —

" తనకు నీకపిరాజ - ధానియుఁ గీర్తి
యును గామినులు గల్మి - నొసఁగినవాఁడు
మీయన్నగాఁడె ? సౌ - మిత్రి ! యేనట్టి
కార్యంబు మఱచిన - కల్లసేయుదునె ?

రాముని చిత్తంబు - రా మెలంగకయె
భూమి నొక్కఁడు సౌఖ్య - మున నుండగలఁడె?
ఎల్లి రావణుఁ ద్రుంచి - యింతిఁ జేపట్ట
చల్లఁగా శ్రీరామ - చంద్రుఁ డుండును.
తాళంబులు నగంబు - ధరణియు నొక్క
కోల నాటఁగ నేయు - కోదండపతికి
రావణుఁ డెంత శ - రంబొక్క టేర్చి
కావలసినఁ ద్రుంప - గలఁడు విశ్వంబు!
అట్టివానికి నాస - హాయత యెంత?
చుట్టఱికము చేసి - గులకఁగాఁ జేయ
రాదని నిన్ను గా - రవము సేయుటకుఁ
గాదె వచ్చితి వెఱుఁ - గక వెఱచితిమి
మానవేల నిమిత్త - మాత్రుని నన్నుఁ
బూనింపఁ డెయ్యది - బుద్ధి చేసెదను
విల్లుమోపట్టిన - విశ్వమంతయును
తల్లడింపఁగఁ జేయు - దశరథాత్మజుఁడు
ఒకరితో డాస నే - యునె? నీదురాక
సకలంక కీర్తులే - నందితి నిపుడు
వెంట వచ్చెదను మీ - విక్రమావళులు
కంటకి మెచ్చుగాఁ - గనుఁగొనవలసి
మందెమేలమున నే - మఱి నీవురాక
ముందుగా నేను రా - ముని సన్నిధికిని
రాకయున్నట్టి నే - రము సహించి
చేకొని నన్ను ర - క్షింపుమీ యెడల"

అనిపల్క సౌమిత్రి - యర్కనందనుని
గనుఁగొని కరుణించి - క్రమ్మఱం బలికె

— లక్ష్మణుండు సుగ్రీవుని ననునయించుట. —

"నినువంటి దొర రాము - నికిఁ గల్గుకతన
దనుజుల గెల్చుటెం - తటిపని యింక
ఇంతకార్యంబు మే - మెంచుట నీతి
మంతుఁడవగు నిన్ను - మది నమ్మికాదె?
ఇటునటు బెదరించి - యేరీతినైన
దిటముగ నినుఁ దోడి - తేక మావలన
నేకార్య మీడేఱు? - నెందులో వార
మ కడమాచేత - నయ్యెడి దేమి?
రావణుఁడెక్కడ - రాముని దేవి
చావును బ్రదుకు నె - చ్చట మాకుఁ దెలుసు?
నీబల్మిఁబట్టుక - నేము రాక్షసుల
చేబల్మితోడ గె - ల్చెదమటుగాక
యీమాటఁ దలఁపగ - నెయ్యది శక్తి
నీమఱుఁగునను బూ - నితి మిట్టి పనికి?
సందేహమేల దు - ర్జయ శౌర్యనిధివి
యెందు నమ్మినవారి - నీడేర్పఁగలవు!
సత్యసంధుఁడవు ప్ర - జారంజకుఁడవు
మత్యుపాయ బలాభి - మానదక్షుఁడవు
యెంతయెంచిన నీకు - నే తగుగాన
నింతటివాఁడని - యెంచి చేరితిమి
యేనన్నమాట నీ - హృదయంబు లోనఁ

బూని నిల్వక యోర్చి - పోషింపుమమ్ము
నీకు రాఘవునకు - నేనొక్కరూప
నాకుఁ దప్పేది ? మ - న్ననకుఁ బాత్రుఁడవు
రాముఁడన్నది మాట - రామునితోడ
నామీఁద మీరొక్క - రన్నది మాట
మీమాటలును జెల్ల - మీ నిలుకడలు
మీమనంబు తెలుంగు - మిగిలిన వేల ?
కార్యాంతరుఁడ నౌటఁ - గన నేరనైతి
మర్యాద రాముఁడీ - మాటలు విన్న
నేమి వల్కునొ ? తన - కేమి యెగ్గైన ?
సీమీఁద భార మ - న్నియు నీకె తెలుసు
శ్రీరామవిభుఁడు చే - సిన సుకృతంబు
కారణంబుగ దైవ - గతిచేతఁ గాక
యాపద వేళకు - నడ్డమై నిలుచు
నీపాటి చుట్టమె - న్నిన వేఱె కలఁడె ?
మాకుఁ జుట్టము వను - మాట మాత్రంబె
యొకడ భుజబల - ధృతి విక్రమముల
సరివత్తు వెంచినఁ - జాలుదు వీవు
నిరుపమ వానరా - నీక సంగతిని
తామసింపఁగనేల - తనవెంటరమ్ము
రాముని కడకుఁ గా - ర్యంబులు గలవు.
ఆలిఁ గోల్పోయి యీ - యవధులకెల్లఁ
బాలైన రాముని - పై దయఁ దలఁచి
నాతప్పులెన్నక - నన్ను మన్నించి
ప్రీతుండవగు నీదు - పెంపుఁ దలంచి."

అనుమాట లాలించి - యనిలకుమారుఁ
గనుఁగొని వానరా - గ్రణి యిట్టులనియె.

— సుగ్రీవుఁడు తిరిగి సౌమిత్రితో సంభాషించుట - సీతను వెదకుటకు - వానరసైన్యము బంపుట —

" సేవకావళిని ర - క్షింప శిక్షింపఁ
దావిభుఁడౌట నీ - తానాయకుండు
పనిచినఁ దనుకార్య - భరము హేతువుగ
ననవలసినమాట - లనియె లక్ష్మణుఁడు.
అది నాకు భూషణం - బగుఁగాని యేమి
కొదవ యిట్లాడుటల్ - కొదవ యిర్వురకు?
నాకుఁ బ్రియోక్తు లా - నతి యియ్యఁ దగునె?
వాకొందురే కడ - వానికిఁ బోలి?
స్త్రీలోలుఁడగు నన్నుఁ - జెక్కిలిఁ గొట్టి
పాలుఁ ద్రావించె ద - బ్బరరాక యుండ!
దొరల చిత్తంబు లెం - దునకైన వచ్చుఁ
దరికొద్ది ఖేదమో - దములేల మనకు?
ఏమఱియుండరా - దిఁకనైన నీవు
తామసింపక మహేం - ద్ర నగంబునందు
కైలాసహిమ వింధ్య - కనకాచలేంద్ర
కీల పూర్వాస్తకు - త్కీలంబులందు
ఫలభారవినమిత - పాదపగహన
ములయందు మత్తేభ - ముల వోలియున్న
హరిణారుణాసితో - దారగాత్రులను
హరివీరులను మహో - హావజయోన్నతులఁ

గామసంచారులఁ - గామరూపులను
భీమబాహాబలో - పేతుల నెల్లఁ
బిలిపింపుమే మున్న - పిలువనంపితిని
బలశాలులైనట్టి - పడవాళ్ళచేతఁ
గామినీమణులందుఁ - గామభోగములఁ
దామసవృత్తిచే - దంగు వొమ్మనినఁ
దప్పించుకొందు రం - దఱు నిండ్లుమఱిగి
చెప్పించవగు మాట - చెవిసోఁక పలికి
పోయిరా పదిదినం - బులు మితిఁ జేసి
నాయాజ్ఞ వలికి వా - నరుల రప్పింపు.
ఆ గడువుకు రాని - యట్టివారలను
వేగంబె తలత్రెగ - వ్రేయుము నీవు
గొబ్బున నొకలక్ష - కోట్ల వానరుల
నిబ్బరంబుగఁ బోవ - నేర్చినవారి
నిందఱి గుఱుతులు - నెఱిఁగినవారి
నెందుఁ బూనిన పను - లీడేర్చు వారి
నంపుమీ''వన నట్ల - యనుపు వాయుజుని
పంపున బిలదీ - పర్వతగహన
వననిధి ద్వీపది - వ్యవనంబులందు
వనచరావళి నెల్ల - వరుసతో వెదకి
వేగుల వారలుఁ - బిలిచిన నలఘు
వేగంబుతోఁ గపి - వీరులందఱును
గాలమృత్యువసంగఁ - గనఁబడి కీలి
కీలయుఁబోలు సు - గ్రీవాజ్ఞచేత
నొకరైన యనుమతి - నుండకవచ్చి

రౌకముహూర్తమున సై - న్యోపేతులగుచు.
అంజనాచల వాసు - లై మూఁడు కోటు
లంజనాసిత వర్ణు - లైన వానరులు
హస్తాచలంబుఁ బా - యక పదికోట్లు
హస్తిలోమాన పచ్చ - నైన వానరులు
కైలాసముననుండి - కదలి నైకోట్లు
వేలంబు తెల్లగా - వియు వానరులు
వేయికోటుల మీఁద - వేయుగాఁ గెంపు
చాయల వలిగొండ - చక్క వానరులు
కపిశవర్ణంబులు - గనివేయి కోటు
లపుడు వింధ్యాద్రిపై - నమరు వానరులు
క్షీరాబ్ధి కడనుండి - చేరినవారు
నారికేళాశనుల్ - నవ్యతమాల
పల్లవవర్ణులు - పదినేఁకోటు
లల్లుక విడిసిన - యట్టివానరులు
నానానదీగిరి - నదవనాటవుల
నేనాఁడు నుండు న - నేకవానరులు
చేరిన హేమాద్రి - చెంతనున్నట్టి
వీరవానరులను - వేగంబె పిలిచి
యచ్చోట హనుమంతుఁ - డంపినఁ బిలువ
వచ్చిన వేగుల - వానరోత్తములు
హరుఁడు మున్నచ్చోట - యాగంబుఁ జేసి
హరికిఁ దానర్పించు - హవిరన్నరాశి
చెదరు నన్నంబెల్లఁ - జెట్టులై మొలిచి
యదనుగాకయుఁ బండు - నమృతోపమాన

ఫలములం దొక్కటి - భక్షించి రేని
నెలకు నాఁకలి దప్పి - నిద్రలేదనుచు
విన్నవారగుట న - వ్విపినంబులోన
నున్న ఫలావళు - లూర్చి కైకొనుచు
వెనుక సేనలురాఁగ - వేగంబెవచ్చి
యినకుమారునితోడ - నిని యుట్టివనుచుఁ
గానుక చేసి యే - కడ నన్న యట్టి
వానరవీరుల - వచ్చెదరనుచు
విన్నపంబొనరింప - విని రవిసుతుఁడు
మన్ననతో బహు - మానంబుఁ జేసి 4080
వారలఁ బనిచిన - వాలిసోదరుని
తో రఘువంశ చం - ద్రుని తమ్ముఁడనియె
"సంతోషమాయె నీ - సైన్యంబు రాక
యింతటి సాహాయ్య - మేరికిఁ గలదు ?
నెమ్మది సరిపోయె - నేమిద్వారమును
రమ్ము పోవుదము శ్రీ - రాముని కడకుఁ
గాక యీమాట - రాఘవునితోఁ బలుకు
మాకడ నేపత్తు నని యంటివేని
యిది బుద్ధి యనుమ"న్న - యిక్ష్వాకు కులుని
వదనంబుఁ జూచి నై - వ స్వతుఁడనియె. 4090
"నాకొక యిచ్చయే ? - నన్నురమ్మనిన
రాకయుండుదునె శ్రీ - రాము సన్నిధికి ?"

—సౌమిత్రితో సుగ్రీవుఁడు శ్రీరామునిఁజూడ నేఁగుట :—

అటులైన పోవుదమని - యప్పుడు తారు
నటు జూచి 'చతురంత - యానంబుఁ దెమ్ము

వేగ నిచ్చుటకని - వెలఁదుల నెల్ల
నేగతి నేయింట - నెవ్వారలుండ
నియమింప వలయు న - న్నింటికిఁ దగిన
నియతి మనోవర్తి - నిత్యకృత్యములు
నడిపింపఁదగు వారి - నగరి వాకిటను
బడగరంబులకును - బ్రహరిచుట్టుటకుఁ
బట్టణరక్షకా - ప్తత గలవారిఁ
గట్టడ చేసి యే - కార్యంబులకును
తార చెప్పినయట్ల - తనయాజ్ఞ నడవ
నేరు పాటుగఁ జేసి - యిచ్చె నుంగరము
ఆముద్రఁ గైకొని - యలివేణితార
రాముని కార్య ని - ర్వాహంబులకును
దగిన యాలోచనల్ - తనతోడ నడుప
నగునని యన్నియు - సంగీకరించి
యమ్మానవతి వెంట - నతివల నాద
రమ్మున సంతః పు - రమ్మున కనిచి
పయనమై తనమ్రోలఁ - బల్లకి యునుప
జయభేరి వేయించి - శాకనీకులను
రప్పించి శుభముహూ - ర్తమున నిల్వెడలి
యప్పుడుప్పొంగు రా - మానుజుఁ జూచి
"యీ పల్లకీమీఁద - నెక్కుఁడు నన్నుఁ
జేపట్టి యేను మీ - సేవ సేయుచును
వెంటవచ్చెద" నన్న - విని లక్ష్మణుండు
దంటగా నతని హ - స్తము కేలఁ బట్టి

యిరువురు నందుపై - నెక్కి యుత్సాహ
భరితులై యన్యోన్య - భాషణంబులను
బ్రమదంబు లందుచుఁ - బణవమృదంగ
ధిమిధిమి ధ్వానంబు - దిక్కులనిండ
కపుల కోలాహల - గంభీరరవము
లపుడు బ్రహ్మాండ మ - ల్లాడంగఁ జేయఁ
గాంచనచ్ఛత్ర ము - క్తాచామరంబు
లంచల లక్ష్మీస - హాయతఁ దెల్పఁ
గిలకిలారభటిఁ గి - ష్కింధాపురంబు
జలరాశి ఘూర్ణిల్లు - చందమై తోఁప
బురము వెల్వడి రయం - బుగ రాముఁడున్న
ధరణీధరంబు చెం - త వనంబులోనఁ
బల్లకి డిగి రఘు - పతిఁ జేర నేఁగి
యల్లనఁ గేల్మోడ్చి - యడుగుల వ్రాలు
వానరపతిఁ జూచి - వైదేహిమగఁడు
మానసంబానంద - మగ్నంబు గాఁగ
బదముల వ్రాలు నా - ప్త సహోదరులను
గదిసి లేవఁగనెత్తి - కౌఁగిటఁ జేర్చి
యగ్రభాగమున హ - స్తాభినయమున
"సుగ్రీవ! యిచటఁ గూ - ర్చుండు" మటంచు
నానతి యిచ్చిన - నటుసేయు నతని
జానకీజాని ప్ర - జ్ఞాశక్తి బలికె

— రామ సుగ్రీవ సంభాషణము. —

"ధర్మార్థములు మదిఁ - దలఁపక యాత్మ
శర్మంబె కోరి యి - చ్ఛావృత్తి వలనఁ

గామోపభోగ సం - గతి నున్నవాని
నేమిటఁ గొఱగాని - హీనుఁ గానెంచి
యార్యులు నిందింతు - రటుగాన తగన
మర్యాద నుచిత క - ర్మములాచరించి
మొలఁగుట ధర్మంబు - మేదినీరుహాము
బలువైన కొమ్మపైఁ - బవళించి యొకఁడు
యేమఱి నిదురించి - యిలఁ బడి వెనకఁ
దా మేను దెలియు చం - దంబగు గాన
కేవలకామంబు - కీడు శాత్రవు
నేవేళఁ గెలువ నూ - హింపగవలయు
నట్టిచో దండెత్తి - నరుల జయింపఁ
బట్టగుగాన యీ - పట్టున నీవు
నుద్యోగ మేమఱి - యుందువె ? యనిన
ఖద్యోతనిభు రాముఁ - గని యిట్లనియె.
' పోయిన రాజ్యంబు - పొలఁతియుఁ గలిమి
యోయయ్య ! నీవు నా - కొసగిత మొదలఁ
దరువాత నీ సుమి - త్రా కుమారకుఁడు
పరిపాలనము చేసి - పాలింపె నిపుడు !
ఉపకారమునకుఁ బ్ర - త్యుపకార మెవ్వఁ
డుపమించి సేయక - యుండునో వాఁడు
నీచుఁడు గాన వ - నేచరావళిని
యేచాయఁ గలవారి - నెల్లను గూర్చి
స్వామి కార్యమునకు - సవదరించితిని.
తామసించిరి నను - తప్పులో గొనుము
కామరూపులు దేవ - గంధర్వపుత్రు

లీమర్కటోత్తము - లీ యెలుఁగులును
దగిన గోలాంగూల - తతులును జాల
మగఁటిమి గలవారు - మహిమ గలారు
మేరువింధ్యాది భూ - మీరుహశ్రేణి
వీరేలుదుగొ చుట్టు - విడిసియున్నారు.
అందఱు రణశూరు - లందఱు మేరు
మందరశైలోప - మానాపఘనులు.
అందులో శతకోటు - లధిపతుల్ వారి
యందొక్కఁ డొకఁడు - కోట్యర్బుదశంఖ
పద్మమహాపద్మ- బలసమన్వితులు!
పద్మశాంధవునైనఁ - బట్టి తేఁగలరు
రావణుఁ బుత్రమి - త్రకళత్రయుతము
గా వధియింప నొ - క్కఁడె చాలువాఁడు
'సీతను దెచ్చెద - సెలవిమ్ము తనకు
సీతజే' ననియుత్స - హించినవారు
'ఏమెఱుఁగని యట్ట - యిరవులు గలవె?
భూమిజ నిపుడె చూ - పుదు' మనువారు
'ఈపాటి పనికైన - నేను రానేల?
నాపంపునకుఁ జాలు - నా?' యనువారు
'రావణుఁ దెచ్చిరా - రాముని యెదుర
నీవేళ నేనుంతు - నే!' యనువారు
నయ్యున్న యీవాన - రావళిఁ జూడు
మయ్య! నీమదిలోని - యలమటల్ దీఱు''
ననియిట్లు సుగ్రీవుఁ - డాడిన మాట
విని యుత్పలశ్యామ - విమలగాత్రుండు

శ్రీరామచంద్రుండు - చిత్తంబు పొదల
సూరతనూభవుఁ - జూచి యిట్లనియె
" వానలింద్రుఁడు మహి - వర్షించుటయును
భానుమండల మాత - పంబుఁ గాయుటయు
నిండు చందురుఁడు వె - న్నెలలు గాయుటయు
నండజస్వామి వి - హాయసంబునను
జరియించుటయు నీని - జ స్వభావములు
హరినాథ ! యిట్టిమ - హాను భావములు
నొరులకునుపకార - మొనరింప నీకుఁ
బరమ ధర్మంబైన - ప్రకృతి గుణంబు !
ఇదినీకు నెచ్చని - యెన్న నేమిటికి ?
మదినీవు దలఁచిన - మాత్రనే మాకు
సీతయుఁ జేకూడుఁ - జింతితార్థములు
చేతిలో నున్నవి - సిద్ధమింతయును
నిన్నుఁ బోలిన యట్టి - నెయ్యుఁడు గలుగ
నన్నిక యేల ? మా - కే కార్యములకు
శచి ననుహ్లాద రా - క్షస నాథుచేత
నచలవృత్తిపులోముఁ - డాది కాలమునఁ
జెఱపట్టి తెప్పించి - చేసి యింద్రుచేత
మరణంబు నొందిన - మాడ్కి రావణుఁడు
నీదండి గలుగ నా - నిశితాస్త్రములను
మేదినిపై గూలు - మిత్రులతోడ "
అనుమాట లాడుచో - నర్క మండలము
పెనుధూళి నడ్డపు - బిల్ల చందమునఁ
గనిపించి యేమియుఁ - గనిపించరాక

పెను చీకటులు దిశా - బృందంబుఁ గప్పె
ఏడు వారాసులు - నేకమై పొరలు
జాడ భోరున మహా - శబ్దంబు వింట
నిండె! సంతతిలోన - నిలిచెఁ గట్టెదురఁ

## — సీతను వెదకుటకు వానరనాయకులు తమ తమ బలములతో వచ్చుట —

గొండలీనిన యట్లు - కోఁతుల బారు
నదులఁ గాననముల - నలినాకరముల
నదములయందు న - నంతంబులైన
కమలకేసర శశాం - కరవిప్రకాశు
లమరాంశజుల పౌజు - లటు గనుపింప
జతఁగూడు మూఁకతో - శార్దూలసింహ
శతబలియైనట్టి - శతబలి యపుడు
కోటాను కోటులా - కోఁతులు మింట
దాఁటుచు రాఁగ ముం - దఱఁ బొడగనియెఁ
దరువాత నీలాంబు - దంబులంబోలు
హరులతో వానరా - ధ్యక్షుని మామ
తారాగరుండు ప్ర - తాపపావకుల
వీరవానరుల వే - వేలఁ గోటులను
గూరుచుకొని వచ్చి - కోదండపాణిఁ
జేరి యొక్కసలాము - జేసితాఁ జనియె
రుమ తండ్రియును నట్ల - రోహితవర్ణ
సమధిక గాత్రుల - సంఖ్యాభిరతులఁ

గొండలు వానర - కోటులఁ గూర్చి
పొందికగాఁ వచ్చి - పొడఁగని పోయె
పద్మకేసర విభా - పటలాంగుఁ డగుచుఁ
బద్మంబుపై లక్ష - బలము సేవింప
సామీరితండ్రి కే - సరియనువాఁడు
స్వామికి వచ్చి మ - స్తము వాంచి మ్రొక్కె
కపివరుల్ కోట్ల సం - ఖ్యలుగాఁగఁ గొలువ
నపుడు వేవేగ గ - వాక్షుఁడు వచ్చి
కండెముల్ దిరిగిన - కరములు మొగిచి
దండదానపు నడఁ - దావచ్చి మ్రొక్కె
వేత తానొక రెండు - వేలుఁ గోటులకు
వీరులా భల్లూక - విభులతోఁ గూడి
తామ్రాననము ప్రభా - తదిశను బోల
ధూమ్రుండు చుట్టల - తో వచ్చి కనియె
పర్వతాకారుఁడై - పద మూఁడు కోట్ల
పర్వతచరవీర - బలములతో వచ్చి
పనసుఁడు తనపేరు - భట్లు పద్యముల
వినుతింపఁ జేమోడ్చి - వెనుకకుఁ బోయెఁ
గాటుక కటికప్పుఁ - గలమేనితోడ
నాటియగా నంజనా - చలము వీనికిని
ననఁ బదికోట్ల మ - హాకపిశ్రేణి
తనుఁగొల్వ నీలుఁ డా - దల మ్రొక్కి చనియె
ఐదుకోటుల వాన - రాధిపు ల్గొల్వఁ
గైదండతో సము - ఖము దాఁకవచ్చి
కోతి కట్టికలు సాం - గు భళా! యనంగ

నేతాము వలెఁ జేతు - లెత్తి తా మ్రొక్కి
గవయుఁడు తనమూఁకఁ - గడకోసరించి
యవనిజావిభుని డా - యఁగవచ్చి నిలిచె
వేయికోటుల కపి - వీరులతోడఁ
జేయి మొగిడ్చి గ - ల్చెను దధిముఖుఁడు
నిండు వేడుక నాశ్వి - నేయనందనులు
వెండియు మైందవి - ద్వివిదులఁ వారు
వేయేసి కోటుల - వీర వానరులు
పాయక కొల్వ వెం - బడిఁబోడగనిరి
మూఁడు కోటుల కపి - ముఖ్యులతోడఁ
గూడి గజుండు తాఁ - గొల్వులో నిలిచె
పదికోట్లు భల్లూక - పతులు సేవింప
వదలని ధృతి జాంబ - వంతుండు వచ్చె
నారుమణ్వంతుఁడు - నప్పుడు వచ్చె
నూరుకోటుల కపీం - ద్రులు చేరికొల్వ
వేయికోటుల కపి - విభులతో వజ్ర
కాయులతో వచ్చె - గంధమాదనుఁడు.
నమ్మిన పదికోట్ల - నగచరుల్ గొల్వ
ముమ్మరమ్ముగ దధి - ముఖుఁడు కేల్మోగిచె
జంభారి విభవులై - శరభుఁడు వచ్చె
రంభుఁడు కుముదుఁడు - ప్రబల విక్రములు
కీశుల లెక్క మి - క్కిలిగాఁగ రాఘ
వేశునిఁ బొడఁగని - యేఁగిరవ్వలికి
శతశంఖ బలము ని - జంబుగాఁ గొల్వ
క్షితిసుతావిభుని ద - ర్శించె నంగదుఁడు

కోరితారుఁడు దుర్ము - ఖుం డింద్రభానుఁ
డేఁచుపాటుగ వార - నేక కోటులగు
వానరావళిఁ గూడి - వచ్చి రాఘవునిఁ
గానక లిడుపాడఁ - గని పోయిరపుడు
లాఁతివారలుగాక - లావరులైన
కోఁతులు తనువేయి - కోటులు గొల్వఁ
జాఁగిలి మ్రొక్కి యం - జలి చేసెనంత
నాగరికుం డంజ - నా నందనుండు!
నుతబలుల్ లక్షయు - నూఱు కోటులును
జితిపడినట్టికై - జీతంబువారు
వానరుల్ సేవింప - వచ్చి నలుండు
జానకీవిభున కం - జలి చేసి నిలిచె
ఈరీతి వానరు - లిలయు నింగియును
నీరంధ్రముగ దిశల్ - నిండ గర్జలను
నుప్పరం బెగయుచు - నుర్వి చలింపఁ
గుప్పించుచును మీఱి - కొప్పరింపుచును
వాలంబు లార్చుచు - వచ్చి భాస్కరుని
నీలమేఘంబులు - నిండుకొన్నట్లు
సుగ్రీవు నెదుట పౌ - జులుదీర రాఘ
వాగ్రణి మదికి న - త్యానందమయ్యె
అందఱి నందందు - నమరించి భాను
నందనుఁడా రఘు - నాయకుఁ జేరి
“ దేవ! యీవనుల న - ద్రిప్రదేశముల
నావారి విడియించి - నాఁడఁ బాళెముల
కపులెల్ల వచ్చిరి - గాన రావణుని

కపుడె సూరును నిండె ! - నవనిజ చేరె !
సందియంబేల ? ని - జమ్ముగా నమ్ము
మందఱ సేనల - యలవి యేర్పఱుప
నెంతవారును నేర - రిందఱు శౌర్య
వంతులు సురదాన - వజయాభిరతులు !
ఈవానరుల కెన్న - నినుమడి నాదు
సేవకులయి కై - జీతంపు మూఁక
కడలతోఁకల గోచి - కడలి నీరెల్ల
కడలను జల్లి యిం - కఁగఁ జేయఁగలరు
మేని సోఁకుల చేత - మేదినీధరవి
తానంబుఁ దూఱు పి - త్తఁగఁ జేయఁగలరు
ధరణీతలంబు పా - తాళంబు మోవ
నురగేంద్రుతోఁ ద్రొక్కి - యనుపంగఁ గలరు
అటునిటు గాలియ - ల్లాడంగనీక
ఘటికలో దెసకట్టు - కట్టంగఁ గలరు
నింగిపైఁ జరియింప - నీటిలో మెలఁగఁ
జంగున ద్వీపముల్ - చౌకళింపంగ
దొడ్డకొండలు దెచ్చి - దొంతరల్ వెట్ట
నడ్డి యేడది ! చేత - నగు వీరికెల్ల !
నీదుకార్యమునకు - నేఁడెల్లవారు
నోదేవ ! పనిపూని - యున్నారు వచ్చి
కామసంచారులుఁ - గామరూపకులుఁ
గామితార్థప్రదుల్ - కామవర్ధితులు
పనిఁగొమ్ము వీరలఁ - బనిచి ” నావుఁడును
విని భానుతనయుని - వీక్షించి యాతఁ

డాలింగిన మొనర్చి - "యాప్తులతోడ
నాలోచనము చేసి - యపనిజఁ దెచ్చు
పని నీకుఁ దీరని - భారంబు! మాకుఁ
బనియేమి? సేయని - పలుక నేరతుము
నీకెట్లు సరిపోయె - నీవది చేసి
కైకొను మాకల్ప - కమనీయకీర్తి"
అనవిని సుగ్రీవుఁ - డట్లకాకనుచు
వినతుని వానర - వీరునిఁ బిలిచి

— సుగ్రీవుఁడు వానరనాయకులను నాల్గు దిక్కులకు సీతను వెదకుటకు నాజ్ఞాపించుట —

"శూరుల భాస్కర - సోమసంతతుల
ధీరుల వానరా - ధిపులఁ గూడి
తూర్పుగాఁ బొమ్ము - తొలుత జాహ్నవిని
మీఱి యాసరయువు - మించి కౌశికియు
యమునయుఁ గనుఁగొని - యామున నగముఁ
గ్రమియించి సింధువుఁ - గని సరస్వతినిఁ
జూచి సరావతి - శోణనదంబు
నాచాయ బ్రహ్మమా - లాపగల్ వెదకి
మాళవకోసల - మగధ విదేహ
గౌళకాశీపుండ్ర - కౌశికముఖ్య
దేశంబులందు వై - దేహిని వెదకి
కోశగారంబు గ - న్గొని వెండిగనులు
గనుఁగొని మందరా - గమున వసించు
వనచరవిభుల న - వ్వలిదిశ కనిచి

యాయసముఖపురు - షాదకిరాత
కాయాద హేమాంగ - కర్ణ చూలులను
బఱికించి పచ్చిచేఁ - పలు దినువారి
నరయుచు జలవాసు - లైన వారలను
ద్వీపవాసులను న - దీప్రాంతభూమిఁ
జూపట్టు పురములు - చూచి శోధించి
సాఁగి యవద్వీప - సౌవర్ణకుడ్య
భాగముల్ సిహోర - పర్వతంబరసి
రత్నవంతము సాగ - రంబు వేలయును
యత్నంబుతోఁ జుట్టి - యచటి ద్వీపములు
మరుదేశముల దధి - మత్పర్వతంబు
నరసి యచ్చటనుండి - యతిశోణమైన
శరనిధి దాఁటి య - చ్చట బ్రహ్మచేత
వరమంది తమచాయ - వచ్చినవారి
యిరుగడ మింటిపై - నేఁగఁగ నీళ
తరిమి నీడలుపట్టి - తమరు మ్రింగుచును
ఛా యాపహారిదు - ష్కృవులనుఁ బోలు
ఛాయాగ్రహములపైఁ - జనక కేడించి
యావారినిధి దాఁటి - యవఁ బ్లక్షాఖ్య
చే వెలసిన దీవిఁ - జేరి శోధించి
ముందఱనిక్షు స - ముద్రంబుఁ జూచి,
యందులో ద్వీపంబు - లన్నియు వెదకి,
గుల్మలతావృక్ష - కోటి భాసురము
శాల్మలీ ద్వీపంబు - సరణిగా నరసి,
మధురసవార్ధి నే - మఱక శోధించి,

మధువాని యలయక – మాని యచ్చోట
గరుడి మూడ్కొని విశ్వ – కర్మనిర్మించు
గరుడని యింటి న – ల్గడ విచారించి
యందు భాస్కరునితో – ననిఁ జేసి పొలియు
మందేహులుండు ధా – మము విచారించి,
యవల గుశద్వీప – మారసి, నేతి
రవణంబు గల సము – ద్రంబున వెదకి,
క్రౌంచంబనెడి దీవిఁ – గాంచి శోధించి,
మించి పై దధివార్ధి – మీఱి యాకెలన
మొనయు శాకద్వీప – మునకేఁగి యవలఁ
దనరెడు పాలసం – ద్రము విచారించి,
యానడుమను వృష – భాచలంబరసి,
పైనున్న కాంచన – పద్మసరంబు
తెరవుగాఁ బుష్కర – ద్వీపంబుఁ జేరి
సరణి సుదర్శన – సరసి శోధించి,
యందుఁ గ్రీడించు వి – ద్యాధరయక్ష
బృందారకులఁ జూచి – పేర్కొని మ్రొక్కి
యాకడ శుద్ధోద – కాంబుధిఁ జూచి,
వ్యాకీర్ణమైన యౌ – ర్వక్రోధజనిత
బాడబానల శిఖా – పటలంబు నిగుడు
జాడగాఁ జనక యె – చ్చరికతోఁ దొలఁగి
యాతరి వివిధభూ – తారావములకు
భీతినొందక హేమ – పృథివీధరంబు
చేరి యానగముపై – శేషుని ధరణి
భారనిర్వాహు నీల – పరిధాను వేయి

తలలొప్పు వానిఁ జం - ద్రప్రభాగాత్రు
నలఘునిఁ ద్రిపటి స - మన్వితకనక
తాళధ్వజునిఁజూచి - దండనే యుదయ
శైలంబుఁ జేరి యో - జనమాత్రమునకుఁ
దగినట్టి వెడలుపు - దశయోజనములు
తెగయును గలుగు వే - దిక దానఁజూచి,
సౌమనసంబనఁ - జనినట్టి దిన్నె
హేమమయంబయి - యెసఁగుచో నచట
నాదిఁ ద్రివిక్రముఁ - డందుపై నొక్క
పాదంబు మేరువు - పై నొక్కయడుగు
నిలిపినాఁ డక్కొండ - నెళవు తూరుపున
బిలమా రసాతలా - భీలమై యుండు
నాజాడగావచ్చు - నక్కడా గట్టు
పైజంబు వొక్కటి - ప్రబలి మిన్నందు
నుదయవేళలయందు - నుష్ణమయూఖుఁ
డది చుట్టివచ్చు న - య్యవనీరుహంబు
శాఖలఁ దపములు - సలుపుచుండుదురు
వైఖానసుల్ మును - ల్వాలఖిల్యులును
నాయుదయాద్రిపై - నరసి, యవ్వలికిఁ
బోయి సుదర్శన - పుణ్యనామంబు
మిక్కిలి యగు దీవి - మీఱ వీక్షించి
యక్కడ నరుణాసం - ధ్యా ప్రకాశమునఁ
గనుపించు చోటులఁ - గని రండు మీఱి
చనకుఁ డవ్వలఁ దమి - స్రమునిండి యుండు
పొమ్ము మూఁకలఁగూడి - పోయి శోధించి

క్రమ్మర మొకనెల – గడువు చేసితిని.
ఆ మితికిని రాక – యాజ్ఞఁ గైకొనక
తామసించినవాఁడు – దండనీయుండు

— వినతుఁడు తూర్పుదిశకు వెడలుట —

వేగఁ బొమ్మని" పల్క – వినతుఁడు తూర్పు
సాఁగిపోయెను దన – సైన్యంబుతోడ.
తరువాత నీలమైం – దద్వివిదులను
గరువలి పట్టిని – గజుని గవాక్షు
శరభసుహోత్రుల – జాంబవద్గజుల
శరగుల్మ విజయకే – సరిపుంగవులను
గంధమాదనుని యం – గదుని సుషేణు
గంధేభసత్త్వను – ల్కాముఖు నలుని
రమ్మని తగినకా – ర్యంబది గాన
సమ్మతపడఁ బల్కి – జతకట్టుచేసి
"దక్షులు మీరు సీ – తను వెదకుటకు
దక్షిణదిశకు నిం – దఱుఁగూడి పొండు

—: అంగదాదులు దక్షిణ దిశకు వెడలుట :—

వానరోత్తములార ! – నైశిఖరములు
నానర్మదయును విం – ధ్యము భోగవతియు
వరదమేఖల శరా – వతి కృష్ణవేణిఁ
బరికింపుచును మహా – భాగయు దాఁటి
కదలి దశార్ణ న – గరములు చూచి
కదిసి కౌశిక కళిం – గ ఋషీకములును

దరసి మాహిష్మికా వి - దర్భదేశములు
నరసి యవ్వల దండ - కారణ్యమునకుఁ
బోయి గోదావరిఁ - బొడగని యవలి
చాయగా నంధ్ర దే - శంబెల్లఁ జూచి
చోళకేరళపాండ్య - శూరసేనములు
గౌళదేశమయోము - ఖమహీధరంబుఁ
గ్రమియించి యవ్వలఁ - గావేరి దాఁటి,
యమరు గంధపు కొండ - యండకుఁ జేరి,
యామలయాద్రిఁ బా - యని యగస్త్యునకుఁ
జేమోడ్చి యాయన - చేఁ జూపినట్టి
నెలవునఁ దామ్రప - ర్ణీనది దాఁటి
యిల నెన్నఁదగిన మ - హేంద్ర పర్వతము
భావింపుఁ డచ్చటి - పర్వకాలముల
దేవతానాథుఁ డిం - తే వేడ్క వచ్చు
కనుఁగొనుఁ డలపాండ్య - కనకకవాట
మన మీఱునది దక్షి - ణాంబుధి చెంతఁ
గాలూఁది నిలువ నే - కడ నాసలేక
యాలంక శతయోజ - నావధియైన
నడిమి వారాశిలో - నఁ ద్రికూటమనెడు
పొడవైన గట్టుపైఁ - బొలుపు వహించు
నదె రావణస్థాన - మచ్చోటఁ గలయ
వెదకుఁడు రాముదే - వేరి నేమఱక
అంగారక యనంగ - నాసురి లంక
సంగడి నది యుండు - ఛాయాగ్రహంబు

అచ్ఛోట నుండునో - యని మీకుఁ దెలియ
నిచ్చలోఁ గడు సంశ - యించి పల్కెదను
గట్టిగా శోధించి - కడలికి నవలి
గట్టునఁ బుష్పిత - కనకంబుఁ జేరి
యందొక్క రాజతా - యత శృంగ మొప్పు
నింద్రుఁ డయ్యెడఁ జరి - యించు నెల్లపుడు
నొక శిఖరము కన - కోజ్జ్వలంబగుచు
నకళంక మహిమ సూ - ర్యనివాసమయ్యెఁ
బాపాత్ములకుఁ గానఁ - బడదా నగంబు
చూపట్టునెడ మ్రొక్కి - చూడుఁడా నెలవు,
దాని యవ్వలఁ జతు - ర్దశ యోజనములఁ
దానొప్పు సూర్యవం - తముపేరి నగము
వైద్యుతంబను కొండ - వరలు నాదండ
హృద్యమై తగు సెల - యేరులచేత
స్థిరముగా నాదిమ - శిల్పి నిర్మితినిఁ
గరమొప్పు నచట న - గస్త్యుని నగము.
అది కాంచనమయంబు - నామడ వెళపు
పదియోజనముల నే - ర్పడు పొడవగుచుఁ
దెరఁ గొప్పు భోగవ - తీ సౌజ్ఞచేతఁ
పురము రంజిలు నది - భుజగులకెల్ల
వాసమై తనరు నే - వల నది యేలు
వాసుకి యన మహా - వ్యాళవల్లభుఁడు
ఆచెంత వృషభాద్రి - యన నొప్పు నందు
నేచాయఁ బరిమళా - నేక వస్తువులు
గోరోచనాగరు - కుంకుమమ్మృగమ

దారూఢరాసుల - యగ్రభాగములు
పదివేలు రోహితుఁ - డనెడి గంధర్వుఁ
డెదురెందు లేనియ - హీన శౌర్యమున
దక్షుఁడు వాని ప్ర - ధానులు శుకుఁడు
చక్షువు గ్రామణి - శైలూషు లనఁగ
నలువురు గాతురు - న్నతబలు లట్టి
పొలిమేర చెంగటఁ - బోక వర్తిలుఁడు
ఆవలఁ బితృలోక - మట యమపురము
పోవరాఁదగుట గో - బ్బున మీరు మఱలి
రండొక్క మాస ప - ర్యంతంబులోనఁ!
బొండెవ్వఁడైన భూ - పుత్రినిఁ జూచి
వచ్చిన వానికి - వలసిన విచ్చి
యిచ్చెద సగము నే - యేలు రాజ్యమున
నాదు ప్రాణములక - న్న హితుండు వాఁడు
వైదేహి యున్నట్టి - వార్తఁ దెచ్చినను,
నెలకు రానట్టి వా - ని వధింతు నేను
గెలుఁడు పొండ"నుచుఁ బ - ల్కి యనంతరమున

—: సుషేణుఁడు పడమటి దిక్కునకు వెడలుట —

ఘనుని సుషేణునిఁ - గాంచి "రా! మామ!"
యనుచు నల్లుఁడు గాన - నడుగుల వ్రాలి,
"ఈమరీచి కుమారు - లెల్ల నత్యంత
భీమపరాక్రమో - పేతులౌ వారు!
అంతటికన్న నీ - యర్యముల్ శౌర్య
వంతులు నీవెంట - వత్తు రీ రెండు

లక్షులతో నీవు – లక్ష్మణాగ్రజునిఁ
బక్షీకరించి యీ – పడమటి దిశకుఁ
జనుము సీతను గాంచి – చనుదెమ్ము మఱల
వినుము మార్గంబు నే – విన్నవించెదను.
ఎలమి సురాష్ట్ర బా – హ్లీకశూరదేశ
ములు బురంబులు వనం – బులు వెదకుచును
బడమరఁ బ్రవహించు – పావన నదుల
పొడగని యచటి త – పోవనావళుల
జాడగా పడమటి – జలరాశి నారి
కేడవుఁ దోఁపులఁ – గ్రీడించి చెంతఁ
జీకటి తోఁపులు – జేరి యచ్చోట
నాఁకలి దప్పులు – నలమటల్ దీఱి
మురజ జటీపట్ట – ములు నంగలోహ
పుర మవంతియుఁ గాంచి – భూమిజ వెదకి
శతశిఖరముల కాం – చనపర్వతంబు
జతనంబుతోఁ జేరి – శరభ వరాహ
వేదండసింహాది – వివిధ జంతువుల
యాదండఁ జేరక – యణఁకువ నేఁగి
పడమటిదిశ వజ్ర – పర్వతంబునకు
నడచుచో నిరువది – నాలుఁగుకోట్ల
గంధర్వులుందుర – క్కడ వారి మీఁదు
సంధింపఁ బోవక – సాధారణముగ
వీరు వానరులన – వెదకుఁ డాకొండ
నూఱు యోజనములం – దును జనకజను.
ఆవలఁ జని సహ – స్రారచక్రంబు

గావించె మును విశ్వ - కర్మ యచ్చోట
నది చక్రవన్నామ - కావనీధరము
వెదకుఁ డచ్చట దైత్య - విభుఁడొక్కరుండు
సాహసాఢ్యుఁడు పంచ - జనుఁడు వసింప
నాహరి గరుడవా - హనుఁడౌచు వచ్చి
యాచక్రమున వాని - యాదలఁ ద్రుంచి
భూచక్రమున నైచి - బొందుగలోన
శల్యమై తగు పాంచ - జన్యంబు భువన
కల్యాణకరము దాఁ - గైకొని యవియె
తనకుఁ గైదువులుగా - దామోదరుండు
చనియె మీరాచక్ర - శైలంబు వెదకి
యాజాడఁ జనుచోట - నఱువదినాల్గు
యోజనంబులమేర - నొప్పువరాహ
శైలంబునందుఁ గాం - చనరత్న శిఖర
జాలంబు ప్రాగ్జ్యోతి - షపురంబుఁ జుట్టి
యెసఁగు నాగిరి దుర్గ - మేలెడు నట్టి
యసురవల్లభు నర - కాసురుఁడండ్రు.
అది మీఱి మేఘవ - దాఖ్యపర్వతము
చదలు మోఁచిన శృంగ - చయములచేతఁ
బరగు మున్నది యింద్రుఁ - బట్టంబు గట్టు
పరమోత్సవము వేళ - భద్రాసనంబు!
అందగా నది చుట్టి - యఱువదివేలు
కొండలు సౌవర్ణ - కూటముల్ గలిగి
మెఱయు నాచెంత నే - మేరువు దాని
యఱుతఁ బ్రకాశించు - నస్తాచలంబు.

అచటికి రవి చేర - నఖిల దేవతలు
నచలితప్రీతి సా - యంసంధ్య యనుచు
నియమముల్ దీర్తురు - నిర్జరనగము
పటుయోజనంబులఁ - బదివేల మేరఁ
గ్రుంకుడుఁ గొండయె - క్కుడు వడితోడి
పంకజాప్తుని తేరు - పఱచు నింతయును
గడియలో మును విశ్వ - కర్మ యక్కొంగ
పొడవున నిర్మించెఁ - బురవరం బొకటి!
అల మేరు భూధరా - స్తాచలమధ్య
తలమున బంగరు - తాఁటి మ్రానొకటి
పది కొమ్మలను హేమ - ఫలములచేతఁ
జదలు మోచును మేరు - సావర్ణి యనెడు
నొకఋషి యచ్చోట - నున్నాఁడు మీర
లకలంక భక్తితో - నతనికి మ్రొక్కి
యావల నంధకా - రా వృతంబగుట
బోవక మఱలుఁడు - భూపుత్రి వెదకి
మితముఁ దప్పక రండు - మీ పుత్రి తార
హితమని తనమది - నెంచు నీతెఱఁగు!"
అని సుషేణుని బంచి - యపుడుత్తరముగ
జనకజ నీక్షింప - శతబలి ముఖులు
సేవించు శతబలిఁ - జేరంగఁ బిలిచి
కేవల ప్రీతి సు - గ్రీవుఁ డిట్లనియె.

— సుగ్రీవుఁడు శతబలి నుత్తరదిశకు సీతను వెదుకఁబంపుట —

"లక్షవానరులు గొ - ల్వఁగ సీతవెదక
యక్షేశు దిక్కుగా - నరుగుము నీవు

నీచేత శ్రీరాము - ని ఋణంబుఁ దీర్చి
యాచంద్రతారక - ఖ్యాతిఁ గాంచెదను!
సెలవిచ్చితిని శూర - సేనపుళింద
ములు జూచి ప్రస్థలం - బును భరతమును
కురుమద్ర కాంభోజ - కోసల యవన
కరహాటశక బాహ్లి - కంబులు జనక
పారసీకావంతి - భాగంబులెల్ల
నారసి తుహినాద్రి - కరిగి యవ్వలను
గాలపర్వత హేమ - గర్భసుదర్శ
నాలోకనమునఁ గృ - తార్థులై వెదకి
దేవనగముఁ జేరి - ధీరులై మీర
ఆవల శతయోజ - నాయత ధరణి
మరుభూమిగాన యే - మఱక యవ్వలను
హరనివాసము రజ - తాద్రి శోధించి
యలకాపురంబు య - క్షాధీశుఁడున్న
నెలవందుఁ గనుఁడీయ - నీరంబుచేత
నమరు విశాలసు - రోంబు పానమున
శ్రమమెల్లఁ దీరి క్రౌంచ - బిలంబుఁ జూచి
మఱికామశైలంబు - మానససరము
దరిసి మైనాక భూ - ధరమును మయుని
యిరవు విచారించి - యేఁగి యచ్చోటఁ
దిరుగు గుజ్జుపుమోము - తెఱవలఁ జూచి
వారి చెంగటనున్న - వాలఖిల్యులనుఁ
జేరి ప్రణామంబుఁ - జేసిజానకినిఁ

గగనపింపుఁ డనుచు వై - ఖానస నగముఁ
గని సార్వభౌము ది - గ్గజము నీక్షించి
కరణీశతంబుతోఁ - గలసి యాకరటి
చరియించుఁ జేరఁగఁ - జనక యాకెలన
వెదురు గుంపులు నట - వీ ప్రదేశములు
నదులను బసిఁడి కొం - డలు విచారించి
పోయి యుత్తరకురు - భూములయందుఁ
బాయక యిష్టార్థ - ఫలదంబు లగుచుఁ
గలధౌతమయములై - కనుపట్టువృక్ష
ములను నిత్యానంద - ములఁ గూడియున్న
పుణ్యదంపతులనుఁ - బొడగని యత్య
గణ్యమా సోమన - గంబు చెంగటను
నావాస మొనరించు - నఖిల దేవతల
సేవించి యుత్తర - సింధువుఁ గాంచి
యంతట మఱలి రం - డవలికి నరుగ
నెంతవారికిఁ దీర - దిప్పుడే కదలి
పొందు ముప్పది దినం - బులకును మరలి
రండు రాకున్న నే - రము వచ్చు మీకు
హితము సేయుదు నేను - నీరాఘవులకు
సతతంబు'' నని పల్కి - శతబలిఁ బనిచి
యందఱిలోపల - హనుమంతుఁ జూచి
యిందు రమ్మని పిల్చి - యేకాంతమునను
కార్యసాధకుఁడని - కడు నిశ్చయించి
యర్యమ తనయుఁ డి - ట్లని పల్కె నపుడు

— హనుమంతుని సుగ్రీవుఁడు దక్షిణదిశకుఁబంపుట :—

“ జగతిని దిక్కుల - జలధులయందు
గగనభాగమున స్వ - ర్గరసాతలముల
నీగమనంబెందు - నిర్నిరోధంబు
వేగంబు వాక్చిత్త - వృత్తాధికంబు
నప్రతిహతము నీ - యతులిత శౌర్య
మప్రమేయము నీమ - హాబాహుశక్తి
వనపర్వతద్వీప - వసుధాంబునిధులఁ
గని మున్ను నీవెఱుఁ - గనియవి లేవు
యక్ష గంధర్వ వి - ద్యాధర సిద్ధ
రాక్షసులకు నిల్వ - రాదు నీయెదుర
లలిత తేజోవేగ - లాఘవ సత్త్వ
ముల నీకు సరిలేరు - ముల్లోకములను!
అనిలుఁడు గాఁడు నీ - యంతటివాఁడు
జనకునికీ శక్తి - శతగుణాధికము!
అతిబుద్ధిచే నుపా - య బలంబుచేతఁ
బ్రతిలేని వాఁడవ - భంగ శీలుఁడవు
మృతిలేని వాఁడవు - మేనికి నస్త్ర
హతిలేని వాఁడవ - పాయ దూరుఁడవు
లక్షిత దేశకా - లజ్ఞాన నీతి
దక్షుఁడ వతివజ్ర - తరశరీరుఁడవు!
అన్న! నీవెటులైన - నవనిజఁ జూచి
నన్ను రాఘవునిఁ బ్రా - ణములతో నునుపు
మిందఱి బ్రతుకుల - కీవె కారణము
ముందఱ నీమనం - బునఁ దోఁచినట్లు

శోధించి వైదేహిఁ - జూచి వచ్చినను
సాధింప నేర్తువ - క్షయము పుణ్యంబు
కదలి స్వామికార్య - కర్తవు నీవు
పదువురకు నీమాట - పలుకులోవారు
నిన్నె నమ్మితి రాము - ని ఎదమ్ములాన
వన్నె వాసియుఁ దెమ్ము - వానరావళికి!"
అనిపల్కి యాదొర - లందఱు వినఁగఁ
గనిపించి మఱియు నీ - క్రమముగాఁ బలికె

— శ్రీరాముఁడు హనుమంతునకుఁ దనముద్దు టుంగరమిచ్చుట —

సౌమ్యన్న రాముఁడ - ప్పుడు విచారించి
యిమ్మారుతాత్మజుఁ - డిట్టివాఁడనుచు
మదినుంచి యపుడను - మానంబులేక
యిది కార్యమనుచు నా - మాంకితంబైన
యనుమతి రాముఁడూ - హించి లక్ష్మణుని
తన కడవ్రేలి కుం - దనపు టుంగరము
'పట్టము తరువాత - బ్రహ్మ పట్టంబు
గట్టెదని' కని - కట్టడ సేయు
రీతిగా నంజనా - ప్రియ కుమారకుని
చేతికి నిచ్చి "మా - సీతను నీవు
పొడగన్న యప్పుడా - భూపుత్రి నిన్నుఁ
గడునమ్మ నేరదు - గావున నీవు
యీ ముద్దుటుంగర - మిచ్చి యిచ్చోటి
సేమంబులెల్ల వ - చింపుదు వెనుక

నిన్ను సుగ్రీవుఁడు - నియమించినట్టి
యెన్నికయును నాదు - హృదయ వర్తనము
వదన వికాస భా - సము నిరూపితంబు
చెదర నీయక కార్య - సిద్ధిఁ దెల్పెడును
దను" మన్నఁ గరములు - సాఁచి యుంగరము
వినయంబుతో నంది - వినతుఁడై లేచి
చేనున్న ముద్రిక - శిరసుపై నుంచి
వానరప్రభులుకై - వారము ల్సేయ
వలుద చుక్కలలోని - వనజారి యనఁగ
వెలయుచు నుత్సాహ - విశదాత్ముఁడగుచు
'నీవానరాధీశు - లీవును గూడి
రావణు నగరి ధ - రాపుత్రిఁ జూచి
గెలిచి రండను' చు సు - గ్రీవుఁడు మఱియుఁ
బలికి పొమ్మనవుఁడు - ప్లవగ నాయకులు
ఎందెందు సుగ్రీవుఁ - డెవ్వారిఁ బనిచె
నందందు పయనమై - యప్పుడే కదలి
ధరయు నింగియు నిండి - దాఁటుచు మిడుత
పరివోలి దిశలు కం - పము నంద నడచి
పోయిన' నప్పుడే - ప్పుడు నెలవచ్చు
నీయెడ వేగింతు - వేనింక' ననుచు
సౌమిత్రి గూడి ప్ర - స్రవణ శైలమున
రాముఁడు దినములు - క్రమియింపుచుండె.
సాగె నుత్తరముగా - శతబలి మునుపు
వేగఁ దూఱుపునకు - వినతుఁడు చనియె.

అంగదాదులును బా - యక దక్షిణముగఁ
బొంగుచుఁ బవమాన - పుత్రుఁడు చనియె
మనసురంజిలఁ బడ - మటి దిక్కుగాఁగ
ఘనుఁడు సుషేణుఁడు - గదలె నాతఁడును
నలు దిక్కులందు వా - నర వీరు లట్లు
చలము బలంబు న - చ్చలమై చెలంగ
" నేనె రావణుఁ గాంతు - నేనె వధింతు
నేనె జానకిఁ దెచ్చి - యిత్తురామునకు "
ననుచు నందఱుచాఁ - కగ్గలికలను
జనుచు గర్జింపుచుఁ - జప్పరింపుచును
దాఁటుచు సింహనా - దములు సేయుచును
పేటెత్తి నగములు - పెకలఁ దన్నుచును
వాలంబు లార్చుచు - నెడినొక్కరొకరు
గేలి సేయుచుఁ బంత - గించి పాఱుచును
మొరములు వేయుచు - మేని సోఁకులను
తరువులు గూల్చుచు - దఱుము లాడుచును
' నేల మీరిందఱు - నీ కార్యమునకు ?
జాలుదు నేన ' ని - జగడించుకొనుచు
' నను జూడుఁ డ ' నుచు పం - తంబు లాడుచును
' చనుఁడు మీయాళ్ళకు - సైన్యంబు ' లనుచు
' పాతాళమున నున్నఁ - బగవానిఁ ద్రుంచి
సీతను గానక - సేతు నేన ' నుచు
' నిల ప్రక్కలింతునో - యీ విశ్వమెల్లఁ
దలక్రిందు సేతునో - తను జూడుఁ ' డనుచు
' నామడ రెండు మూఁ - డామడలైన

నేమి ? దాఁటుదము ర - మ్మా ' వను వారు
'రావణుఁ డోఁక నూ - రకఁ గట్టి రాము
దేవి మూఁపున నుంచి - తెత్త'ను వారు
'యెందున్న జానకి - నేఁడెత్తు నొకఁడు
పందెమాడునె !' యంచుఁ - బచరించువారు
'అందఱు నుండఁగ - హనుమంతుఁ బిలిచి
యింద యంచును జేతి - కిచ్చెనుంగరము
తా నేమి యెఱుఁగు ? నిం - దఱు వానికన్న
హీనులే ? కనుఁగొంద - మిఁక ' ననువారు
అతఁడేమి సేయు ? రా - జైనట్టివాఁడు
మితిలేని పొగడికల్ - మిక్కిలి పొగడ
కాఁబోలు నను చు నుం - గరము చేతికిని
తాఁబిల్చి యిచ్చె నీ - తా నాయకుండు !
కనుపించుకొను వేళ - గాదని తాళు
కొని యుంటినపుడు నా - కోపంబణంచి
చేరి చెక్కిలిఁ గొట్టి - చేతి యుంగరము
తేరోరి యని పల్క - దినకరాత్మజుఁడు
తా నేమి సేయునో ? - దశరథాత్మజుఁడు
తా నేమి సేయునో ? - తెప్పె గార్యంబు !'
అనువారు ' హోరోరి ! - యది యేటిమాట ?
మనమెల్ల నాహను - మంతుని వాల
రోమ మాత్రము లేమె - ఱుంగమే యతని
సామర్థ్య మటు సేయఁ - జను ' ననువారు
నగుచు వానరు లట్టు - హాసంబుచేత
గగనంబు పుడమియుఁ - గంపింపఁ గదలి

చనినఁ బ్రభాకర - సంతతిం జూచి
అనఘాత్మకుఁడు లక్ష్మ - ణాగ్రజుఁ డనియె
" ఏరీతి నెఱిఁగితి - వీ విశ్వ మెల్లఁ?
దీరునే యొరులకుఁ - దెలుపు లేర్పఱుప?
ఎన్నఁడు చూచితి? - వెవ్వారిచేత
విన్నావు? దివ్యవి - వేకమౌఁ గాక!
పూసగ్రుచ్చిన యట్లు - భుజపత్రికలను
వ్రాసి పారము సేయు - నైఖరిఁ జిత్ర
పటము చెప్పిన యట్లు - పటుబుద్ధి చేత
నెటువలె వాకొంటి? - విన్నిదిక్కులను! 4780
చూచి రేనియు నవి - సులభమే మదికి
గోచరించి వచింపఁ - గూడునే యట్లు?
ఇంతప్రజ్ఞాశక్తి - యేరీతిఁగలిగె?
నంతయు వివరింపు" - మన రాముఁ జూచి
కరములు ముకుళించి - కలయట్టిరీతి
తరణితనూజుఁ డం - తయు విన్నవించె.

— సుగ్రీవుఁడు రామునకు సీతను వానరులు వెదకిన విశేషములను చెప్పుట —

" అయ్య! దుందుభికి మా - యన్నకు మొదట
కయ్యంబు నడచిన - కార్యమంతయును
విన్నవించితి గద - విబుధుఁడై యున్న
నన్ను మావాలి మి - న్నక యాగ్రహించి 4790
తరిమిన నతనిచేఁ - దాడికిఁ గాక
కొలఁది ద్రిప్పిన యట్లు - కుంభిని యెల్ల

దిక్కులు సాగర - ద్వీపముల్ దాటి
యక్కడక్కడ తమం - బవధిగా మఱలి
చేరఁ జొచ్చుటఁ - జింతింపలేక
పాఱెడు తను జూచి - పవమానసుతుఁడు
మును మతంగుని శాప - మున ఋశ్యమూక
మను కొండచుట్టు మీ - యన్న రావెఱచు
నాయద్రిపై నున్న - నన్ని ఖేదములు
వాయుదమని పల్కి - పావని మాటఁ
జేసితి నటుగాన - చిత్తంబులోన
నేసర్వమును జూచి - యెఱిఁగి యుండుదును."
అనుచుఁ బల్కిన యంత - నన్ని దిక్కులకుఁ
జనిన వానరులు మా - సమితంబునకును
బాయక సీతను - బగలెల్ల వెదకి
రేయి సిద్రించి కో - రిన ఫలావళులు
మెసవుచు నెందు భూ - మిజఁ గానలేక
యసురుసురై వచ్చి - నట్టమార్గమున
నందఱు వచ్చిరి - యా వినతుండు
'ముందుగాఁ బూర్వాభి - ముఖమునఁబోయి
తాఁగాన'నియె నం - తట శతబలియుఁ
'దాఁగాననవియె ను - త్తరపు దిక్కునను.'
వారివెంబడిఁ దాను - వచ్చి సుషేణుఁ
డారీతి వచియించె - నర్కజుతోడ.
తమరు వోయిన పోక - తమవచ్చురాక
తమ యగచాటులు - తడవిరిగాని
యందొక్కఁడైన నే - నవనిజఁ గంటి

నిందునన్నట్టి వాఁ - డెవ్వఁడు లేక
యాస దీఱఁగఁ బల్క - నది విని మిగుల
గాసిచే రఘుపతి - కన్నీరు రాల్ప
నందఱు ప్రాణముల్ - హనుమంతు మాట
యందుఁ గీల్కొనఁజేసి - యడియాస చేత
"యెప్పుడు వచ్చునో - యీనెల గడువు
తప్పె నాయనరాక - తామస బయ్యె
సీతను జూచి వ - చ్చినమేలు కాక
యేతరి వెదకితి - నెచ్చోటఁ గాన
నను నంతకన్న రా - నట్టిదేమేలు
తనచేనిలోని విం - దఱి బ్రదుకులును"
అనుచు విచారింప - హనుమంతుఁడచటఁ
దన వెంట దారాంగ - దకుమారముఖులు
కూడి రాదన నది - కోటలు గిరులు
జాడల వెదకుచు - చవులైనయట్టి
ఫలములు మెసవుచుఁ - బతిచెప్పినట్టి
నెళవులఁ గాలూఁది - నిలువక తిరిగి
జనకిజఁ గానక - చనిచని కండుఁ
డను మునీశ్వరుని మ - హాశ్రమంబునకు
నందఱు గుమిగూడి - యరుదేర నచట
నెందెందుఁ జూచిన - నేమియు లేక
యతిఘోరతపము సే - యఁగఁ దొల్లి యతని
సుతుఁడీల్గుటయుఁ బుత్ర - శోకంబుచేత
నావనంబెల్ల మృ - గాంబు భూమీరు
హావళి యుడివోయి - యూవళినొంది

పాడఱుగాకని - పదరి శపింప
నాఁడాదిగా నిర్జ - నస్థలం బగుచు
నున్నది గాన వా - రోడక సీత
నన్నెలవుల నెల్ల - నారసి చూచి
కానక యొక్క రా - క్షసుని వీక్షించి
వానరవీరుల - వాఁడును జూచి
"ఎక్కటివారు ? మీ - రేఁటికి వచ్చి
చిక్కితి రిపుడు నా - చేతిలోపలికి ?
పోనిత్తునే ?" యని - పొడవుగా భయద
మైనట్టి తనదు బా - హాయుగళంబుఁ
జాఁచుక వచ్చు రా - క్షసుని వీక్షించి
కొంచవారక వాలి - కొడు కాగ్రహించి
చెకొద్ది రొమ్ము వ్రే - సిన సొమ్మసిల్లి
మోకరించుక ప్రాణ - ములు వోయి పడియె.
దానవుఁ బోరిఁగొన్న - తమ యువరాజు
వానరులెల్ల జై - వారముల్ చేసి
యాచుట్టు నెళవుల - నవనిజ వెదకి
యేచోటఁ గానక - యెల్లరు గూడి
యలసి యాకెలని మ - హామహీరుహము
చలువ నీడను వరు - సను గూరుచుండి
తనవారితో నంగ - దకుమారకుండు
తనువెల్ల నలసి కొం - దలముతోఁ బలికె.
" మనచేత నైన క్ర - మంబున రాజు
చనుమన్న చోటికిఁ - జని చూడుమన్న
చోటులు కలియంగఁ - జూచి వేసరక

దాఁటుమన్న నగాలి - దాఁటి వాహినులు
చూడఁగున్నవి యెల్ల - చూచి యేరీతి
నాడించె నటులెల్ల - నాడి యింతయును
రిత్త వోవంగ ధ - రిత్రీతనూజ
నిత్తఱిఁ గనమైతి - మిఁక నేఁటిబ్రదుకు ?
కానలేమని పోయి - గడువునకైన
భానుజుఁ జేరిన - బ్రదికించు నతఁడు
మితమును మీఱి భూ - మిజఁ గానకున్న
నతఁడుగ్రశాసనుఁ - డగుట యెఱింగి
జీవనాపేక్షలు - సెల్లునే యింకఁ
గావున నిదురయాఁ - కలి దప్పులుడిగి
వెదకుఁడు సీతను - విశ్వంబులోన !
పదరక చేతనా - పాటులఁ బడినఁ
గార్యమొక్కటి దైవ - గతిని సిద్ధించు
మర్యాదమాని యే - మఱియున్నవారు
రామసుగ్రీవుల - క్రమము నాజ్ఞయును
మానసంబులుకుందె - మేనులువాడె !
అలసితి మాకొంటి - మని ప్రాలుమాలి
చలువ నీడను సుఖ - శయనులైనారు.
వచియించితి" నటన్న - వాలినందనుని
వచనంబు విని మాల్యవ - వంతునిఁ జూచి
గంధమాదనుఁ"డిది - కార్యమా ప్రాణ
బంధులైనను బట్టి - భానునందనుఁడు
తప్పిన దండించుఁ - దగదు రం"డనుచు
నప్పు డందఱు లేచి - యలయిక లేక

సీతను వెదకి ద - క్షిణముగా వచ్చి
ధౌతప్రభాధగ - ద్ధగితమై తమకుఁ
గనుపట్టెనో వచ్చి - కైలాసమనఁగఁ
దనరు రాజిత మహీ - ధరము నీక్షించి
యా వెండికొండ డా - యఁగఁబోయి యెల్ల
తావులఁ జల్లని - తావులు చల్లు
కపురంపుటనఁటులు - ఖర్జూరములును
దపనీయ కమలశ్రీ - తళసరోజినుల
గనుఁగొని తమపని - గట్టెక్కకునికి
యనువున నాకొండ - నందఱు నెక్కి
యాచాయ నుండునో - యవనిజ యనుచుఁ
జూచియుఁ గానక - చూతముగాక
చూతమున్నట్టి యా - చోటని డిగ్గి
శీతలంబైన యా - చెట్టుక్రిందటను
వెదకియుఁ గానక - వింధ్యాద్రిఁ జేరి
యదియును జూచి తా - రాంగదాదులఁ
దాఁగూడి పవమాన - తనయుఁడు గుహలు
వాఁగులుఁ గోనలు - వనములు చరులు
దక్షుఁడై వెదకి యా - ధరణీధరమున
రాక్షసు మూల ఘో - రద్వారమైన
బిలముఁ గన్గొని చేరఁ - బిలుచుచుఁ దార
నలనీలకుముదమైం - దద్వివిదులును
వాయుజుండును జాంబ - వంతుఁ డంగదుఁడు
నాయెడ గజగవ - యగవాక్షముఖులు
నందఱు గుమిగూడి - యాఁకట నొగిలి

యందుఁ బ్రవేశింప - ననువుగాకున్నఁ
జింతిల్లునెడ తడి - సినతెక్కలను శ
కుంతముల్ బకహంస - కోయష్టికములు
మొదలైన యవిరాగ - ముదితులై బిలముఁ
గదియంగరాక యా - కడనున్న యొక్క
దనుజుని గేహమం - దఱుఁ జూచుచుండ
హనుమంతుఁడా వాన - రావళిఁ జూచి,
"ఇదె వచ్చె జలపక్షు - లీగుహనుండి
నదియైన దొనయైన - నడబావియైనఁ
జెఱువైనఁ గొలనైన - సిద్ధమిచ్చోట
నిరవుకొన్నది చూడుఁ - డీ భూరుహములు
చెంగలించిన బాగు - చీకటుల్గదిసి
చెంగట మనకిది - చేరంగరాదు.

ఐన నేమాయె? రం - డని" యాబిలంబుఁ
దాను మున్నుగఁ జొచ్చి - తనవారలెల్ల
వెనుకొని రాఁబోవ - విపులతేజములు
పనికిరావయ్యె నా - పాటివారలకు
మఱి పోవఁ బోవ ము - మ్మరముగా నెదురఁ
దెరవుఁ గానంగని - దివ్యతేజంబు
దిగదిగ వెలుఁగుచో - దృష్టింపలేక
మొగిడించి కన్నులు - ముందఱవెనక
కానక యొక్కఁడొ - క్కనిఁ గౌఁగలించి
మేనులు మఱచి యే - మియుఁ దెల్విలేక
యొకయోజనముమేర - యూరకపోయి
యొకరైన వాయెత్త - నోపక భ్రమసి

దగదొట్టి నాల్కలఁ - దడిలేక చాల
దిగులుతో దప్పివా - తెఱలెండఁబాఱి
బ్రదుకుల యాస స్వ - ప్నములందు లేక
చదికలఁ బడువానిఁ - జదియఁద్రొక్కుచును
బడుచు లేచుచు గాలి - పట్టియే తక్క
కడమవారెల్ల న - గ్గలికలే కరిగి
యావలఁ జనుచోట - నరజామునకును
కావిరి విఱిఁగిన - క్రమముతోఁ దమకు
నలమట లెడవాసి - యజ్ఞానముడిగి
తెలివిడి వచ్చిన - దృష్టించునపుడు
కనుమ్రోలఁ గాంచన - కలధౌతభూజ
వనములు చూచి యా - వలఁబోవ హేమ
కమలముల్ నవరత్న - కర్ణికావళులు
విమలముక్తాఫల - వీచికాగణము
కలహంస చక్రవా - కక్రౌంచ మిథున
విలసనంబులు గల్గు - విపులదీర్ఘికలు
కాంచి ముందఱఁ జూడఁ - గనగన వెలుఁగు
కాంచన వప్రంబుఁ - గనక సౌధములు
మకరాల గోడలు - మణికుట్టిమములు
పగడాల కొణిగలు - పసిఁడి తల్పులును
బచ్చతోరణములు - బరువుముత్తియపుఁ
గుచ్చులు జల్లులు - గోమేధికముల
జాలకంబులు పారి - జాతప్రసూన
మాలికలును నీల - మయవేదికలును
పట్టపటుధ్వజ - పాళిక ల్మణుల

మెట్టికలును హేమ - మృగ చిత్రచయము
నవరత్నరథము లు - న్నత గోపురములు
భవనముల్ సావళ్లు - పడకిండ్లు తెరలు
పట్టిమంచంబులు - పఱపులు మేల్మి
పట్టు తలాడలు - బటువు బిల్లలును
మణిదీప కణికలు - మర్దలవేణు
పణవమృదంగాది - బహుసాధనములు
రత్నకంబళ్లు ప - రంగి పీటలును
రత్నపాత్రికలు నా - రతి పళ్లెరములు
కాళికాగరు ధూప - గంధసంవాసి
తాళాంతరాళర - మ్య ప్రదేశములు
వివిధవస్తు సమృద్ధ - విపణివీధికలు
పువ్వులు గస్తురిగంధ - వాడికదంబములు
మదిరాఘటంబులు - మాంసరాసులును
పొదిగొన్న దధ్యాజ్య - పూర్ణకుంభములు
కాంచనరాసులు - గలిగిన యట్టి
కాంచనపురము చెం - గట విలోకించి
మందునకైనను - మానిసి కులము
పొందికలేనట్టి - పురములోఁ జొచ్చి
హరివరుల్ కనకల - తావళితోడ
బెరస కెంపులతేనె - పెరలు ఝుమ్మనుచు
నపరంజి తుమ్మెద - లాడ వైడూర్య
విపుల ప్రసవగుచ్ఛ - విశదమై కనక
కేసరామృతరసా - కీర్ణమై హేమ
భాసి రజోబృంద - భరితమై శాత

కుంభ నానాపక్షి - కోటియై కవక
సంభార ఫలనమ్ర - శాఖియై పోలుచు
నొక్కబీజమునీడ - నొసపరి చన్ను
జక్కవల్ చీరవ - స్త్రము మాటుపఱుప
మూయుఁ గన్నులతోడ - మువ్వన్నె మెకము
మేయొల్పు జఘనంబు - మీఁద రాణింపఁ
జిగురు చేతులు కల్వ - చెలికాని లోఁ
సగమైన నుదుట నం - జలితోడఁ గూడ
కాఁక దీరుకడాని - కమ్మియో యనఁగ
వ్రేఁకమౌ తనముచే - వెలుఁగు నంగమున
జాళువా పావల - చరణ పద్మములు
వాలిచి వ్రాల్పక - వనభూమి నెగయు
నుదిరి దుమ్మునఁ గప్పి - యున్నట్టి తపసి
ముదితను జూచి క - మ్మనక వారలెల్ల
బెన్నిధిఁ గనుఁగొన్న - పేదయుఁబోలి
సన్నుతింపుచు నమ - స్కారముల్ చేసి
యందఱు గడనుండ - హనుమంతుఁడపుడు
ముందఱ నిల్చి కే - ల్మోగిచి యిట్లనియె

## —· స్వయంప్రభా వృత్తాంతము ·—

"అమ్మ! నీపేరెద్ది? - యసహాయవగుచు
నిమ్మనఁ దపమూన - నేమి గారణము?
ఈపురం బెయ్యది? - యెందు నెవ్వరును
జూపట్ట రదియేమి? - చోద్యమేర్పఱుపు
దీనుల మముఁ గృపా - దృష్టినీక్షించి

మానుపు మొకమాట - మావిచారములు!
దేవతారమణివో! - తెలుపు మావిపిన
దేవతవో? నీవ - దిక్కుగా నిలుచు
నీపురలక్ష్మివో! - యిపుడు మాపాలఁ
జూపట్టు పుణ్య మె - చ్చునఁ దీఱినదియొ? 5020
ఆనతి యీవమ్మ! - యవనిజ వెదకఁ
బూని సుగ్రీవు పం - పున వచ్చినాము
ఆఁకలి దప్పుల - నలసిన మేము
చీకటి బిలముఁ జొ - చ్చితిమి నిరాశ
నీరత్నరాసులు - నీహేమరాసు
లీరమణీయ మ - హీరుహంబులును
నీపట్టణమపార - హేమమాణిక్య
దీపప్రకాశ సం - దీప సౌధములు
నెవ్వరి సొమ్ము నీ - వింతియొ కాని
యెవ్వరు లేరిందు - నెందుఁ జూచినను 5030
అనినఁ దపస్విని - హనుమంతుమోముఁ
గనుఁగొని యుచితవా - క్యముల నిట్లనియె.
"మాయావియైనట్టి - మయుఁడు పూర్వమున
నాయబ్జసంభవు - న త్మగుతించి
తపము గావించి ధా - తవరంబుచేతఁ
జపలాక్షి హేమన - చ్చర జాతిదాని
దివినిఁ బట్టుకవచ్చి - తెరువెందు లేని
వివరంబుఁ గల్పించి - విపులాంతరమున
శైలంబుక్రింద కాం - చన రత్నమయవి
శాలమౌ నగరమి - చాయఁగావించి 5040

యాకొమ్మయును దాను - నరమర లేని
యేకాంత సుఖముల - నెల్ల భోగముల
నొంటి కాపురము సే - యుచునుండ నతని
వెంటాడి తనచేఁబ - వి ప్రహారమున
గిరియును దొలిచి వా - కిలిచేసి మయునిఁ
బొరిఁగొని హేమను - బూఁదేరుమీఁద
నెక్కించుకొని యింద్రుఁ - డేఁగెడువేళ
నక్కొమ్మ నెచ్చెలి - నైనట్టి కతన
నను నుండుమనుచు నీ - నగరంబులోన
నునిచి తాఁబోయె నే - నున్నట్టి దాన!
మేరుసావర్ణి కూ - ర్మితనూజ నేను
పేరు స్వయంప్రభ - పెక్కేండ్లనుండి
మహనీయ యోగస - మాధిచే నిచట
విహరింతు వలసిన - వేళ నెందైన
నరుగుదు వేలుపు - లర్థించి చేరఁ
బరిచర్య సేతు సం - భావించి వారి.
ఎవ్వరివారు? మీ - రేనిమిత్తముగ
నివ్విపినమునకు - నేతెంచినారు?
బిలముఁ జొచ్చితి రే య - పేక్షచే? నేమి
వలసిన నిత్తు భా - వముల నున్నట్టి
పలుకులు మీకు దె - ల్పఁగ నాకు వినఁగ
నలవగునేని యే - నడిగితిఁ గాన
యన విని హనుమంతుఁ - డంజలిచేసి
వినుమని జడదారి - వెలఁదికిట్లనియె
"దశరథసుతుఁడు సీ - తానాయకుండు

శశివదనుఁడు రామ - చంద్రుండు తాను
తమ్ముఁడు ఖాగువయుఁ - దండ్రి వాక్యంబు
నెమ్మది నుంచి వ - నీభాగములకు
వచ్చి వసింప రా - వణుఁడు జానకిని
మ్రుచ్చిలి కొనిపోయి - మోసపుచ్చుటయు
నారాఘవుండు సూ - ర్యతనూజుతోడ
పోరామి చేసి యి - ప్పుడుమమ్ము బిలిచి
‘ధరణిజ వెదకుఁడు - దక్షిణ దిశను
సరగున రండు మా - సములోనె మఱలి’
అని మమ్ము బనిచి మా - యట్టివానరుల
ననిచిరి వెదుకంగ - నన్నిదిక్కులకు
నేము వచ్చిన వార - మెల్లచోటులను
భూమిజ వెదకి యి - ప్పుడు చాలనలసి
యీయెడఁ దడిసిన - యెఱకలతోడ
నేయిముద్దలవంటి - నీడజశ్రేణి
బిలము వాకిట తమ - పెంటులతోడ
వెలువడఁ జూచి మీ - వివరంబులోన
నీరము ల్గలవని - యేమిందుఁజేరి
నీరంధ్రమగు తమో - నివహంబుఁజొచ్చి
వెలుఁగు లోపలఁ జిక్కు - విధమునఁ బెద్ద
వెలుఁగులో నుడివడి - వెదకంగ లేక
ప్రాణముల్ పిడికిటఁ - బట్టుకకొంత
త్రాణఁ దెచ్చుకొని యం - దఱము నీవలికి
సాగి వచ్చితిమి కాం - చనపురిఁ జూచి
యోగిని! యొకకొంత - యూరడిల్లితిమి?

జలములానితిమి ర - సాలాది పక్వ
ఫలములు మెసవి క్షు - ద్బాధ వాసితిమి
ఎన్ని నాళ్లాయె మే - మిచటికి వచ్చి?
కన్నియ! మఱలిపో - గానము తెరువు
దరిఁ జేర్పు మమ్ము నిం - దఱి నీవు సేయు
పరమోపకారంబు - భావంబు లందు
నిలుపుటెంతియొ కాక - నేర్తుమే నీకు
కలకంఠి! ప్రత్యుప - కారంబు సేయ
వనచరులము గాన - వరకృపాదృష్టిఁ
గను" మన్న సావర్ణి - కన్నె యిట్లనియె.
శ్రీరాము కార్యంబుఁ - జేసెదమనుచుఁ
జేరిన మిమ్ముఁ జూ - చినయంతె చాలు
మీకేమి వలయు నీ - మేరఁ గల్గినవి
వాకొని కైకొని - స్వాదునీరంబు
నానాఫలంబులిం - దఱు దృప్తిఁ దీఱ
నాని పొందనవుఁడు - హనుమంతుఁడనియె.
"కమలాక్షి! మమువంటి - కపులకీ త్రోవ
నమరించితి వయాచి - తాతిథ్య మీవు!
అన్నిటఁ దృప్తుల - మైతిమిమమ్ము
మన్నించి దరిఁ జేర్చు - మార్గంబు గనుము
అర్కనందనుని యా - జ్ఞాపాల మేము
కర్కశుఁడా రాజు - గడువును మీఱె
వెడలనంపుట పది - వేలు మాక" నుచు
నుడివినయట్టి హ - నూమంతుఁ జూచి
"ఏరికిఁ బోవరా - దిచటికి వచ్చి

మీరెల్ల నొక్కని - మేష మాత్రంబు
కన్నులు మూసుక - కదలకయుండుఁ"
డన్న వానరులెల్ల - నటుల సేయుటయుఁ
గరములఁ గన్నులు - గప్పక యున్న
హరివీరవరుల మ - హాయోగశక్తి
బిలము వెల్వలఁదెచ్చి - పెట్టియూరార్చి
చలప మాటలు వల్కి - "జలరాశి యిదియె!
ఇదె ప్రస్రవణశైల - మిదియె వింధ్యాద్రి
యిది యుదయాచలం - బిదియ స్తనగము
తెలిసికొండ" ని నాల్గు - దిక్కులేర్పఱచి
వలసిన యెడకేఁగి - వత్తురు గాక
మేలు గావలయును - మీకెల్ల" ననుచు
చాలదీవించి కాం - చనగాత్రి చనిన
బయలుదేరిన యంత - భ్రమయును దీఱి
పయనమై జనకజఁ - బరికింప మనుచుఁ
జూచుచో వికచప్ర - సూనగుచ్ఛములు
కాఁచినకాయలు - కమ్మని పండ్లు
చల్లగాడ్పులును వ - సంతాగమమున
నుల్లసిల్లిన భీతి - నొంది వారెల్ల
మనముల "నాశ్విన - మాసంబునందు
నినసూనుఁడనిచె నిం - కేమి చేయుదము ?
పుష్యమాసము వచ్చెఁ - బోలు మరంద
నిష్యంద సూనముల్ - నిండె నీవనుల
మార్గశీర్షము యిది - మనకింక నేది
మార్గ ?" మంచును దీన - మానసులగుచు

నందఱుఁ జింతింప - నంగదుఁడపుడు
తుందుడుకున వారి - తో నిట్టులనియె

—: సీతను వెదకి కనుఁగొనలేనందులకుఁ జింతిల్లి అంగదుఁడు
ప్రాయోపవేశము చేయనిశ్చయించుట —

"ఎంచనేమున్నది - యిఁకమీఁద ? కావ
రించి మించితిమి సు - గ్రీవాజ్ఞ మనము !
గడువు దప్పితిమి రా - ఘవు దేవినైనఁ
బొడగానమైతిమి - పోసఁగ బొంకుటయు
బుద్ధిమంతులు కార్య - బోధకు ల్వంశ
వృద్ధులు నీతికో - విదులు ధార్మికులు
నుత్తమ గుణశాలు - లుసుకీర్తి నిధులు
మత్తారి వీరదు - ర్మానభంజనుల
కాలోచితంబైన - గతివివరింతు !
తేలనాడకుఁడు ప - దింబదిగాఁగ
నాలోచనము సేయుఁ - డర్కనందనుని
పాలికిఁ జని యాజ్ఞఁ - బడిపోవు కన్న
నిచట జచ్చుటయ మే - లింత లేదనుచు
నచటి కేఁగినఁ దాళఁ - డల్పదోషంబు !
సీతను వెదకి చూ - చినయది లేదు
మీ తెఱంగడుగ నే - మిటికింక నాకు ?
ఆతరువాత మీ - రైనట్లు కనుఁడు
ఏ తెరవునఁ బోతి - రేమి ? యామీఁద
ప్రాయోపవేశన - పరుఁడనై యిపుడె
కాయంబుఁ దొఱగ ని - క్కడ శయనింతు !

ఇదియె మీకును బుద్ధి – యిండ్లు సంపదలు
మదవతుల్ తనయులు – మనలరాకలకు
నాసించి యుండుదు – రని వారి మీఁద
నాసలు సేయక – యవి తెగఁ గోసి
మఱలిపోవుద మను – మాట చిత్తముల
మఱవుఁడు రఘువంశ – మణి నన్నుఁ దెచ్చి
కరుణించి యువరాజు – గావించెఁ గాక
ఖరకరాత్మజుఁడు తాఁ – గావలెననుచుఁ
బట్టంబుఁ గట్టెనె – పట్టిగా యనుచు?
అట్టిచో నేమియు – ననలేక తాళి
కాదనఁగా లేక – కడకుఁ బొమ్మనియె
నేదైన నొకనేర – మెన్నెదననుచు
నందుపై నిదివచ్చె – నట్టె పొమ్మనుచు
నందురుగాని యా – యర్కవంశజులు
సీతఁగానఁగలేక – చేరిననన్నుఁ
జేతులఁబట్టక – చెదఱఁ ద్రోలుదురు!
అపుడు సుగ్రీవుచే – నగపడి మొదట
కపటంబుచే లేని – కల్ల పై మోపి
వాలికిఁ బుట్టినఁ – వాఁడని తన్ను
కాలుఁగేలునుఁ గని – గలుగఁ గొట్టించు
నేనేల పోవుదు ? – నీపుణ్యభూమి
మేను దొరంగుటె – మేలం" చు ననిన
నందఱు నంగదుఁ – డాడిన మాట
యందమా నిదియని – యతనికిట్లనిరి.
"ఉగ్రశాసనుఁడౌట – నోర్వఁడు తప్పు

సుగ్రీవుఁడపుడు రా - జులకిచ్చకముగ
నాజ్ఞసేయక మానఁ - డతివను బాసి
యజ్ఞుఁడై కామాంధుఁ - డైనరాఘవుఁడు
తన కేల యనుగాక - తగదుపొమ్మనుచుఁ
గనిపించుకొనఁడిల్లు - గానేల మనకు ?
చపలాత్ములై చేరఁ - జనుట కాదందు.
అపరాధులగువార - లధిపుల కడకుఁ
బోవుదమందని - పోరాదు మఱలి
చావ నేమిటికి ? మో - సముఁవచ్చె "ననుచు
ననిన తారాగ్రజుఁ - డైనతారుండు
తనకుఁ దోఁచియట్టి - దారి నిట్లనియె.

— తారుఁడు బిలములోనే యుండిపోవుదమని వానరులకు బోధించుట - వానరు లందుల కంగీకరించుట —

" ఎందును బోనేల ? - యీరిక్షబిలము
నందులో నుండుద - మందఱుఁ గూడి
ఇచ్చోట మనకు నె - య్యేవి లేవు ? మనసు
వచ్చినగతి నుండ - వచ్చు నెన్నటికి !
ఈ రామసుగ్రీవు - లేల యింద్రునకుఁ
జేరవచ్చునె యిట్టి - చీకటి బిలము ?
కాదని వేఱొక్క - కడ కేఁగి యుండ
రాదు క్రమ్మరఁబోవ - రాదెఱింగియును ! "
అన విని యిదిబుద్ధి - యవునని మెచ్చి
వనచరు " లిదియె యె - వ్వరికి సమ్మతము

తనహాని కెవ్వఁడు - తా సమ్మతించు ?
చనుద మచ్చటి కను - సమయంబునందుఁ
దప్పెఁగార్యంబని - తారుని మాట
కొప్పిన వానర - యూథంబుఁజూచి
యష్టాంగవజ్రమా - యనతనబుద్ధి
యష్టాంగములతోడ - నమరినవానిఁ
జతురుఁ జతుర్బల - సంపన్ను రాజ
చతురుపాయ సమర్థు - సాహసనిధిని
బలవంతుఁ బ్రాజ్ఞునిఁ - బాడ్యమిచంద్రు
వలె దినదిన వృద్ధి - వరలెడి వాని
మతి బృహస్పతిని కౌ - మారవయస్కు
నతిధీరు నంగదు - నమర నాయకుఁడు
మున్ను శుక్రుని బుద్ధి - మోసంబుఁదెచ్చు
కొన్నకైవడి నియ్య - కొని తారుమాటఁ
జెవినాని తానట్ల - సేయుదు ననెడి
యవివేకమునకుఁ దా - నసహిష్ణుఁడగుచు
సకలాగమాంతార్థ - శాస్త్రకోవిదుఁడు
సకలసద్గుణశాలి - స్వామికార్యైక
పరతుఁ డాశ్రితకల్ప - భద్రసంధాత
కరువలిపట్టి చెం - గటఁ జేర నేఁగి
యొకఁడెఱుంగకయుండ - నొకని బోధించి
వెకలి యాలోచన - విఱుఁగంగనాడి
భేదపుట్టించి తాఁ - బినతండ్రిఁ జేరఁ
గాదని యున్నయం - గద కుమారకుని

మాపు చెప్పినబుద్ధి - మనసొగ్గి యున్న
యామహామహునితో - హనుమంతుఁడనియె.

—. హనుమంతుఁ డంగదునికి తారునిమాటలు వినవలదని
హితోపదేశ మొనర్చుట :—

' ఏలయ్య ! తారేయ ! - యీబుద్ధినీకు ?
వాలితో సరియైన - వాఁడవు నీవు
యీరాజ్యమంతయు - నేలఁగఁజాలు
నేరుపు శౌర్యంబు - నీయందుఁ గలదు !
నీమాటలోపల - నిలుతురేవీరు ?
సామాన్యులే ? సత్త్వ - శాలులిందఱును. 5240
ఈగజుఁడీ నీలుఁ - డీ జాంబవంతుఁ
డీగంధమాదనుఁ - డీ సుహోత్రుండు
నీనలుఁడీమైందుఁ - డీ ద్వివిదుండు
నేనును గైకోము - నిన్నుఁ జీరికిని !
నీయాజ్ఞలోపల - నిలుతుమే మాకు
రాయలైనట్టి యా - రవిసూనుఁడుండ ?
స్వామికార్యహితంబు - సడలనేరుతుమె ?
ఏమని వింటివి - యీ తారుబుద్ధి ?
వీఁడిపుడిటులాడి - వెనకఁ దామంచి
వాఁడగు సుగ్రీవు - వద్దికిఁజేరి ! 5250
తిరుగబాటునకు నా - దినకరు సుతుని
సరిబల మున్నదే - జగడింతమనిన ?
నెవ్వరి సత్తువ - నీవు పోరెదవు ?
దవ్వుచేసెను బిన - తండ్రికి నిన్ను

వీనిఁ బట్టుక లోక - విశ్రుతకీర్తి
యైనట్టి సుగ్రీవు - నాజ్ఞ మీఱెదవు.
వలదన్న ! బుద్ధులు - వయసులరావు
తలఁచుకొమ్మిపుడు నీ - తానాయకుండు
సేయుమేలునకునై - సీమతోఁ బాటు
చేయూసగాక వం - చింప ధర్మంబె ?
పావనాత్ముఁడ వీవు - భగినీముఖోప
జీవి మాటలు వినఁ - జెల్లునే నీకు ?"
అని " యోరి ! తార ! యే - మంటి వీబిలము
మనకు నాధారమై - మనఁగఁ జోటగునె ?
మంచి మాటాడితి - మార్తాండ సుతుని
నెంచి రాఘవు నెంచి - యింద్రుని నెంచి !
వారికసాధ్యమీ - వసుధాబిలంబు
చేరరాదంటివి - చెల్లునామాట ?
అంతటికున్నదె - యలిగి పై వచ్చు
నంతకురీతి రా - మానుజుఁడొకఁడు
కుప్పెకోలను దమో - గుహాయు నీయురము
దొప్పకై వడిఁ జించి - తునియలు సేయు !
మాయావియైనట్టి - మయుఁడు ద్వారంబు
సేయక యిచట వ - సించి యుండంగఁ
గులిశంబుతో వచ్చి - గుహచేసి మయునిఁ
బొలియించి నటువలెఁ - బోవదు సుమ్ము
రాముసోదర మహో - స్త్రప్రయోగమున
నీమహాశైలంబు - నీఱిక్క బిలము

మణిమయ పురము నీ - మర్కటప్రభుల
క్షణములోపలను భ - స్మము సేయుఁగాని!
చెడుబుద్ధి యీరీతిఁ - జెప్పిన నిన్ను
విడిచి కాచితిఁ దార - విలపించుననుచు"
నని తాల్మివహియించి - యంగదుఁ జూచి
"వినవన్న! యువరాజ! - వీనిమాటలను
నీవిందు నిలిచిన - నిను బాసి కపులు
పోవుదు రిండ్లను - పొలఁతులఁ దలఁచి
యపు డొంటిగాఁ జిక్కి - యనదవై యున్నఁ
జపచపగాఁ జూచి - చౌక సేయుచును
నెట్టివారును నిన్ను - నెంచరుగాన
గట్టిగా నాబుద్ధిఁ - గైకొను మీవు
మావెంట వచ్చిన - మహికెల్లఁ గర్తఁ
గావించి పట్టంబు - గట్టి నిల్పుదుము
కపటము మది నెఱుం - గఁడు సత్యసంధుఁ
డెపుడు తారాదేవి - యెడఁ బ్రీతిఁగలఁడు.
ఆయమ్మఁ జూచిన - యందు హితంబె
సేయు సుగ్రీవుఁడు - క్షితియెల్ల నొసఁగి
యతఁడపుత్రకుఁడు నీ - వతనికి మాకు
గతిగాక యెవ్వరు - గలరిట మీఁద
తరతరమ్ములవచ్చు - తగిన సంస్థాన
మొరుల మాటలు విని - యూడదన్నదవు!
ఏనున్నవాఁడ ని - న్నేమన్న నతఁడు
నానిలుకడనమ్మి - నావెంటరమ్ము!"
అని స్వామిహితము న - య్యంగదహితము

జనకజారామ ల - క్ష్మణహితంబునుగఁ
బవనజుఁ డాడిన - భాషణావళులు
చెవిసోఁక విని మదిఁ - జేపట్టి యలరి
చెంగటఁ దిగిచి మ - చ్చికఁ గౌఁగలించి
యంగదుఁడప్పుడా - హనుమంతుకనియె.

—: అంగదుఁడు తనకార్యము నిర్వర్తింపలేదని సుగ్రీవుఁడు కోపించునని కిష్కింధకు వెడలకుండ ప్రాయోపవేశము చేయఁ బూనుట —

"నీమాట కెదురాడ - నేరముగాని
నామీఁద నేరమె - న్నక పోఁడతండు
ఒరుల నిల్కడలు హి - తోక్తులు శౌర్య
నిరతులు మదినెన్న నే భానుసుతుఁడు ?
ఎట్టివాఁడైన నీ - యిలమీఁదఁ దోడ
బుట్టిన జ్యేష్ఠుని - పొలఁతిని జూచి
తల్లిగానెన్నక - తానాస సేయు
క్షుల్లకు నొక్కనిఁ - జూచుటల్ గలదె ?
అట్టి యధర్మాత్ముఁ - డన్నకుఁబుట్టి
నట్టి కుమారుఁ దా - యాది వీఁడనుచుఁ
జంపక మానునే ? - చచ్చిసాధిందు
సంపదలున్నవె ? - నాతులు గారె
నీవును వహ్నియు ? - నిలిపిన వంశ
పావనుఁడగు రామ - భద్రునితోడ
మొదటనాడినమాట - ములుచ వీఁడనుచు
బెదరించి సౌమిత్రి - పెడతల వేయు

వచ్చినప్పుడుగదా - వచ్చెనాపాలి
కెచ్చైన యుపకార - మెఱుఁగనివాఁడు
కడమవారల మీఁదఁ - గనికరంబుంచి
నడపునే యదికృత - ఘ్నతయౌనో కాదో ?
వెఱచికదా మీరు - వెదకఁ బొండనుచు
పఱపులువారె నా - పదవచ్చినపుడు
పాపంబునకు నోడి - పనిచెనే మనల !
నాపాటి దొరకు మ - ర్యాద యెక్కడిది ?
ఆరీతి నోఁగాము - లరయని వానిఁ
జేరునే బ్రదుకాసఁ - జేసినవాఁడు ?
అపరాధినగువాఁడ - నబలుఁడ నెట్లు
కపినాయకుని సము - ఖమునకు వత్తు ?
పోయినఁ జంపక - పోనీఁడతండు
చేయిగాంచిన నుంచుఁ - జెఱసాలనైన
వేయేల ? ప్రాయోప - వేశంబె చాలు
నీయాన నమ్మరా - నేర నచ్చటికి
నిందునకు ననుజ్ఞ - యిందుమీరెల్ల
నందఱు పురమున - కరుగుఁడు మఱలి.
మ్రొక్కితి ననుచు రా - మునితోడ ననుఁడు
మక్కువసేయు ల - క్ష్మణునితో మీరు
తనమీఁదఁ గలిగిన - దయయెల్లనాఁడు
పనివింటి మనసులో - పల నిల్పుమనుఁడు
•తండ్రిని మఱపించి - దయఁ జూచినీవె
తండ్రివై మనుపుచోఁ - దప్పు చేసితిని

యిటువంటి ద్రోహి నే - మని వత్తుననుచు
నిటులైనయపుడు ని - న్నెంతయుఁ దలఁచి
తలమోచి సాష్టాంగ - దండంబుఁ జేసి
తలఁచితి ననుఁడు మం - దఱ ఱమాపతికి
నేమని యనుముందు - నీమాట వినినఁ
దాము న్నెమృతినొందుఁ - దార నాజనని
యాయమ నూరార్చి - యర్కజుచేతఁ
జేయించి యోర్చి ర - క్షించు కొమ్మనుఁడు
నామీఁదఁ గలుగు మ - న్ననయెంచి మీర
లేమఱ కాతార - యింటికిఁ బోయి
గ్రక్కునఁ దెలుపక - క్రమముగాఁ బలికి
పొక్కంగనీక నే - ర్పునఁ గాచికొనుఁడు.
అక్కడి పెద్దల - కందఱికేను
మ్రొక్కితి ననుఁడ"ని - మున్నె తాఁదెచ్చి
పఱచిన దర్భల - పై బవళించి
తొరిగెడు కన్నీరు - తో మోము తడియఁ
దారకుఁ దానొంటి - తనయుఁడఁగాన
నేరీతి బ్రదుకునో - యిటమీఁద ననుచు
మాటికిఁ జింతించి - మదిచిక్కఁ బట్టి
మాటలాడక హను - మంతుని యెదురఁ
గన్నులు మొగిడించి - కదలక యార్తి
నున్నయంగదుని ప్రా - యోపవేశంబు
కపులకుఁ బ్రాణాశ - కడకోసరింప
నపుడందఱును వాలి - నందనుఁ బొగడి
" యింతవాఁడిటులైన - నీతనికన్న

నంత తీపయ్యెనె - ప్రాణము ల్మనకు ?
నితని వెంబడివచ్చి - యెడశాయనేల ?
నితఁడు వోయిన త్రోవ - నేపోద" మనుచు
దక్షిణాగ్రములుఁగా - దర్భలు పఱిచి
దీక్షించి వార్చి త - దీయపార్శ్వముల
వేర్వేరఁ బ్రాయోప - వేశముల్ చేసి
యుర్విపైఁ బవళించి - యూరుపులూని
తడవు నిగుడ్చుచు - దశరథతనయు
లడగక వచ్చుట - యవనిజఁ దోడి
తెచ్చుట రాముని - దేవి రావణుఁడు
ప్రుచ్చిలించుట కపి - ముఖ్యులతోడ
సీతకై రాఘవుల్ - చెలిమి సేయుటయు
దూతల నలుగడఁ - ద్రోలి వానరులఁ
బిలిపించుటయుఁ దమ్ము - బిలిచి దక్షిణము
వెలువరించుటయు దే - వీ నిమిత్తముగ
నిందఱి బ్రదుకుల - కెసరులు వెట్టి
యిందుకునై విధి - యెన్నాళ్లుగాచె ?
అనిఁ జచ్చినదిగాదు - హా ! యని మున్ను
జనకజఁ జెఱవోవ - శౌర్యంబు మెఱసి
యాజటాయువు రీతి - నడ్డంబు దూరి
యాజిలోఁ బడుటగా - దన్యాయములుగ
రాజభయంబుచేఁ - బ్రాణముల్ విడువ
రోజించితిమి దైవ - యోగంబుచేత"
ననుచు శోకాతురు - లై రోదసేయ

—. అంగదునితో ప్రాయోపవేశము చేయుటకు సిద్ధముగనున్న వానరులను సంపాతి చూచుట —

వనచరధ్వని ఘన - ధ్వనిఁ బోలి నిండ
నాలించి వింధ్యగ - హ్వరములోఁ బెక్కు
కాలంబు మనిన వి - ఖ్యాతబలుండు
ఆజటాయువునకు - నన్న పక్షులకు
రాజు సంపాతి "యే - రావమో ?" యనుచుఁ
దానున్న యాబిల - ద్వారంబు వెడలి
వానరులను గాంచి - వారలీ రీతిఁ
బ్రాయోపవేశన - పరులగాఁ దలఁచి
"ఏయెడఁ జనరాక - యేనిన్నినాళ్లు
బిలములో నాఁకటి - బీదనై యుండఁ
దలఁచని తలఁపు రి - త్తకు రిత్త వీరు
నాచెంతఁ జేరి ప్రా - ణమ్ములు విడువఁ
గాచుక యుండ నొ - క్కరిఁ బోవనీక
యందఱిఁ మ్రింగి నా - యాఁకలిఁ దీర్తు
విందుచేసె విధాత - వీరిచేఁ దనకు !"
అను మాట లాలించి - హనుమంతుఁ జూచి
తన భీతిచే నంగ - దకుమారుఁడనియె.
"తప్పెఁ గార్యంబు సీ - తానిమిత్తముగ
నిప్పుడు మనమెల్ల - నెంచిన యట్టి
తలఁపును దైవయ - త్నము జతగూడి
పొలియక యటమున్నె - పొలియంగవలసె.
తినుమని వీని వా - తికి నగ్గమైతి
మినసూతి పూనిక - యీడేరదయ్యె

రాముని కార్యమా - రడిఁ బోయె మొదట
భూమిజకై పక్షి - పుంగవుఁడైన
యల జటాయువురీతి - నన్యోపకార
ములకునై యీదేహ - ము లొసంగలేదు,
ఊరక ప్రాణంబు - లొల్లక పొలియఁ
గారణంబయ్యె నే - కైవడినైన
రామకార్యార్థమై - ప్రాణముల్ విడువఁ
గావింప నుత్తమ - గతులు చేకూడు."
అని "తండ్రిపనుపున - నడవికి రాక,
మునుకొని సుగ్రీవు - మొగము చూడంగఁ
దమకుఁ బోరానియం - తయుఁ" గథాసరణిఁ
గ్రమముతో వినఁబల్కి - 'కైకేయి వలన
వానరప్రభులకు - వచ్చెగా! యిట్ట
హాని" యంచును "జన - కాత్మజ కొఱకుఁ
గనిపించుకొని పుణ్య - గతులకు నేఁగె
ననఘుఁడైన జటాయు" - వనుచు నీరీతిఁ
బలుమాఱు నార్తుఁడై - పలుకు నంగదుని
పలుకు లాలించి సం - పాతి యిట్లనియె.

— సంపాతి వానరులతో సంభాషించుట —

"మీరెవ్వరయ్య? యే - మి నిమిత్తముగను
శ్రీరాము దేవేరిఁ - జెఱవట్టుకొనియె
దనుజనాయకుఁడు? నా - తమ్ముఁడైనట్టి
ఘనుఁడు జటాయు వే - క్రమమునఁ బడియె?
రాముని తెఱఁగు స - ర్వము వినవలతు

భూమీధరంబుపైఁ - బొడవున నుండి
శ్రీరామదాసులు - క్షితిక్రింద నుండఁ
గారాదు మీదువా - క్యంబులే వినఁగ.
కావున నన్నెఱ - కలు లేనివాని
లావునఁ బట్టి మె - ల్లనె డింపుఁ డిపుడు."
అనిన వానర వీరు - లాపక్షిమాట
విని తమ్ము మ్రింగునో - యీఁ డని యెంచి
యొప్పక తెంపుతో - నున్నవా రగుట
నప్పుడూహించి 'యై - నట్టులయ్యెడును
డింపుద'మని పట్టి - డింప నంగదుఁడు
సంపాతిఁ జూచి కొం - చక యిట్టులనియె.

—. అంగదుఁడు తన వృత్తాంతము సంపాతికిఁ జెప్పుట :—

"పక్షీంద్ర! మీతాత - బలసత్త్వశాలి
ఋక్షరజుండతఁ - డిరువురఁ గనియె.
వాలిసుగ్రీవుల - వైరంబు పుట్టి
వాలి సుగ్రీవుచే - వదలిపోఁదరమె ?
దశరథుఁడన నయో - ధ్యానాయకుండు
శశిముఖయగు కైక - చనవు చెల్లించి
యడవుల కనిచిన - నవనిజఁ గూడి
వెడలి రాముఁడు ఘోర - విపినంబులందుఁ
జరియించునపుడు ద - శగ్రీవుఁ డతని
తరుణి నెత్తుకపోవఁ - దా విలోకించి
యరికట్టి యొకఁడు జ - టాయువు వాని
విరథునిగాఁ జేసి - విల్లు ఖండించి

పెద్దవాఁడగుట ద - ర్పించి రావణుఁడు
గద్దించి తెక్కలొ - క్కటఁ ద్రుంచుటయును
ధరణిపైఁ బడియుండఁ - దమ్ముఁడుఁ దానుఁ
దరుణిపోయిన జాడ - తెఎ కేఱుపడక
వచ్చి జటాయువు - వార్తచే నసుర
ద్రుచ్చిలికొనిపోవు - మూలంబెఱింగి
తమ తండ్రికాతఁడెం - తయు నాప్తుఁడతఁడు
తమకార్యమునకునై - తనువుఁ బాయుటయు
నరలేక పుణ్యలో - కావాప్తి కొఱకు
కరుణించి యగ్ని సం - స్కారంబుఁ జేసి
ముందుగానక ఋశ్య - మూకంబుఁ జేరి
యందుఁ జింతిలుచున్న - యర్కనందనుని
చెలిమి కార్యార్థులై - చేసి రాఘవుఁడు
బలిమిచే నొకకోలఁ - బడ వాలినేసి
భానుజుఁ గిష్కింధఁ - బట్టంబుఁ గట్టి
తానిల్చె నతనిపైఁ - దమకార్యభరము.
ఆ రవినందనుఁ - డన్నిదిక్కులకు
వీరవానరులను - వెదకంగఁ బనిచి
తము పొండనుచుఁ బంపె - దక్షిణంబునకు
సమరేంద్రతనయుఁడౌ - నావాలిసుతుఁడ
నంగదుఁడనువాఁడ - నర్కజుమాట
నంగీకరించి మే - మన్ని దిక్కులును
జనకజ వెదకి యె - చ్చటఁ గానలేక
పెనుదప్పిఁ జీకటి - బిలముఁ జొచ్చితిమి

మఱలిరాలేక క్రు - మ్మరు వారిఁజూచి
కరుణించి మునిబాలి - కామణి యొకతె
దరిఁజేర్పఁ దత్ప్రసా - దమున నీకొండ
దరి జేరితిమి మితిఁ - దప్పిన కతన
నుగ్రశాసనుఁడని - యూహించి మేము
సుగ్రీవుఁ జేరి యు - చ్చో నాజ్ఞ పడక
వెతఁదీఱఁ బ్రాయోప - వేశంబు సేయు
మతినున్న వారము - మ్మలికతో" ననిన
నామాట వినుల - నాని సంపాతి
యామర్కటేంద్రుల - కప్పు డిట్లనియె.

## — సంపాతి తన వృత్తాంతమును చెప్పుట. —

"ఎన్నినాళ్లాయె మే - మెడవాసి ! వింటి
నిన్నాళ్ళకు జటాయు - విటులయ్యెననుచు
నేనిది వినియు స - హించితి నిపుడె
దానవాధమునిఁ జే - తడియారకుండఁ
జంపి యీనూడు దీ - ర్చకయున్న నన్ను
సంపాతి యనుచు నెం - చఁగ నేమిఫలము ?
మాన్యవర్తనలచే - మదిమది నుండి
యన్యోన్యగమనజ - యాభిలాషలను
నన్నదమ్ములము వి - హాయస వీథి
నున్నత పథమున - నురువడి నెగసి
యిన మండలముఁ జేర - నేఁగఁ దపించు
తన సహోదరునిపై - దయయుంచి యేను
చాటు చేసితి విప - క్షములందు కతన

గాటంపు కొండలఁ - గమిలేనిక్రియలు
యీవింధ్య బిలములో - హీనసత్త్వమునఁ
దావచ్చి పడితి నా - తమ్ముఁడెచ్చటికిఁ
బోయెనో యెఱుఁగ మి - ప్పుడువాని హాని
నో యయ్యలార! మీ - యుక్తులవింటి
ననిన వాలితనూజుఁ - డావిహగేంద్రుఁ
గనుఁగొని పేరాసఁ - గ్రమ్మఱం బలికె.
"సీతకునై పోరి - సిన పక్షిరాజు
నీతోడఁబుట్టుట - నిజమయ్యె నేని
మాటవాసిగ నీవు - మహిసుత యిట్టి
చోట నున్నదియని - చూపి చెప్పినను
మమ్ము రక్షించుట - మమునంపి చాల
నమ్మిన సుగ్రీవు - నకుఁ గీర్తి యగుట
శ్రీరామునకు సీత - చేకూడుటయును
కారణమ్ములుగాఁగఁ - గల సుకృతంబు
నిన్నుఁ జేరునటన్న - నీడజస్వామి
మన్నించి వారితో - మఱియు నిట్లనియె.
"క్షితిమీఁదఁ గన్నులు - చెఱచు దైవంబు
మతి యిచ్చినట్లు నా - మదిలోన నిపుడు
బుద్ధి చలింపదు - పోయెఁ గాలంబు
వద్ధుఁడనైతి నో - ర్వీర్యంబు లేదు
చేదోడు గావింపఁ - జేతఁగాకున్న
వాదోడుచేసి మీ - వాఁడ నేనగుదు.
బలిఁజేరి తా దార - వట్టి వామనుఁడు
యిలఁ గొల్చినది చూచి - యేనెఱుంగుదును.

అమృతవార్ధి మథించి - హరిదివిజులకు
నమృతంబుఁ బంచిచ్చి - నదియెఱుంగుదును
భావజారాతి తాఁ - బార్వతీదేవి
రేవితోఁ బెండ్లియా - డిన దెఱుంగుదును
చేరి దిక్పాలక - శ్రేణి యందందుఁ
గోరి పట్టములుఁ గై - కొను టెఱుంగుదును
రావణు నెఱుఁగు ట - బ్రమె ? సీతయున్న
తావును మీఁకు ని - త్తరి వివరింతు
"హా! రామ! హా! లక్ష్మ - ణా!" యనిపలుకు
నారీశిరోమణి - నల్లనివాఁడు
తొడలపై నిడుకొని - తొలుకారు మెఱుపు
వెడద మేఘంబులో - వెలుఁగు నట్లమరఁ
గొనిపోవఁ గంటి నీ - గుహలోన నుండి
తనకది యిప్పుడు - తలఁపులోఁ దోఁచె
శతయోజనము మేర - జలరాశిలోన
నతేఁదుండు లంక యా - యన రాజధాని
యపరంజి కోటలు - నట్టి తల్పులునుఁ
విపులమాణిక్యన - వీన సౌధములు
లెక్కగాఁ గొనక ని - లింపులఁ బట్టి
మక్కమారుచు దైత్య - మండలి గలిగి
యా లంక యొప్పు ది - వ్యజ్ఞాన శక్తి
చాలియుండును నాకు - సకలంబుఁ దెలియు
నిలమీఁది ధాన్యంబు - లేఱుకో తినెదు
పులుగులు యోజనం - బునకు పై నెగయు.
నందుపైఁ బోవలే - వామీఁద నైదు

కందువల్ పక్షిమా - ర్గంబులు వినుఁడు
ఇది కుళింగములను - నెల్ల పక్షులును
వదలక చరియించు - వలదటుమీఁద
బలి భోజనంబుల - ఫలభక్షణముల
నలరు పక్షులకు రెం - డవ మార్గమొప్పు
క్రౌంచంబులును భాస - గణమును కురర
సంచయంబును నేఁగు - జాడ యామీఁద
పావురంబులు డేగ - పదుపునమ్మీఁదఁ
దేరినాలవజాడఁ - ద్రిమ్మరుచుండు
దానిపైత్రోవ గృ - ధ్రము లేఁగనేర్చు
నానెలవున మీరి - హంసముల్దిరుగు
ఆపైన గారుడం - బైన మార్గంబు
చూపట్టుఁ బక్షులీ - చొప్పున మెలఁగు
సప్తవాతస్కంధ - సంచారమార్గ
సప్తమస్థలములఁ - జరియింతు మేము
పక్షులు దివి నూట - పది యోజనముల
లక్షించుఁ దనుమేపు - లకు నుర్విమీఁదఁ
గలుగు నామిష మట్టి - ఖగజాతిఁ గలుగు
బలముచే జ్ఞానసం - పదచేత మాకు
గరుడండు పినతండ్రి - గావున నెల్ల
ధరణిపై మాకసా - ధ్యము లేదు చూడ!
అదె లంక! యదె సీత! - యసురభామినులు
బెదరింపుచును గాసి - పెట్టుచున్నారు
వాఁడె రావణుఁడు ది - వ్యవిరోధి తనదు
వేడిమిఁ గొలువులో - వెలుఁగుచున్నాఁడు!

అతఁడు కుబేరుని - యనుజన్ముఁ డతఁడు
క్షితియెల్ల మనుపనుఁ - జెఱుపశక్తుండు!
ఆరావణునిఁ గూల్చి - యవనిజఁ దెచ్చు
మీరాఘవుండు నా - మేటి దీవనను
జలధిఁ దాఁటునుపాయ - శక్తియే మీకుఁ
గలిగినఁజాలు లం - కానాథుఁ డెంత!
తమ్మునికిని వారి - దానంబుసేయ
నెమ్మదిఁ గోరితి - నేడబ్ధియందు
నాకోర్కి యీడేర్పుఁ" - డనవారలతనిఁ
జేకొని జలరాశి - చెంగట నుంచి
కృతకృత్యులైన ప - క్షివరేణ్యుఁ దెచ్చి
క్షితిధరాగ్రమునకుఁ - జేర్చియుంచుటయు
వాడిన చేలపై - వానయుఁ బోలి
నీడజోత్తము మాట - నిండు ప్రాణములు
పోకుండ మరల ని - ల్పుటయుఁ గూర్చుండ
వాకొని యాజాంబ - వంతుఁడిట్లనియె
"అయ్య! సుగ్రీవుని - యాజ్ఞకు వెఱచి
యియ్యెడఁ గపులెల్ల - నీ దర్భలందుఁ
బ్రాయోపవిష్టులై - పడియుండఁ జూచి
సేయ నేమియు లేక - చింతాపయోధి
మునిఁగి తెల్విడిఁ దప్పి - ముదుసలిఁగాన
వినసైతిఁ దెలియ నీ - వృత్తాంతమెల్ల
ఏమంటి? వసురేంద్రుఁ - డెచట నున్నాఁడు!
భూమిజ నెందు ని - ప్పుడు గనుఁగొంటి?
మాకేదిబుద్ధి! యీ - మాఱువేసరక

వాఁడను" మన జాంబ - వంతుని జూచి
యుండఁగ వినుచుండ - నపుడు వీనులకు
విందుగా సంపాతి - వెండియుఁ బలికె
"జైవాతృకుఁడను ప - క్షంబులు కమలె
లావును లేదు చా - లదు జవశక్తి
కావున నీశైల - గహ్వరాంతరము
తావలంబుగ నుందుఁ - దన తనయుండు
నాహారమిడి నీర - మందిచ్చి యిట్టి
దేహంబుఁ బోషించు - దినము వేసరక
నతని పేరు సుపార్శ్వుఁ - డందురు వాఁడు
హితబుద్ధి నాహార - మెద్ది యేతేర
వనములందుఁ జరించు - వాఁడొక్కనాఁడు
తనచేతి కేమియుఁ - దగలక ప్రొద్దు
పోటుకున గ్రుంకు న - ప్పుడు వచ్చి నిలువ
కటకటఁ బడి వానిఁ - గనుఁగొని యేను
నాఁకటి కోర్వక - యలిగి నేఁడేల
చీకటివేళ వ - చ్చితివి మైమఱచి?
ఏమిషంబున నుంటి - విందాక? నేల
యామిషం బిడవైతి - వాఁకలి మెఱిఁగి?
నీప్రాపుచాలు మే - నికి నేల వగవ?
ఓప నిట్లుండఁ బ్రా - యోపవేశమునఁ
దనువువాతు నటన్నఁ - దనయుఁడు చాల
వినయంబుతోఁ దను - వీక్షించి పలికె

— సంపాతి సీతవృత్తాంతమును జాంబవంతునికిఁ జెప్పుట :—

“అయ్య! ప్రమత్తుండ - నై యేను గ్రొవ్వి
నెయ్యంబు మఱచి యుం - డి వాఁడ గాను
ఏను నింతియును మ - హేంద్రాద్రి గడచి
యీనెలవుల మెత్త - నైనమాంసంబు
వెదకి కానక వార్ధి - వేలకుఁ జేరి
సుదతియు నేను నీ - చులవెంట దిరిగి
యొకయెడఁ గాలూది - యుండియు మీన
మొకటియు దొరకక - యున్నట్టి వేళఁ
దపనప్రభాగాత్రిఁ - దరుణి నొక్కతెను
నిపుణత నల్లని - నెమ్మేను వాఁడు
కొనిపోవ నార్తిచేఁ - గుంది ‘హా! రామ!’
యనియు ‘హా! లక్ష్మణా!’ - యనియుఁ గూయిడుచుఁ
బోవుచో వాఁడు నా - పొంతకుఁ జేరి
‘ఓవిహగేంద్ర! నా - యూరికిఁ ద్రోవ
యెయ్యది?’ యని వేడ - నేనిట్టులనుచు
జెయ్యిచూపుటయు ద - క్షిణముగాఁ జనియె
కలన నోడినవాఁడు - కామినీమణులఁ
దొలగించు వాఁడును - ద్రోహంబు చేసి
చనువాఁడు దొఁగిలి - చనువాఁడు చంపి
చనువాఁడు త్రోవనే - చనుచుండిరేని
నెఱుఁగక భ్రమనొంది - యిట్టట్టు మఱల
దిరుగుచుండురుగాన - తెరవు నన్నడిగి
నప్పుడు దివినున్న - యమరులు వచ్చి
తప్పె నేటికి పురా - తన సుకృతమున

పరమసాధ్విని రామ - భార్యను వాఁడు
చెఱవట్టుకొని భీతి - చేఁ బోవు కతన
నూరక చనియెఁగా - కూరక చనునె?
నీరాముఁ గొనిపోవు - నే రావణుండు?
ఇంతకు దీని వాఁ - డెత్తుకపోవు
నింతలో మఱలునో - యెఱుఁగరాదతని
పొలఁతిఁ జేకూర్చుక - పొమ్మందు నేల
నిలిచెద వనిపల్క - నిర్జరశ్రేణి
మాటలు వినియేను - మగువయు నెగసి
యీరెంకిఁ జేరితి - మిదినిమిత్తముగ
నీకు నాహారంబు - నేఁడబ్బదయ్యె
కాకయుండిన నిట్టి - కల్ల సేయుదునె?
అనుసుపార్శ్వుఁడు వల్క - నప్పుడామీఁద
వినియుండి జానకి - వృత్తాంత మెల్ల
నసమర్థుఁడను వాక్స - హాయత గాని
యిసుమంత పనికైన - నేమిటివాఁడ?
రామకార్యంబు పో - రానిది యైన
సామాన్యమతి నుంటి - శక్తి చాలమిని
శ్రీరామచంద్రుండు - చేత విల్లంది
నారాచ మొకటి సం - ధానంబు సేయ
దొల్లును దొంతుల - తోఁ జూర్ణమగుచు
నెల్లలోకములు మీ - రెఱుఁగరు గాక
యొకరి తోడాసించు - నో? రాఘవునకు
నొకఁడసాధ్యము గల్గు - నో జగత్రయిని
యందుపై బుద్ధి బ - లాతి శౌర్యముల

కండంబులై మించు - కపివరుల్ మీరు
చేకూడి యున్నారు - సీత రామునకుఁ
జేకూర్పఁ గలరైనఁ - జెప్పెదమీకు
కొంచగాఁడని యెంచ - కుఁడు దశాననుని
ముంచి మీకీఁతలు - మోఁతలు చేయు
నతని ప్రతాప మిం - ద్రాదులకైన
నతి దుర్జయం బని - ద్రాహార కరగు
తాముసంజేల ? య - త్నము చేసి మీర
లీమీఁది కార్యమూ - హించి కొండిపుడు
అని పల్కి యువరాజు - నంగదుఁ జూచి
" జనకతనూజాప్ర - చారమంతయును
నాకు నేర్పుషు కార - ణము వినిపింతు
నీక '' ని ఖగవంశ - నేత యిట్లనియె
" ఇనుని వేడిమిచేత - నెఱకలుగాలి
పోనుఁగుడువడి మూర్ఛఁ - బుడమిపైఁ ద్రెళ్ళి
యీవింధ్య బిలములో - నేడువారములు
చావుతో సరియైన - జాడ మేమఱచి
తెలిసితి నెనిమిదో - దినమున మేను
కలయఁ జూచితి విం - ధ్య గహ్వరంబగుట
నపుడు మెల్లనె నడ - యాడుచుఁ జెంతఁ
దపమొనరించు ను - త్తము నిశాకరునిఁ
జూచి యయ్యాశ్రమ - క్షోణి నెమ్మేను
వైచి యెన్మిదివేల - వత్సరంబులకు
నిట్టెట్టు మెదలక - నెఱుఁగక పడిన
పట్టున నగజర - భావంబులోన

నున్నాఁడ నెప్పుడి - ట్లుంటి నాప్రొద్దె
యన్నిశాకరుఁడు సు - రాలయంబునకుఁ
జని యెనిమిదివేలు - సంవత్సరంబు
లనిమిషపురి నుండి - యట తరువాత
మఱలి యావింధ్యక్ష - మాధరంబునకు
నరుదేర నిచట సిం - హాదులై నట్టి
వనమృగ చయము పూ - ర్వంబునఁ దమ్ము
మనిచి రక్షించిన - మచ్చికఁ జేసి
యాశ్రమమహిమచే - నన్నియు నచట
నశ్రాంతచిరజీవు - లై యున్న కతన
గని యెదుర్కొని నిశా - కరమౌనిఁ గొలిచి
చనుదేర దేవతా - సభలోన నున్న
యా విరించి యనంగ - నాశ్రమంబునకుఁ
దావచ్చి సకలబాం - ధవ జనకోటి
తనుజేరరా మేరు - ధరణీశుఁ డనఁగ
మునివరుఁడచ్చోట - ముచ్చమునింగి
దరిదాపు లేక ప - త్రంబులు గమలి
ధరణిపైఁ బడియున్నఁ - దను దేఱిచూచి
తనగృహంబున కేఁగి - తడవుగా నచట
మనసొగ్గి నిలువక - మఱలంగ వచ్చి
నాచెంత నిలిచి పూ - ర్ణకృపా విభూతి
వాచంయమీంద్రుఁడో - ర్వీశ యిట్టులనియె
‘అమరావతికి నేఁగు - నప్పుడు నీదు
గ్రమము చూచియును శీ - ఘ్రమునఁ బోవలసి
యిచ్చోట నెటులున్న - మృతినీకు లేమి

యిచ్చలోఁ దెలిసి నే - నిచటికి మఱల
నేతేరఁ బనిగల్గి - యేమియు ననక
యాతరి మాటాడ - నైతి నీతోడ
నెచ్చటనుండుదు ? - వెవ్వఁడ ? వేల
యిచ్చోటఁ బడితివి - యీఁకియల్ గమలి
యగ్నిచేఁ గమలెనో ? - యనిల సంహతిని
భగ్నమయ్యెనో నీదు - పక్షవ్రజంబు
తెలియఁబల్కు' మటన్న - దీనతనతని
పలుకులు విని ప్ర - భావంబుచేత
మాటాడశక్తియు - మదిలోని మెఱుక
పాటునఁ బడిన యేఁ - బలికెదననుచు
మదినెంచు నప్పుడా - మౌని నాయకుఁడు
మది నెఱింగిన మాట - మాటక పలికె
'ఏమోయి! సంపాతి! - యెఱుఁగనే నిన్న ?
ఈమాడ్కి దురవస్థ - నేల పొందితివి ?
అనుజుఁ డైనట్టి జ - టాయువు నీవు
మును పొక్కనాఁడు నా - ముందఱ నిలిచి
రాజవేషములఁ దే - రఁగ వచ్చి మ్రొక్కి
పూజించితిరి నన్ను - పొందామరలను
దీవించి పనిచితిఁ - దిరిగి రారైతి
రేవలనికిఁ బోతి ? - రిట్లైతివేల ?
ఎఱిఁగింపు' మనిమౌని - నీక్షించి యేను
శరణంబు వేఁడి దాఁ - చక యిట్టులంటి
మునినాథ! యన్నద - మ్మలము మీచేత
ననిపించుకొని విహం - గాధి రాజ్యంబు

పాలింపుచును వయో - బల గర్వములను
కైలాసమున కేఁగి - కాలానుగతిని
మాలోన మేము సు - మాళించి మాని
జాలంబు వినఁగ న - చ్చట నిరువురము
నినునిరథంబు వో - యిన జాడ నతని
వెనుక నస్త్రాద్రిఁ బ్ర - వేశించు దనుకఁ
బఱచుటకై యేము - పన్నిదంబాడి
యెఱికలు జాడించి - యెగసిన యపుడు
భోరను రవమొందు - బొదువ సపక్ష
మేరు మందరముల - మేరఁ జూపట్టి
మఱి పోవఁబోవ నై - మానికశ్రేణి
తెరువిచ్చి యొదుగుచు - దిగులుతోఁ జూడ
నాకాశమున నేఁగు - నప్పుడీ యవని
మాకంటి కొకబంతి - మాత్రమై తోఁచెఁ
బాడవునఁ జూడ నీ - భూమీధరములు
చిడిపిరాలనఁగ మిం - చెను జూపులకును
సైకపు నూలి పోఁ - చలువైచినట్లు
మాకుఁ గన్పట్టె సమ - స్త వాహినులు.
ఎచ్చట నెడలేని - యీవనశ్రేణి
పచ్చ బొట్లనఁగ నే - ర్పఱపరాదయ్యె!
ఆరీతి మిన్నుల - నరిగి భాస్కరుని
తేరు వెంబడిఁ బోవ - దివిజకామినుల
గ్రహముల ఋషుల వె - న్కను నైచి యుగ్ర
మహస్సైన నడుమింటి - మార్తాండుఁ జేర
నెంతటి వెడలుపో - యీ మహీచక్ర

మంతమై కనుపట్టి - నతని మండలము
భానుబింబముఁ జేర - భానుతాపమునఁ
దానోరు దెఱచి సం - తప్తుఁడై సొరిగి
యలసిన యట్టి జ - టాయువుఁ జూచి
యిలమీఁదఁ బడకుండ - యేఁ జాటునిలిచి
యదరక మద్గరుఁ - డాతపత్రములఁ
బొదువుక మఱలు న - ప్పుడు పద్మబంధు
కిరణాగ్నిచేత నీఁ - కియలెల్లఁ గమలఁ
గెరలి వ్రాలితి వింధ్య - గిరి గహ్వరమున
నాజనస్థాన మ - హావనచ్ఛాయ
నాజటాయువు వ్రాలి - నటువలెఁ దోఁచ
నతఁడేమియయ్యెనో ? - యటమీఁద నిందు
కతమున నాదు ఱె - క్కలు మాఁడిపోయెఁ
" గరుణింపవే! నిశా - కరమానిచంద్ర !
శరణార్థి " ననుచు బా - ష్పములు నించుటయు
మానియంతముహూర్త - మాత్రంబు మదిని
ధ్యానంబు చేసి ' నీ - తనువున మఱల
బలమును వేగంబు - పక్షముల్ తొలుతఁ
గలిగిన కైవడిఁ - గలుగఁ జేసితిని !
అటులైన రామకా - ర్యార్థమై శైల
కటకంబునం దీవు - గాఁచియుండంగ
వలయుఁ గావున నేఁడు - వలదు నావరము
ఫలియించు మీఁద నా - పలుకేల తప్పు ?
రాముఁడు దశరథ - రాజనందనుఁడు
భూమిజతో వనం - బులకుఁ దావచ్చి

యున్నచో రావణుఁ - డోడక యతని
కన్నుఁగిఁ జానకిఁ - గైకొని పోయి
తన లంకయందు న - ద్యానంబులోన
నునిచినచో సీత - యున్నకీలెఱిఁగి
యమరనాథుఁడు పాయ - సాన్నంబు దివ్య
మమృతపర్యాయ మ - హాంబులయందు
నొరు లెఱుఁగకయుండ - నుర్వీతనూజ
కరమున కిచ్చి యాఁ - కలి నీరువట్టు
నలయికలును బాపి - యరుగు నాసాధ్వి
తలఁచని తలఁపుచే - తను నిల్చినట్టి
పాయసాన్నంబు వి - భాగించి రాముఁ
డామెడ నుండిన - యందుచేఁ దృప్తి
గనుఁగాక యనుచు స - గం బుర్వినునిచి
తనపాలు నిత్యంబుఁ - దా నారగించు
నపుడు సీతాన్వేష - ణార్థులైవచ్చి
కపులు నీతోడ రా - ఘవ చరితంబు
వినిపించు నప్పుడు - విలసిల్లునీదు
తనువుపుఁ బక్షస - త్త్వజవాదికములు!
అందాఁక లోకహి - తార్థమై యుండు
మిందు 'నంచు ననుగ్ర - హించినాఁడతఁడు.
అతఁడు నాతోడ ని - ట్లానతియిచ్చి
యతిశయించెను కాల - మైదునూఱేండ్లు.
ఎదురెదురులు చూచి - యేనుమీరాక
మదిఁగోరియుంటి నే - మముఁ జేరఁగంటి.''
అనుమాటలాడియు - నాడకమున్న

తనువునిండఁగఁ బత - త్రంబులు మొలిచె!
లావుల వెంటనే - లావునువచ్చె
నావిహాగేంద్రుఁడు - హనుమంతుఁజూచి
"యనుమానములు మాని యవనిజవెదకు
పనికి మీరుద్యోగ - పరులుఁ గావలయుఁ
బక్షముల్ మొలిచె నా - పైనది మీకు
సాక్షి మీకార్యంబు - సఫలమౌటకును
అనుచు రెక్కలతోడి - యద్రియుఁబోలి
పెనుమ్రోఁత రివ్వని - పృథివిపై నిండ
సంపాతి యెగసి కీ - శశ్రేణిఁజూచి
సంపూర్ణకాముఁడై - చదలఁ బోవుచును
"అదె! లంక! వాఁడె! ద - శాననుఁ డల్ల
యదె సీత! చనుఁడు మీ - రని వినఁబల్కి
పోయినఁ గపులెల్ల - పుటముగా నెగసి
యాయద్రిపైనుండి - యవనికిదాఁటి
"సంపాతి మాటలు - చాల నమ్మితిమి
చంపఁజూచె నతండు - జలధి పాల్జేసి.
ఎక్కడి పని? మన - మెక్కడ? లంక
యెక్కడ? రావణుఁ - డెక్కడ? సీత
యెక్కడ? వానరు - లెక్కడ? పోవు
టెక్కడ?" యని కపు - లెల్ల వాకొనఁగ
నందఱుఁగనుఁగొని - యందుకుఁ దగిన
యందంబు మదినెంచి - యంగదుండనియె.

— అంగదుఁడు సంపాతిచెప్పిన రీతిని సముద్రమును దాఁటుటకుఁ దగినవారెవ్వరో యని విచారించుట —

"ఏల చింతించెద - రీ విచారమున?
బాలకు లెఱుఁగక - పాములఁ బట్టి
నాశ మొందినగతి - నశియింతు రింత
ధీశక్తి వదలంగఁ - దీఱునే మనకు?
చాలశౌర్యము జూపు - సమయంబుగాని
జాలిఁబొందెడు నట్టి - సమయంబుగాదు.
ఇక్కమలాకరం - బెంత దాఁటుటకు?
ఎక్కులు వచ్చును - గ్రీవాజ్ఞఁ దలఁప!
మనమెంత జడిసిన - మాపినతండ్రి
కిని దయవచ్చునే? - కినుకయే గాక."
అని మాటలాడుచో - నర్కమండలము
కనరాక యస్తాద్రి - కడకుఁ జేరుటయు
నారేయి వా రని - ద్రాహారు లగుచుఁ
దూఱుపు తెల్లనై - తొలుసంజ వొడమఁ
గపులెల్లఁ దనుచుట్టుఁ - గదిసి యుండంగ
నపుడు వెండియునుఁ దా - రాత్మజుం డనియె.
"సభయులమైన కీ - శశ్రేణికెవ్వఁ
డభయ ప్రదాన మి - య్యంగ సమర్థుండు?
ఇందఱి ప్రాణంబు - లిచ్చి వానరుల
బొందులతో నుంచు - పుణ్యమెవ్వరిది?
అక్కట! శతయోజ - నాయతంబైన
యిక్కమలధి దాఁట - నెవ్వఁడున్నాఁడు?

ఇనకుమారు ప్రతిజ్ఞ - యీడేర్చి యతఁడు
తనవాఁడుగా నుండు - ధన్యుఁడెవ్వాఁడు ?
ఎవ్వాఁడు జానకి - నీక్షించి మఱల
నవ్వుమోమున వచ్చి - నన్నురక్షించు ?
సీతఁ జూచితి నని - శ్రీరాముతోడ
నితఱి నను ధన్యుఁ - డెవ్వఁడున్నాఁడు ?
రామసుగ్రీవుల - రక్షించు పాట
స్వామికార్యహితుండు - జగతినెవ్వండు ?
ఓయయ్యలార ! యిం - దొకఁడేఱుపడినఁ
జేయెత్తి మ్రొక్కి కొ - ల్చెద నమ్మహాత్ము
నొక రేఱుపడరయ్య ! - యూరక యున్న
సుకరంబుగాఁగఁ దోఁ - చునె కార్యసరణి?"
అని యెంత వలికిన - నమ్మహాకపులు
మొనయక యొండొరు - మోములఁ గనుచు
నురకున్న వానర - యోధులఁజూచి
మఱలఁగ వాలికు - మారుఁ డిట్లనియె.
"మీరు కులీనులు - మీరసహాయ
శూరులు మీరు తే - జోబలాధికులు
స్వామికార్యహిత ప్ర - చారులు మీర
లేమియు వాకొన - కిటులూరకున్నఁ
బదుచువాఁడను మీదు - ప్రాపున వచ్చి
యొడలోముకొని మీర - లున్నచో నుండి
యందఱు మీరు న - న్నరయుచుఁ బిలిచి
ముందఱ నిడుకొని - ముద్దుగా నడుప
నున్నట్టివాఁడఁ బ - యోరాశిఁ జూచి

మీన్నక ననుఁ జాటి - మీఱుంటిరేని
యేమగు నాచేత ? - నిది శక్తియనుచు
మీమీ తలంపుల - మితిగన్నయట్టి
జవసత్త్వములు వల్కి - జలరాశి యొకఁడు
చపుకళింపంగ యో - జనసేయుఁ"డనిన
నామాట లాలించి - యంగదుఁ జూచి
తామొక్క రొకరె స - త్త్వంబుల కొలఁది
గట్టిగాఁజూచుక - కలశక్తి మఱుఁగు
పెట్టక యొకపి - వీరులిట్లనిరి.

— వానరులు తమతమ బలమును నంగదునకుఁ దెలుపుట —

" పది యోజనంబుల - పాటికి జలధి
యదరక దాఁటుదు" - ననియె గజుండు
"వారాశి యే నిరు - వది యోజనముల
దారి"గవాక్షుఁడు - "దాఁటుదు"ననియె.
' పగ్గలేమిటికి ? ము - ప్పది యోజనములు
తగ్గక"గవయుండు - "దాఁటుదు" ననియె.
"బరవసంబున నలు - వదియోజనములు
శరధి దాఁటుదు"వని - శరభుఁడు పలికె.
"బంధురశక్తి నేఁ - బది యోజనములు
కంధి దాఁటుదు "ననె - గంధమాదనుఁడు.
"నాకు నర్వది యోజ - నంబులుగాని
యాకడ మఱికూడ - దనియె "మైందుండు
"యోజింప డెబ్బది - యోజనంబులకు
నాజవంబనియె" ను - న్నతి ద్వివిదుండు.

నలుఁ "డెనుబదియోజ - నంబులుగాని
కలుగదా మీఁద-లా - ఘవమని" పలికె.
"నేను వృద్ధుఁడ సత్త్వ - హీనుఁడఁ జేత
నైన మాత్రంబు నే - నబ్ధిదాఁటెదను
నందుఁ దీఱెడిదేమి? - యాదికాలంబు
నందు శౌరి త్రివిక్ర - మావతారమునఁ
జెలఁగుచో యేఁబ్ర ద - క్షిణము చేసితిని
తొలుత భానుఁడు తేరు - తోలుకపోవ
నదిమీఱిపోవుదు - నని పోవఁబోయి
కదియు మేరువు నిర - కటమునఁ జనఁగ
మోకాలు నొచ్చె నా - మొదలింటి శక్తి
చేకూడ దిప్పుడీ - సింధువుదాఁట
ఇదిమేర యనవల - నేకాకయున్న
నుదధి యంతయు దాఁట - నోపుదు మొదటఁ
బాటుగాదిపుడు తొం - బది యోజనముల
పాటి దాఁటుదు మరి - పాఱదు శక్తి"
అని జాంబవంతుఁ డి - ట్లాడిన మాట
విని తనశక్తి భా - వించి యంగదుఁడు,
"చాలదు నూఱు యో - జనములు దాఁట
రాలేదు మఱలి వా - రాశి మీఁదటను.
అందునకై సంశ - యంబుతో మదినిఁ
గొందలపడుచు మే - కొనక యున్నాఁడఁ
జనుదునే?" యని పల్క - జాంబవంతుండు
మనములోఁ గలఁగి క్ర - మ్మఱ నిట్టులనియె.
"అంగద! యీమాట - లాడుదురయ్య!

అంగద నిను నంప - నగునయ్య ! మాకు ?
ఏమెల్ల నటు మీఁద - నేమిటివార
మేము కొల్చినవార - మినుఁడవు నీవు
స్వామి భృత్యన్యాయ - సరణియూహింప
నీమాట వినవగు - నే మాకు నెల్ల ?
బలిమిఁ గూఁకటివేరు - పదిలమైయున్న
ఫలవృక్షములను జొ - ప్పడు భూరుహాంబు
దొర లెస్సయున్న హి - తుల్బాంధవులను
పరివారమును జేరి - బ్రదుకుచుండుదురు
నిన్నొక్కనిం బంపి - నిలుతుమే యిట్టి
చెన్నటి మేను లూ - ర్జితములే మాకు ?
రాజులఁ బనిఁగొను - బ్రజలుఁ గలరె !
పూజనీయుఁడవు మా - బోఁటివారెల్ల
నినుఁ జూచుకొని యెందు - నీదు సేమమునఁ
గనుగల్గి రక్షించ - గా నీతిగాక
యేము నెమ్మది నుందు - మీవు బొమ్మనుచు
నేమింతుమే యిట్లు - నీతిఁ బోవిడిచి
చాలింపు మిట్టి వి - చారంబు''లనిన
నాలించి మఱలంగ - నంగదుఁడనియె.
"ఏనూరకున్నచో - నెవ్వాఁడు పోవు
వానరప్రభుల స - త్త్వంబులు వినమె ?
చేతగాదనువానిఁ - జెవిమెలివెట్టి
త్రోతమె యీయెడఁ - దోయధిఁ బడఁగ
దొరచేత నగుపనుల్ - దొరలు సేయుదురు
పరిజనుల్ చేసైన - పాటి తీర్పుదురు

మనకెల్లఁ గర్త యీ - మార్తాండసుతుఁడు
పనిపూని వచ్చిన - భటులమిందఱము.
అతని యానతి మీఱి - నగునె యెవ్వరికిఁ
గతమిచ్చెనే నన్నుఁ - గడనుండు మనుచు ?
నీపని యితనిచే - నీడేఱు ననుచుఁ
జూపుము పనిగొమ్ము - చూచెదమతని ”
అనిన నందఱి మాట - నాలకింపుచును
దనకేమి పనియని - తలఁచిన కరణిఁ
గడనున్న వీరశే - ఖరు నాంజనేయు
వడిఁజూచి యాజాంబ - వంతుఁడిట్లనియె.

— సీతను వెదకుటకై జాంబవంతుఁడు హనుమంతునిఁ ప్రోత్సహించుట —

“ ఏమయ్యా ! హనుమంత ! - యేమియుననక
స్వామి కార్యహితంబు - సడలి యున్నావు
సామజోత్తమము దీ - ర్చఁగనైనపనికి
దోమలు పూని పోం - దునె కార్యసిద్ధి ?
నీచేతనగుపని - నీచేతఁగాక
నీచవానరులెల్ల - నిర్వహింపుదురె ?
మాదృశులకుఁ దర - మా ? వార్ధి దాఁటి
యీదృశకార్యంబు - లీడేర్తుమనఁగ ?
రామలక్ష్మణులకు - రవితనూజునకు
నీమేర సరివత్తు - వీ వెల్లయెడల
ధరణిభరంబెల్లఁ - దాఁబూనఁజాలు
గరుడుఁ డొక్కఁడు విహం - గమ జాతిలోన

వానరజాతి నె – వ్వరు నీడు లేని
భూనుతశక్తి – సంపూర్ణుఁడ వీవు
వానరులేల దే – వమనుష్యదైత్య
దానవుల్ గూడి యం – దఱు నీకు సరియె?
వైనతేయుని యంత – వాఁడవు హెచ్చు
గాని మాయందు నొ – క్కరుఁడవే నీవు?
నీశక్తి యెఱుఁగక – నేఁడూరకున్న
కీశకోటికి నెల్లఁ – గీడావహిల్లు.

—: హనుమంతుని జన్మవృత్తాంతము :—

పుంజకస్థలియను – పూఁబోఁడిగాదె
యంజనాదేవి? యా – య్యాలినీలవేణి
చక్కదనంబుఁ గే – సరిచూచి మెచ్చి
యక్కరతోఁ బెండ్లి – యాడె నవ్వేలఁది
మొదట నచ్చరనొక – ముని శపియింప
నదివచ్చి కుంజరుం – డను కపీంద్రునకు
మానవ తరుణియై – మహి జనియించె
నానీరజేక్షణ – యపు డొక్కనాఁడు
గిరికందరంబులఁ – గేళీవిలాస
పరతచేఁ జరియింపఁ – బవమానవశతఁ
జేల తొలంగిన – శిబ్బెపు గుబ్బ
పాలిండ్లు నరఁటికం – బముల క్రొమ్మెఱుఁగు
వెదఁజల్లు తొడలు నీ – వీ బంధమూడి
ప్రిదిలినఁ దోఁచునా – భీవివరంబుఁ
బటువైన కటితటీ – భారంబు నడుము

గిటగిటయును జూచి - క్రేఁగన్నువైచి
యాలింగనముచేయు - ననిలునిఁగాంచి
బాల పాతివ్రత్య - భంగభయమున
నోడబాటు చాలక - యొదుగుచోఁ బట్టి
విడువక యోకొమ్మ! - వెఱవ నేమిటికి?
పవనుఁడ నేను దో - ర్బల శౌర్యశాలి
నువిద నీకొక పుత్రు - నొసఁగ వచ్చితిని
యహితంబు గాదు నీ - కని" యొడంబఱచి
బహుమాన మొనరించి - పవనుండు చనియె.
తరుణి యాప్రొద్దె మం - దర కందరమునఁ
గరువలి కృపనిన్నుఁ - గాంచె మోదమునఁ
బుట్టినప్పుడె నీవు - పొడుపు గుబ్బలిని
కట్టెఱచేఁ దోచు - ఖరకరుఁ జూచి
ఫలబుద్ధిచేఁ జేరి - పట్టెదననుచు
నులకగా మున్నూఱు - యోజనంబులకు
నెగసి భానుని వేఁడి - నెంతయు నీవు
బొగడఁగఁ జేరఁగో - పించి యింద్రుండు
భిదురంబుచే వ్రేయ - భీమమైనింగి
నది వచ్చి నీవాను - హనువుఁ గొట్టటయు
తొడనొచ్చి యొకకొంక - తోడుతఁగొట్టు
వడి పడియున్నచోఁ - బవమానుఁ డలిగి
యుర్విపైఁ దనమూర్తి - యుపసంహరించి
పర్వి జీవుల గతి - ప్రాణులఁజేయ

దడ కట్టువడి జగ - త్త్రయమున నూర్పు
వెడలక ప్రతిమల - విధమున నున్న
జీవకోటులను జూ - చి విరించి వచ్చి
దీవించి నిన్ను నె - త్తి కవుంగిలించి
హనువు నొప్పియుఁ దీర్చి - యాదరించుటను
హనుమంతుఁడనెడి వి - ఖ్యాతి గాంచితివి.
అదిగాక దివ్యశ - స్త్రాస్త్రముల్ నిన్ను
బొదివి నాఁటకయుండఁ - బుడమి నెవ్వరును
నిను గెల్వకుండ వ - న్నింప నింద్రుండు
తన వరంబుగ నమ్ము - తత్వం బొసంగె
వాయువు తనయంత - వానిగా నిన్ను
నీయెడలఁ జరింప - నిచ్చె వరంబు
జీవకోటులను ర - క్షించి చైతన్య
భావము గ్గలిగించెఁ - బ్రాణంబు లిచ్చి
యట్టి యువధ్యుండ - వతి సత్త్వ నిధివి
పట్టిన పనులు దీ - ర్పఁగ సమర్థుఁడవు
బుద్ధిమంతుఁడవు నే - ర్పును నీకె కలదు
యుద్ధకోవిదుఁడ వ - త్యుత్సాహ నిధివి
క్షేత్రజుఁడవు నీవు - కేసరి కపికి
పుత్రుఁడవైతి గా - ద్పున కౌరసుఁడవు
గావున నీసరి - గాము నేమెల్ల
లావున జవసత్త్వ - లాఘవంబులను
మును త్రివిక్రమునకు - ముయ్యేడు మాఱు
లొనరఁ బ్రదక్షిణం - బొనరించుకొఱకు

నొకముహూర్తంబులో - నుర్విఁ బుట్టితిమి
సకలౌషధులును ప్ర - సన్నంబు లగుట
వయసు సత్తువయేల - వచ్చునెప్పటికి ?
రయమున పెద్దవా - రము గాన లేదు.
అన్న ! త్రివిక్రముఁ - డై మేను పెంచు
వెన్నుని గతి నీవు - విశ్వరూపంబుఁ
జూపి యావారిధిఁ - జులకఁగా దాఁటి
నీపౌరుషము లంక - నిండంగడాసి
సీతను జూచి వ - చ్చినఁ గాక యొరుని
చేతఁ దీరునె యీయ - జేయ పౌరుషము ?
వానరులకును జీ - వములిచ్చి యభయ
దానంబొసంగుము - తడయ నేమిటికి ? ”
అనుమాట లాలించి - యంజనాతనయుఁ

— జాంబవంతుని మాటలకు హనుమంతుఁ డుప్పొంగి సము
ద్రము దాఁటుటకు నంగదుననుజ్ఞ వేఁడుట —

డనుపమోత్సాహ శౌ - ర్యవిజృంభణముల
వాలంబు మహి యద్రు - వంగ దాఁటించి
తాలేచి మితిలేని - తనమేను పెంచి
చెంత వానరులెల్ల - సింహనాదములు
గంతులు వినుతులుఁ - గావింపుచుండ
నట్టహాసముచేసి - యనిల నందనుఁడు
చుట్టును జెలరేఁగు - చుట్టాలఁ జూచి

"వాయునందనుఁడను - వాయుపుంగాఁడు
నాయంతవాఁడ నం - తబలంబుచేత
సరిగాఁడు నాకు ఖే - చరగమనమున
గరుడుఁ డన్యులుసాటి - గారననేల ?
దాఁటుదునే మేరు - ధరణీ ధరంబు
మాటమాత్రనె నభో - మండలి నెగసి
జలజంతువులతోడ - జలరాశియెల్ల
నిలఁ జేతులను జల్లి - యింకఁ జేయుదునె !
ధరణీతలంబు హ - స్తమునఁ బెకల్చి
శరనిధిలోవైచి - జలగడుగుదునె !
ఒకయడుగిచ్చోట - నొకకాలు లంక
నొకటనుండఁగఁ జిందు - లురకత్రొక్కుదునె !
త్రొక్కిన యడుగుల - తో నివి రెండుఁ
ద్రొక్కి నిల్పుదునె యు - ధో లోకములను !
ఉదయించు రవియుండె - యుండ నందుండి
కదిసి యస్తాద్రి క - క్కడికిఁ జేరుదునె !
దీవులు జలధులు - దిరిగి సల్డిక్కు
లీవలావల దాఁటి - యిపుడె చేరుదునె ।
ఎగయుచో నామేన - నెసఁగు వాయువుల
నొగ డాకులన రాల్తు - నోవిమానములు !
ఇలద్రవక్కలించి భో - గీంద్రునిఁ బట్టి
యొలఁ దమ్మితూఁడుగా - నెగరవేయుదునొ !
ఎందున్న రవిచంద్రు - లిట్టట్టురాక
యుందె నిల్వఁగఁ జేతు - లాని నిల్పుదునొ !
అమ్మనంబులుగా కు - లాచల శ్రేణి

రెమ్మ పైపై నెగ - రించి యాడుదునో!
ఇందుండి యీలంక - కెగయుచో నిచటి
చందనాచల మహీ - జశ్రేణి వెంట
విడువక రాఁ దాని - వెంబడిచేత
నుడుమండలం బెల్ల - నొక్క మొత్తముగ
నిప్పపువ్వులజాడ - నీమహిమీఁదఁ
గుప్పలుగా రాల - గుప్పగింపుదునో!
ఎగయుచో ననుఁ జూచి - యీభూతకోటి
పొగడి వెంటనె పెడ - బొబ్బలు వెట్టి
దివి భువి నిండింప - దిగులుచే భ్రమసి
చెవులు మూసుకొనఁగఁ - జేతునో యిమ్ము!
మేరువుగతి నాక్ర - మించి మిన్నెల్ల
నీరంధ్రముగ నిండ - నేను జేయుదునో!
గరుడవాయువు లొక్క - కడయైననాకు
సరియనవచ్చును - జవసత్త్వములను
మెఱపు తళుక్కన్న - మెఱచిన కరణిఁ
దిరిగివచ్చెదను వై - దేహినిఁ జూచి
మున్ను జూచెఁ ద్రివిక్ర - ముని జాంబవంతుఁ
డెన్నఁడు ననుజూచి - యిటమీఁద నతని
నాబుద్ధిజవబలౌ - న్నత్యముల్ మిగులఁ
బ్రాబల్యగతి కొనల్ - వారేని యొడల
గరుసు మీరెను భుజా - కండూతి తనకుఁ
దరణిసూనుండు కృ - తార్థతఁ గాంచె నిపుడు
శ్రీరామలక్ష్మణుల్ - చింతలుదీఱి
యూరడిల్లుదు రింక - నుల్లంబులందు

లక్షయోజనములు - లంఘింతు మీఁదు
లక్షింపుఁ డల్లది - లంకాపురంబు
శతయోజనములెంత ? - చంగునదాఁటి
హితముఁ జేసెదమీకు - నీక్షింపుఁ డిపుడు ।
ఎదిరింపఁ గలదె బ్ర - హ్మేంద్రాదులైన
నిది యసాధ్యంబన - నెయ్యదినాకు ?
అమరావతికి నేఁగి - యమృతంబుఁ దెత్తు
నిమిషంబులో రాము - నికి వలెనన్న ।
లంకాధిపతితో ని - లాసుత తోడ
లంక నాచేత న - లంకారముగను
పెకలించి తెత్తునో - పిఁచమణంచి
యొకరాక్షసుఁడు లేక - యుండఁగఁ జేసి ।
రావణు నావాల - రజ్జు వల్లరులఁ
జావకుండఁగఁ గట్టి - జానకీదేవి
నామూఁపుల నమర్చి - నమ్మించి సగము
జాములోఁ దెచ్చియీ - చాయ నిల్పుదునొ ।
ఊరకే రావణు - నూరెల్లఁ జూచి
శ్రీరాము దేవేరిఁ - జేరి యూరార్చి
వత్తునొ యొకమాట - వాలినందనుని
చిత్తంబునందుఁ దో - చిన బుద్ధి యడిగి
వాకొనుఁ" డన జాంబ - వంతుండు భీక
రాకారుఁడైనట్టి - హనుమంతుఁ బలికె
"శరణు చొచ్చిన నీదు - చరణ పద్మముల
మఱఁగుననని యున్న - మర్కటోత్తముల

కంగదునకు నాకు - నానందమయ్యె!
మంగళంబగు గాక - మాయన్న ! నీకు
నినుఁ జేరఁగాక మా - నిత జయలక్ష్మి!
కనుచాటు దాఁకక - క్రమ్మరుమయ్య
మమువంటి పెద్దల - మంచి దీవెనలు!
సమబుద్ధి వజ్రాంగి - నాడ్పున నీవు
చేకొని సంకల్ప - సిద్ధుఁడ వగుచు
నాకల్పమైన వి - ఖ్యాతిఁ గైకొనుము.
వానరులకు రఘు - వరులకుఁ బ్రాణ
దానముల్ చేసి కీ - ర్తనములు గనుము.
నీవాని నన్ను మ - న్నించి నామాట
నీవననిధి దాఁటు - మిచ్చటనుండి
జలధి దాఁటిన భూమి - చలియించు గ్రుంగు
నిలువ నేరరు కపుల్ - నీజవంబునకు
నీ మహేంద్రాచలం - బెక్కి యీకొండ
భూమిఁ గ్రుంగక యుండఁ - బుటముగా నెగసి
పోయిరమ్మన వాయు - పుత్రుఁడుప్పొంగి
యాయద్రిఁ జేరి శృం - గాగ్ర వీథులకు
నడుచుచో గులగుల - నగము గొంతాము
వడువున పట్టులు - వదలి ఘూర్ణిల్ల
బిలములు సందీక - పిచ్చుకగూళ్ళ
పొలుపునఁ గనరాక - పొడివొడి గాఁగ
గజసింహ గవయ సూ - కరలులాయములు

నజగజ వడఁకి న - ల్గడలను బఱవఁ
జరులఁ గ్రీడించు ని - ర్జర మిథునములు
పరువుతోడ విమాన - పంక్తులనేఁగ
వడిగల గతికొప్పు - పడగలువిచ్చి
తెడనెడఁ గాలాహులు - తెరమానిచూడ
నిజ బిరుదాంక వం - దిగణంబు రీతి
ద్విజకోటి యెగసి నల్ - దిక్కులఁ గెలయఁ
దపము సేయునున్న - తాపసశ్రేణి
యపుడు నిల్వఁగరామి - నవ్వాలికరుగఁ
జిత్తంబు వదలంగ - శిఖరంబు లెక్కి
యుత్తాలమగువాల - ముడువీథి నార్చి
లంకపైఁ జూపుల - ల్లననిగుడించి
శంకింప శాఖామాల - జలరాశిఁ గాంచి
దాఁటెదనని వియ - త్తలము వీక్షించి
హాటకాచల నిభం - బైనగాత్రంబు
గిరిమీఁద మెఱయ న - గ్గింప వేలుపులు
కరువలిపట్టి య - గ్గలికతో నుండె
విలసిల్లె నని వేద - వేద్యుని పేర
నలమేలు మంగాంగ - నాధీశు పేర
నంచిత కరుణాక - టాక్షుని పేరఁ
గాంచనమణిమయా - కల్పుని పేర
వేదవేదాంతార్థ - విదితుని పేరఁ
నాదిత్యకోటి ప్ర - భాంగుని పేరఁ

గంకణాంగదరత్న - కటకాఢ్యపేర
వెంకటేశుని పేర - విశ్వాత్మపేర
నంకితంబుగ వెంక - టాధీశ చరణ
పంకజసేవాను - భావమానసుఁడు
హరిదాసమణి కట్ట - హరిదాసరాజు
వరదరాజు నితాంత - వరదానశాలి
రచియించు వాల్మీకి - రామాయణంబు
ప్రచురభక్తిని మదిఁ - బాటించివినినఁ
జదివిన వ్రాసిన - సభలఁ బేర్కొనిన
మదిఁ దలఁచిన నెట్టి - మనుజులకైన
ధారుణిమీఁద సీ - తారామచంద్ర
పారిజాతదయాప్ర - భావంబు వలన
హయమేధరాజసూ - యాదిమయాగ
నియతఫలంబులు - నిరతాన్నదాన
సుకృతంబు నిత్యయ - శోవైభవములు
నకలంక తీర్థయా - త్రాది పుణ్యములు
సత్యవ్రత పదంబు - సకల సౌఖ్యములు
నిత్యమహోదాన - నిరుపమశ్రీలు
కలికాల సంప్రాప్త - కలుష నాశనము
కలుములు హరిభక్తి - గౌరవోన్నతులు
శత్రుజయంబును - స్వామిహితంబు
పుత్రలాభంబును - భోగభాగ్యములు
ననుకూలదాంపత్య - మంగనాప్రియము
ధనధాన్యపశువస్తు - దాసీసమృద్ధి
మానసహితము ధ - ర్మప్రవర్తనము

నానందములు ఖేద - మందకుండుటయు
నలఘు వివేకంబు - నతుల గౌరవము
వలయు కార్యములు కై - వశము లౌటయునుఁ
బావనత్వము దీర్ఘ - పరమాయువులునుఁ
గైవల్యసుఖము ని - క్కముగాఁగఁ గలుగు. 6240
ఎన్నాళ్లు ధారుణి - యెన్నాళ్లు జలధు
లెన్నాళ్లు రవిచంద్రు - లెన్నాళ్లు గిరులు
నెన్నాళ్లు నిగమంబు - లెన్నాళ్లు విశ్వ
మన్నాళ్లు నీకథ - యలరు నార్షంబు.
ఆదికావ్యంబు సమ - స్తపూజ్యంబు
వేదసమానంబు - విశ్వసన్నుతము
నైన కిష్కింధా మ - హాకాండ మిపుడు
మానిత శ్రీలచే - మహినొప్పఁగాత! 6248



కట్టా వరదరాజ కృతమగు
వాల్మీకిరామాయణమునందు
కిష్కింధాకాండము
సంపూర్ణము